వ. అప్పుడు జగజ్జనకుండగు నప్పరమేశ్వరుండు దరహాసితముఖ
కమల యగు నక్కమల కిట్లనియె. 92

క. బాలా! నా వెనువెంటను
హేల న్వినువీథినుండి యేతెంచుచు నీ
చేలాంచలంబుఁ బట్టుట
కాలో నేమంటి నన్ను నంభోజముఖీ! 93

క. ఎఱుఁగుదుఁ దెఱవా! యెప్పుడు
మఱవను సకలంబు నన్ను మఱచినయెడలన్
మరతు నని యెఱిఁగి మొఱఁగక
మఱవక మొఱ యిడిరయేని మఱి యన్యములన్. 94

వ. అని పలికిన నరవిందమందిరయగు నయ్యిందిరాదేవి
చంద్రికాదరహాససుందరవదనారవిందయగుచు ముకుందున
కిట్లనియె. 95

క. దేవా! దేవరయడుగులు
భావంబున నిలిపి కొలుచుపని నా పనిగా
శ్రీవల్లభ! యే మనియెద
నీవెంటనె వచ్చుచుంటి నిఖిలాధిపతీ! 96

క. దీనుల కుయ్యాలింపను
దీనుల రక్షింప మేలు దీవనఁబొందన్
దీనావన! నీ కొప్పును
దీనపరాధీన దేవదేవ మహేశా! 97

వ. అని మఱియును సముచితసంభాషణంబుల నంకించుచున్న యప్పరమవైష్ణవీరత్నంబును సాదర సరససల్లాప మంద హాసపూర్వకంబుగా నాలింగనంబు గావించి సపరివా రుండై గరుడ గంధర్వ సిద్ధ విబుధగణ జేగీయమానుండై గరుడారూఢుం డగుచు నిజసదనంబునకుం జనియె. 98



## పోతన - శ్రీభాగవతము

# శ్రీ రా మ చ రి త్ర ము

మ. అమరేంద్రాశకుఁ బూర్ణచంద్రుఁ డుదితుం డైనట్లు నారాయణాం
శమునం బుట్టె మదాంధరావణశిరస్సంఘాతసంఛేదన
క్రమణోద్దాముఁడు రాముఁ డాగరితకుం గౌసల్యకున్, సన్నుతా
సమనైర్మల్యకతుల్యకంచితజనుస్సంసారసాఫల్యకున్. 1

మ. సవరక్షార్థము దండ్రి పంపఁ జని విశ్వామిత్రుఁడుం దోడ రా
నవలీలం దునుమాడె రాముఁ డదయుండై బాలుఁడై కుంతల
చ్ఛవిసంపజ్జితహాటకం గపటభాషావిస్ఫురన్నాటకన్
జవభిన్నార్యమఘోటకం గరవిరాజత్ఖేటకం దాటకన్. 2

క. గారాముగఁ గౌశికమఖ
మారాముఁడు గాచి దైత్యు నధికు సుబాహున్
ఘోరాజిఁ ద్రుంచి, తోలెను
మారీచున్ నీచుఁ గపటమంజులరోచున్. 3

మ. ఒకమున్నూఱు గదల్చి తెచ్చిన లలాటోగ్రాక్షు చాపంబు బా
లకరీంద్రంబు సులీలమైఁ జెఱకుఁగోలం ద్రుంచు చందంబునన్
సకలోర్వీశులుఁ జూడఁగా విఱిచె దోశ్శక్తిన్ విదేహాత్మజా
పక గేహంబున సీతకై గుణమణిప్రస్ఫీతకై లీలతోన్. 4

క. భూతలనాథుఁడు రాముఁడు
ప్రీతుండై పెండ్లియాడెఁ బృథుగుణమణిసం
ఘాతన్ భాగ్యోపేతన్
సీతన్ ముఖకాంతివిజితసితఖద్యోతన్. 5

క. రాముఁడు నిజ బాహుబల
స్థేమంబున భంగపఱిచె దీర్ఘకుఠాగ్రో
ద్దామున్ విదళీకృతనృప
ఘామున్ రణరంగభీము భార్గవరామున్. 6

క. దశరథుఁడు మున్ను గైకకు
వశుఁడై తా నిచ్చినట్టి వరముకతన వా
గ్దశ సెడక యడవి కనిచెను
దశముఖముఖకమలతుహినధాముఁ రామున్. 7

క. జనకుఁడు పనిచిన మే లని
జనకజయును లక్ష్మణుండు సంసేవింపన్
జనపతి రాముఁడు విడిచెను
జనపాలారాధ్య ద్విషదసాధ్య నయోధ్యన్. 8

క. భరతున్ నిజపదసేవా
నిరతున్ రాజ్యమున నునిచి నృపమణి యెక్కెన్
సురుచిరరుచిపరిభావిత
గురుగోత్రాచలముఁ జిత్రకూటాచలమున్. 9

*ఉ. పుణ్యుఁడు రామచంద్రుఁడట వోయి ముదంబునఁ గాంచె దండకా
రణ్యముఁ, దాపసోత్తమశరణ్యము, నుద్ధతబర్హిబర్హలా
వణ్యము, గౌతమీవిమలవాఃకణపర్యటనప్రభూతసా
ద్గుణ్యము, నుల్లసత్తరునికుంజవరేణ్యము నగ్రగణ్యమున్.

సీ. ఆవనంబున రాముఁ డనుజసమేతుఁడై
సతితోడ నొకపర్ణశాల నుండ
రావణుచెలియలు రయమున నెదురంగ
మొగి లక్ష్మణుఁడు దానిముక్కు గోయ
నది విని ఖరదూషణాదులు పదునాల్గు
వేలు వచ్చిన రామవిభుఁడు గలన
బాణానలంబున భస్మంబు గావింప
జనకనందన మేనిచక్కఁదనము

తే. విని, దశగ్రీవుఁ డంగజవివశుఁ డగుచు
నర్ధిఁ బంచినఁ బసిఁడిజింకయై నటించు
నీచు మారీచు రాముఁడు నెఱి వధించె
నంతలో సీతఁ గొనిపోయె నసురవిభుఁడు. 11

ఉ. ఆయసురేశ్వరుండు వడి నంబరవీథి నిలాతనూజ న
న్యాయము సేసి నిష్కరుణుఁడై కొనిపోవఁగ నడ్డమైనఘో

రాయత హేతిఁ ద్రుంచె ననహాయత రామన రేంద్ర కార్యద
త్త్రాయువుఁ బక్షి వేగపరిహాసితవాయువు నజ్జటాయువున్.

వ. అంత నారామచంద్రుండు లక్ష్మణసహితుండై సీత వెదక నరుదెంచి, నిజకార్యనిహతుండైన జటాయువునకుఁ బరలోకక్రియలు గావించి, ఋశ్యమూకంబునకుఁ జని, 13

క. నిగ్రహము నీకు వల దీక
నగ్రజు వాలిన్ వధింతు నని నియమముతో
నగ్రచరుగాఁగ నేలెను
సుగ్రీవున్ జరణఘాతచూర్ణగ్రావున్. 14

క. లీలన్ రామవిభుం డొక
కోలం గూలంగ నేసె గురునయశాలిన్,
శీలిన్ సేవితశూలిన్,
మాలిన్ వాలిన్ దశాస్యమానోన్మాలిన్. 15

క. ఇలమీఁద సీత వెదకఁగ
నలఘుఁడు రాఘవుఁడు పనిచె హనుమంతు నతి
చ్ఛలవంతున్ మతిమంతున్
బలవంతున్ శౌర్యవంతుఁ బ్రాభవవంతున్. 16

క. అలవాటుకలిమి మారుతి
లలితామితలాఘవమున లంఘించెను శై
వలినీగణసంబంధిన్
జలపూరితధరణిగగనసంధిన్ గంధిన్. 17

వ. ఇట్లు సముద్రంబు దాఁటి సీతం గని హనుమంతుడు దిగిగి
చనుదెంచుచు నక్షకుమారాదుల వధియించి. 18

క. సముద్రగత ననిలసుతుం
డమరాహితదత్తవాలహస్తాగ్నుల భ
స్మము సేసె నిశాతంకర
సమదాసురసుభటవిగతశంకర లంకన్. 19

వ. ఇట్లు లంకాదహనంబు సేసి వచ్చి వాయుజుండు సీతా
కథనంబు సెప్పిన విని రామచంద్రుండు వనచరనాథ
యూథంబులుం దానును జని చని. 20

*శా. ఆరాజేంద్రుఁడు గాంచె భూరివిధరత్నాగారమున్
మీనకుం
భీరగ్రాహకఠోరమున్ విపులగంభీరంబు నభ్రభ్రమ
ద్ఘోరాన్యోన్యవిభిన్నభంగభవనిర్ఘోషచ్ఛటాంభఃకణ
ప్రారుద్ధాంబరపారమున్ లవణపారావారముం జేరువన్.21

వ. కని తనకుఁ డ్రోవ యిమ్మని వేఁడిన నదియు మార్గంబు
సూపక మిన్నందిన నారాచపట్టి రెట్టించిన కోపంబున.22

క. మెల్లనినగవున నయనము
లల్లార్చి శరంబు విల్లు నందినమాత్రన్
గుల్లలు నాఁచులుఁ జిప్పలుఁ
బెల్లలు నై జలధి పెద్దబీడై యుండెన్. 23

వ. ఇట్లు విపన్నుం డగుసముద్రుండు నదులతోఁగూడి మూర్తి
మంతుం డయి చనుదెంచి, రామచంద్రునిచరణంబులు
శరణంబుఁ జొచ్చి, యిట్లని నుతియించె: 24

శా. ఓకాకుత్థ్సకులేశ! యోగుణనిధీ! యోదీనమందార! నే
నీకోపంబున కెంతవాఁడ! జడధిన్; నీ వేమి భూరాజవే?
లోకాధీశుఁడ వాదినాయకుఁడ; వీలోకంబు లెల్లప్పుడున్
నీకుక్షిం బ్రభవించుచుండు నడఁగున్ నిక్కంబు సర్వాత్మకా

క. కట్టుము సేతువు లంకం
జొట్టుము నీ శాణవహ్ని సురవైరితలల్
గొట్టుము నేలం బడఁ జే
పట్టుము నీయబల నధికభాగ్యప్రబలన్. 26

వ. అని విన్నవించిన రామచంద్రుండు సముద్రునిం బూర్వ ప్రకారంబున నుండు పొమ్మని వీడుకొల్పె నంత. 27

క. ఘనశైలంబులుఁ దరువులు
ఘనజవమునఁ బెఱికి తెచ్చి కపికులనాథుల్
ఘనవనరాశిం గట్టిరి
ఘనవాహప్రముఖదివిజగణము నుతింపన్. 28

వ. ఇట్లు సముద్రంబు దాఁటి రామచంద్రుండు రావణుతమ్ముం డైన విభీషణుండు శరణంబు వేఁడిన నభయం బిచ్చి కూడుకొని లంకకుఁ జని విడిసి వేడెపెట్టించి లగ్గలు పట్టించిన. 29

సీ. ప్రాకారములు ద్రవ్వి పరిఖలు పూడిచి,
కోట కొమ్మలు నేలఁ గూలఁ ద్రోచి,
వప్రంబు లగలించి, వాకిళ్ళు వెకలించి,
తలుపులు విఱిచి యంత్రములు సెఱిచి,
ఘనవిటంకంబులు ఖండించి పడవైచి,

గోపురంబులు నేలఁ గూలఁ దన్ని
మకరతోరణములు మహిఁ గూల్చి, కేతనం
బులు సించి, సోపానములు గదల్చి,

ఆ. గృహములెల్ల వ్రచ్చి, గృహరాజములు గ్రొచ్చి,
ధర్మకుంభచయము పాఱవైచి,
కదులు కొలను సొచ్చి కలఁచినకైవడిఁ
గపులు లంకఁ జొచ్చి కలఁచి రపుడు. 30

వ. అంత నయ్యసురేంద్రుండు వంచిన దనుజవీరులు శరశ
రాసనతోమరాది సాధనంబులు ధరియించి మాతంగ
తురంగస్యందనసందోహంబుతో బవరంబు సేయ సుగ్రీవ
పవన తనయాదు లారక్కసుల నెక్కటి కయ్యంబులందుఁ
దరుల గిరులఁ గరాఘాతంబుల నుక్కడంచి త్రుంచి రంత.

ఆ. రామచంద్రవిభుఁడు రణమున ఖండించె
మేటికడిమి నీల మేఘవర్ణు,
బాహుశక్తిపూర్ణుఁ, బటుసింహనాదసం
కుచితదిగిభకర్ణుఁ గుంభకర్ణు. 32

క. అలవున లక్ష్మణుఁ డాజి
స్థలిఁ గూల్చెన్ మేఘనాదుఁ జటులాహ్లాదున్,
బలభేదిజయవినోదున్,
బలజనితసుపర్వసుభటభావవిషాదున్. 33

వ. అంత. 34

క. తనవారందఱు మ్రగ్గిన,
ననిమిషపతివైరి పుష్పకారూఢుండై
యనికి నడచి రామునితో
ఘనరౌద్రముతోడ సంప్రయుద్ధము సేసెన్. 35

వ. అయ్యవసరంబున. 36

క. సురపతిపంపున మాతలి
గురుతరమగుదివ్యరథముఁ గొని వచ్చిన నా
ధరణీవల్లభుఁ డెక్కెను
ఖరకరుఁ డుదయాద్రి నెక్కకైవడి దోఁపన్. 37

వ ఇట్లు దివ్యరథారూఢుం డయి రామచంద్రుండు రావణున
కి ట్లనియె : 38

*మ. "చపలత్వంబున డాఁగి హేమమృగమున్ సంప్రీతిఁ
బుత్తెంచుటో
కపటబ్రాహ్మణమూర్తివై యబల నాకాంతార
మధ్యంబునం
దపలాపించుటయో మదీయశితదివ్యామోఘబాణాగ్నిసం
తపనం బేగతి నోర్చువాడవు దురంతం బెంతయున్ రావణా!

క. "నీచేసిన పాపములకు
నీచాత్మక! యముఁడు వలను ; నేఁ డిట నానా
రాచములఁ ద్రుంచివైచెద
ఖేచరభూచరులు గూడి క్రీడం జూడన్" 40

వ. అని పలికి. 41

మ. బలువింటన్ గుణటంకృతంబు నిగుడన్ బ్రహ్మాండ
భీమంబుగాఁ
బ్రళయోగ్రానలసన్నిభం బగుమహాబాణంబు సంధించి రా
జలలాముం డగురాముఁ డేసె ఖరభాషాశ్రావణర్ణ దేవతా
బలవిద్రావణు వైరిదారజనగర్భస్రావణున్ రావణున్. 42

క. దశరథసూనుం డేసిన
విశిఖము హృదయంబుఁ దూఱ వివశుం డగుచున్
దశకంధరుండు గూలెను
దశవదనంబులను రక్తధారలు దొరఁగన్. 43

వ. అంత నా రావణుండు దెగుట విని. 44

సీ. కొప్పులు బిగి వీడి కుసుమమాలికలతో
నంసభాగంబుల నావరింప,
నేసము త్రియములు సెదరఁ, గర్ణిక లూడఁ,
గంఠహారంబులు గ్రందుకొనఁగ,
వదనపంకజములు వాఁడి వాతెఱ లెండఁ,
గన్నీళ్ళవఱద లంగములు దడుప,
సన్నపునడుములు జవ్వాడఁ బాదముల్
భయకంపితమ్ములై పరిఢవిల్ల,

ఆ. నెత్తి మోఁదికొనుచు నెఱేఁ బయ్యెదలు జాఱ,
నట్టు నిట్టుఁ దప్పటడుగు లిడుచు
నసురసతులు వచ్చి రట భూతవేతాళ
సదనమునకు ఘోరకదనమునకు. 45

వ. ఇట్లు వచ్చి తమతమనాథులం గని శోకించి రందు మండో
దరి రావణుం జూచి యిట్లని విలపించె : 46

ఉ. "హా దనుజేంద్ర! హా సురగణాంతక! హా హృదయేశ! నిర్జరేం
ద్రాదుల గెల్చి నీవు గుసుమాస్త్రునికోలల కోర్వలేక సో
న్మాదముగన్ రఘుప్రవరుమానిని నేటికిఁ దెచ్చితి తప్పు డేఁ
గా దని చెప్పినన్ వినక కాలవశంబునఁ బొంది తక్కటా!

ఆ. "ఎండఁ గాయ వెఱచు నినుఁడు, వెన్నెలఁ గాయ
వెఱచు విధుఁడు, గాలి వీవ వెఱచు
లంకమీఁద ; నిట్టి లంకాపురికి మాకు
నధిప ! విధవభావ మడరె నేఁడు. 48

క. "దురితముఁ దలఁపరు, గానరు,
జరుగుదు రెట కైన నిమిషసౌఖ్యంబులకై
పరవనితాసక్తులకును
బరధనరక్తులకు నిహముఁ బరముం గలదే ?" 49

వ. అని విలపింప నంత విభీషణుండు రామచంద్రునిపంపు వడసి
రావణునకు దహనాదిక్రియలు గావించె ; నంత రాఘవేం
ద్రుండు నశోక వనంబున కేఁగి శింశుపాతరుసమీపంబు
నందు. 50

*శా. వైదేయప్రమదాపరీత, నతిభీతన్, గ్రంథిబంధాలక
వ్రాతన్, నిశ్శ్వసనానిలాశ్రుకణజీవంజీవదారామభూ

జాతన్, శుష్కకపోలకీలితకరాబ్జాతం, బ్రపూతం, గృశీ
భూతం. బ్రాణసమేత, సీతఁ గనియెన్ భూమీశుఁ
డామునఁదటన్. 51

వ. కని రామచంద్రుండును దాపంబు నొంది, భార్యవలన
దోషంబు లేకుండుట వహ్నిముఖంబునం బ్రకటంబు సేసి,
దేవతలపంపున దేవిం జేకొని. 52

ఉ. శోషితదానవుండు నృపసోముఁడు రాముఁడు
రాక్షసేంద్రతా
శేషవిభూతిఁ గల్పసమజీవివి గ మ్మని నిల్పె నర్థిసం
తోషణుఁ, బాపశోషణుఁ, నదూషణు, శశ్వదరోషణున్
మితా
భాషణు నార్యపోషణు గృపాగుణభూషణు
నవ్విభీషణుర్. 53

వ. ఇట్లు విభీషణసంస్థాపనుండై రామచంద్రుండు సీతాలక్ష్మణ
సమేతుండై సుగ్రీవహనుమదాదులం గూడికొని పుష్పకా
రూఢుండై వేల్పులు గురియు పువ్వులసోనలం దడియుచుఁ
గొల్లివచ్చిన తెరువు జాడలు సీతకు నెఱింగించుచు మరలి
నందిగ్రామంబునకు వచ్చె నయ్యవసరంబున. 54

ఆ. రామచంద్రవిభునిరాగ వీనుల విని
భరతుఁ డుత్సహించి పాదుకలను
మోచికొనుచు వచ్చి ముదముతోఁ బురజను
లెల్లఁ గొలువ నన్న కెదురు వచ్చె. 55

వ. వచ్చి, పాదుకల ముందట నిడికొని యెడనెడ సాష్టాంగ దండప్రణామంబులు సేయుచు మెల్లమెల్లన డాసి, రామచంద్రుని పాదంబులు దననొసలం గదియించి, తచ్చరణ రేణువులు దుడిచి శిరంబునఁ జల్లికొని, తనివిసనక మఱియు నప్పదకమలంబు లక్కున మోపికొనుచు సంతసంపుఁ గన్నీటం గడిగి సేమంబు లరయుచుండె నంత సీతాలక్ష్మణ సహితుండై విభుండును దన కెదురువచ్చిన బ్రాహ్మణ జనంబులకు నమస్కరించి తక్కినవారలచేత మన్ననలు వొంది వారల మన్నించె నయ్యవసరంబున. 56

సీ. కవగూడి యిరుదెసఁ గపిరాజు రాక్షస
రాజు నొక్కటఁ జామరములు వీవ
హనుమంతుఁ డతిధవళాతపత్రముఁ బట్టఁ
బాదుకల్ భరతుండు భక్తిఁ దేర
శత్రుఘ్నుఁ డమ్ములుఁ జాపంబుఁ గొని రాఁగ
సౌమిత్రి భృత్యుఁడై చనవు సూప
జలపాత్రఁ జేఁబట్టి జనకజ గూడి రాఁ
గాంచనఖడ్గ మంగదుఁడు మోవఁ

ఆ. బసిఁడికేడె మర్థి భల్లూకపతి మోచి
కొలువఁ బుష్పకంబు వెలయ నెక్కి
గ్రహములెల్లఁ గొలువఁ గడునొప్పు సంపూర్ణ
చంద్రుపగిది రామచంద్రుఁ డొప్పె. 57

వ. ఇట్లు పుష్పకారూఢుండై కపిబలంబులు సేరి కొలువ

శ్రీరాముం డయోధ్యకుం జనియె నంతకు మున్న య
ప్పురంబునందు. 58

సీ. వీథులు సక్కఁగావించి తోయంబులు
సల్లి, రంభాస్తంభచయము నిలిపి,
పట్టుఁజీరలు సుట్టి, బహుతోరణంబులుఁ
గలువడంబులు మేలుకట్లుఁ గట్టి,
వేదిక లలికించి, వివిధరత్నంబుల
ముగ్గులు పలుచందములుగఁ బెట్టి
కలయ గోడల రామకథ లెల్ల వ్రాయించి,
ప్రాసాదముల దేవభవనములను
గోపురంబుల బంగారుకుండ లెత్తి,
యెల్లవాకిండ్లఁ గానిక లేర్పరించి,
జనులు గై సేసి తూర్యఘోషములతోడ
నెదురు నడ తెంచి రా రాఘువేంద్రుకడకు. 59

ఆ. రామభూవరేంద్రురాకఁ దూర్యములతో
రథగజాశ్వసుభటరాజితోడ
నమరెఁ బురము చంద్రుఁ డరుదేర ఘూర్ణిల్లు
జంతుభంగమిళితజలధిభంగి. 60

వ. ఇట్లొప్పుచున్న యప్పురంబుఁ బ్రవేశించి రాజమార్గంబున
రామచంద్రుం డరుగుచున్న సమయంబున. 61

మ. ఇతఁడే రామనరేంద్రుఁ డీయబల కాయింద్రారి ఖండించె,న
ల్లతఁడే లక్ష్మణుఁ, డాతఁడే కపివరుం, డాపొంత
వాఁడే మరు
త్సుతుఁ, డాచెంగట నావిభీషణుఁ డటంచుం జేతులం
జూపుచున్
సతులెల్లం బరికించి చూచిరి పురీసౌధాగ్ర
భాగంబులన్. 62

వ. ఇట్లు సమస్తజనంబుఁ జూచుచుండ రామచంద్రుండు రాజ
మార్గంబునం జనిచని. 63

సీ. పటికంపుగోడలుఁ బవడంపువాకిండ్లు
నీలంపుటరుఁగులు నెఱయ నొప్పి
కమనీయవైడూర్యకస్తంభచయముల
మకరతోరణముల మహిత మగుచుఁ
బడగల మాణిక్యబద్ధచేలంబులఁ
జిగురుఁదోరణములఁ జెలువు మీఱి
పుష్పదామకముల భూరివాసనలను
బహుళతరధూపదీపముల మెఱసి
తే. మాఱువేల్పులభంగిని మలయుచున్న
సతులుఁ బురుషులు నెప్పుడు సందడింప
గుఱుతు లిడ రాని ధనములకుప్ప లున్న
రాజసదనంబునకు వచ్చె రామవిభుఁడు. 64

వ. ఇట్లు వచ్చి. 65

ఉ. తల్లులకెల్ల మ్రొక్కి తమతల్లికి వందన మాచరించి య
ల్లల్ల బుధాళికిన్ వినతుఁడై చెలికాండ్రను
దమ్మునలం బ్రసం
ఫుల్లతఁ గౌఁగిలించికొని భూవరుఁ డోలిఁ గృపారసంబు రం
జిల్లఁగఁ జాల మన్ననలు సేసె నమాత్యులఁ
బూర్వభృత్యులన్. 66

వ. తత్సమయంబునఁ దల్లులు. 67

చ. కొడుకులుఁ బెద్దకోడలును గొబ్బున మ్రొక్కిన నెత్తి
చేతులం
బుడుకుచు మోములుం దలలు బోరన ముద్దులు గొంచు
నవ్వుచుం
దొడలకు వారి రాఁ దిగిచి తోఁగఁగఁ జేసిరి నేత్రధారలన్
వెడలినప్రాణముల్ దగఁ బ్రవిష్టము లయ్యె నటంచు
నుబ్బుచున్ 68

వ. అంత వశిష్ఠుం డరుగుదెంచి శ్రీరామచంద్రుని జటా
బంధంబు విడిపించి కులవృద్ధులుం దానును సమంత్రకంబుగ
దేవేంద్రుని మంగళస్నానంబు సేయించు బృహస్పతి చం
దంబున సముద్రనదీజలఁబుల నభిషేకంబు సేయించె రఘు
వరుండును సీతాసమేతుండై జలకంబులాడిమంచివుట్టంబులు
గట్టికొని కమ్మనిపువ్వులు దఃఱిమి సుగంధంబులలందికొని
తొడవులు దొడిగికొని తనకు భరతుండు సమర్పించిన
రాజసింహాసనంబునం గూర్చుండి యతనిమన్నించి కౌశల్య

కుఁ బ్రియంబు సేయుచు జగత్పూజ్యంబుగ రాజ్యంబు
సేయుచుండె నప్పుడు 69

సీ. కలఁగుటెల్లను మానె జలధు లేడింటికిఁ
జలనంబు మానె భూచక్రమునకు
జాగరూకత మానె జలజలోచనునకు
దీనభావము మానె దిక్పతులకు
మాసియుండుట మానె మార్తాండవిధులకుఁ
గావిరి మానె దిక్తటములకును
మడిగి పోవుట మానె నుర్వీరుహంబుల
కడఁగుట మానెఁ దేత్రాగ్నులకును

ఆ. వె. గడఁదిరిగు మానెఁ గరిగిరికిరినాగ
కమఠములకుఁ బ్రజలకలఁక మానె
రామచంద్రవిభుఁడు రాజేంద్రరత్నంబు
ధరణిభరణ రేఖఁ దాల్చు నపుడు. 70

క. తంద్రిక్రియ రామచంద్రుఁడు
తంద్రుల మఱపించి ప్రజలఁ దా రక్షింపం
దంద్రుల 'నందఱు మఱచిరి
తంద్రి గదా రామచంద్రధరణిపుఁ డనుచున్. 71

వ. మఱియు నారామచంద్రుండు రాజర్షి చరితుండును నిజ
ధర్మనిరతుండును నేకపత్నీవ్రతుండును సర్వలోకసమ్మ
తుండును నగుచు ధర్మవిరోధంబు గాకుండఁ గోరిక లను
భవించుచుఁ ద్రేతాయుగంబైనఁ గృతయుగధర్మంబుఁ

గావించుచు బాలమరణంబు మొదలగు నరిష్టంబులు
ప్రజలకుఁ గలుగకుండ రాజ్యంబు సేయుచుండెనయ్యెడ. 72

ఆ. వె. సిగ్గువడుట గల్గి సింగారమును గల్గి
భక్తి గలిగి చాలభయముఁ గలిగి,
నయముఁ బ్రియముఁ గల్గి నరనాథుచిత్తంబుఁ
సీత దనకు వశము సేసికొనియె. 73



# పోతన — ఆంధ్రమహాభాగవతము

## నరకాసుర వధ

## (దశమస్కంధము)

మ. బలవంతుండు ధరాసుతుండు గనె శుంభద్రాజబింబోపరి
స్థలశంపాన్వితమేఘమో యన ఖగేంద్రస్కంధపీఠంబుపై
లలనారత్నముఁగూడి సంగరకథాలాపంబులం దేలు ను
జ్జ్వలనీలాంగుఁ గనన్నిషంగు గుహనాచంగున్
రణాభంగునిన్. 1

వ. కని కలహంబునకు నరకాసురుండు గమకింపం, దమకింపక
విలోకించి సంభ్రమంబున. 2

శా. వేణిన్ జొల్లెము వెట్టి సంఘటితనీవీబంధయై భూషణ
శ్రేణిం దాల్చి ముఖేందుమండలమరీచీజాలముల్ పర్వఁగాఁ
బాణిం బయ్యెద చక్కఁగాఁ దుఱిమి శుంభద్వీర
సంరంభయై
యేణీలోచన లేచినిల్చెఁ దన ప్రాణేశాగ్రభాగంబునన్. 3

క. జన్యంబున దనుజులదా
ర్జన్యము లుడుపంగఁ గోరి చనుదెంచిన సౌ
జన్యవతిఁ జూచి యదురా
జన్యశ్రేష్ఠుండు సరససల్లాపములన్. 4

క. లేమా దనుజుల గెలువఁగ
లేమా వీ వేల కడఁగి లేచితి విటురా
లేమాను మానవే నా
లే మావిల్లందికొనుము లీలం గేలన్. 5

వ. అని పలికి

క. హరిణాక్షికి హరి యిచ్చెను
సురనికరోల్లాసనమును శూరకఠోరా
సురసైన్య త్రాసనమును
బరగర్వనిరాసనమును బాణాసనమున్. 7

శా. ఆ విల్లంది బలంబునొంది తదగణ్యానంత తేజోవిశే
షావిర్భూతమహాప్రతాపమున వీరాలోక దుర్లోకయై
తావేగన్ సగుణంబుఁ జేసె ధనువుం దన్వంగి దైత్యాంగనా
గ్రీవాసంఘము నిర్గుణంబుగ రణక్రీడా మహోత్కంఠతోన్.

క. నారి మొరయించె రిపుసే
నారింఖణహేతు వైన నాదము నిగుడన్
నారీమణి జలసంప
న్నారీభాదికము మూర్ఛనంద నరేంద్రా. 9

సీ. సౌవర్ణకంకణ ఝణఝణనినదంబు
శింజినీరవముతోఁ జెలిమిసేయఁ
దాటంకమణిగణ ధగధగదీప్తులు
గండమండలరుచిఁ గప్పికొనఁగ

ధవళతరాపాంగధళధళరోచులు
బాణజాలప్రభాపటలి నడఁప
శరపాతఘుమఘుమశబ్దంబు పరిపంథి
సైనికకలకలస్వనము నుడుప
వీరశృంగారభయరౌద్రవిస్మయములు
గలసి భామిని యయ్యెనో కాక యనఁగ
నిషువుఁ దొడుగుట దివుచుట యేయుటెల్ల
నెఱుఁగరాకుండ ననిసేసె నిందువదన. 10

*మ. పరుఁజూచున్వారుఁజూచునొంపనలరింపన్ రోష
రాగోదయా
విరత భ్రూకుటిమందహాసములతో వీరంబు శృంగారమున్
జరగంగన్నులఁ గెంపుసొంపుఁబరఁగం జండాస్త్ర
సందోహమున్
సరసాలోకసమూహమున్నెఱపుచుం జంద్రాస్య
హేలాగతిన్. 11

మ. అలినీలాలక చూడ నొప్పెసఁగెఁ బ్రత్యాలీఢపాదంబుతో
నలికస్వేదవికీర్ణ కాలకలతో నాకర్ణికానీతస
ల్లలితజ్యానఖపుంఖ దీధితులతో లక్ష్యావలోకంబుతో
వలయాకారధనుర్విముక్తవిశిఖవ్రాతాహతారాతియై. 12

సీ. బొమ్మ పెండ్లిండ్లకుఁ బోనొల్ల ననుబాల
రణరంగమున కెట్లు రాఁదలంచె
మగవారిఁ గనినఁ దామఱుఁగుఁ జేరెడునింతి
పగవారి గెల్వ నేపగిదిఁ జూచెఁ

బసిఁడియుయ్యేల లెక్కఁ-భయ మందు భీరువు
ఖగపతిస్కంధ మేకడిఁది నెక్కె-
సఖులకోలాహలస్వనము లోర్వసి కన్య
పటహాభాంకృతుల కెబ్బంగి నోర్చె

ఆ. నీలకంఠములకు నృత్యంబుఁ గఱపుచు
నలసి తలఁగిపోవు నలరుఁబోఁడి
యేవిధమున నుండె నెలమి నాలీఢాది
మానములను రిపులమాన మడఁప. 13

సీ. వీణెఁ జక్కఁగఁ బట్టవెఱ వెఱుంగనికొమ్మ
బాణాసనం బెట్లు పట్టనేర్చె
మ్రాఁకునఁ దీగెఁ గూర్పంగ నేరనికొమ్మ
గుణము నేక్రియ ధనుఃకోటిఁ గూర్చె
సరవి ముత్యము గ్రువ్వఁజాలని యబల యే
నిపుణత సంధించె నిశితశరముఁ
జిలుకకుఁ బద్యంబుఁ జెప్పనేరని తన్వి
యస్త్రమంత్రము లెన్నఁ డభ్యసించెఁ

ఆ. బలుకుమనినఁ బెక్కు పలుకని ముగ్ధ యే
గతి నొనర్చె సింహగర్జనంబు
లనఁగ మెఱఁసె ద్రిజగదభిరామ గుణధామ
చారుసత్యభామ సత్యభామ. 14

శా. జ్యావల్లీధ్వని గర్జనంబుగ సురల్ సారంగయూథంబుగా
నావిల్లింద్రశరాసనంబుగ సరోజాతుండు మేఘంబుగాఁ

దా విద్యుల్లతభంగి నింతి సురజిద్దావాగ్ని మగ్నంబుగాఁ
బ్రావృట్కాలము సేసె బాణచయ మంభశ్శీకర శ్రేణిగాన్.

సీ. రాకేందుబింబమై రవిబింబమై యొప్పు
నీరజాతేక్షణ నెమ్మొగంబు
కందర్పకేతువై ఘనధూమకేతువై
యలరు పూఁబోఁడి చేలాంచలంబు
భావజుపరిధియై ప్రళయార్కపరిధియై
మెఱయు నాకృష్టమై మెలఁతచాప
మమృతప్రవాహమై యనలసందోహమై
తనరారు నింతి సందర్శనంబు

ఆ. హర్షదాయి యయి మహారోషదాయియై
పరగు ముద్దరాలి బాణవృష్టి
హరికి నరికిఁ జూడ నందంద శృంగార
వీరరసము లోలి విస్తరిల్ల. 16

వ. ఇవ్విధంబున రణంబున విక్రమించుటయు. 17

క. శంపాలతాభ బెడిదపు
టంపరచే ఘోరదానవానీకంబుల్
పెంపఱి సన్నాహంబుల
సొంపఱి భూసుతునివెనుకఁ జొచ్చెన్ విచ్చెన్. 18

వ. అయ్యవసరంబునఁ గంససంహారి మనోహారిణింజూచి సంతోషకారియుం గరుణారసావలోకనప్రసారియు మధుర వచన సుధారసవిసారియుం దదీయ సమర సన్నాహనివారియునై యిట్లనియె. 19

క. కొమ్మా దానవనాథుని
కొమ్మా హావమునకుఁ దొలఁగె గురువిజయముఁ గై
కొమ్మా మెచ్చితి నిచ్చెదఁ
గొమ్మాభరణములు నీవు గోరినవెల్లన్. 20

వ. అని పలికి సమ్మానరూపంబులును మోహనదీపకంబులును దూరీకృత చిత్తవిక్షేపంబులును నైన సల్లాపంబులఁ గళావతిం దద్దయుఁ బెద్దఱికంబు సేసి తత్కరకిసలయోల్లసిత బాణాసనంబు మఱల నందికొనియె నప్పుడు సురవైరి మురవైరి కిట్లనియె. 21

క. మగువ మగవారిముందఱ
మగతనములు సూప రణముమానుట నీకున్
మగతనము గాదు దనుజులు
మగువలదెసఁ జనరు మగలమగ లౌట హరీ. 22

వ. అనిన హరి యి ట్లనియె. 23

క. నరకా ఖండించెద మ
త్కరకాండాసనవిముక్తఘనశరముల భీ
కరకాయు నిన్ను సుర కి
న్నరకాంతలు సూచి నేఁడు నందం బందన్ 24

వ. అని పలికి హరి నరకాసురయోధులమీఁద శతఘ్ని యను దివ్యాస్త్రంబుఁ బ్రయోగించిన నొక్కవరుసను వార లందఱు మహావ్యథఁ జెందుటయు నప్పుడు. 25

మ. శరవిచ్ఛిన్నతురంగమై పటుగదాసంభిన్నమాతంగమై
యురుచక్రాహతవీరమధ్యపదబాహుస్కంధముఖ్యాంగమై
సురభిత్సైన్యము దైన్యముం బొరయుచున్ శోషించి
హైన్యంబుతో
సౌరిక్రోమాల న్నిలువంగలేక పఱచెన్ హాహా
నినాదంబులన్. 26

వ. అంత. 27

ఆ.వె. మొనసి దనుజయోధముఖ్యులు నిగిడించు
శస్త్రసముదయముల జనవరేణ్యు
మురహరుండు వరుస మూఁడేసికోలల
ఖండితంబుసేసెఁ గదనమందు. 28

క. వెన్నుని సత్యను మోచుచుఁ
బన్నుగఁ బదనఖర చంచుపక్షాహతులన్
భిన్నములు సేసె గరుడుఁడు
పన్నిన గజ సముదయములఁ బౌరవముఖ్యా. 29

వ. మఱియు విహగరాజపక్షవిక్షేపణసంజాతవాతంబునసైరింపఁ
జాలక హతశేషంబయిన సైన్యంబు పురంబు సొచ్చుటం
జూచి నరకాసురుండు మున్ను వజ్రాయుధంబుం దిరస్క
రించిన తనచేత శక్తింగొని గరుడునివై చె నతండును విరుల
దండ వేటునఁ జలింపని మదోద్దండ వేదండంబునుంబోలె
విలసిల్లెనయ్యవసరంబున గజారూఢుండై కలహారంగంబున.

మ. సమదేభేంద్రము నెక్కి భూమిసుతుఁ డా చక్రాయుధున్ వైవశూ
లముచేఁబట్టిన యంతలోన రుచిమాలాభిన్నఘోరాసురో
త్తమచక్రం బగు చేతిచక్రమున దైత్యధ్వంసి ఖండించె ర
త్నమయోదగ్రవినూత్నకుండలసమేతంబైన తన్మూర్ధముల్. 31

శా. ఇల్లాలన్ గిటియైనకాలమున మున్నేనంచు ఘోషింతువో
తల్లీ నిన్నుఁ దలంచియైన నిచటం దన్నుం గృపంగావఁడే
చెల్లంబో తలఁద్రెంచెనంచు నిల నాక్షేపించుచందంబునం
ద్రెళ్లెం జప్పుడుగాఁగ భూమిసుతుఁ డుద్దీప్తాహవక్షోణిపై.

క. కంటిమి నరకుఁడు వడఁగా
మంటిమి నేఁ డనుచు వెస నమర్త్యులు మునులున్
మింటం బువ్వులు గురియుచుఁ
బంటెంపక పొగడి రోలిఁ బద్మదళాక్షున్. 33

---

# పోతన — ఆంధ్రమహాభాగవతము

## అశ్వత్థామాపమానము

15-వ శతాబ్దాంత్యమున నుండిన వాఁడని యూహింపఁబడిన బమ్మెర పోతనామాత్యునిచే తెనిఁగింపబడిన భాగవతమునుండి యీ భాగము గ్రహింపఁబడినది. దీనినే తిక్కన సౌప్తికపర్వమున మహాభారతమునుండి తెనిఁగించెను. పాఠకులు రెంటిని బఠియించి భేదమును గ్రహింపవచ్చును.

ఉ. బాలురచావు కర్ణములఁ బడ్డఁ గలంగి యలంగి యోరువం
జాలక బాష్పతోయకణజాలము చెక్కులరాల నేడ్చెఁ బాం
చాలతనూజ నేలఁబడి జాలిఁబడం గనియెత్తి మంజు వా
చాలత చూపుచుం జికురజాలము దువ్వచుఁ గ్రీడి
యిట్లనున్. 1

మ. ధరణీశాత్మజవీవు నీకువగవర్ ధర్మంబె యాద్రౌణి ని
ష్కరుణుండై విదళించె బాలకుల మద్గాండీవ నిర్ముక్త భీ
కర బాణంబుల నేఁడు వానిశిరముర్ ఖండించి నేఁ దెత్తుఁ ద
చ్ఛిరముం ద్రొక్కి జలంబులాడు మిచటన్ శీతాంశు
బింబాననా. 2

వ. అని యిట్లాడంబఱచి తనకు మిత్రుండును సారథియునైన హరి మేలనుచుండఁ గవచంబు దొడిగి గాండీవంబు ధరించి కపిధ్వజుండై గురుసుతుని వెంట రథంబును దోలించిన

శా. తన్నుం జంపెదనంచు వచ్చు విజయున్ దర్శించి, తద్వారిణి, యా
పన్నుండై శిశుహంత గావున, నిజ ప్రాణేచ్ఛఁ బారెన్ వడిన్
మున్నా బ్రహ్మమృగాకృతిం దనయకున్ మోహించి క్రీడింపనా
పన్నుండౌ హరుఁ జూచి పాఱుపగిదిన్ సర్వేంద్రియ భ్రాంతితోన్.

వ. ఇట్లోపినంతదూరంబు పరువిడి వెనుకఁ జూచి రథతురగంబు లలయుట దెలిసి నిలిచి ప్రాణరక్షణంబునకు నొండుపాయంబు లేమి నిశ్చయించి జలంబులఁ వార్చి ద్రోణనందనుండు సమాహితచిత్తుండై ప్రయోగంబకాని యుపసంహారంబు నేరకయుఁ బ్రాణసంరక్షణార్థంబు పార్థుని మీఁద బ్రహ్మశిరోనామకాస్త్రంబు ప్రయోగించిన నది ప్రచండ తేజంబున దిగంతరాళంబు నిండి ప్రాణి భయంకరంబై తోఁచిన హరికి నర్జునుం డి ట్లనియె. 5

సీ. పద్మలోచన, కృష్ణ, భక్తాభయప్రద
వినుము సంసారాగ్ని వేఁచుచున్న
జనుల సంసారంబు సంహరింపఁగ నీవు
దక్క నన్యులు లేరు తలఁచి చూడ
సాక్షాత్కరించిన సర్వేశ్వరుండవు
ప్రకృతికి నవ్వలి ప్రభుఁడవాద్య
పురుషుండవగు నీవు బోధముచే మాయ
నడఁతువు నిశ్శ్రేయసాత్మయందు

ఆ. మాయచేత మునిఁగి మనువారలకుఁ గృప
సేసి ధర్మముఖ్యచిహ్నమైన
శుభము సేయుదీవు సుజనుల నవనిలోఁ
గావఁ బుట్టుదువు జగన్నివాస. 6

క. ఇదియొక తేజము భూమియుఁ
జదలును దిక్కులునునిండి సర్వంకషమై
యెదురై వచ్చుచు నున్నది
విదితముగా నెఱుఁగఁ జెప్పవే దేవేశా! 7

వ. అనిన హరి యిట్లనియె. 8

శా. జిహ్మత్వంబునఁ బాఱి ద్రోణజుఁడు దుశ్శీలుండు ప్రాణేచ్ఛుమై
బ్రహ్మాస్త్రంబదె యేసె వచ్చెనిదె తద్బాణాగ్ని భీభత్స నీ
బ్రహ్మాస్త్రంబునఁగాని దీని మరలింపన్ రాదు సంహారమీ
బ్రహ్మపత్య మెఱుంగఁ డేయుము వడిన్
బ్రహ్మాస్త్రమున్ దీనిపై. 9

వ. అనిన నర్జునుండు జలంబుల వార్చి హరికిం బ్రదక్షిణంబు వచ్చి ద్రోణనందనుం డేసిన బ్రహ్మాస్త్రంబుమీఁదఁ దన బ్రహ్మాస్త్రంబుం బ్రయోగించిన. 10

మ. అవనీ వ్యోమములందు నిండి తమలో నా రెండు బ్రహ్మాస్త్రముల్
రవివహ్నిద్యుతిఁ బోరుచుం ద్రిభువనత్రాసంబుగావింపఁగా

వివశభ్రాంతి యుగాంతమోయని ప్రజల్ వీక్షింప
నావేళ మా
ధవునాజ్ఞన్ విజయుండుసేసె విశిఖద్వంద్వోప
సంహారమున్. 11

వ. ఇ ట్లస్త్రద్వయంబు నుపసంహరించి ధనంజయుండు ద్రోణ
నందనుంగూడ నరిగి పట్టుకొని రోషారుణితలోచనుండై
యాజ్ఞికుండు రజ్జువునం బశువుఁ గట్టిన చందంబున
బంధించి శిబిరంబుకడకుం గొనిచని హింసింతునని తిగిచినం
జూచి హరి యి ట్లనియె. 12

ఉ. మాఱుపడంగ లేని యసమర్థుల సుప్తుల నస్త్రవిద్యలం
దేఱని పిన్నపాపల వధించె నిశీథమునందుఁ గ్రూరుఁడై
పాఱుఁడుగాని పాతకుఁడు ప్రాణభయంబున వెచ్చనూర్చుచుం
బాఱెడి వీనిఁ గావుము కృపామతి నర్జున, పాపవర్జనా! 13

చ. వెఱచినవాని దైన్యమున వేదుఱునొందినవాని నిద్ర మై
మఱచినవాని సౌఖ్యమున మద్యముఁ ద్రావినవానిభగ్నుఁడై
పఱచినవాని సాధుజడభావమువానిని గావుమంచు వా
చఱచినవానిఁ గామినులఁ జంపుట ధర్మముగాదు ఫల్గునా!

శా. స్వప్రాణంబుల నెవ్వఁడేని గరుణాసంగంబు సాలించి య
న్యప్రాణంబులచేత రక్షణముసేయన్ వాఁడధోలోకదుః
ఖప్రాప్తుఁడగు రాజదండమున సత్కల్యాణుఁడౌ నైన నీ
విప్రుందండితుఁజేయు మేటికి మహావిభ్రాంతిచే నుండఁగన్.

వ. అని యివ్విధంబునఁ గృష్ణుం డానతిచ్చిన బ్రాహ్మణుండు
కృతాపగాథుండయ్యు వధ్యుండుగాఁడనుధర్మంబు దలంచి
చంపక ద్రుపద రాజపుత్త్రికిం దనచేసిన ప్రతిజ్ఞం దలంచి
బద్ధుండైన గురునందనుం దోడ్కొని కృష్ణుండు సార
థ్యంబుసేయ శిబిరంబుకడకు వచ్చి. 16

క. సురరాజ సుతుఁడు చూపెను
దురవధిసుత శోకయుతకు ద్రుపదుని సుతకుం
బరిచలితాంగ శ్రేణిం
బరుష మహాపాశబద్ధపాణిన్ ద్రౌణిన్. 17

వ. ఇట్లర్జునుండు తెచ్చి చూపిన బాలవధజనిత లజ్జాపరాఙ్ము
ఖుండైన కృపి కొడుకుం జూచి మ్రొక్కి సుస్వభావయగు
ద్రౌపది యిట్లనియె. 18

మ. పరఁగన్ మా మగవారలందఱును మున్ బాణప్రయోగోపసం
హరణాద్యాయుధ విద్యలన్నియును ద్రోణాచార్యుచే నభ్యసిం
చిరి పుత్త్రాకృతినున్న ద్రోణుఁడవు నీ చిత్తంబులో లేశముం
గరుణాసంగము లేక శిష్యసుతులన్ ఖండింపఁగాఁబాడియే.

క. భూసురుఁడవు బుద్ధిదయా
భాసురుఁడవు శుద్ధవీరభటసందోహా

గ్రేసరుఁడవు శిశుమారణ
మాసురకృత్యంబు ధర్మమగునే తండ్రీ! 20

శా. ఉద్రేకంబున రారు శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు కిం
చిద్ద్రోహంబును నీకుఁ జేయరు బలోత్సేకంబుతోఁ జీకటిన్
భద్రాకారులఁ బిన్న పాపల రణప్రౌఢ క్రియాహీనులన్
నిద్రాసక్తుల సంహరింప సకటా నీచేతు లెట్లాడెనో! 21

ఉ. అక్కట పుత్రశోకజనితాకులభార విషణ్ణచిత్తనై
పొక్కుచునున్న భంగి నినుఁబోరఁ గిరీటి నిబద్ధుఁజేసి నేఁ
డిక్కడ కీడ్చి తెచ్చుట సహింపనిదై భవదీయమాత నేఁ
డెక్కడ నిట్టిశోకమున నేక్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో

వ. అని కృష్ణార్జునులం జూచి యిట్లనియె. 23

ఉ. ద్రోణునితోఁ శిఖంబడక ద్రోణకుటుంబిని యున్నదిఁట న
క్షీణతనూజశోక వివశీకృతనై విలపించుభంగి నీ
ద్రౌణిఁ దెరల్చి తెచ్చుటకు దైన్యమునొందుచు నెంత పొక్కునో
ప్రాణవియుక్తుఁడైన నతిపాపము బ్రాహ్మణహింస మానరే.

క. భూపాలకులకుఁ విప్రులఁ
గోపింపం జేయఁదగదు కోపించినఁ ద
త్కోపానలంబు మొదలికి
భూపాలాటవులఁ గాల్చు భూకంపముగాన్. 25

వ. అని యిట్లు ధర్మ్యంబును సకరుణంబును నిర్వ్యాళీకంబును
సమంజసంబును శ్లాఘ్యంబునుం గాఁ బలుకు ద్రౌపది

పలుకులకు ధర్మనందనుండు సంతసిల్లె. నకుల సహదేవ సాత్యకి ధనంజయ కృష్ణులు సమ్మతించిరి. సమ్మతింపక భీముం డిట్లనియె. 26

చ. కొడుకులఁబట్టి చంపెనని కోపమునొందదు బాలఘాతకుగ
విడువుమటంచు జెప్పెడిని వెఱ్ఱిది ద్రౌపది వీఁడు విప్రుఁడే
విడువఁగనేల చంపుఁడిటు వీనిని మీరలు సంపరేని నా
పిడికిటిపోటునన్ శిరము భిన్నము సేసెదఁ జూడుఁడిందఱున్.

వ. అని పలికిన నశ్వత్థామకు ద్రౌపది యడ్డంబువచ్చె. భీముని సంరంభంబు సూచి హరిచతుర్భుజుండయి రెండుచేతుల భీముని వారించి కడమ రెంటను ద్రుపద పుత్రికను దలంగించి నగుచు భీమున కిట్లనియె. 28

ఉ. అవ్యుఁడుగాడు వీఁడు. శిశుహంత దురాత్మకుఁ డాతతాయి హం
తవ్యుఁడు బ్రహ్మబంధుఁడగుఁ దప్పదు నిక్కము బ్రాహ్మణో నహం
తవ్యయటంచు వేదము శ్రుతంబగుఁ గావున ధర్మదృష్టిఁ గ
ర్తవ్యము వీనిఁగాంచుట యథాస్థితిఁ జూడుము పాండవో త్తమా. 29

వ. అని సరసాలాపంబులాడి పవననందను నొడంబఱచి యర్జునుంజూచి ద్రౌపదికి నాకు భీమసేనునకు సమ్మతంబుగ మున్ను నీ చేసిన ప్రతిజ్ఞయు సిద్ధించునట్లు నాపంపుచేయు

మని నారాయణుం డానతిచ్చిన నర్జునుండును దదను
మతంబున. 30

శా. విశ్వస్తుత్యుఁడు శక్రసూనుఁడు మహావీరుండు ఘోరాసిచే
నశ్వత్థామ శిరోజముల్ దఱిగి చూడాంతర్మహారత్నమున్
శశ్వత్కీర్తి వెలుంగఁ బుచ్చుకొని పాశవ్రాత బంధంబులన్
విశ్వాసంబున నూడ్చి త్రోచె శిబిరోర్వీభాగముం బాసిపోన్.

క. నిబ్బరపు బాలహంతయు
గొబ్బునఁ దేజంబు మణియుఁగోల్పడి నతుఁడై
డబ్బిన వగచే విప్రుఁడు
సిబ్బితితో నొడలి గబ్బుసెడి వడిఁ జనియెన్. 32

ఆ. ధనము గొనుటయొండె
దలగొఱుగుట యొండె
నాలయంబు వెడల నడచుటొండెఁ
గాని చంపఁ దగిన కర్మంబుసేసినఁ
జంపఁదగదు విప్రజాతిఁ బతికి. 33

వ. ఇట్లశ్వత్థామం బ్రాణావశిష్టుం జేసి వెడలనడచి పాండవులు
పాంచాలీ సహితులై పుత్రులకు శోకించి మృతులైన
బంధువులకెల్ల దహనాది కృత్యంబులు సేసి యుదక
ప్రదానంబు సేయుకొఱకు స్త్రీల ముందట నిడుకొని
గోవిందుండునుం దారును గంగకుం జని తిలోదకంబువోసి
క్రమ్మఱ విలపించి హరిపాదపద్మజాతపవిత్రంబు లయిన
భాగీరథీజలంబుల స్నాతులయి యున్నయెడం బుత్ర

శోకాతురులయిన గాంధారీధృతరాష్ట్రులను గుంతీద్రౌపదు
లనుజూచి మాధవుండు మునీంద్రులుం దాను బంధు
మరణశోకాతురు లయినవారల వగపు మానిచి
మన్నించె నివ్విధంబున 34

శా. పాంచాలీకబరీ వికర్షణ మహాపాపక్షతాయుష్కులం
జంచద్గర్వుల ధార్తరాష్ట్రుల ననిం జంపించి గోవిందుఁ డి
ప్పించెన్ రాజ్యము ధర్మపుత్రునకుఁ గల్పించెన్ మహా
ఖ్యాతిఁ జే
యించెన్ మూఁడుతురంగమేధములు దేవేంద్రప్రభా
వంబునన్. 35



# పోతన – ఆంధ్రమహాభాగవతము

## (దశమ స్కంధము)

## శ్రీకృష్ణుఁడు కాలయవనుని జంపుట

వ. కలహవిద్యావిశారదుండగు నారదుఁడు గాలయవనుకడకుం జని యి ట్లనియె,

మ. యవనా నీవు సమస్తభూసతుల బాహాఖర్వగర్వోన్నతిం
బవనుం డభ్రములన్ హరించుపగిదిన్ భంజించి
యున్నేల యా
దవులన్ గెల్వవు వారలన్ మఱచియో దర్పంబు
లేకుండియో
యవివేకస్థితి నొందియో వెఱచియో హైన్యంబునం
జెందియో. 2

క. యాదవులలోన నొక్కఁడు
మేదినిపై సత్త్వరేఖ మెఱసి జరాసం
ధాదులఁ దూలందోలెను
దాదృశుఁడిల లేఁడు వినవె తత్కర్మంబుల్. 3

వ. అనిన విని కాలయవనుం డి ట్లనియె. 4

శా. ఏమీ నారద నీవు చెప్పిన నరుం డే రూపువాఁ డెంతవాఁ
డేమేరన్ విహరించు నెవ్వఁడు సఖుం డెందుండు నేపాటి దో

స్సామర్థ్యంబునఁ గయ్యముల్ సలుపు నస్మద్బాహు
శౌర్యంబు సం
గ్రామక్షోణి భరించి నిల్వఁ గలఁడే గర్వాఢ్యుఁడే
చెప్పుమా. 5

వ. అనిన విని దేవముని యి ట్లనియె. 6

సీ. నీలజీమూత సన్నిభ శరీరమువాఁడు
తామరసాభ నేత్రములవాఁడు
పూర్ణేందుబింబంబుఁ బోలెడి మోమువాఁ
డున్నత దీర్ఘ బాహువులవాఁడు
శ్రీవత్సలాంఛనాంచిత మహోరమువాఁడు
కౌస్తుభమణిపదకంబువాఁడు
శ్రీకరపీతకౌశేయచేలమువాఁడు
మకరకుండలదీప్తి మలయువాఁడు

తే. రాజయింతంతవాఁ డనరానివాఁడు
మెఱసి దిక్కులనెల్లను మెరయువాఁడు
తెలిసి యే వేళలం దైనఁ దిరుగువాఁడు
పట్టనేర్చినఁగాని లోఁ బడనివాఁడు. 7

వ. అని మఱియు నితరలక్షణంబులుం జెప్పిన విని సరకుసేయక,

ఉ. యాదవుఁ డెంతవాఁడు ప్రళయాంతకుఁ డైన నెదిర్చె
నేనియుం
గా దనఁ బోర మత్కలహ కర్కశ బాహు ధనుర్విముక్తనా
నా దృఢ హేమపుంఖ కఠిన జ్వాలదస్త్రపరంపరా సము
త్పాదితవహ్నికీలముల భస్మముసేసెదఁ దాపసోత్తమా. 9

వ. అని పలికి కాలయవనుండు మూఁడుకోట్ల మ్లేచ్ఛవీరులం గూడుకొని శీఘ్రగమనంబున దాడివెడలి మథురాపురంబు మీఁద విడిసినం జూచి బలభద్రసహితుండై కృష్ణుం డిట్లని వితర్కించె. 10

సీ. యవనుండు పురమెల్ల నావరించెను నేఁటి
యెల్లింటి లోపల యీ నడుమను
మాగధుండును వచ్చి మనమీఁద విడియును
యవనమాగధులు మహాప్రబలులు
పురి రెండువంకలఁ బోరుదు రట్టిచో
నోపినభంగి నొక్కొక్కచోట
మనము యుద్ధము సేయ మఱియొక్కఁ డెడసొచ్చి
బంధుల నందఱఁ బట్టిచంపు
తే. నొండెఁగొనిపోయి చెఱ బెట్టు నుగ్రకర్ముఁ
డైన మాగధుఁ డది గాన నరివరులకు
విడియఁ బోరాడఁగా రాని విషమభూమి
నొక్కదుర్గంబు సేసి యందునుపవలయు. 11

వ. అని వితర్కించి సముద్రు నడిగి సముద్రమధ్యంబునఁ బండ్రెండుయోజనంబుల నిడుపు నంతియ వెడల్పుంగల దుర్గ ప్రదేశంబు సంపాదించి తన్మధ్యంబునం గృష్ణుండు సర్వాశ్చర్యకరంబుగ నొక్క నగరంబు నిర్మింపుమని విశ్వకర్మం బంచిన. 12

ఆ. వరుణపురముకంటె వాసవుపురికంటె
ధనదువీటికంటె దండధరుని

నగరికంటె బ్రహ్మ నగరంబుకంటెఁ బ్ర
స్ఫుటము గాఁగ నొక్క పురముఁ జేసె. 13

క. దర్పించిచేసి పురము స
మర్పించెను విశ్వకర్మ మంగళగుణ సం
తర్పితగహ్వారికిని గురు
దర్పితదుఃఖప్రవాహ తరికిన్ హరికిన్. 14

వ. ఇట్లు విశ్వకర్మనిర్మితంబైన ద్వారకానగరంబునకు నిజ యోగప్రభావంబున మధురాపురజనుల నందఱం జేర్చి బలభద్రున కెఱింగించి తదనుమతంబున నందనవనంబు నిర్గమించు పూర్వాదిగ్గజంబు పెంపున మేరుగిరిగహ్వారంబు వెలువడు కంఠీరవంబు తెఱంగున హరిహయు దిగంతరాళంబున నుదయించు నంధకార పరిపంథికై వడి మధురానగరంబు వెలువడి నిరాయుధుండై యెదురు వచ్చుచున్న హరిం గని. 15

మ. కరిసంఘంబులు లేవు రావు తురగౌఘంబుల్ రథవ్రాతముల్
పరిసర్పింపవు రారు శూరులు ధనుర్బాణాసి ముఖ్యాయుధో
త్కరముం బట్టఁడు శక్రచాపయుత మేఘస్ఫూర్తితో మాలికా
ధరుఁ డొక్కండదె నిర్గమించె నగర ద్వారంబునం గంటిరే. 16

శా. ఎన్నే నయ్యె దినంబు లీ నగరిపై నేతెంచి పోరాటకున్
మున్నెవ్వండును రాఁడు వీఁడొకఁడు నిర్ముక్తాయుధుం డేఁగుదెం
చెన్నన్నోర్వఁగనో ప్రియోక్తులకునో శ్రీఁగోరియో చూడుఁ డం
చు న్నాత్మీయ జనంబుతోడ యవనేశుం డిట్లు తర్కింపఁగన్. 17

క. విభులగు బ్రహ్మప్రముఖుల
కభిముఖుఁడై నడవకుండు నధిక గుణాఢ్యుం
డిభరాజగమన మొప్పఁగ
నభిముఖుఁడై నడచెఁ గాల యవనున కధిపా. 18

వ. ఆ సమయంబున నయ్యాదవేంద్రు నేర్పడంజూచి. 19

మ. వనజాతాక్షుఁడు సింహమధ్యుఁడు రమా వక్షుండు శ్రీవత్సలాం
ఛనుఁ డంభోధర దేహు డిందుముఖుఁ డంచద్దీర్ఘ బాహుండు స
ద్వనమాలాంగద హారకంకణ సముద్యత్కుండలుం డీతఁ డా
ముని సూచించిన వీరుఁ డౌ ననుచు న మ్మ్లాధుండు గాఢోద్ధతిన్. 20

సీ. చటుల వాలాభీల సైంహికేయుని భంగి
లాలితేతరజటా లతిక దూలఁ
బ్రళయావసర బృహ ద్భాను హేతిద్యుతిఁ
బరుషారుణశ్మశ్రు పటలి వ్రేలఁ

గాదంబినీ చ్ఛన్న కాంచన గిరిభాతిఁ
గవచ సంవృతదీర్ఘ కాయ మమర
వల్మీక సుప్తదుర్వారాహికై వడిఁ
గోశంబులో వాలు గొమరు మిగుల

ఆ. నార్చి పేర్చి మించి యశ్వంబు గదలించి
కమలసంభవాది ఘనుల కైనఁ
బట్టరాని ప్రోడఁ బట్టెద నని జగ
దవనుఁ బట్టఁ గదిసె యవను డధిప. 21

క. ఇటు దన్నుఁ బట్ట వచ్చినఁ
బటుతరజవరేఖ మెఱసి పట్టుపడక ది
క్తటము లదుర హరి వాఁ డెం
జటులగతిఁ వాఁడుఁదోడఁ జను దేరంగన్. 22

వ. అప్పుడు కాలయవనుం డి ట్లనియె. 23

మ. యదు వంశోత్తమ పోకు పోకు రణమిం సర్వాంబు కంసాదులం
గదనక్షోణి జయించి తీ వని సమిత్కామంబునన్ వచ్చితిన్
విదితఖ్యాతులు వీటఁ బోవ నరికిన్ వెన్నిచ్చియిబ్భంగి నే
గుదురే రాజులు రాజమాత్రుఁడవె వైగుణ్యంబు వచ్చుంజుమీ. 24

మ. బలిమిన్ మాధవ నేఁడు నిన్ను భువన ప్రఖ్యాతిగాఁ
బట్టుదున్
జలముల్ సొచ్చిన భూమిక్రిందఁ జనినన్ శైలంబుపై
నెక్కినన్
బలిదంశన్ విలసించినన్ వికృత రూపంబుం బ్రవేశించినన్
జలధిం దాఁటిన నగ్రజన్మహలికా శ్యాటాకృతుల్
దాల్చినన్. 25

వ. అదియునుంగాక. 26

మ. శరముల్ దూఱపు మద్ధనుర్గుణలతా శబ్దంబు లేతేర వా
హరి రింఖోత్థితధూళి గప్ప దకటా హాస్యుండవై పాఱెదు
ర్వరపై నేక్రియఁ బోరితో కదిసి మున్ వాతాశితోఁ
గేశితోఁ
గరితో మల్లురతో జరాతనయుతోఁ గంసావనీ
నాథుతోన్. 27

వ. అని పలుకుచుఁ గాలయవనుండు వెంట నరుగుదేర సరకు
సేయక మందహాసంబు ముఖారవిందంబునకు సౌంద
ర్యంబు నొసంగ వేగిరపడకు రమ్మ రమ్మనుచు
హరియును. 28

సీ. అదె యిదె లోఁబడె నని పట్టవచ్చినఁ
గుప్పించి లంఘించుఁ గొంత తడవు
పట్టరా దీతని పరు వగ్గలం బని
భావింపఁగా సమీపమున నిలుచు

నడరి పార్శ్వంబుల కడ్డంబు వచ్చినఁ
గేడించి యిట్టట్టు గికురు వెట్టు
వల్మీకతరు సరోవరము లడ్డంబైన
సవ్యాపసవ్య సంచరతఁ జూపుఁ

తే. బల్లముల డాఁగు దిబ్బల బయలుపడును
నీడలకుఁ బోవు నిఱుముల నిగిడి తాఱు
నన్నుఁ బట్టిన నీవు మా నవుఁడ వనుచు
యవనుఁ డెగువంగ బహుజగ దవనుఁ డపుడు. 29

వ. మఱియును. 30

సీ. సకల భూతవ్రాత సంవాసుఁ డయ్యును
వనములు నగములు వరుస దాఁటు
లోకోన్నతుండును లోకచక్షుఁడు నయ్యు
మాటిమాటికి నిక్కి మగిడి చూచుఁ
బత్తివిపత్తిసంబంధశూన్యుం డయ్యుఁ
దను విపక్షుఁడు వెంటఁ దగుల నిగుడు
విజయాపజయ భావ విరహితుం డయ్యుఁ దా
నపజయంబును జెంది నట్లు తోఁచు

ఆ. నభయ భయ విహీనుఁ డయ్యు భీతునిమాడ్కిఁ
గానఁబడును సర్వ కాలరూపుఁ
డయ్యుఁ గాలచకితుఁ డైన కైవడి వన
మాలి పఱచు వెఱపు మాలి యధిప. 31

వ. ఇవ్విధంబున. 32

క. దారితశాత్రవభవను న
పారమహావేగవిజిత పవనున్ యవనున్
దూరము గొనిచని కృష్ణుఁడు
ఘోరంబగు నొక్కశైల గుహావడిఁ జొచ్చెన్. 33

క. అదె లోఁబడె నిదె లోఁబడె నదెయిదె
పట్టెదనటంచు నాశావశుఁడై
యదుసింహుని పదపద్ధతి వదలక
గిరిగహ్వరంబు వాఁడుం జొచ్చెన్. 34

వ. ఇట్లు చొచ్చి మూఢహృదయంబునుంబోలెఁ దమఃపూర్ణం
బయిన గుహాంతరాళంబున దీర్ఘతల్పనిద్రితుండై గుఱు
వెట్టుచున్న యొక మహాపురుషునింగని శ్రీహరిగాఁ
దలంచి. 35

ఉ. ఆలము సేయ లేక పురుషాధమ దుర్లభ కంటకద్రుమా
భీలమహాశిలా సహిత భీకర కుంజర ఖడ్గ సింహ శా
ర్దూల తరక్షు సంకలిత దుర్గపథంబునఁ బాఱుతెంచి యీ
శైలగుహన్ సనిద్రుక్రియఁజాఁగి నటించినఁబోవనిత్తునే. 36

క. ఎక్కడ నెవ్వారలకును జి
క్కఁడనుచు నారదుండు సెప్పెనునాకుం
జిక్కితి వెక్కడఁబోయెదు
నిక్కముగానిద్రపుత్తు నిన్నిఁకొండఁ. 37

ఆ. అనుచు యవనుఁ డట్టహాసంబు గావించి
చటుల కఠిన కులిశ సదృశమైన
పాద మెత్తి తన్నెఁ బాటి తద్దేహంబు
నగగుహాం బ్రతిస్వనంబు నిగుడ. 38

ఉ. తన్నిన లేచి నీల్గి కనుదమ్ములు మెల్లన విచ్చి లోపలన్
సన్నపుఁగిన్క వర్ధిల దిశల్ గని దృష్టి సమిద్ధ విగ్రహో
త్పన్న మహాగ్ని కీలముల భస్మముసేసె నతండు సాయక
చ్ఛిన్న విరోధికంతవను శ్రీభవనున్ యవనున్
లఘుక్రియన్. 39



## నన్నయభట్టు — ఆంధ్రమహాభారతము

### ఆదిపర్వము : చతుర్థాశ్వాసము

## శకుంతలోపాఖ్యానము

వ. త్రసునకుఁ గాళింది యనుదాని[1]కి నీలినుండు పుట్టె వానికి రథంతరి యనుదానికి దుష్యంతుండు పుట్టెఁ బుట్టి యనన్య సాధారణ గుణయుక్తుండై. 1

క. బాలహరిణములఁ బట్టెడు,
[2]లీలను విషమాటవీచలిత కేసరి శా
ర్దూలేభశరభములఁ దన
బాలత్వమునంద యెగిచి పట్టుచు మఱియున్. 2

క. ఉర్వీరుహానివహాముతోఁ,
బర్వతములు వెఱికి యొండు పర్వతములపైఁ
బర్వఁగ వైచుచు యావన
గర్వంబున నొప్పె నుర్విఁ గడు నధికుండై. 3

శా. ఆదుష్యంతుఁ డనంతసత్త్వుఁడు సమస్తాశాంతమాతంగ మ
ర్యాదాలంకృత మైన భూవలయ మాత్మాయత్తమై
యుండఁగా

1. 'కిలిలుండు' అనునది తప్పు. సంస్కృతమున 'ఈలినం తు సుత తంసు ర్జనయామాస': 'ఈలినో జనయామాస దుష్యన్తమ్' అనియున్నది
2. లీల మహాటవికిఁ జని చలింపక మృగళా.

నాదిత్యాంశుసమీర దుర్గమ మహోగ్రారణ్య దేశాళితో
నాదిక్షత్త్రి చరిత్ర నేలె నజితుండై బహువీర్యంబునన్. 4

క. ఆతని రాజ్యంబున ను
ర్వీతలము ప్రజాసమృద్ధి వెలసి రుజాశో
కాతంకక్షయశంకా
పేతంబై ధర్మచరితఁ బెరుఁగుచు నుండెన్. 5

వ. అమ్మహీపతి యొక్కనాఁడు మృగయావినోదార్థియయి
యాదిత్యహయంబుల కంటె వడిగల వాహనంబులు
[1]పూనిన రథంబెక్కి యాజానేయ తురంగారూఢులైన
యాశ్వికులు పరివేష్టించి రాఁగ ననంతకుంతశక్తి చాప
కృపాణపాణు లయిన వీరభటసహస్రంబులతోఁ జని
వనంబులోని మృగంబులం జుట్టిముట్టి. 6

క. కలయఁగ [2]నార్పుల బొబ్బల,
యులివున నవ్విపిన మను మహోదధిఁ బెలుచం
గలఁచెను దుష్యంతమహా
బలమందరనగము సత్త్వభయజననంబై. 7

క. సరభసపరిచలిత మహా
శరభ ద్వీపరిపు వరాహ శార్దూల మద
ద్విరదాదిప్రకరభయం
కర వనమధ్యమున నృపతి గడుఁగడిమి మెయిన్. 8

---

1. పూన్చిన, 2. నార్పును బొబ్బయును, యులివు(పు)న.

క. ఓసరిలి పఱచుమృగముల
నేసియు డాసినమృగముల నెగిచి భుజాసిన్
వ్రేసియుఁ జంపెను మృగయా
వ్యాసక్తి నపారఘోరవన్యమృగాలిన్. 9

వ. ఇట్లు పెక్కుమృగంబుల నెగిచి చంపుచు మఱియుఁ జంపెడు వేడుక నతిదూరంబున కరిగిన నాతని రథవేగంబు ననుగమింపనోపక యధిక క్షుత్పిపాసా పరవశులయి పదాతులయ్యయి ప్రదేశంబుల విశ్రమించి రంత దుష్యంతుండు కతిపయామాత్య పరిజన పురోహిత సహితుండై కొండొక నేల యరిగి ముందట నొక్క పుణ్యనదీతీరంబున వివిధసురభి కుసుమఫలభారవినమ్ర తరులతాగుల్మపరిశోభితం బయిన యొక్క వనంబు గని. 10

క. అమరపతి ఖాండవమునకు
రమణను వైశ్రవణు చైత్రరథమునకు సమా
నముగా దీనిని భూభా
గమునకు రచియించెనొక్కొ కమలజుఁడు దయన్. 11

వ. అని దానిరమణీయభావంబుఁ బొగడుచుఁ [1]జనుదెంచి యవ్వనంబు సొచ్చునప్పుడు. 12

చ. అతిరుచిరాగతుం డయినయాతనికిన్ హృదయ ప్రమోద మా
తతముగ నవ్వనంబున లతాలలనల్ మృదులానిలాపవ

---

1. జొత్తెంచు

ర్జితకుసుమాక్షతావళులు సేసలు[1] వెట్టినయట్టి రైరిసం
పతదళినీనినాదమృదుభాషల దీవన లొప్ప నిచ్చుచున్.13

వ. మఱియును. 14

క. కాఱడవిఁ బఱచుమృగముల
నూఱడకం [2]దిగిచి డస్సియున్న తని శ్రమం
బాఱఁగ నెడఁ బరితాపము
దీఱఁగఁ బైవీచె నన్నదీపవనంబుల్. 15

మానిని. ఏచి తనర్చితలిర్చినక్రోవుల నిమ్మగుతావుల జొంపములం
బూచినమంచియశోకములన్ సురపొన్నలఁ బొన్నల గేదఁగులం
గాచి బెడంగుగఁ బండినయా సహకారములం గదళీతతులం
జూచుచు వీనులకిం పెసఁగన్ వినుచున్ శుకకోకిల సుస్వరముల్.16

కవిరాజవిరాజితము. చనిచని ముందట నాజ్యహవిర్ధృత సౌరభధూమలతాతతులం
బెనఁగినమ్రాఁకుల కొమ్మలమీఁద నపేతలతాంతము లైనను బా

1. చల్లిన, 2. దెగిచి.

యనిమధుపప్రకరంబులఁ జూచి జనాధిపుఁ డంత నెఱింగెఁ దపో
వన మిది యల్లదె దివ్యమునీంద్రునివాసము దా నగు నంచు నెడన్. 17

వ. ఇట్లు హృదయసుఖావహం బగుచున్న యవ్వనంబులోఁ నరిగి యరిగి యనవరత పదక్రమపఠ్యమాన మహాద్విజ వేదధ్వనులను నవిచ్ఛిన్న హూయమానాగ్నిహోత్ర స్వాహాశబ్దంబులను ననేక మునిగణ [1]ప్రణీతవచన విషయ విభాగవినిర్ణయ న్యాయనిపుణవిద్వత్సభాసంభాషణఘోషం బులను [2]ప్రతిపక్ష దుర్విభేద ప్రమాణవిచార్యమాణ వేదార్థ మీమాంసకగోష్ఠీవివాదనాదంబులనుం జేసి మ్రోయుచు యజ్ఞప్రయోగ ప్రవీణు లయిన యాజ్ఞికులకును విహితానుష్ఠానాసక్తులయిన యనుష్ఠాతలకును నధిక తపో నిరతులయిన మహాతపోధనులకును నివాసంబయిన పుణ్యా నదీతీరంబునఁ దద్దయురమ్యంబయి గంగాతీరంబున నర నారాయణ స్థానంబునుంబోలె జగత్పావనంబగుచున్న కణ్వామహాముని యాశ్రమంబుగని యందు. 18

సీ. శ్రవణసుఖంబుగా సామగానంబులు
చదివెడు శుకముల చదువు దగిలి
కదలక వినుచుండు కరులును
గరికరశీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు

1. ప్రణుత, 2. పర.

కణముల చల్లనిగా డ్వాసపడి వానిఁ
జెంది సుఖంబున్న సింహములును
భూసుర ప్రవరులు భూతబలుల్
దెచ్చిపెట్టు నీ వారాన్న పిండతతులు
తే. గడఁగి భక్షింప నొక్కటఁగలసి యాడు
చున్న యెలుకలుఁ బిల్లులు నొండు సహజ
వైరివర్గంబులయు సహవాస మపుడు
సూచి మునిశక్తి కెంతయుఁ జోద్యమంది. 19

వ. ఇక్ష్వాకుశ్యపుండైన కణ్వమహామునీంద్రునకు నమస్కరించి వచ్చెద నావచ్చునంతకు నందఱు నిచ్చోటన యుండునది యని. 20

చ. వలయు నమాత్యులం దగినవారల నుండఁగఁ బంచి ధారుణీ
తలవిభుఁ డొక్కరుండ చని తన్విఁ బయోజ దళాయతాక్షిసం
కులమిళితాళినీలపరికుంచిత కోమలకుంతలన్ శకుం
తల యను కన్యకం గనియెఁ దన్మునివల్లభ మందిరంబునన్. 21

వ. అదియును ననంత విలాసంబున జయంతుండవోని దుష్యంతు నెఱింగి యతి సంభ్రమంబున నాసనార్ఘ్యపాద్యాదివిధులం బూజించి కుశలం బడిగియున్న నక్కన్యకం జూచి దుష్యంతుం డి ట్లనియె. 22

ఉ. క్రచ్చఱ వేఁట వచ్చి యిట కణ్వమహామునిఁ జూచి పోవఁగా
వచ్చితి [1]మెందుఁ బోయిరొకో వారనినన్ వినియా లతాంగి వా
రిచ్చటనుండి యీ క్షణమయేఁగిరి కానకుఁ బండ్లు దేర మీ
వచ్చుటెఱింగి రేని జనవల్లభ వారును వత్తు రింతకున్. 23

వ. వారు వచ్చునంతకు నొక్క ముహూర్తంబుండునది యనిన విని యక్కోమలి వినయంబునకు మృదుమధుర వచనంబులకు సంతసిల్లి దానిం గన్యకఁగా నెఱింగి మనోజ రాజ్యలక్ష్మియుంబోనిదాని సర్వలక్షణలక్షితంబు లయిన సర్వావయవంబులుం జూచి సంచలిత హృదయుండై నీ వెవ్వరి కూఁతుర విట్టి [2]రూపలావణ్య విలాస విభ్రమగుణసుందరి విందుల కేల వచ్చి తని యడిగిన నది యిట్లనియె. 24

శకుంతల దుష్యంతునకుఁ దన జన్మక్రమం బెఱింగించుట

క. జగతీవల్లభ యే న
త్యగణితధర్మస్వరూపుఁడని జనములు దన్
బొగడఁగ జగదారాధ్యుం
డగు కన్వమహామునీంద్రునాత్మజ ననినన్. 25

చ. ఇది మునికన్యయేని మఱియేలొకొ యీలలితాంగి యందు నా
హృదయము దద్దయుం దవిలె నిప్పలుకింతను నమ్మనేర [3]న

1. నొందు వోయిరొకో, 2. రూపలావణ్యసుందరి, 3. నా, మెద.

య్యెద విజితేంద్రియుండనఁగ నిమ్మునిఁ బాయక విందు
నంచుఁడా
నిదికలరూపెఱుంగ నవనీపతి యుత్సుకుఁడయ్యె
నాత్మలోన్. 26

వ. ఇట్లు దుష్యంతుండా శకుంతల జన్మం బెఱుంగ వేఁడి
వెండియు దాని కిట్లనియె. 27

తే. ఉత్తమాశ్రమ నిష్ఠితుఁ డూర్ధ్వరేతుఁ
డైన కణ్వమహాముని యనఘచరితుఁ
డట్టిముని కెట్లు కూఁతుర వైతి దీని
నాకు నెఱుఁగంగఁ జెప్పుము నలిననేత్ర. 28

వ. అని యడిగిన నారాజునకు శకుంతల యిట్లనియె. 29

క. ఇక్కమలాక్షి శకుంతల
యెక్కడియది దీనిజన్మ మెవ్విధ మని త
య్యొక్క మునినాథుఁ డడిగిన
నిక్కాశ్యపు లర్థిఁ జెప్పి రేను వినంగన్. 30

వ. నాజన్మప్రకారంబు మాయయ్య యమ్మునికిం జెప్పిన
విధంబు చెప్పెదఁ జిత్తగించి విను మని యాదుష్యంతునకు
శకుంతల యిట్లనియె. 31

సీ. అనఘుఁడు రాజర్షి యై తపశ్శక్తిమై బ్రహ్మర్షి భావంబుఁ
బడసియున్న
సన్మునీశ్వరుఁడు విశ్వామిత్రుఁ డతిఘోరతపము సేయుచు
నున్నఁ దత్తపమున

కొంతయు వెఱచి దేవేశ్వరుఁ డప్సరోగణములలో నగ్రగణ్యమైన
దాని మేనక యనుధవళాక్షిఁ బిలిచి విశ్వామిత్రు పాలికిఁ జని తదీయ

ఆ. ఘోరతపము చెఱిచి కోమలి నాదైన
దేవరాజ్యమహిమఁ దివిరి నీవు
గావు మనిన నదియుఁ గడుభయంపడి యమ
రేశ్వరునకు మ్రొక్కి యిట్టులనియె. 32

చ. వనజభవప్రభావుఁ డగువాని వశిష్ఠు నపత్యశోక మ
గ్నవననిధిలోన ముంచినయవారితసత్త్వుఁడు నిన్నుఁ దొట్టి యీ
యనిమిషు లెల్ల [1]వానికి భయంపడు చుందురు రట్టి యుగ్రకో
పనుకడ కిప్పు డేఁగుమనపాడియె యిప్పని నన్నుఁ బంపగాన్.

ఉ. అమ్మునిఁ యల్గిచూచుడును నాక్షణమాత్రన గోత్రధారిణీ
ధ్రమ్ములు వ్రయ్య నయ్యసుము దక్కఁగ నంబుధు లింకు మూఁడులో
కమ్ములు దిర్దిరం దిరుగుఁ గాడ్పు చలింపఁగ నోడు నుగ్రతం
బమ్మినయట్టి కోపపరుపాలికి భామలు వోవ [2]నోడరే. 34

1. వానిని, 2. వెరతురే.

వ. అయినను నానేర్చువిధంబున నమ్మునివరుచిత్తంబుమెత్తన
చిత్తజాయత్తం బగునట్లుగాఁ జేసెదనని వాసవు వీడ్కొని
మేనక తనకు మందమలయానిలంబు దోడుగాఁ జనుదెంచి
హిమవత్పర్వత ప్రదేశంబునం దపంబు సేయుచున్న
విశ్వామిత్రు తపోవనంబు సొత్తెంచిన. 35

క. చల్లని దక్షిణమారుత
మల్లన వీతెంచెఁ దగిలి యాలలనాథ
మ్మిల్లకుసుమాంగ రాగస
ముల్లసనసుగంధి యగుచు మునివరుమీఁదన్. 36

వ. అంత. 37

చ. అనిమిష కాంతయున్ సవలతాంతవిభూషణలీల నల్లన
ల్లన వనకేళిలాలసవిలాసగతిం జనుదెంచి ముందటం
గనియె [1]మహాముని ప్రవరుఁ గౌశికుఁ గౌశికచిత్తభీతిసం
జననమహాతపశ్చరణ సంయతచిత్తు నిరస్తచిత్తజున్. 38

క. అంబుజలోచన గని విన
యంబున నమ్మునికి మ్రొక్కి యనురాగముతో
డం బుష్పాపచయవ్యా
జంబున విహరించుచుండె సఖులుం దానున్. 39

చ. అలసత యొప్పఁగాఁ దరుణి యమ్మునివల్లభు
మ్రోల నున్న సం
మిళితసుగంధబంధురసమీరవశంబునఁ దూలి చాలపై

1. మునీశ్వర.

వలు వెడలన్ బయల్పడియె [1]వల్గుకుచంబులుఁ గక్షయుగ్మమున్
లలితకృశోదరంబుఁ దరళత్రివళీయుతరోమరాజియున్. 40

క. అందుఁ దనదృష్టి నాటుడుఁ
గందర్పనిశాతసాయకంబులు పెలుచన్
డెందముఁ గాఁడిన ధృతి సెడి
కంది మునీంద్రుండు దానిఁ గవయందివిరెఁ. 41

వ. మేనకయు విశ్వామిత్రునిష్టంబునకుం దగినకామోపభోగంబులం బెద్దకాలంబు రమియించిన నయ్యిద్దఱకు నిక్కన్యక పుట్టిన దీనిమాలిన యనునొక్కయేటి పులినతలంబునం బెట్టి మేనక దేవలోకంబునకుం జనియె విశ్వామిత్రుండును తపోవనంబునకుం జనియె నంత నమ్మాని ప్రభావంబున. 42

ఆ. చెలఁగి లేవ నేడ్చుచిఱుతుక దానిఁ గ్ర
వ్యాద ఘోరమృగము లశన [2]బుద్ధిఁ
బట్టకుండఁ జెట్టుపలఁ గప్పి రక్షించు
కొని శకుంతతతులు గూడి యుండె. 43

వ. అంత నేము శిష్యగణంబులతోడ సమిత్కుసుమఫలాహారణార్థం బక్కడకుం జని యమ్మాలినీపులినతలంబున శకుంతరక్షితమై యున్న కూఁతు నత్యంతకాంతిమతి నవనీతలం

1. వక్షువచన్నులు 2. కాంక్ష, దాయ

బున కవతరించిన తరుణ శశిరేఖయుంబోని దాని నెత్తి
కొని వచ్చి శకుంతరక్షిత యగుటం జేసి శకుంతల యను
నామంబిడి కరంబు గారవంబునం బెనిచితిమి. 44

మధురాక్కర. తనర జనకుండు నన్నప్రదాతయును
భయత్రాత
యును నన( గ నింతులకు ముగ్వురొగిన గురువులు వీర
లనఘ యుపనేత మఱియు నిరంతరాధ్యాపకుండు
నన( గ బురుషున కిద్యేవు రనయంబున గురువులు. 45

వ. అనం బర(గిన శాస్త్రార్థంబున నేము దీనికి భయత్రాతల
మగుటం జేసి గురుల మిదియును మాచే నభివర్ధిత యగుటం
జేసి మాకు హృదయానందని యైన కూ(తురని కణ్వ
మహాముని లమ్మునికిఁ జెప్పినవిధం బంతయు సవిస్తరంబుగా
శకుంతల సెప్పిన విని దుష్యంతుం డాత్మగతంబున. 46

దుష్యంతుండు శకుంతలను వివాహంబు సేసికొన( గోరుట

చ. ఇది మునినాథకన్య యని యెంతయు నిస్పృహవృత్తి
నున్న నా
హృదయము రాజపుత్త్రి యని యిక్కమలాక్షి నిజాభిజాత్యసం
పద నెఱి(గించినన్ మదనబాణ [1]పరంపర కిప్పుడుండ నా
స్పద మయి సంచలించె నళిపాతవికంపితపంకజాకృతిన్. 47

---

1. పరంపర( గుంద నిప్పు డా

వ. అనుచు మదనాతురుం డయి దుష్యంతుండు దనయం
దక్కోమలి యనురాగం బుపలక్షించి యిట్లనియె. 48

క. ఈ వల్కలాజినములకు
నీవన్యఫలాశనముల కీవిటపకుటీ
రావాసములకు నుచితమె
నీవిలసిత రూపకాంతి నిర్మలగుణముల్. 49

ఉ. ఈ మునిపల్లెనుండు టిది యేల కరంబనురాగ మొప్పఁగా
భామిని నాకు భార్యవయి భాసురలీల నశేష రాజ్యల
క్ష్మీమహనీయ సౌఖ్యముల మేలుగ నందు మనింది
తేందుపా
దామలతుంగహర్మ్యముల హారిహిరణ్మయకుట్టి
మంబులన్. 50

సీ. బ్రాహ్మంబు దైవంబుఁ బరఁగ నార్షంబుఁ
బ్రాజాపత్యమును రాక్షసంబు నాసు
రంబు గాంధర్వంబు రమణిఁ బైశాచంబు
నను నెనిమిది వివాహములయందుఁ
గడుఁ బ్రశస్తములు సత్క్షత్రవంశ్యులకు
గాంధర్వ రాక్షసములు ధర్మయుక్తి
నీకును నాకును నెమ్మిఁ బరస్పర ప్రేమంబు
గాముండు పెంపఁ దొడఁగెఁ

ఆ. గాన [1]యెడయుఁ జేయఁగా నేల గాంధర్వ
విధి వివాహమగుట వినవె యుక్త
మనిన లజ్జఁజేసి యవనతవదనయై
యా లతాంగి యిట్టులనియెఁ బతికి. 51

క. కరుణానిరతులు ధర్మ
స్వరూపు లింతకు మదీయ జనకులు సను దెం
తురు వారు వచ్చి నీ కి
చ్చిరేని పాణిగ్ర[2]హణము సేయుము నన్నున్. 52

వ. అనిన దానికి దుష్యంతుం డిట్లనియె. 53

తే. తనకు మఱి తాన చుట్టంబు తాన తనకు
గతియుఁ దన్నిచ్చుచోఁ దాన కర్తయనఁగ
వనజనేత్ర గాంధర్వవివాహ [3]మతిర
హస్యమును నమంత్రకమును నగుచు నొప్పు. 54

వ. అని దుష్యంతుండు గాంధర్వవివాహ స్వరూపంబు సెప్పి
శకుంతల నొడంబఱిచిన నది యిట్లనియె. 55

చ. నరనుత నీ ప్రసాదమున నాకుదయించిన నందనుఁ మహీ
గురుతర యావరాజ్యమునకుఁ దయతో నభిషిక్తుఁ
జేయఁగా
వరము ప్రసన్నబుద్ధి ననవద్యముగా దయసేయు నెమ్మితో
నిరుపమ[4]దాన యట్లయిన నీకును నాకును సంగమం
బగుఁ. 56

1. తడవు 2. హంబు 3. మిది 4. కీర్తి

వ. అనిన విని శకుంతల కెంతయు సంతోషంబుగా దాని
కోరిన వరంబిచ్చి గాంధర్వవివాహంబున నభిమతసుఖంబు
లనుభవించి యక్కోమలి వీడ్కొని నిన్నుఁ దోడ్కొని
రా నస్మత్ప్రధానవర్గంబుఁ గణ్వమహామునిపాలికిం బుత్తెం
చెద నని యూఱడ నొడివి దుష్యంతుండు నిజపురంబునకుం
జనియె నిట శకుంతలయుఁ దనచేసిన దాని మునివరుం
డెఱింగి యలిగెడునో యని వెఱచుచుండె నంత నమ్మహా
ముని వనంబుననుండి కందమూలఫలంబులు గొని చను
దెంచి లలిత శృంగారభావంబున లజ్జావనత వదనయు నతి
భీతచిత్తయునై యున్న కూఁతుంజూచి తన దివ్యజ్ఞానం
బున నంతవృత్తాంతంబు నెఱింగి క్షత్త్రియులకు గాంధర్వ
వివాహంబు విధిచోదితంబ యని సంతసిల్లి శకుంతల కి
ట్లనియె. 57

తే. తల్లి నీ కులగోత్ర సౌందర్యములకుఁ
దగినపతిఁ గంటి దానికిఁ దగఁగ గర్భ
మయ్యె నీదు గర్భమునవాఁ డఖిలభువన
వహనమహనీయుఁడగు చక్రవర్తి సుమ్ము. 58

వ. నీ ధర్మచరితంబునకు మెచ్చితి నీవు గోరినవరం బిచ్చెద
వేఁడుమనిన శకుంతలయు నాచిత్తం బెప్పుడు ధర్మువునంద
తగిలి యుండను నాకుద్భవిల్లెడు పుత్త్రుండు దీర్ఘాయురారో
గ్యైశ్వర్య బలసమన్వితుండును వంశకర్తయుఁ గానువలయు
ననిన నమ్మహాముని కరుణించి దాని కోరినవరంబిచ్చి

యథాకాలవిధుల గర్భసంస్కారరక్షణంబులు సేయించి
యున్నంత వర్షత్రయంబు సంపూర్ణంబైన శకుంతలకు
భరతుం డుదయించి కణ్వనిర్వర్తితజాతకర్మాది క్రియా
కలాపుండయి పెరుఁగుచుఁ గరతలాలంకృత చక్రుండును
జక్రవర్తి లక్షణలక్షితుండును సింహసంహననుండును
దీర్ఘబాహుండును ననంతజవసత్త్వ సంపన్నుండును నై 59
పరఁగుచు.

మ. అమితోగ్రాటవిలోనఁ గ్రుమ్మరువరాహ [1]వ్యాళశార్దూల ఖ
డ్గమదేభాదులఁ బట్టి తెచ్చి ఘనుఁడై కణ్వాశ్రమోపాంత భూ
జములందోలిన కట్టుచుం బలిమిమై శాకుంతలుండొప్పె వ
న్యమదేభంబుల నెక్కుచుం దగిలి నానాశైశవక్రీడలన్.

వ. ఇట్లు వనంబులోని సర్వసత్త్వంబులను దనమహాసత్త్వంబునం
జేసి దమియించుచున్న యాతనింజూచి యాశ్చర్యంబంది
యందలి మునులెల్ల నాతనికి సర్వదమనుండను నామంబుఁ
జేసిరి కణ్వమహామునియు నక్కుమారు నుదారతేజో
రూపవిక్రమగుణంబులకు సంతసిల్లి వీఁ డఖిలభువన యౌవ
రాజ్యాభిషేకంబునకు సమర్థుం [2]డగు సమయం బరుగుదెంచె
నని విచారించి యొక్కనాఁడు గూఁతున కిట్లనియె. 61

1. క్రూరశార్దూల నా. గ మృగేంద్రాదులఁ 2. డరుగుదెంచె

ఆ. ఎట్టి సాధ్వులకును బుట్టినయిండ్లను
బెద్దకాల మునికి తద్దతగదు
పతులకడన యునికి సతులకు ధర్మువు
సతుల కేడుగడయుఁ బతుల చూవె. 62

కణ్వమహాముని శకుంతలను దుష్యంతునిపాలికిం బంపుట

వ. కావున నీ విక్కుమారునిం దోడ్కొని నీపతిపాలికి నరుగు మని మహాతపోధనులైన తనశిష్యులం గొందఱం దోడు పంచిన శకుంతలయు దౌష్యంతుం దోడ్కొని దుష్యంతు పాలికి వచ్చి సకలసామంతమంత్రి పురోహిత ప్రధాన పౌరజన పరివృతుండై యున్న యారాజుం గనుంగొని. 63

క. గురునాశ్రమంబునను ము
న్నరుదుగఁ బతివలనఁ గనినయనురాగము నా
దరణము ననుగ్రహంబును
గరుణయు సంభ్రమమునపుడు గానక యెడలోన్. 64

క. ఎఱుఁగఁడొకొ నన్ను నెఱిఁగియు
నెఱుఁగనియట్లుండునొక్కొ యెడ దవ్వగుటన్
మఱచెనొకొ ముగ్ధులధిపులు
మఱవరె బహుకార్యభారమగ్నులు గారే. 65

చ. తలపఁగఁ నాఁడుపల్కినవిధం [1]బెడఁదప్పగ వీడెనొక్కొ చూ
డ్కులువిరసంబులై కరము క్రూరములైన నిమిత్తమేమియో

1. బులు దప్పగఁ జూచు నొక్కొఁ; బెడఁ దప్పుదలంచెనొక్కొ; బెడఁదప్పశయుండు నొక్కొ; బెడదన్ దలఁపంగ లేఁడొ; ఇంక ననేక పాఠములున్నవి

కలయఁగఁ బల్కరించి రుపకారులునై రని నమ్మియుండఁగా
వలవదు బుద్ధిమంతులు నవప్రియులైన ధరాధినాథులన్.

వ. అని తలంచి చింతాక్రాంతయై శకుంతల వెండియు నాత్మ
గతంబున. 67

క. మఱచినఁ దలఁపింపఁగ నగు
నెఱుఁగనినాఁ డెల్ల [1]పాటనెఱిఁగింప నగున్
మఱి యెఱిఁగి యెఱుఁగ నొల్లని
కఱటిం దెలుపంగఁ గమలగర్భునివశమే. 68

వ. అయినను వచ్చి యూరక పోవంగాదు కావున నా పూర్వ
వృత్తాంతం బెల్ల నెఱింగించి యే నిక్కుమారుం జూపుదు
నని మనంబున నిశ్చయించి శకుంతల యారాజున కి
ట్లనియె. 69

క. జననాథ వేఁటనెపమున
గొనకొని కణ్వాశ్రమమునకుఁ వచ్చి ముదం
బున [2]నందు నాకు నీ యి
చ్చిన వరము దలంపవలయుఁ జిత్తములోనన్. 70

క. బాలార్కతేజుఁ డగు నీ
బాలుఁడు నీ కొడుకు వీనిఁ బౌరవకుల ర
త్నాలంకారు నుదార గు
ణాలయు యువరాజుఁ జేయు మభిషేకమునన్. 71

---

1. వెంట 2. నాఁడు

వ. అనిన విని దుష్యంతుండు దానినంతయు నెఱింగియు నెఱుంగనివాఁడపోలె నిట్లనియె. 72

క. ఏ నెఱుఁగ నిన్ను నెక్కడి
దానవు మిన్నకయ యనుచితంబులు పలుకం
గా నేల యరుగు మంబురు
హానన యెందుండి వచ్చి తందులకు వడిన్. 73

వ. అనిన విని వెలువెల్లనై వెచ్చనూర్చి నిశ్చేష్టితయై కెందమ్మి రేకులవలనం దొరంగు జలకణంబులపోలెఁ గోపారుణిత నయనంబుల బాష్పకణంబులు దొరఁగం దలవాంచి యారాజుం గటాక్షించుచు హృదయసంతాపంబు దనకుఁదాన యుపశమించుకొని పెద్దయుం బ్రొద్దు చింతించి శకుంతల యారాజున కిట్లనియె. 74

ఆ. ఏల యెఱుక లేని యితరులయట్ల నీ
వెఱుఁగ ననుచుఁ బలికె దెఱిఁగి యెఱిఁగి
యేన కాని దీని నెఱుఁగ రిం దొరులని
తప్పఁ బలుక నగునె ధార్మికులకు. 75

చ. విమలయశోనిధీ పురుషవృత్తమెఱుంగుచు నుండుఁజూవె వే
దములునుబంచభూతములుధర్మువుసంధ్యలునంతరాత్మయున్
యముఁడును జంద్రసూర్యులు నహంబును రాత్రియు నన్మహాపదా
ర్థము లివి యుండఁగా నరుఁడు [1]దక్కొఁన నేర్చునెతన్ను
బ్రముచ్చిలన్. 76

---

1. దక్కఁగ

క. నా యెఱిఁగినట్ల యిన్నియుఁ
నీ యిచ్చిన వరము ధారుణీవర యెఱుఁగున్
నా యందుఁ దొంటి యట్టుల
చేయు మనుగ్రహ మవజ్ఞ సేయందగునే. 77

క. సవతియును గుణవతియుఁ బ్రజా
వతియు ననువ్రతయు నై నవనిత నవజ్ఞా
న్వితదృష్టిఁ జూచు నతిదు
ర్మతి కిహముం బరముఁ గలదె మతిఁ బరికింపన్. 78

క. సంతతగృహమేధిఫలం
బంతయుఁ బడయంగ నోపు ననుగుణభార్యా
వంతుం డగువాఁడు క్రియా
వంతుఁడు దాంతుండుఁ బుత్రవంతుండు నగున్. 79

వ. మఱియును. 80

సీ. ధర్మార్థకామసాధన కుపకరణంబు
గృహనీతి విద్యకు గృహము విమల
చారిత్రశిక్ష కాచార్యకంబన్వయ
స్థితికి మూలంబు సద్గతికి నూఁత
గౌరవంబున కేక కారణం బున్నతస్థిర
గుణమణుల కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయ
చూవె భర్తకు నొండ్లుగావు ప్రియము

ఆ. లెట్టి ఘట్టములను నెట్టి యాపదలను
నెట్టి తీఱములను ముట్టఁబడిన
వంత లెల్లఁ బాయు నింతులఁ బ్రజలను
నొనరఁ జూడఁ గనిన జనులకెందు. 81

వ మఱియు భార్య పురుషునం దర్ధంబగుటం జేసి పురుషునకు
మున్న పరేతమైన పతివ్రత పరలోకంబునం దన పురుషుం
గూడఁ దదాగమనంబు ప్రతీక్షించుచుండుఁ బురుషుండు
మున్న పరేతుండై నఁ బదంపడి తానును బరేతమై తన
పురుషుంగూడ నరుగునట్టి భార్య నవమానించుట యధ
ర్మంబు మఱియునుం బురుషుండు భార్యయందుఁ బ్రవేశించి
గర్భంబునఁ బుత్త్రుండై తాన యుద్భవిల్లు గావున నఙా
దఙ్గా త్సమ్భవసి యనునది యాదిగాఁ గల వేదవచనం
బుల యందును జనకుండును బుత్త్రుండును నను భేదంబు
లేదు. 82

క. విను గార్హాపత్య మనున
య్యనలము విహరింపఁబడి తదాహవనీయం
బున వెలుఁగునట్ల వెలుఁగును
జనకుఁడు దాఁబుత్త్రుఁడై నిజద్యుతితోడన్. 83

క. తాన తన్వనీడ నీళ్ళల
లో నేర్పడఁ జూచునట్లు లోకస్తుత త
త్సూను జనకుండు సూచి మ
హానందముఁ బొందు నతిశయప్రీతిమెయిన్. 84

వ. పున్నామ్నో నరకాత్త్రాయత ఇతి పుత్త్ర యను వేద
వచనంబు గలదు గావునఁ బుణ్యాచారుం డయిన పుత్త్రుం
డుభయపక్షంబులవారి నుద్ధరించుఁ గావున. ౮౫

క. నీపుణ్య తనువువలనన
యీపుత్త్రకుఁ డుద్భవిల్లి యెంతయు నొప్పున్
దీపంబువలన నొండొక
దీపము [1]ప్రభవించినట్లు తేజంబెసఁగన్. 86

మ. విపరీతప్రతిభాష లేమిటికి నుర్వీనాథ యీపుత్త్రగా
త్రపరిష్వంగ సుఖంబు సేకొనుము ముక్తాహారకర్పూరసాం
ద్రపరాగ ప్రసరంబుఁ జందనముఁ జంద్రజ్యోత్స్నయుం
బుత్త్రగా
త్రపరిష్వంగమునట్లు జీవులకు హృద్యంబే కడున్ శీతమే.

క. అనఘుఁడు వంశకరుం డై
పెనుపున నీ సుతుఁడు వాజపేయంబులు నూ
ఱొనరించు నని సరస్వతి
[2]వినిచె మునులు వినఁగ నాకు వినువీథి దెసన్. 88

క. భూరిగుణు నిట్టికులవి
స్తారకు దారకు నుదారధర్మప్రియ ని
ష్కారణము తప్పఁ జూడఁగ
సారమతీ చనునె నాఁటిసత్యము [3]గలుగన్. 89

1. పుట్టించి; పుట్టించి 2. వినిపించెను మునులు వినఁగ 3. గలుగుత

చ. నుతజలపూరితంబులగు నూతులు నూటికంటె సూనృత
వ్రత యొక [1]బావి మేలు మఱి బావులు నూటికంటె
నొక్కస
త్క్రతు వది మేలు తత్క్రతుశతంబునకంటె సుతుండు
మేలు త
త్సుతశతకంబుకంటె నొక సూనృత [2]వాక్యము మేలు
సూడఁగన్. 90

క. వెలయంగ నశ్వమేధం
బులు వేయును నొక్కసత్యమును నిఱుగడలం
దుల నిడి [3]తూఁపఁగ సత్యము
వలనన ములు [4]సూపు గౌరవంబున పేర్మిన్. 91

క. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగమము సత్యంబుతో సరియుఁ [5]గావ
యెఱుఁగు మెల్ల ధర్మంబుల కెందుఁబెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞులైన [6]మునులు. 92

క. కావున సత్యము మిక్కిలి
గా విమలప్రతిభఁ దలఁచి కణ్వాశ్రమసం
భావితసమయస్థితి దయఁ
గావింపుము గొడుకుఁ జూడు కరుణాదృష్టిన్. 93

క. క్షత్త్రివరుఁ డైన విశ్వా
మిత్త్రునకుఁ బవిత్రమైన మేనకకున్ స

1. వాపి మేలు మఱి వాపులు 2. మెంతయు 3. తూస్పఁగ
4. సూపె 5. గావు, ఎఱుఁగు 6. వారు

త్పుత్త్రినయి బొంకు వలుకఁగ
ధాత్త్రీతలనాథ [1]యంతధర్మేతర నే. 94

వ. అనిన శకుంతల పలుకులు సైకొన నొల్లక దుష్యంతుం
డిట్లనియె. 95

క. *ఏ నెట నీ వెట సుతుఁ డెట
యే నెన్నఁడు దొల్లి చూచి యెఱుఁగను నిన్నున్
మానిను లసత్యవచనలు
నానిట్టు లసత్యభాషణం బుచితం బే. 96

క. పొడవునఁ బ్రాయంబునఁ గడుఁ
గడిఁదిబలంబునను జూడఁగా నసదృశు నీ
కొడు కని యీతని నెంతయు
నెడమడుగుగఁ జూపఁ దెత్తె యిందఱు నగఁగాన్. 97

వ. ఇట్టి లోకవిరుద్ధంబులకే మోడుదు మయుక్తంబు లయిన
పలుకులు వలుకక నీ యాశ్రమంబునకుం బొమ్మనిన శకుం
తల యత్యంత సంతాపితాంతఃకరణయై.

మధ్యాక్కర. తడయక పుట్టిననాఁడ తల్లిచేఁ దండ్రిచే విడువఁ
బడితి నిప్పుడు పతిచేతను విడువఁబడియెద నొక్క
నుడువులు వేయు నింకేల యిప్పాటి నోములు దొల్లి
కడఁగి నోఁచితిని గా కేమి యనుచును గందె డెందమున.

---

1. యింత

* "కన్యక యఁట నే నఁట, వనమున గాంధర్వమున వివాహంబఁట
నం, దనుఁ గనె నట, మఱచితనఁట వినఁగూడునె యిట్టిభంగి విపరీతో
క్తుల్", ఈపద్య మాదిపర్వమున నున్నదని అప్పకవి వ్రాసియున్నాఁడు.
ఐనచో నిచ్చోన యుండఁబోలు.

వ. ఇట్లు దద్దయు దుఃఖించి విగతాశయై బోరనం దొరఁగు
బాష్ప[1]జలంబు లందంద యొత్తికొనుచు నింక దైవంబ
కాని యొండు శరణంబు లేదని యప్పరమ పతివ్రత
తనయుం దోడ్కొని క్రమ్మఱి పోవనున్నయవసరంబున.

చ. గొనకొని వీఁడు నీకును శకుంతలకుం బ్రియనందనుండు సే
కొని భరియింపు మీతని శకుంతల సత్యము వల్కె సాధ్వీస
ద్వినుత మహాపతివ్రత వివేకముతో నని దివ్యవాణి దా
వినిచె ధరాధినాథునకు విస్మయ[2]మందఁగఁ దత్సభాసదుల్.

వ. ఇట్లెల్లవారలకు నతిహర్షంబుగా శకుంతల పతివ్రతాత్వం
బును సత్యంబును భరతోత్పత్తియుఁ బ్రశంసించు వేలు
పులపలుకు లతివ్యక్తంబు లయి యాకాశంబువలన వీతెం
చిన విని దుష్యంతుండు సభాసదులు విన నిట్లనియె. 102

తే. ఏను నీ[3]యింతియును గాని యెఱుఁగ రన్య
లర్థిఁ గణ్వమహాముని యాశ్రమంబు
నందు గాంధర్వవిధి వివాహమునఁ గరము
నెమ్మిఁ జేసిన దీనిఁ బాణి[4]గ్రహణము.

తే. అన్యు లెఱుఁగమిఁ జేసి లోకాపవాద
భీతినెఱిఁగియు నిత్తన్విఁ బ్రీతి దప్పి
యెఱుఁగ నంటిని నిందఱ కిప్పుడెఱుఁగఁ
జెప్పె నాకాశవాణి యచ్చెరువుగాఁగ.

1. కణం 2. మందిరి త 3. తన్వి 4. గ్రహంబు

వ. అని మహానురాగంబునం గొడుకు నెత్తికొని హర్షపులక
లెసఁగ నాలింగనంబు సేసి శకుంతలామహాదేవి నతిప్రణయ
గౌరవంబున సంభావించి యావరాజ్యంబునకు భరతు నభి
షిక్తుంజేసి పెద్దకాలంబు రాజ్యసుఖంబు లనుభవించి తన
రాజ్యభారం బంతయు భరతుం బూన్చి దుష్యంతుండు
దపోవనంబున కరిగిన. 105

చ. భరతుఁ డశేషభూభువనభార ధురంధరుఁడై వసుంధరం
బరఁగి యనేక యాగములఁ బాయకభాస్కరజహ్ను
కన్యకా
సురుచిరతీర దేశముల సువ్రతుఁడై యొనరించి భూరిభూ
సురులకు నిచ్చె దక్షిణలు శుద్ధసువర్ణ[1]గవాశ్వహస్తులన్.

—————

1. గవాశ్వరత్నముల్

## నన్నయభట్టు — ఆంధ్రమహాభారతము

### ఆదిపర్వము : షష్ఠాశ్వాసము

# కుమారాస్త్రవిద్యాసందర్శనము

వ. కృతాస్త్రశస్త్రులయిన రాజకుమారుల విద్యాకౌశలంబు వ్యాస గాంగేయ విదుర కృప శల్య శకుని సోమదత్తాదుల సమక్షంబునం జూప సమకట్టి యొక్కనాఁడు ద్రోణుండు ధృతరాష్ట్రున కిట్లనియె. 1

క. ఘోరాస్త్రశస్త్రవిద్యల
నారూఢత మిగుల నిపుణులైరి కుమారుల్
మీరలు వీరలవిద్యా
పారము చను దెలియఁగవలయు భవదీయసభన్. 2

వ. అనిన నట్లచేయుదునని ధృతరాష్ట్రుండు గుమారుల విద్యాసందర్శనరంగంబు రమ్యంబుగాఁ జేయింపు మని విదురుం బనిచిన నతండు వల్లె యని శాస్త్రోపదిష్ట ప్రమాణోపేత వృత్తాయామంబును నపాకృతవృక్షగుల్మవల్మీకంబును నంగీకృతపూర్వోత్తర ప్లవంబును సమీకృత నిమ్నోన్నత ప్రదేశంబును దూరీకృతకంటక పాషాణశల్యాశకలంబును విరజీకృతరజోధూసరస్థలంబును విరచిత బహువిధ ప్రేక్షాగారమంచక ప్రపంచంబును నానాధ్వజ నవపల్లవ రంభాస్తంభమాలాలంకృత ద్వారతోరణంబును బ్రతిదిశ నిర్వ

ర్తితశాంతికబలి విధానంబునుంగాఁ జేయించి పంచాంగ
శుద్ధదినంబున సుముహూర్తంబున ధృతరాష్ట్రుండు గాం
ధారీపురస్సర దేవీశతపరివృతుండై వివిధ భూషణభూషితా
నేక విలాసినీ నివహంబుతోఁ జనుదెంచి విలంబితకదంబ
స్థూలముక్తాఫలదామరమణీయంబై యాబద్ధ మరకత వజ్ర
వైడూర్య పద్మరాగప్రవాళ ప్రభానికర వ్యతికరవిరచితా
పూర్వసురచాప చారుగౌరవంబై యతిమనోహరంబైన
శాతకుంభ మయప్రేక్షాగారంబున నున్న. 3

తే. అందుఁ గర మొప్పి సుందరీబృంద మఖిల
రత్న రాజితకనకధరాధరేంద్ర
కందరాంతరమున నున్న సుందరామృ
తాశనాంగనాబృందంబు ననుకరించె 4

తే. సుతులవిద్యాప్రవీణతఁ జూచువేడ్క
నెంతయును సంతసంబునఁ గుంతిదేవి
రాజసన్నిధి గాంధార రాజపుత్త్రి
కెలన నుండె సుస్మితనలిననేత్ర. 5

సీ. వ్యాసపురస్కృతావని దేవనివహంబుఁ
గృపశల్యశకునిగాంగేయవిదుర
సోమదత్తాదిభూసురగురుబాంధవ
మిత్రవర్గంబు నమేయమంత్రి
సామంతమండలేశ్వరసమూహంబును
గాయకవైతాళికప్రవరులుఁ

దమతమనియమిత స్థానంబులం దోలి
నుండిరి బోరన నులిసె భేరు

లస్త్రదర్శనాగతాఖిలక్షత్త్రియ
వైశ్యశూద్రవివిధవర్ణజనుల
కలకలంబు ప్రళయకాలసంక్షోభితాం
భోధినిస్వనంబుఁబోలెఁ జెలఁగె. 6

వ. అట్టి యవసరంబున నాచార్యుండు శుక్లాంబరాభరణమా
ల్యానులేపన యజ్ఞోపవీత పలితశ్మశ్రుకేశకలాపోపశోభిత
దేహుండై రంగమధ్యంబున నశ్వత్థామ సహితుండై
విముక్త జలధరవియన్మధ్యంబున నంగారకసహితుండైన
యాదిత్యుండును బోలెనున్న నగణ్య భూసురవరేణ్య
పుణ్యాహవాచనానంతరంబున. 7

శా. ద్రోణాచార్యపిఱుంద నొప్పి దృఢహస్తుల్ బద్ధగోధాంగుళి
త్రాణుల్ మార్గణపూర్ణతూణులు మహాధన్వుల్ కుమారుల్ తను
త్రాణోపేతులు రంగమధ్యమున నంతన్నిల్చి రుద్యద్గుణ
శ్రేణీరమ్యులు ధర్మజప్రముఖులై జ్యేష్ఠాను పూర్వంబుగాఁ. 8

వ. ఇట్లు నిలిచి యాచార్యననుమతంబున. 9

సీ. అసివర్మకౌశలం బమరంగఁ జూపెడు
వారును దృఢసౌష్ఠవంబు లొప్పఁ
దమతమనామాంకితములైన శరముల
నేర్పడ లక్ష్యంబు లేయువారు
హయమదద్విరదరథారూఢదక్షతఁ
బ్రకటించువారును బ్రాసశక్తి
కుంతతోమరగదా కుశలత్వ మెఱఁగించు
వారునుగా నిట్లు వసుధలోని
రాజసుతులతోడ రమణఁ బాండవధృత
రాష్ట్రసుతులు వృద్ధరాజులొద్దఁ
దద్ద ముదముతోడఁ దమతమ నేర్పుల
మెఱసి రెల్లజనులు మెచ్చి పొగడ. 10

వ. అంత ననంత పరాక్రము లగు భీమదుర్యోధను లుద్యద్గదాహస్తులయి . మహామత్సరంబుతో నేకశృంగసముత్తుంగ శైలద్వయంబు ననుకరించుచు వశానిమిత్తక్రుద్ధగంధసింధురంబులుంబోలె నొండొరులం దాఁకుచు సవ్యాపసవ్యచిత్ర మండలమార్గప్రచారంబుల గదాకౌశలంబు మెఱయునెడ. 11

మ. అవనీచక్రము పాదఘాతమున నల్లాడంగ నత్యుచ్చభై
రవహుంకారరవంబునన్ వియదగారం బెల్ల భేదిల్లఁ బాం
డవకౌరవ్యగదావిఘట్టన మకాండప్రోత్థమై భావిపాం
డవకౌరవ్యరణాభిసూచనపటిష్ఠం బయ్యె ఘోరాకృతిన్.

క. ఆరాజసుతులవిద్యా
పారగపటుచేష్టితములఁ బరువడి నగ్గాం
ధారీధృతరాష్ట్రుల కతి
ధీరుఁడు విదురుండు సెప్పి తెలుపుచు నుండెన్. 13

వ. అంత భీమదుర్యోధనుల గదాకౌశలంబు చూచుజనంబుల పక్షపాతవచనంబులు విని ద్రోణుండు రంగభంగభయంబున నశ్వత్థామం బంచి వారి నిద్దఱ వారించి వారాశి యుంబోలె మ్రోయుచున్న వాదిత్రశబ్దంబు లుడిగించి నాప్రియశిష్యుండయిన యర్జును ధనుర్విద్యాకౌశలంబుఁ జూడుం డనిన నయ్యాచార్యవచనానంతరంబున. 14

ఉ. హారివిచిత్రహేమకవచావృతుఁ డున్నతచారుచాపదీ
ర్ఘోరుభుజుండు భాస్వదసితోత్పలవర్ణుఁడు నైంద్రచాపశం
పారుచిమేఘమో యనఁగఁ బాండవమధ్యముఁ డొప్పె బద్ధతూ
ణీరుఁడు రంగమధ్యమున నిల్చి జనంబులు దన్నుఁ జూడఁగన్. 15

క. నరు నింద్రాత్మజు నింద్రా
వరజసఖున్ వీరుఁ బాండవప్రవరు ధను
ర్ధరుఁ జూచి చూప ఱెల్లం
బరమాద్భుతచిత్తు లగుచుఁ బలికిరి తమలోన్. 16

తే. వీఁడె కృతహస్తుఁడఖిలాస్త్ర విద్యలందు
వీఁడె యగ్రగణ్యుఁడు ధర్మవిదులలోన

వీఁడె భరతవంశం బెల్ల వెలుఁగ గుంతి
కడుపుచల్లగాఁ బుట్టిన ఘనభుజుండు. 17

క. అనిపలుకు జనులపలుకులు
విని కుంతి యసంతహర్ష విస్తారితలో
చనయై నందను నృపనం
దనసంఘములోనఁ జూచి తద్దయుఁ బొంగెన్. 18

క. చారుమనస్సమ్మదరస
పూరము వెలి వచ్చినట్లు పొలఁతికి విగళ
ద్భూరి స్తనజనితపయో
ధారలు నానందబాష్పధారలు నొప్పెన్. 19

వ. అయ్యర్జునుస్తుతివచనంబు లొక్కట జనసంఘంబువలన నెగసి వియత్తలవిదళనంబయిన నమ్మహాధ్వని విని యదరిపడి ధృతరాష్ట్రుం డిది యేమి రవంబని విదురు నడిగిన నతం డిట్లనియె. 20

క. భూరిభుజుం డర్జునుఁ డతి
శూరుఁడు దనయస్త్రవిద్యఁ జూపఁగ రంగ
ప్రారంభుఁ డయిన నతనిన్
వారక వర్ణించుజనరవం బిది యధిపా. 21

క. అనవుడు ధృతరాష్ట్రుఁడు దన
మనమున సంతోష మంది మానుగ వీనుల్
గనినఫల మిపుడు గంటిని
వినఁ గంటిని బాండుసుతుల విద్యాశక్తుల్. 22

క. భూరినిజద్యుతితోడఁ బృ
థారణిసంభూతపాండవాగ్నిత్రితయం
బారఁగ నస్మత్కులదురి
తోరుతరారణ్యదాహ మున్నతిఁ జేయున్. 23

వ. అని పొగడుచుండ నర్జునుం డాచార్యననుమతంబున నస్త్రలాఘవవిచిత్రప్రకాశన పరుం డయి యెల్లవారును జూచుచుండ. 24

సీ. ఆగ్నేయశరమున నతిభీకరాగ్నియు
వారుణాస్త్రమున దుర్వారజలము
ననిల బాణంబున నధికానిలంబును
మేఘాస్త్రమున మహామేఘచయముఁ
బుట్టించు మఱియును భూమిబాణంబున
భూప్రవిష్టుం డగు భూరి ఘోర
శైలబాణంబున శైలరూపముదాల్చు
వీరుఁ డదృశ్యాస్త్రవిద్య పేర్మిఁ

గీ. దా నదృశ్యదేహుఁడగు దత్క్షణంబ
హ్రస్వుఁడగుదీర్ఘుఁడగుసూక్ష్ముఁడగు రయంబు
తోడరథమధ్యగతుఁడగు దురగగతుఁడు
నగుమహీగతుఁడగునిట్టు లద్భుతముగ. 25

వ. మఱియుం బాణెను సింహవ్యాఘ్రవరాహాది మృగంబుల ముఖంబులందొక్కొక్క యమ్మేసినట్లేనేసి యమ్ములతిలాఘవంబున నేసియు రజ్జుసమాలంబితం బయిన గోశృంగం

బునం దేకవింశతిశరంబులు వఱుసను నాటనేసియు నిట్లస్త్ర
విద్యా వైచిత్ర్యంబు మెఱసి గదాఖడ్గాదివివిధాయుధ
దక్షతం జూపి యర్జునుండు జనుల కాశ్చర్యంబు సేయు
చున్నంతఁ గర్ణుండు నిజవిద్యాకౌశలంబు మెఱయ సమ
కట్టివచ్చి రంగద్వారంబున భుజాస్ఫాలనంబు సేసిన. 26

మ. జను లెల్లం గడు సంభ్రమింపఁగ నజస్రంబై భుజాస్ఫాలన
ధ్వని శైలప్రకరంబుపైఁ బడు మహాదంభోళిశబ్దం బొకో
యన వీతెంచినఁ బాండవుల్ సనిరి ద్రోణాచార్యు డాయ
న్సుయో
ధను వేష్టించిరి తమ్ము లందఱును దద్ద్వారంబు
నీక్షించుచున్. 27

శా. సాలప్రాంశు నిజోజ్జ్వలత్కవచు శశ్వత్కుండలో
ద్భాసితున్
బాలార్కప్రతిము న్శరాసనధరు న్బద్ధోగ్రనిస్త్రింశు శౌ
ర్యాలంకారు సువర్ణవర్ణు ఘనుఁ గర్ణాఖ్యు న్జగత్కర్ణపూ
ర్ణాలోలద్గుణుఁ జూచి చూపఱు ప్రభూతాశ్చర్యులై
రచ్చటన్. 28

వ. అంతఁ గర్ణుండు జనుల నందఱ నదల్చి చొత్తెంచి రంగ
మధ్యంబున నిలిచి కలయం జూచి కృపద్రోణులకు నమ
స్కరించి సజలజలధరధ్వానగంభీరవచనంబుల నర్జును
నాక్షేపించి యిట్లనియె. 29

క. నీవ కడు నేర్పుకాఁడవు
గా వలవదు వీనిఁ గొన్ని గఱచితి మేమున్
నీవిద్య లెల్లఁ జూపుదు
మే వీఱలు సూచి మేలుమే లని పొగడన్. 30

క. అనిన ననతనయుపలుకులు
జనులకు విస్మయము సవ్యసాచికిఁ గోపం
బును సిగ్గును మఱి దుర్యో
ధనునకుఁ బ్రీతియును జేసెఁదత్క్షణమాత్రన్. 31

వ. అంత ద్రోణుచేత ననుజ్ఞాతుండయి కర్ణుం డర్జునుచూపిన యస్త్రవిద్యావిశేషంబులెల్ల నశ్రమంబునఁ జూపినఁ జూచి దుర్యోధనుండు దానుం దమ్ములును గర్ణునిం గౌఁగిలించుకొని నాతో బద్ధసఖ్యుండ వయి నాకును బాంధవులకును హితంబుసేసి నన్నుం గురురాజ్యం బేలించి నా యైశ్వర్యం బుపయోగింపు మనిన నట్ల చేయుదునని కర్ణుం డొడంబడి యిమ్మొఁగిన రాజలోకంబును నీవునుఁ జూడఁ బార్థుతో ద్వంద్వయుద్ధంబు సేయవలయు ననిన ధార్తరాష్ట్ర మధ్యంబున నున్న యక్కర్ణుంజూచి పార్థుం డిట్లనియె. 32

క. పిలువంగఁబడక సభలకు
బలిమిం జని పలుకుపాపభాగుల లోకం
బులకుఁ జన వేఁడి పలికెదు
పలువ యెఱుంగవు పరాత్మపరిమాణంబుల్. 33

క. అనిన విని పార్థునకు ని
ట్లనియె నినాత్మజుఁడు దుర్బలాయాసక్షే
పనిబంధమ్ములు వలుకక
ఘననిశితాస్త్రములఁ బలుకఁ గడగుము నాతోన్. 34

క. ఈరంగభూమి యస్త్రవి
శారదు లగువారి కెల్ల సామాన్యముగా
కారయ వీరికిఁ జూర నగు
వీరికిఁ గా దను విచారవిషయము గలదే. 35

వ. అని గర్వించి దుర్యోధనానుమతంబునఁ బార్థుతో ద్వంద్వ యుద్ధంబు సేయంబూని రణసన్నద్ధుం డయి రవితనయుండు రంగమధ్యంబున నున్నంత నర్జునుండును నాచార్యభ్రాతృ చోదితుండై యుగాంతకాలానలుండునుంబోలెఁ బ్రతిఘ టించి నిలిచిన. 36

కర్ణార్జునుల ద్వంద్వయుద్ధము

మ. జనితామర్షణుఁ డంతఁ బార్థుపయిఁ బర్జన్యాస్త్ర
మక్కర్ణుఁ డే
సె నపారంబయి భూనభోంతరముఁ దజ్జీమూతయూథంబు గ
ప్పినఁదద్ధ్వాంతతిరోహితాపఘనుఁడై బీభత్సుఁడుండెన్ విరో
చనుఁ డాత్మద్యుతి విస్తరించె సుతుపై సంప్రీతచేతస్కుఁడై.

వ. అయ్యవసరంబున దుర్యోధనుం దొట్టి ధృతరాష్ట్రనందను లందఱుఁ గర్ణువలన నుండిరి భీష్మద్రోణకృపపాండవులు పార్థువలన నుండిరంత. 38

క. రవిసుత పార్థుల ఘోరా
హవమునకును వెఱచుచున్నయది కుంతి తదు
ద్భవఘనతరశరతిమిరా
ఘువృతాంగుఁ దనూజుఁ జూడఁ గానక వంతన్. 39

క. ధృతి దఱఁగి మోహమూర్ఛా
న్వితయైనను సంభ్రమించి విదురుఁడు ప్రత్యా
గతజీవఁ జేసె నప్పుడ
యతిశీతలచందనోదకాసేకమునన్. 40

వ. అంత నర్జునుం డనిలబాణంబున నమ్మేఘపటలంబు పఱవ
నేసి యాదిత్యసమతేజుండయి యున్న విదురదర్శితులైన
యక్కర్ణార్జునులం జూచి కుంతి సంతసిల్లె నపుడు ధర్మ
విదుం డఖిలద్వంద్వయుద్ధసమాచారనిపుణుండు కృపా
చార్యుం డయ్యిద్దఱ నడుమ నిలిచి కర్ణున కిట్లనియె. 41

చ. కురుకులజుండు పాండునకుఁ గుంతికిఁ బుత్త్రుఁడు రాజధర్మబం
ధురచరితుండు నీ వితనితోడ రణం బొనరించెదేని వి
స్తరముగ నీదువంశమును దల్లిని దండ్రిని జెప్పు చెప్పినన్
దొర యగుదేని నీ కెదిరి దోర్బలశక్తి నితండు
చూపెడిన్. 42

వ. అనిన విని కర్ణుండు దనకులంబును దల్లిదండ్రులను జెప్ప
సిగ్గువడి తల వాంచి యున్నం జూచి దుర్యోధనుఁడు
గృపున కిట్లనియె. 43

క. కులము గలవాఁడు శౌర్యము
గలవాఁడును నధిక సేన గలవాఁడును భూ
తలమున రా జనునామము
విలసిల్లఁగఁ దాల్చు మూఁడువిధముల పేర్మిన్. 44

తే. రాజవరుఁ డైన పార్థుతో రాజు గాని
యీతఁ డని సేయఁగాఁ దగఁ డేని వీని
నెల్లవారును జూడంగ నీక్షణంబ
రాజుఁ జేసెద నే నంగరాజ్య మిచ్చి. 45

వ. అని యప్పుడ భీష్మధృతరాష్ట్రులకుం జెప్పి వారి యనుమతంబున మహామహీసురసహస్రంబునకు గోసహస్రాయుతంబు దానంబు సేసి యంగరాజ్యంబునకు వీఁ డర్హుం డయ్యెడు మనుబ్రాహ్మణవచనంబు వడసి కర్ణుం గాంచనపీఠంబున నునిచి యంగరాజ్యమున కభిషిక్తుం జేసినం గర్ణుండు మణిమకుటకేయూరహారాదిభూషణభూషితుండై సకలరాజచిహ్నంబుల నొప్పి పరమహర్షంబుతోడఁ గురుపతి కిట్లనియె. 46

క. బృహదబ్ధిమేఖలాఖిల
మహీతలక్షత్రవరసమక్షమునమహా
మహిమాన్వితుఁగా నన్నును
మహీశుఁగా జేసి తతిసమర్థత వెలయన్. 47

క. దీనికి సదృశముగా మఱి
యే నేమి యొనర్తు నీకు నిష్టం బనినన్
మానుగ నాతోఁ జెలిమి మ
హీనుతముగఁ జేయు మిదియ యిష్టము నాకున్. 48

వ. అనిన విని దుర్యోధనున కెంతయు సంతోషంబుగాఁ గర్ణుం డతనితోడి యిష్టసఖత్వంబున కొడంబడియె నంతఁ గొడుకు రాజ్యాభిషేకోత్సవంబు సూచి హర్షపరవశుం డయి సూతుండు రథంబుడిగ్గి కర్ణునొద్దకుం బఱతెంచినఁ గర్ణుం డును బితృగౌరవంబున సంభ్రమించి వినయవినమితోత్త మాంగుం డయిన. 49

తే. కడఁగి సూతుండు పుత్త్రకుఁ గౌఁగిలించి
కొని తదీయ మూర్ధాఘ్రాణ మొనరఁ జేసి
యంగరాజ్యాభిషేకార్ద్రమైన శిరముఁ
దడిపె వెండియు హర్షాశ్రుతతులఁ జేసి. 50

వ. దానిం జూచి భీముండు గర్ణుని సూతకులసంభవుంగా నెఱింగి నగుచు నిట్లనియె. 41

క. నీదుకులమునకుఁ దగఁగఁ బ్ర
తోదముగొని రథము గడపఁ దొడఁగుము నృపధ
ర్మోదయుఁ డగునర్జునుతోఁ
గా దనక రణంబు సేయఁగా నీ కగునే. 52

వ. మఱి యదియునుం గాక. 53

తే. ఉత్తమక్షత్త్రియప్రవరోపయోగ్య
మైన యంగరాజ్యంబు నీ కర్హ మగునె?
మంత్రపూతమై గురుయజమానభక్ష్య
మగు పురోడాశ మది కుక్క కర్హ మగునె. 54

వ. అనినం గర్ణుండు వెల్ల నయి యెద్దియుం జేయునది నేరక దీర్ఘోష్ణనిశ్వాస వ్యాకులితవదనుండయి యాకాశంబువలన నున్న యాదిత్యుం జూచుచు మిన్నకుండె నంత నంత ర్వ్యాలులితుం డయిన యక్కర్ణుం జూచి భ్రాతృపద్మవన మధ్యంబున నుండి దుర్యోధనమదాంధగంధసింధురంబు వెలువడి వచ్చి కడునలిగి భీమున కి ట్లనియె. 55

క. అనిలజ నీ కిట్లని ప
ల్కను దలఁపను నగునె లేడికడుపునఁ బులి పు
ట్టునె యిట్టి దివ్యతేజం
బున వాఁ డధమాన్వయమునఁ బుట్టునె చెపుమా. 56

సీ. సూరులజన్మంబు సురలజన్మంబును
నేఱులజన్మంబు నెఱుఁగ నగునె
మొగిని దధీచియెమ్మునఁ బుట్టదయ్యె నే
వాసవాయుధ మైనవజ్ర మదియు
గాంగేయుఁ డన మఱి కార్త్తికేయుం డన
నాగ్నేయుఁ డన రౌద్రుఁడనఁగ శరవ
ణోద్భవుం డన గుహుం డుద్భవిల్లఁడె
శరస్తంబజన్ముఁడు గాఁడె ధర్మవిదుఁడు

తే. కృపుఁడు ఘటసంభవుఁడుగాఁడె కీర్తిపరుఁడు
వరుఁడు ద్రోణుండు విప్రులవలనఁబుట్ట
రైరె సత్క్షత్త్రియప్రభు లవనిఁ గావఁ
గడఁగి మీజన్మములు నిట్లు కావె వినఁగ. 57

వ. వానితోడిదేమి దివ్యలక్షణలక్షితుండును సహజకవచ
కుండలమండితుండునుగాని ప్రాకృతపురుషుండు గాఁడు
తన బాహుబలంబున నీయంగరాజ్యంబునకే కాదు సకల
మహీరాజ్యంబునకు నర్హుం డగు నను చున్నయంత నాది
త్యుం డస్తగతుండైన నస్త్రసందర్శనరంగంబు వెలువడి
దుర్యోధనుండు గర్ణుం దోడ్కొని కరదీపికాసహస్రంబుతో
నిజమందిరంబునకరిగె. పాండవులును భీష్మద్రోణవిదుర
కృపాచార్యులతో నిజనివాసంబుల కరిగిరి. 58

ఆ. కుంతి యంత సహజ కుండలకవచాభి
రాముఁ గర్ణుఁ జూచి రవిసమానుఁ
బ్రత్యభిజ్ఞ నెఱిఁగి ప్రథమపుత్త్రిస్నేహ
మెఱుకపడక యుండ నింతియుండె. 59

క. వినుతధనుర్విద్యావిదు
ఘునుఁ గర్ణు సహాయుఁ బడసి కౌరవవిభుఁ డ
ర్జునువలనిభయము సెడి యా
త్మను నేఁ జేయిడి నిద్రవోయె ముదితాత్ముం డై 60

సభాపర్వము : ద్వితీయాశ్వాసము

# ధర్మజుని రాజసూయ యాగము

వ. రాజసూయమహోత్సవంబు నొప్పను ధర్మరాజు ధర్మ నిత్యతయును స్తుతియించి నారదుం డాసదనంబున సకల రాజసమూహంబును రాజలోకంబులో మనుష్యసామా న్యుం డయి యున్న జగన్మాన్యు జనార్దనుం జూచి తొల్లి బ్రహ్మాదిసురగణప్రార్థితుం డయి యఖిల మహీభారావ తరణార్థంబు నారాయణుండు యదువంశంబున నుద యించుటయు నయ్యాయి క్షత్త్రియకులంబుల సురదైత్య దానవయక్షరాక్షసగంధర్వాదుల యంశావతారంబులుం దలంచి భవిష్యద్భారతరణంబునకు సంహృష్టహృదయుం డయి యుండునంత. 1

క. శాంతనవుఁడు భీష్ముండు ప్ర
శాంతుఁడు దత్క్రతువు సూచి సంతుష్టుండై
యంతకతనూజునకు ధృతి
మంతున కత్యంతధర్మ మతికిట్లనియెన్ 2

మత్తకోకిలము. స్నాతకుండును ఋత్విజుండును సద్గురుండును నిష్టుఁడున్
భూతలేశుఁడు సంయుజుండును బూజనీయులు వీరిలోఁ

ప్రీతి నెవ్వఁడు సద్గుణంబులఁ బెద్ద యట్టిమహాత్ము వి
ఖ్యాతుఁ బూజితుఁ జేయు మొక్కనిఁ గౌర

వాన్వయవర్ధనా! 3

వ. అనిన నట్టివాఁ డెవ్వండు నా కెఱింగింపు మనిన ధర్మరాజు
నకు భీష్ముం డిట్లనియె. 4

సీ. రోదసీ కుహరంబు రుచిరాంశుతతిఁ జేసి
యర్కుఁ డెందు వెలిఁగించు నట్టు లమృత
సందోహనిష్యంద చంద్రికఁ జేసి శీ
తాంశుఁ డానందించు నట్లు సకల
జనులకుఁ దనదైన సదమల ద్యుతిఁ జేసి
తనరంగఁ దేజంబుఁ దనుపుఁ దాన
చేయుచునున్న స త్సేవ్యుండు పుండరీ
కాక్షుండు గృష్ణుం డనాది నిధనుఁ

ఆ. డబ్జనాభుఁడుండ నర్ఘ్యంబునకు నిందు
నర్హు లొరులు గలరె యజ్ఞపురుషు
నఖిలలోకపూజ్యు నచ్యుతుఁ బూజింపు
మధిప! యదియచూవె యజ్ఞఫలము. 5

వ. అనిన భీష్మవచనంబున నప్పుడు సహదేవోపనీతం బయిన
యర్ఘ్యం బర్హణీయుండయిన వాసుదేవునకు శాస్త్రదృష్ట
విధానంబున ధర్మతనయుం డిచ్చిన దానిం జూచి సహింపక
శిశుపాలుం డుపాలంభనపరుండయి యధోక్షజు నాక్షే
పించుచు ధర్మరాజున కిట్లనియె. 6

## శిశుపాలుండు ధర్మరాజు నాక్షేపించుట

మ. అవనీనాథు లనేకు లుండఁగ విశిష్టారాధ్యు
లార్యుల్ మహీ
దివిజుల్ పూజ్యులు పల్వు రుండఁగ ధరిత్రీనాథ!
గాంగేయుదు
ర్వ్యవసాయంబునఁ గృష్ణుఁ గష్టచరితున్ వార్ష్ణేయుఁ
బూజించి నీ
యవివేకం బెఱిఁగించి తిందఱకు దాశార్హుండు
పూజార్హుఁడే. 7

చ. కడుకొని ధర్మతత్త్వ మెఱుఁగంగ నశక్యము
ధర్మబాహ్యు ని
న్నొడఁబడ నిష్టుఁడై కలిపి యుత్తము లుండఁగ
వాసుదేవుఁ డ
న్గడునకుఁ బూజ యిమ్మని విచారవిదూరుఁడు
భీష్ముఁ డెంతయున్
వెడఁగుఁదనంబునం బనిచె వృద్ధులబుద్ధులు సంచలింపవే! 8

చ. ఇతనికిఁ గూర్తు రేని ధనమిత్తు రభీష్టము లైనకార్యముల్
మతినొనరింతు రిష్టుఁడనిమంతురు గాక మహాత్ములైన భూ
పతులయు విప్రముఖ్యులసభన్ విధిదృష్టవిశిష్టపూజనా
యతికి ననర్హు నర్హుఁడని యచ్యుతు నర్చితుఁ జేయఁ బాడియే.

సీ. ఈతని వృద్ధని యెఱింగి పూజించితే
వసుదేవుఁ డుండంగ వసుమతీశ!
ఋత్విజుం డని విచారించి పూజించితే
ద్వైపాయనుం డుండ ధర్మయుక్తి
యాచార్యుఁడని వినయమునఁ బూజించితే
కృతమతుల్ ద్రోణుండు గృపుఁడు నుండ
భూనాథుఁ డనియెడు బుద్ధిఁ బూజించితే
యాదవుల్ రాజులే యవనిమీఁదఁ

ఆ. బూజనీయులైన పురుషులలోపల
నెవ్వఁ డయ్యెఁ గృష్ణుఁ డిట్టు లేల
పూజ్యు లయినవారిఁ బూజింపనొల్లక
భీష్మపలుకుఁ జేసి బేల వయితి. 10

చ. పురుషవిశేషవిత్తముఁడు పూజ్యుఁడు రాజులలోన నీయధి
ష్ఠిరుఁ డని నీగుణాళి ప్రకటించి మనంబులలోన ధారుణీ
శ్వరులు భవన్ముఖంబునకు వచ్చిన నిందలు కివ్విధంబునం
బరఁగ నవజ్ఞ సేయు టిది పాడియె ధర్మువె ధర్మనందనా! 11

క. నీ వెఱుఁగక యిచ్చిన నది
నావిషయమె యని మనంబునం దలఁపక ల
జ్జావిరహితుఁడయి యర్ఘ్యము
గోవిందుఁడు గొనియెఁ దనకుఁ గొనుటుచితం బే. 12

క. చనఁ బేడికి దారక్రియ
యును జెవిటికి మధురగీతియును జీకున క
త్యనుపమసురూపదర్శన
మును జేయుటఁబోలుఁ గృష్ణుఁ బూజించుటలెన్. 13

ఉ. ఈయవనీశ్వరప్రవరు లిందఱు నిన్ను నగంగ నిట్లు గాఁ
జేయుదె ధర్మరాజను విశేషసమాఖ్య నిరర్థకంబుగా
ధీయుత ! యంచు ధర్మజ నదీసుత కృష్ణుల నెగ్గు లాడుచుం
బోయె సదంబు వెల్వడి సపుత్త్రబలుం డయి చైద్యుఁ
డల్కతోన్. 14

వ. శిశుపాలుపిఱుఁదన చని ధర్మనందనుండు వానిం బ్రియ
వచనంబుల ననునయించుచు నిట్లనియె. 15

క. భూరిగుణోన్నతు లనఁ దగు
వారికి ధీరులకు ధరణి వల్లభులకు వా
క్పారుష్యము చన్నె మహా
దారుణ మది విషముకంటె దహనముకంటెన్. 16

ఉ. ఆదిజుఁడైన బ్రహ్మయుదయంబున కాస్పదమైనవాఁడు వే
దాదిసమస్తవాఙ్మయములందుఁ బ్రశంసితుఁ
డైనవాఁడు లో
కాది త్రిలోకపూజ్యుఁ డని యాత్మ నెఱింగి పితామహుండు
దా
మోదరుఁ జెప్పఁ బూజ్యుఁ డని యుత్తమ కా కిది యేమి
దోసమే. 17

క. పరమార్థప్రతిభఁ దమో
హరు నచ్యుతు భీష్ముఁ డెఱిఁగిన ట్లెఱుఁగఁగ నీ
కరిది శిశుపాల! పెద్దల
చరితం బల్పులకు నెఱుఁగ శక్యమె యెందున్ ? 18

క. గురుఁ డని సమ స్తలోకో
త్తరుఁ డని నీకంటె వృద్ధతము లైన నరే
శ్వరు లచ్యుతు నర్చన నెఱఁ
గర మభినందింప నీకుఁ గాదనఁదగునే. 19

వ. అని యాశిశుపాలుం బట్టువఱుచుచున్న ధర్మరాజునకు
భీష్ముం డిట్లనియె. 20

ఉ. పాలితదుర్ణయుండు శిశుపాలుఁడు బాలుఁడు వీని నేల భూ
పాలక! నీకుఁ బట్టువఱుపన్ మఱి ధర్మ మెఱుంగ వీనికిం
బోలునె రాగకోపపరిభూతమనస్కున కల్పరాజ్యల
క్ష్మీలలనాంధబుద్ధి కనిమిత్తమహత్పరివాదశీలికిన్. 21

వ. అని ధర్మరాజును వారించి శిశుపాలుంజూచిభీష్ముండిట్లనియె.

చ. అవినయబుద్ధివై హరికి నర్ఘ్య మయోగ్యమ యంటి నీవు మూ
ర్ఖవు శిశుపాల! యింకఁ బలుకన్ వలసెన్ సభలోన నున్నయీ
యవనిపు లెల్ల నాతనిదయం బరిముక్తులు వానిచేత నా
హవజితులుం దదీయశరణార్థులుఁ గా రొకొ లయ్య చెప్పుమా! 23

తే. ఉత్తమజ్ఞానవృద్ధు నా నుండెనేని
బాలుఁడయ్యును బూజ్యుండు బ్రాహ్మణుండు
క్షత్త్రియుఁడు పూజ్యుఁడమితవిక్రమసమృద్ధి
నుర్విపతులలోనధికుఁడై యుండెనేని. 24

క. ఈ రెండుకారణముల ము
రారాతియ యర్ఘ్యమునకు నర్హుఁడు జగదా
ధారుండు మాక కాదు స
దారాధ్యుఁడు విష్టపత్రయావాసులకున్. 25

క. వృద్ధు లోకలక్ష యున్నను
బుద్ధియె యెవ్వరికి వారిఁ బూజింపంగా
నిద్ధరణీశులలో గుణ
వృద్ధని పూజించితిమి త్రివిక్రము భక్తిన్. 26

క. పూజితుల తృప్తులగుదురు
భూజను లారు లచ్యుతుండు పూజితుఁ డగుడుం
దేజమున జగత్త్రితయముఁ
బూజిత మయి తృప్తిఁ బొందెఁ బుణ్యసమృద్ధిన్. 27

సీ. బుద్ధియు మనమును బురుషుండు నవ్యక్త
మగుచున్నప్రకృతియు నంబరంబు
ధరణియుఁ దరణియు దహనుండుఁజంద్రుండు
గాడ్పును దిక్కులుఁ గాలములును
దాన మై జంగమస్థావరాత్మక మైన
సకలభూతప్రపంచంబు నెల్లఁ

దనదివ్యశక్తిమైఁ దాల్చినసర్వాత్ము
సర్వభూతేశ్వరు సర్వవంద్యు

ఆ. నధికయోగనిష్ఠితాత్ములగుమహా
యోగివరులు తత్త్వయుక్తిఁ జేసి
యెఱిఁగినట్టు నీకు నెఱుఁగంగఁ బోలునే
యనుచు భీష్ముఁడన్న యవసరమున. 28

చ. ఎడపక యర్ఘ్య మచ్యుతునకిచ్చితి మిచ్చిన దీని కిం దొడం
బడ మని దుర్జనత్వమునఁ బల్కెడు వీరులమస్తకంబుపై
నిడి యెదనంచుఁ దాఁ జరణమెత్తె సభన్ సహదేవుఁడట్టిచో
నుడిగి సభాసదుల్ పలుకకుండిరి తద్దయు భీతచిత్తులై. 29

చ చెలువుగఁ బుష్పవృష్టి గురిసెన్ సహదేవుపయిన్ దివంబునన్
వెలయఁగ సాధువాదములు వించె సభాసదు లెల్ల విస్మయా
కులితమనస్కులై రితనకుం జెయుఁ గృష్ణమృగాజినంబునుం
బలుమఱు వీచుచుం గలహబంధుఁడు నారదుఁ డాడె వేడుకన్. 30

వ. అంత శిశుపాలుసేనాపతి సునీథుం డనువాఁ డతిరోషపరుష
వచనుం డగుచు స్వపక్షక్షత్రియుల నెల్ల నొక్కంతం
జేర్చికొని శిశుపాలు ననుమతంబున యుద్ధసన్నద్ధుం డయి
యున్న సమయంబున. 31

చ. రయవిచలత్తురంగమతరంగములన్ మదనాగనక్రసం
చయముల సంచలచ్చటుల సైనికమత్స్యములన్ భయంకరం

బయి యదు వృష్ణి భోజ కుకురాంధక వాహినియుం గలంగె ని
ర్దయతరరోషమారుతనితాంతసమీరిత మై క్షణంబునన్.

వ. అట్టిసకలక్షత్త్రియక్షోభంబు సూచి భయసంభ్రమాక్రాం
తహృదయుం డయి ధర్మరాజు భీష్మున కిట్లనియె. 33

తరలము

ధరణిలోఁగల రాజులెల్లను దారుణ క్షయకాల సా
గరములట్లు గలంగి రిప్డు మఖప్రయోగము విఘ్నముం
బొరయ కుండఁ బ్రజాపకారము పుట్ట కుండఁగ నీవు చె
చ్చెరఁ బితామహ! వీరి కిచ్చటఁ జిత్తశాంతి యొనర్పవే.

వ. అనిన ధర్మరాజునకు భీష్ముం డిట్లనియె. 35

క. నీయజ్ఞమునకు విఘ్నము
సేయఁగ నోపుదురె యొరులు జితదైత్యుఁడు నా
రాయణుఁడు యజ్ఞపురుషుఁ డ
జేయపరాక్రముఁడు దీనిఁ జేకొని కావన్. 36

సీ. చైద్యునకై పూని సన్నద్ధులై యున్న
యీరాజు లిందఱు నీక్షణంబ
హరి యల్గి చూడుడు నంతకక్షయమున
కరిగెడువార ఘోరాహవమున
దమఘోషనందను దర్పంబు నిప్పుడ
యడఁగెడుఁ గడుఁబెక్కులయ్యుఁ గుక్క
లిభకుంభదళనమహిష్ఠనిష్ఠురనఖ
ముఖుఁ డగుహరిమీఁద మొఱఁగి యేమి

ఆ. సేయ నోపుఁ గృష్ణు సింహపరాక్రమము
నెఱుఁగ కున్నవారె యెల్లవారు
ననిన భీష్మపలుకు లవి కర్ణశూలంబు
లయినఁ జేదినాథుఁ డాగ్రహించి. 37

ఉ. ఇమ్మది వెట్టి వీనిఁ బరమేశ్వరుఁగాఁ గొనియాడె ధర్మత
త్త్వమ్ములు పాండవేయులును దానును గాని యెఱుంగ
రట్టె సా
మమ్మున నెల్ల వారినవమాన్యులఁ జేసెనమాన్యుఁ డంచు రూ
క్షమ్మున భీష్ముఁ జూచి బల గర్వితుఁ డిట్లని పల్కె
నల్కతోన్. 38

ఉ. నెట్టన ధర్మనందనుడు నిన్నవలంబము సేసి యోడతోఁ
గట్టిన యోడవోలె గత గౌరవుఁడై కడుఁ దూలెఁ గృష్ణుఁ జే
పట్టి బిభీషికల్ ధరణిపాలుర కిప్పుడు సూపి తెందు నీ
యట్టి దురాత్ములుం గలరె యంతయధీరులె ధారుణీపతుల్.

సీ. పూతనాఘాతంబుఁ జేత నేతరమైన
శకటంబు ద్రోపును జరణనిహతి
వీఁకతోఁ గడుఁ బూచు మ్రాకుల విఱుపును
వల్మీకమాత్రపర్వతము నెత్తి
కొని లావు గలఁడు వీఁడన నేడుదివసంబు
లునికియు వృషవధ యును ననంగఁ
బమ్మినకృష్ణుబీరమ్ములు వొగడుచు
నున్ననీనాలుక యొక్కఁ డయ్యె

ఆ. ద్రవ్యవలయు నూఱు ద్రవ్యములుగాఁగ న
ట్లయినఁగాని చాల వతనిఁ బొగడ
నెల్లదాని నేన యెఱుఁగుదు నెందు వాఁ
డర్ఘ్యదానయోగ్యుఁడయ్యెఁ జెపుమ ? 40

వ. స్త్రీలను గోబ్రాహ్మణులం గూడు వెట్టువారిని విశ్వసించిన వారిని వధియించుట మహాపాతకం బని పెద్దలు సెప్పుదు రట్టియందు గోవిందుండు స్త్రీవధయును గోవధయును జేసె నీవునుం గడు ధర్మ మెఱింగినవాఁడవయి వీని కర్ఘ్యం బిప్పించి తదియునుంగాక యన్యకామినియయిన యంబ యనుకన్యక నపహరించి నీవు దెచ్చిన నెఱింగి నీతమ్ముండు విచిత్రవీర్యుండు ధర్మ మెఱిఁగినవాఁడై దాని విడిచిపుచ్చె.

క. జననిందిత మయి నీయం
దనపత్యత యనునధర్మమది యుండఁగ ధ
ర్మనివృత్తచరిత్రక ! నీ
యనుశాసన మెట్లు నమ్మనగు జనములకున్. 42

వ. తొల్లి సముద్రతీరంబున నుండి యొక్కవృద్ధహంస ధర్మాధర్మంబులు సెప్పుచు ధర్మమార్గంబున వర్తిల్లుచుండుఁడని పక్షులనెల్ల శిక్షించుచుఁ బ్రాణిహింస సేయక తపోవృత్తినున్న దానికి సముద్రజలచరంబు లయినపక్షులు రుచ్యంబులగు భక్ష్యంబులు దెచ్చి పెట్టుచుం దత్సమీపంబునం దమతమయండంబులనెల్ల నిక్షేపించి భక్షణార్థం బొక్కనాఁ డతిదూరం బరిగిన నిట యాహంసయు న

య్యండంబుల భక్షించిన దాని నొక్కపక్షి గని యా పక్షుల కెల్లం జెప్పిన నవిదద్దయు దుఃఖించి యాలయించను వధియించెం గావున నట్ల నీవు నధర్మ ప్రవృత్తుండవై ధర్మశిక్ష సేయుచుఁ గౌరవుల కాపద యాపాదించుచున్న వాఁడవు. 43

క. విదితముగ నధికబలసం
పద నోర్చె నుపేంద్రుఁ డవనిపాలుర నంచున్
మదిఁ బొగడితి నాయెఱుఁగని
యదియె జనార్దనుబలంబు నత్యున్నతియున్. 44

క. సకలక్షత్త్రిభయంకరు
నకు బార్హద్రథికి నని మొనన్ మార్కొన నో
పక వలియం బాఱఁడె యీ
ముకుందుఁడు భయాతిరేకమునఁ బదిమాఱుల్. 45

వ. అమ్మహాసత్త్వు జరాసంధుం బరమబ్రహ్మణ్యు బ్రాహ్మణ వేషంబున భీమార్జునులం దోడు సేసికొని వధియించె నవి యెల్లం ద్రివిక్రమపరాక్రమంబులుగా నక్రాంతవదనుండ వయి. 46

ఆ. బూతు వొగడినట్లు వొగడెదు పొగడంగ
వలయునేని సుగుణవంతు లయిన
కర్ణశల్యు లాదిగాఁ గలవీరులఁ
బొగడుచుండ రాదె ప్రొద్దువోక. 47

ఆ. అన్యకీర్తనంబు నన్యునిందయుఁ దన్నుఁ
బరఁగఁ బొగడికోలుఁ బ్రచ్చికోలు
నాపగాతనూజ! యార్యవృత్తములు గా
వనిరి వీని నాద్యులయిన మునులు. 48

వ. అని రూక్షాక్షరవచనంబుల నాక్షేపించుచున్న శిశుపాలుం జూచి సహింపనోపక భీమసేనుం డతి రౌద్రాకారంబున నలిగిన. 49

చ. ప్రకటితకోపవేగమునఁ బద్మదళాయతనేత్రముల్ భయా
నకతరలీలఁ దాల్చె నరుణద్యుతి నుద్యతమై త్రిశాఖమై
భ్రుకుటి లలాటదేశమునఁబొల్చెఁ ద్రికూటతటత్రిమార్గగా
నుకృతిఁ బ్రభంజనప్రియతనూజున కంతకమూర్తి
కచ్చటన్. 50

భీమునకు భీష్ముండు శిశుపాలుని వృత్తాంతంబు సెప్పుట

వ. ఇట్లు నిఖిలక్షత్త్రియత్రాసజననంబుగా నలిగి దంతసందష్టదారుణముఖుండై శిశుపాలనిర్మూలనాభీలసంరంభంబున నున్న భీమసేను వారించి భీష్ముం డిట్లని చెప్పె నిద్దురాత్ముండు తొల్లి చేదివంశంబున దమఘోషుం డనువానికి సాత్వతికిం జతుర్భుజలలాటనేత్రంబులతో నుదయించి రాసభరవంబున నేడ్చుచున్నం జూచి తల్లిదండ్రులు భయవిస్మయాధీనమనస్కు లయి యున్న వారికి నొక్క యశరీరభూతం బిట్లనియె. 51

ఆ. వీని నొరులు సంపఁ గానోప రెవ్వరు
నెవ్వ రేని వీని నెత్తికొనుఁడు
మిగిలియున్న బాహుయుగళంబుఁ గన్నును
నడఁగు వీని కతఁడ యంతకుండు. 52

వ. అనిన నయ్యశరీరి వచనంబులువిని వార లాశ్చర్యమానసు
లయి యాకుమారుం జూడవచ్చినవారిచేతి కెల్ల నెత్తి
కొన నిచ్చుచున్నంత. 53

చ. అతి వికృతస్వరూపధరుఁడైన కుమారకుఁ బ్రీతితోడ సా
త్వతిఁ దమమేనయత్తను ముదంబునఁ జూడఁగఁగోరి
యద్భుత
ప్రతిములు రామకేశవులు పన్నుగ నేఁగిరి చేదిధారుణీ
పతిపురి కొక్కనాఁ డఖిల బాంధవ మంత్రి సుహృ
త్సమేతులై. 54

వ. ఇట్లు వచ్చిన రామకేశవులం బ్రియసత్కారంబులఁ
బూజించి సాత్వతియు నబ్బాలు బలదేవుచేతికి నెత్తికొన
నిచ్చి తదనంతరంబ నారాయణుచేతికి నిచ్చిన. 55

క అక్కొడుకు నబ్జనాభుం
డక్కజముగ నెత్తికొనుడు నందఱుఁ జూడఁగ
గ్రక్కున నొక్కట నడఁగెను
మిక్కిలి చేతులును వాని మిక్కిలికన్నుఁ. 56

వ. దానిం జూచి సాత్వతి యద్భుతచిత్తయై యశరీరిపలుకు

లప్పుడు దలంచి తన పుత్త్రునకు మురవైరివలన మరణం
బగుట యెఱింగి యతని కిట్లనియె. 57

క. కుపథప్రవృత్తుఁ డయి వీఁ
డపనయమున నీ కనిష్టుఁ డయినను గరుణా
నిపుణుఁడవై నీమఱఁదికి
నపరాధశతంబు సైఁపుమయ్య యుపేంద్రా! 58

వ. అని వీనితల్లి తొల్లి జగద్వల్లభుండైన జనార్దనుం బ్రార్థించి
తత్ప్రసాదంబు వడయుటం జేసి శతాపరాధంబులు నిండు
నంతకు వీఁ డన్యులచేత నప్రతిహతుండు గృష్ణునిచేత
నిహతుం డగు నది కారణంబుగా. 59

చ. ఇతనికి నిట్లు నన్నుఱక యెగ్గులు వల్కఁగఁ బోలెఁ
గాక యు
ద్ధతమతి నన్యు లీతనివిధంబునఁ బల్కి మదీయచాపని
ర్గతచటులోగ్రమార్గణనికాయపయోధి మునుంగ కిట్లు ద
ర్పితు లయి పోవ నేర్తురె గభీరపరాక్రమ!
మారుతాత్మజా! 60

వ. అని పలుకుచున్న భీష్మభీముల నతిక్రమించి శిశుపాలుండు
జనార్దనునకభిముఖుండయి యిట్లనియె. 61

మ. అవమాన్యున్ సభలోన మాన్యుఁడని సౌహార్దంబునం
గౌరవ
స్థవిరప్రేరణ నిన్నుఁ బాండుతనయుల్ తప్పంగఁ
బూజించి ర

య్యవివేకాస్పదులైన పాండవులు మోహాంధుండు
భీష్ముండుఁ. కే
శవ! నీవుం గడఁగుండు నాకు నెదురై సంగ్రామ
రంగంబునన్. 62

వ. అని శిశుపాలుండు గర్వించి పలికిన విని చక్రధరుం డఖిల
రాజచక్రంబు విన నిట్లనియె. 63

సీ. ప్రాగ్జ్యోతిషంబున భగదత్తుపయి నేము
వోయిన నీతఁ డన్యాయవృత్తి
నిట బాలవృద్ధులకెల్ల భయంబుగా
ద్వారకాపురిఁ గాల్చె వీరులైన
భోజరాజన్యులు పొలఁతులతోడ రై
వతకాద్రిఁ గ్రీడాభిరతిఁ బ్రమత్తు
లయియున్నవారల నదయుఁడై వధియించె
దేవాభుఁడగు వసుదేవు చేయు

ఆ. నశ్వమేధమునకు నభ్యర్చితంబైన
హయము నపహరించి యజ్ఞమునకు
విఘ్న మాచరించి వీఁ డతి పాపుఁడై
ప్రభుభార్యఁ దనకు భార్యఁ జేసె. 64

వ. మఱియు వాగ్విషయంబు లయినయపకారంబు లనేకం
బులు సేసె మాయత్తసాత్వతి నన్నుం బ్రార్థించుటం జేసి
యిద్దురాత్మ్ముండు సేసినయపరాధశతంబు సహించితి
నిప్పుడు మీా రిందఱు నెఱుంగ నాయం దకారణవ్యతిక్ర

మం బుపక్రమించి యత్యంతశ్రమం డయ్యె ననిన విని శిశుపాలుం డతిపరుషవచనుం డగుచుఁ బురుషోత్తమున కిట్లనియె. 65

క. నీకూర్మియు నీయలుకయు
నా కవియేమిటికి దుర్గుణప్రియ! మొదలన్
నా కిచ్చినయకన్యకఁ
జేకొని నీ కిట్లు వలుక సిగ్గును లేదే? 66

చక్రాయుధముచే శిశుపాలుండు చచ్చుట

చ. అని శిశుపాలుఁ డొండొకట నప్రియముల్ హరిఁ బల్కుచున్నచో
ననలశిఖాలి దూల దనుజాంతకచక్రము రాజచక్ర మె
ల్లను భయమంద మూర్ధవికలంబుగ నప్పుడు సేసెఁ జేదినం
దనుతనువున్ బృహద్రుధిరధారలు బోరన మీఁది కొల్కఁగాన్. 67

ఉ. ప్రల్లద మేది యిట్లు శిశుపాలుఁడు వజ్రహతాద్రితుల్యుఁడై
త్రెళ్ళుడు వానిదైనపృథుదేహము వెల్వడి తేజ మంబరం
బెల్ల వెలుంగవచ్చి పరమేశ్వరుదేహము సొచ్చె విస్మయో
త్ఫుల్లవిశాలనేత్రు లయి భూపతు లెల్లను జూచుచుండఁగాన్. 68

క. ఘనజాలము లేకయుఁ బెలు
చన పిడుగులతోడివృష్టి వైద్యునిపాతం
బునఁ గురిసె సముద్రమహా
ద్రినికాయముతో ధరిత్రి దిర్దిరఁ దిరిగెన్. 69

క. జయజయనినాదమున న
వ్యయు నంబుజనాభు భువనవంద్యు నుపేంద్రుం
బ్రియమునఁ బొగడుజనంబుల
దయినమహాధ్వనియుఁ జెలఁగె నతితుములంబై. 70

వ. అంతననంతశయనుండు శిశుపాలు సంస్కరింపం బంచి వానికొడుకుం జేదిరాజ్యంబున కభిషిక్తుం జేసె నట్లు ప్రశాంతవిఘ్నం బయి సుఖారంభం బయి ప్రభూత భక్ష్యాన్నధనదానసనాథం బయి జగన్నాథరక్షితం బయి రాజసూయమహాధ్వరంబు సమాప్తసంప్రయోగం బయిన. 71

ఉ. దేవగురుద్విజప్రకర తృప్తికరున్ వరరాజసూయయ
జ్ఞావభృథాభిషేకవిమలాంగు విశుద్ధయశోనిధిన్ జగ
త్పావను ధర్మనందను సభాస్థితుఁ జూచి ముదంబు చెంది రిం
ద్రావరజాదిమిత్రు లసహత్వముఁ బొందిరి ధార్త
రాష్ట్రిలున్. 72

వ. ఇట్లు మహావిభూతితోనున్నధర్మరాజునొద్దకు వచ్చి నానా దేశాగతు లయిన రాజు లిట్లనిరి. 73

మాలిని. జగదభినుతసామ్రాజ్యంబుతో నొప్పునీయ
త్యగణితగుణయుక్తం బైన ధర్మప్రవృత్తిన్
మిగిలి వెలిఁగె నాజామీఢవంశంబు విద్వ
ద్గగనతపన సర్వక్షత్త్రవంశంబులందున్. 74

వ. ఏము భవదీయరాజసూయమహోత్సవదర్శనంబునను భవ
త్కృతసత్కార గౌరవంబుననుం జేసి కృతార్థుల
మయితిమి మామా దేశంబులకుం బోయెద మని చెప్పి
వీడ్కొని చనిరప్పుడు ధర్మరాజువచనంబున భీష్మ ధృత
రాష్ట్రులభీమసేనుండు, యజ్ఞసేను నర్జునుండు, సపుత్త్రకు
లయిన కర్ణశల్యసుబలుల నకులుండు, కృప ద్రోణాశ్వ
త్థామల సహదేవుండును విరాటభగదత్తుల ధృష్టద్యుమ్నుం
డును, బార్వతేయు లైనరాజుల సౌభద్రద్రౌపదేయులును
ననిచిరంత. 75

క. సతతధనదానములఁ బూ
జితు లయి తృప్తు లయి గుణవిశిష్టమహీదే
వతవరులు ధర్మసుతు మా
నితగుణు దీవించి చనిరి నిజగృహములకున్. 76

వ. నారాయణుండును బాండునందనుల నందఱం గ్రమంబున
వీడ్కొని ద్వారవతికిం బోవుచుండి ధర్మరాజున
కిట్లనియె. 77

తే. సకలభూతసంఘంబు పర్జన్యుఁ బక్షి
సమితి బహుఫలవృక్షంబు నమరులింద్రు

ననిశమును నుపజీవించునట్లు బంధు
జనులు నిన్ను పజీవింప మనుము పేర్మి. 78

వ. మఱియు నప్రమత్తుండవయి నిఖిలప్రజారక్షణంబు సేయు
మనినఁ గృష్ణునకు ధర్మరా జిట్లనియె. 79

ఉ. నీకరుణం గరంబు రమణీయతరం బయి సర్వవిఘ్నదూ
రీకృత మై సమాప్తి నొనరెఁ ధరణీధర!
యిమ్మఖంబు భూ
లోకములోన నేను నృపలోక నమస్కృతిఁ
గీర్తిఁ బర్వితిన్
నాకులమున్ వెలింగె సుగుణంబుల కాస్పదమై
పవిత్రమై. 80

క. ద్వారవతి నుండియును నిట
యారసి యుండునది దాన వాంతక! లోకా
ధార! సమీపస్థుండవ
దూరంబున నుండియుం జతుర్భుజ! మాకున్. 81

వ. నిన్నుం బాసి నిమిషం బయిన నిర్వహింప నేర మని
ధర్మరా జెట్ట కేనియు గరుడగమను గమనంబున కొడం
బడియె నంత. 82

చ. అనిలజవాశ్వయుక్త మయి హాటకరత్నవిచిత్రతార్క్ష్య కే
తన మయి. మేఘనాద మయి దారుకసారథి యైనదివ్య కాం

చనరథ మెక్కి యాత్మఁణమ సాత్వతకుంజరుఁ డేఁగె
భక్తి నా
తని ననిచెన్ యుధిష్ఠిరుఁడు దమ్ములు దానును
బాదచారియై. 83

క. తగిలి విలోచనగోచర
మగునంతకు దృష్టి నిలిపి యట హృదయం బి
మ్ముగఁ జొనిపి యెట్టకేనియు
మగిడిరి హరి ననిచి దీనమతిఁ బాండుసుతుల్. 84

పాండవసభామహిమకు దుర్యోధనుండు లజ్జితుం డగుట

వ. అట దుర్యోధనుండు శకునియుం దానును సభావిభవంబుఁ
జూచువేడుకనందుఁ గొన్నిదినంబు లుండి యొక్కనాఁడు
దాని యపూర్వరమణీయతకు విస్మితుండగుచు నయ్యాయి
ప్రదేశంబులం గ్రుమ్మరువాఁడు వివృతంబైన ద్వార
దేశంబు సంవృతంబుగా వగచి చొరనొల్లక సంవృతం
బైనదాని వివృతంబుగా వగచి చొరం బోయి లలాట
ఘట్టితగృహద్వారుం డయి సమప్రదేశంబున్నతంబుగా
వగచి యెక్క సమకట్టి నీలాశ్మరశ్మిస్థగితం బైనవిమల
మణిస్థలంబు జలాశయంబుగా వగచి పరిధానం బెగఁద్రోచి
కొని స్ఫటికదీప్తిజాలపరివృతం బైనజలాశయంబు స్థలంబు
గా వగచి కట్టినపుట్టంబు దడియం జొచ్చి క్రమ్మఱిన
వానిం జూచి పాంచాలియుఁ బాండుకుమారులును
నగి రంత. 85

ఆ. దాని నెఱిఁగి ధర్మతనయుండు ధృతరాష్ట్ర
తనయునకు సమీర తనయుచేత
దివ్యవస్త్రములును దివ్యభూషణములు
నిచ్చి పుచ్చెఁ బ్రీతి యేర్పడంగ. 86

వ. దుర్యోధనుం డట్లు సభాప్రలంభంబునకు లజ్జితుం డయి పాండవుల వీడ్కొని గజపురంబున కరిగి ధర్మరాజు రాజసూయంబు దన కసూయాజననం బగుటయు సకలజనమనోనయనోత్సవంబయినతత్సభాలక్ష్మి దనమనోనయనంబుల కగ్నిజ్వాలయుంబోలె మహాదాహంబు సేయుటయు సంతప్తుండై నిదాఘదాహంబున నింకి తఱుఁగు నల్పజలాశయంబునుంబోలెఁ దద్దయుం దఱిఁగి. 87

క. కందు గలపసిఁడి గాఁచినఁ
గంది వివర్ణ మయినట్లు కౌరవుకాయం
బొందఁగ వివర్ణమయి కడు
వందె మనస్తాపహవ్యవహదాహమునన్. 88

క. అవనీ రాజ్యవ్యాపా
రవిహీనుం డయి సుహృద్విరంజనుఁడై కౌ
రవపాంసనుండు పాప
వ్యవసాయమునందు బుద్ధి వదలక నిలిపెన్. 89

వ. ఇట్లు సకలసుఖోపభోగవిముఖుం డయి యెవ్వరితోడం బలుక కున్నదుర్యోధనుం జూచి శకుని యిట్లనియె. 90

ఆ. ఇన్నిదినము లయ్యె నేఁటికి నాతోడ
నిభపురేశ! పలుక విట్టు లేల
నీముఖంబు దీర్ఘ నిశ్వాసధూమసం
హతులఁజేసి కలుష మయినయదియు. 91

క. నా కెఱిఁగింపుము దీసి న
నేకాగ్రతఁ బొంద నేల యే నుండఁగ న
వ్యాకులభవత్ప్రతాపని
రాకృతులు ధరిత్రిలోని రాజులు నీకున్. 92

వ. ఇంత సంతాపింప నేల యనిన నాశకునికి దుర్యోధనుం
డిట్లనియె. 93

దుర్యోధనుని దురాలోచనము

ఉ. నీవును జూచి తట్టిసభ నేని వినంబడ దేయుగంబులన్
భూవలయంబులో నది యపూర్వము సర్వమనోజ్ఞమిష్టభో
గావహ మేక్రియం బడసె నయ్య మహాత్ముఁడు
దాన నేమి సం
భావితభాగ్యుఁ డయ్యెను బ్రభాకర తేజుఁడు
ధర్మజుం డిలన్. 94

చ. కడుభయ మంది వానికిఁ దగన్ మఱి వైశ్యులపోలె
వశ్యులై
పుడమి నతిప్రసిద్ధులగు భూపతులెల్ల మహాధనావళుల్

దడయక తెచ్చియిచ్చి కర దానముసేయుటఁ బార్థివత్వమే
ర్పడిరెయెఁ బృథాగ్రపుత్త్రునకుఁ బాండవ తేజము పర్వెనెల్ల
చోన్. 95

ఉ. యాదవుచేతిచక్రము భయంకరమై శిశుపాలమస్తక
చ్ఛేదము సేసినం గడుఁ బ్రసిద్ధులు శూరులునైన రాజుల
య్యాదవుముందటన్ జయజయధ్వను లిచ్చిరిగాని వానిశౌ
ర్యోదయవృత్తి కెదురనోపర యెవ్వరు విక్రమింపఁగాన్.

చ. అతులపరాక్రమార్జితము లైన ధనంబుల పేర్మిఁ జేసి యు
న్నత మగు చున్న పాండునరనాథతనూజుల లక్ష్మి నాకస
మ్మతమయి సూ వెలింగె విను మాతుల! మానధనాఢ్యుఁ
డైనభూ
పతి సహియింప నోపునె సపత్నుల వృద్ధియు నాత్మహాని
యున్. 97

వ. ఏమిసేయుదము పాండవుల లక్ష్మి యెవ్విధంబున మన
కపహరించికొాన నగు ననిన దుర్యోధనునకు శకుని
యి ట్లనియె. 98

క. దీనికి ధృతరాష్ట్రినను
జ్ఞానము వడయుదును మనకు సమకూరు ధరి
త్రీ నాథ ! భవదభిప్రా
యానుగుణైశ్వర్య మతిశయంబుగఁ బ్రీతిన్. 99

వ. అని యప్పుడ శకుని దుర్యోధనుం దోడ్కొని ధృత
రాష్ట్రునొద్దకుం జని యాతని శరీర కార్శ్యవైవర్ణ్యంబులు
సెప్పిన విని యుదరిపడి ధృతరాష్ట్రుండు కొడుకు నొడ
లంటి చూచి కడు దుఃఖితుండయి యిట్లనియె. 100

సీ. కౌరవైశ్వర్యంబు గౌరవంబున సమ
ర్పిత మయ్యె నీయంద పేర్మితోడ
ననుజులు మిత్రులు ననుచరులును నీకుఁ
బ్రీతుల కాని యప్రియులు లేరు
వివిధోపభోగముల్ దివిజేశునకుఁ గల
యట్టుల కలవు నీ కనుభవింప
సకలభూపతులుఁ బాయక భక్తియుక్తులై
యొలసి నీపనుపు సేయుదురు పేర్మి

ఆ. నేమిగొఱఁత యయ్యె నిట్లు డయ్యను దను
చ్ఛాయ దఱఁగియుండ సకలధరణి
రాజ్యభోగ సుఖపరాఙ్ముఖత్వముఁ బొంద
నేల ? నీకుఁ గురుకులేశ్వరుండ ! 101

వ. అనిన విని ధృతరాష్ట్రునకు దుర్యోధనుం డిట్లనియె. 102

క. పాండవులవిభవ మది యా
ఖండలు విభవంబుకంటెఁ గడు మిక్కిలి యై
యొండొండ పెరిఁగి దిక్కులు
నిండెఁ దదీయప్రతాప నిర్మలరుచితోన్. 103

క. సామాన్యమె యుత్తరకురు
భూములు మొదలగ సమస్త భూములు విజయ
శ్రీమహిమను సాధించె ద్రి
ధామపరాక్రముఁడు శక్రతనయుఁడు బలిమిన్. 104

తే. సఖ్యసంబంధములఁ జేసి చక్రధరుఁడు
ద్రుపదుఁడునుఁ దక్కఁ దక్కిన నృపతులెల్ల
నరియు బెట్టనివారు లేరఖిలజలధి
వలయితక్షోణిలోఁ బాండవులకుఁ బ్రీతి. 105

తే. శైలకాననద్వీప విశాలమయిన
వసుమతీచక్రమంతయు వారివశమ
యేను నొక రాజసుతుఁడనై యెట్లు దీనిఁ
జూడనోపుదుఁ బ్రాభవశూన్యునట్లు. 106

తే. నన్ను రత్నపరిగ్రహణంబునందుఁ
బాండవుండు నియోగించెఁ బార్థివేంద్ర!
సర్వరత్నాకరైక ప్రశస్తరత్న
పుంజముల కాస్పదము ధర్మపుత్త్రిగృహము. 107

తే యజ్ఞదీక్షితుఁ డయిన ధర్మాత్మజునకు
గౌడకాంభోజపతు లనేకప్రకార
వర్ణకంబళములు శుకవర్ణ వాహ
నివహములుఁ దెచ్చి యిచ్చిరి నెమ్మితోడ. 108

ఉ. సాగరసారవారిరుహ శౌక్తికమౌక్తికవిద్రుమద్రుమై
లాగురుచందనంబులు ప్రియంబున నిచ్చిరి తెచ్చి యున్నత

శ్రీగుణయుక్తిమై(బరగు సింహాళ కేరళ చోళ పాండ్యదే
శాగతరాజపుత్త్రిలు మహాగుణశాలి కజాతవైరికిన్. 109

ఉ. మందితసూర్యరశ్మిరుచిమన్మణిహారచయంబుతో( గట
స్యందిసుగంధిదానజల సంపద నొప్పెడువాని దేవకీ
నందను( డిచ్చె( బ్రీతి బదునాలుగువేలు గజంబులన్ జనా
నందనకీర్తియైన యమనాథతనూజున కిష్టమిత్రు(డై. 110

క. హరియును గిరీటియును నొం
డొరుల కభీష్టములు సలుపుచుండుదు రం ద
ఱ్ఱ్యరువురు నేకాత్ములు జన
శరణ్యు లుత్తములు నిత్యసాంగత్యమునన్. 111

వ. మఱియు నయ్యధిష్ఠిరున కనురక్తుండయి విరాటుండు రెండువేలు గజంబుల నిచ్చె ద్రుపదుండు వేయిగజంబులను బదివేలు హయంబులను బదునాలుగువేలు విలాసినీజనంబులం బదివేలు దాసీగృహస్థులనిచ్చె( గురు కుకు రోలూక కేకయ కాశ్మీర కాంభోజ గాంధార మద్ర ద్రవిడ మగధ మాళవ కళిం గాంగ వంగ బంగాళ గౌ డాంధ్ర కేరళ కోస లాదిమహీపతులునుం బ్రాగ్జ్యోతిషంబున భగదత్తుండును మరుకచ్ఛనివాసులును జేదిపతులును నాజానేయబాహ్లికహూణపారసీయ దేశంబులం గలహయంబులం బర్వతనిభంబులైన యిభంబులను దివ్యాంబరాభరణభూషితంబు లయిన యోషిత్సహస్రంబులను నపరిమితంబు లయిన యజావి గో మహిషంబులను,హిరణ్య రత్న రజత

కంబ ళాంబరాదుల నిచ్చిరి. మఱియు మేరుమందరమధ్య
కీచగవనవాసు లయిన గుళింద పారద బర్బర తురుష్క
కొంకణ కోంకణాధిపతులును వశగతులై హిమశైల రామ
శైల కురుదేశంబులైన కౌసుమక్షౌద్రపాత్రంబులను దివ్యౌ
షధంబులను నింద్రనీలేంద్రగోపపిక చంద్రమయూరకీరవర్ణ
తురంగంబులను సౌవర్ణకీటజపట్టజాండజశయ్యలను నిశిత
దీర్ఘనిస్త్రింశంబులను మణికాంచనరచితగజదంతమయశిబి
కాసనంబులను నిచ్చిరి. వాసవసఖుం డయిన గంధర్వ
పతి చిత్రరథుం డనువాఁడు నన్నూఱు గంధర్వహయంబుల
నిచ్చెఁ దుంబురు డనుగంధర్వుండు నూఱుహయంబుల
నిచ్చె. 112

ఉ. భావిపురాతనాద్యతన పార్థివలక్ష్ములు పాండవేయు ల
క్ష్మీవిభవంబుతోడ నుపమింప సమంబులు గా వశేషరా
జావళిలోన నత్యధికులైన సపత్నులపేర్మిఁ జూచి యేఁ
జూవె సహింపనోపక కృశుండ వివర్ణుఁడనైతి నెంతయున్.

ఆ. ఒక్కలక్షభూసురోత్తముల్ గుడిచిన
మొనసి తనకుఁ దాన మ్రోయు శంఖ
మొక్కనిమిషమేని యుడుగక మ్రోసె న
య్యధ్వరోత్సవంబు నన్నినాళ్ళు. 114

సీ. జన్నంబుచూడంగ సకలభూములనుండి
వచ్చిన రాజన్యవరుల నవని

సురులను వైశ్యుల శూద్రుల నాత్మీయ
బంధు సుహృ ద్వీరభట నియోగ
జనులను బేదల సాధుల నిత్యంబుఁ
దాన పరీక్షించి తగ వెలింగి
యన్నంబు దయఁబెట్టి యందఱుఁ గుడిచినఁ,
దనుమధ్య యర్ధరాత్రంబు నపుడు

ఆ. గాని కుడువదట్టె కమలాక్షి ద్రౌపది
యదియుఁ గాక యమ్మహాధ్వరమున
నధముఁడయ్యెఁ గడుఁబ్రియంబున నభ్యర్చి
తుండ కాని వంచితుండు లేఁడు. 115

క. ధరణి హరిశ్చంద్రుఁడు భా
సురయశుఁ డయి చేసె రాజసూయం బదియున్
సరిగా దనియే వగతును
సురుచిర విభవమునఁ బాండుసుతుయజ్ఞముతోన్. 116

వ. అట్టి రాజసూయాధ్వరంబున నవభృథసమయంబునందు బ్రహ్మర్షి రాజర్షి లోకపాల పరివృతుండయిన మహేంద్రుండునుంబోలెనున్న ధర్మతనయు నారదపారాశర్యాది మహామునిసమేతుం డయి ధౌమ్యుం డశేషతీర్థజలంబుల నభిషిక్తుం జేసిన. 117

సీ. అభిషిక్తుఁ డయినయయ్యమరాజసుతునకు
సాత్యకి మహా కీర్తి చ్ఛత్రి మెఱపఁ

బట్టె భీముండును బార్థుండు మణిహేమ
దండచామరయుగధారు లయిరి
కమలనాభుండును గవలును ద్రుపదేశ
పుత్త్రిండు వేర్వేఱ భూమిపతుల
మూర్ధాభిషిక్తుల ద్రొక్కించుచుండిరి
దర్పంబు వెలయంగ దానిఁ జూచి

ఆ. యేను మొదలుగా మహీపతులెల్లను
దీప్తి దఱిఁగియుండఁ దివిరి మమ్మ
నగిరి కృష్ణపాండునందనద్రౌపదీ
సాత్యకులుఁ గరంబు సంతసమున. 118

వ. మఱియు నయ్యుధిష్ఠిరుండు. 119

సీ. అనఘుఁడై యెనుబదియెనిమిదివేవురు
బ్రాహ్మణప్రవరుల బ్రహ్మప్రవరుల బ్రహ్మవిదుల
వెలయంగ నల్లిండ్ల నిలిపి ప్రత్యేకంబ
ముప్పండ్రు దాసుల నొప్ప నిచ్చి
ముదముతో రక్షించు బదివేవు రుత్తమ
భూసురు లతనియ గ్రాసనమునఁ
గలధౌతమయపాత్రములఁ బ్రతిదినమును
గుడుపను గట్టను దొడువఁబూయ

ఆ. ననుభవింపఁ గలుగుటది యేమి పురుషార్థ
మయ్యు కష్టపురుషు నట్టు లొరుల

పేర్మిఁ జూచుచుండఁ బెద్దయు నే నోప
ననినఁ బతికి నిట్టులనియె శకుని. 120

క. భానుప్రభు లగుపాండుమ
హీనాథాత్మజులలక్ష్మి యెల్లను నీకున్
నే నపహరించి యిత్తు ధ
రానుత మాయాదురోదరవ్యాజమునన్. 121

వ. ధర్మతనయుండు జూదంబునకుఁ బ్రియుండుగాని యందుల యుక్తిఁ బెఱుంగండే నక్షవిద్యయం దతిదక్షుండ నాతని నశ్రమంబున నోడించి తదీయరాజ్యవిభూతి నీ కిచ్చెద వగవకుండు మని పలికిన శకునిపలుకులకు సంతసిలి దుర్యోధనుండు దండ్రిపాదంబులపయిం బడి మ్రొక్కి యాశకుని మతంబున నొడంబడవలయు ననినఁ గొడుకునకు ధృతరాష్ట్రం డిట్లనియె 122

క. ధీరమతి విదురుతోడ వి
చారింతము వాఁడు నయవిశారదుఁడు కళా
పారగుఁడు దీర్ఘదర్శి య
పారహితారంభుఁ డుభయ పక్షంబులకున్. 123

వ సురపతిగురుం డైనబృహస్పతి సేసిననీతిశాస్త్రరహస్యంబులం దెవ్వరికంటె విదురుం డెంతయు విశారదుం డాతని బుద్ధిబలంబునను, నాపగేయుబాహుబలంబు ననుం జేసి యీరాజ్యతంత్రంబు వర్తిల్లుచున్నయది గావున నవ్వి

దురానుమతంబున నెగడుట లగ్గగు ననిన దుర్యోధనుం డిట్లనియె. 124

తే. పాండుపుత్త్రుల కెప్పుడు బక్షపాతి
విదురుఁ డని చెప్పఁ దొల్లియు విందు దీని
నెఱిఁగి వారించుఁ గాకతఁ డేల శకుని
కైతవంబున గొడఁబడుఁ గౌరవేంద్ర! 125

తే. దీని గొడఁబడు మొడఁబడ వేని నేఁడ
యాత్మఁ ణమ సర్వభక్షుచే భక్షితుండ
నగుదుఁ దెల్ల మేనన్లైన వగపు దక్కి
విదురుఁడును నీవునుండుఁడు ముదముతోడ. 126

క. అని కడు నడలుగఁ బలికిన
విని ధృతరాష్ట్రుండు దుఃఖ వివశాత్ముకుఁ డ
య్యును నెద నది యుచితముగా
దని వగచుచు నాత్మజునకు నాహ్లాదముగాన్. 127

వ. అప్పుడు వేవురుశిల్పాచార్యుల రావించి కనకరత్నఖచిత స్తంభసహస్రంబులను విచిత్ర ద్వారశతంబులను వివిధరత్న రుచిర ప్రదేశంబులనుం జేసి రమ్యంబుగా నొక్క సభ నిర్మింపం బనిచె. 128

---

# తిక్కన సోమయాజి— ఆంధ్రమహాభారతము

## విరాటపర్వము

## ఉత్తరుని పరాక్రమము

కౌరవులు విరటుని గోగణమును బట్టఁగా, రాజూర లేనందున నాతని కుమారుఁడు ఉత్తరుఁడు గోవులను విడిపింపఁ బూనుకొనును. కాని ఉత్తరుఁడు బాలుఁడు, భీరువు. అంతఃపుర స్త్రీలతోఁ బ్రగల్భము లాడిన రాజకుమారుఁడు కౌరవ సేనఁజూచి భయభ్రాంతుఁడై యుద్ధము సేయనొల్లక రథముడిగ్గి పురమునకుఁ బరుగెత్తిపోవ సంసిద్ధుడగును. సారథ్యమున కంగీకరించిన బృహన్నల అతని వారించి, అతని బదులు తాన యుద్ధమునకు సన్నద్ధుఁడగును. ఇది యిందలి గాథ.

క. సూర్యోదయావసరమున
దుర్యోధనుబలము ప్రబలదోర్బలలీలా
ధుర్యగతి నడచె భీష్మా
చార్యరవిసుతాదియోధ సంఘోద్భటమై. 1

వ. ఇట్లు నడచి మత్స్యనగరంబున కనతిదూరంబున విరాటు పశుగణంబులం బొదివె నట్టియెడ ముక్కడిమూఁకలు సని యెక్కడెక్కడ యని తలపడినం గృపాశ్వత్థామ శకుని దుశ్శాసన కర్ణ వికర్ణ దుర్ముఖప్రముఖ రథికజనం బులు గోపాలవర్గంబు ననర్గళప్రసారం బగు శరాసారంబు నం గప్పినం గని కౌరవబలం బగుట యెఱింగి బెగ్గలించి

గవాధ్యక్షుండు రథంబు దోలికొని యాక్రోశించుచుం బురంబున కరుగుదెంచి రాజమందిరద్వారంబుఁ జొచ్చి రథావతరణంబు సేసి యంతఃపురంబున నున్న భూమిం జయుం గాంచి ససంభ్రమంబుగా ని ట్లనియె : 2

*మ. ధరణీచక్రము సంచలింపఁగ సముద్దాంతంబు లై గ్రక్కునం
గురుసైన్యంబులు వచ్చి ముట్టికొనియెఁ గోవర్గమున్ వేగమై
మరలం దెచ్చుటకుం గడంగుము రిపుక్ష్మాపాలలోకంబు నీ
శరజాలంబులపాలు సేయుము భుజోత్సాహంబు శోభిల్లఁగన్. 3

ఆ. తేరుఁ బూన్పఁ బంపు తెప్పింపు దృఢతను
త్రాణ ముగ్రచాపబాణపూర్ణ
తూణఘనగదాసితోమరచక్రాదు
లనువుగా నొనర్పు మతిరయమున. 4

చ. విరటుఁడు నిన్ను నెప్డుఁ బదివేవురముందటఁ జెప్పు బాహువి
స్ఫురితుఁడు శౌర్యశాలి కులభూతివిశేషవిధాయకుండు భూ
భరణవిశారదుండు జనభవ్యతపఃఫలసంభవుండు గా
తరపరిరక్షకుం డనుచు దానికి నీఁడుగఁ జేయు మిత్తఱిన్. 5

క. అని కాంతాజనములలోఁ
దను నగించుటయుఁ బొంగి దర్పోద్ధతి ని

ట్లను నుత్తరుండు దన మన
మున సంగరకౌతుకంబు ముడివడు చుండన్. 6

ఉ. ఎత్తునఁగొందుఁ గౌరవుల నెల్లను మార్కొని రేని
గోవులం
దెత్తు ముహూర్తమాత్రమునఁ దేరికి సారథి లేమిఁ జేసి నా
చిత్తమునన్ విచారదశ నెందెదు నెవ్వఁడు గల్గునొక్కొ నా
కిత్తఱి నేఁ గదా కడప నెంతయు నేర్తు రథం బనం
బురిన్. 7

క. తగుసారథి దొరకొనినం
బగతుర భంజించు టెంతపని కదుపుల ద
వ్వఁగఁ గొని పోదురొకో యి
ట్లగునె కలం డేని సూతు నరయుం డెందున్. 8

చ. కురుపతిభీష్మకర్ణకృపకుంభజముఖ్యులు మత్సముద్యమ
స్ఫురణము సూచి పార్థుఁ డనుబుద్ధిఁ గలంగఁగ బెట్టు
గిట్టి సం
గరమున నోర్చి యేఁ బసులఁ గ్రమ్మఱఁ దేరకయున్న
నన్ను భూ
వరుఁడు సుహృజ్జనంబుఁ బరివారముఁ జిత్తములందు
మెత్తురే! 9

వ. అనునప్పుడు తత్ప్రదేశంబున నునికిం జేసి. 10

క. విని ద్రుపదధరణిపతినం
దన సామర్థ్యాపహాసతరళహృదయ యై

చని తద్వృత్తాంతము మె
త్తనిపలుకులఁ జెప్పె నింద్రతనయునితోడన్. 11

వ. అతండు నజ్ఞాతవాసవత్సరం బతీతం బగుట నిరూపించి పాంచాలి కిట్లనియె నీవు వోయి వారలతో నిట్లనుము మనబృహన్నలకు సారథ్యంబుసేయు సామర్థ్యంబు గలదు. తొల్లిఖాండవదహనంబునం బాండవమధ్యమునకు సారథియై యతనిచిత్తంబు వడసె.మఱియుఁ బెక్కొడలం దదీయంబగు రథంబు గడపఁ దానయైయుండు నేను నెఱుంగుదుం ద త్సాహాయ్యంబునం గురుసైన్యంబుల జయింపవచ్చుటకు సంశయంబు వలవ దనుము. వా రేమనిరేని మఱియుం దగ నాడి నన్నుం బిలిపించునట్టి తెఱంగు గావింపుమన నట్ల చేయుదునని సైరంధ్రి యుత్తరయున్నయెడకుం బోయి. 12

చ. జనపతినందనుండు దగుసారథి నారయుచున్న వాఁ డెఱిం గినపని సెప్పఁగా వలయుఁ గ్రీడి మనంబున మెచ్చునట్టి నే ర్పును భుజశక్తియుం గలిగి రూఢికి నెక్కిన సూతవృత్తిమై నని సడిసన్న యేడ్తెఱ బృహన్నలకుం గల దంబుజాననా.

తే. అర్జునునకు ఖాండవదహనాదు లైన
విక్రమము లాబృహన్నల వెరవులావు
గాదె జయ మొనరించె లోకంబు లెఱుఁగ
నువిద దీని నెఱింగింత ముత్తరునకు. 41

క. అని యమ్ముదితయుఁ దానును
జని యతనికి నత్తెఱంగు సముచితముగఁ జె
ప్పిన నక్కుమారవరుఁ డి
ట్లనియెం బాంచాలితోడ నల్లన నగుచున్. 15

తే. అకట సైరంధ్రి నన్ను నిట్లాలిగొనఁగ
నేల చక్కఁగఁ గనువిచ్చి యేను బేడిఁ
జూడ రోయుదు రణమున సూతకృత్య
భరము దాల్చుట కెమ్మెయిఁ బనుచువాఁడ? 16

వ. అదియునుం గాక. 17

*చ. కురుబల మేఁగుదెంచె నటె గోవుల బిట్టుఱఁ
బట్ట దానిపైఁ
బరి గొని శౌర్యసంపదయు బాహుబలంబును
జూపఁ బూని యే
నరిగెద నట్టె తేరికి బృహన్నల సారథియైన దీని న
వ్వరె పురిలోన నింత కిఱవా రథచోదకు లింత
యేటికిన్. 18

వ. అనిన విని సైరంధ్రి యతని కిట్లనియె. 19

ఉ. కౌరవసేన గాదు త్రిజగంబులు నొక్కట నెత్తివచ్చినం
దేఱు బృహన్నలావశగతిం జరియించిన గెల్వవచ్చుఁ ద
ద్వీరగుణంబుసొంపు పృథివీవరనందన మున్నెఱుంగుదుం
గారణజన్మ మై తనువికారము వచ్చినఁ బెంపు దప్పునే. 20

వ. అనవుడు. 21

క. మన మురియాడుచు నుండఁగఁ
దన కొఱ లప్పటికి లేమి ధరణీశ్వరనం
దనుఁడు బృహన్నలఁ బిలువం
బనుచుట కొడఁబడినపలుకు వలుకుటయుఁ దగన్. 22

వ. సైరంధ్రి దెసఁ గనుంగొని యేను బోయి తోడ్కొని
వచ్చెదనని పూని. 23

సీ. అడుగులనునుఁగాంతి నయ్యెడ పద్మరా
గంబులనెలకట్టుకరణి నొప్పఁ
బాలిండ్లు దను వెడ వ్రాలింపఁ జెన్నొందు
నసదుఁగౌదీఁగె యల్లాడు చుండఁ
దఱి వేచి వెనువెంటఁ దగులు కామాంధకా
రములీలఁ గ్రొవ్వెదగొమరు మిగులఁ
గర్ణభూషణమౌక్తికప్రభాడోలన
మీక్షణదీప్తుల నినుమడింప

తే. నందియల మొరపంబున కరుగుదెంచి
ప్రోదిరాయంచ రయమునఁ బోవు నవ్వి
ధంబు దగ నభ్యసించుచందమునఁ దోన
చనఁగ నుత్తర నర్తనశాల కరిగె. 24

ఆ. మెఱుఁగు మొగిలు సొచ్చు తెఱఁగున నాట్యమం
దిరము సొచ్చి తనదు గురువుకడకు

నరిగి నెమ్మి నిట్టు లను నింతి ప్రార్థనా
వినయసంభ్రమములు పెనఁగొనంగ. 25

క. ఇచ్చట నొకకయ్యంబునఁ
జచ్చె మదీయాగ్రజన్మసారథి తగువాఁ
డెచ్చోట లేమి నాతం
డచ్చుపఱుపఁ డయ్యె నీక్రియకు నొం డొకనిన్. 26

వ. అది యట్లుండె నేఁడు కౌరవులు పసులం బట్టి రని కూయి వచ్చిన నన్ను సన్నద్ధుండై వెనుకం దగుల సమకట్టి సారథ్యంబు సేయువాఁడు లేమికి విషాదంబు నొందిన నీకందువ సైరంధ్రి సెప్పినం బ్రియం బంది నిన్నుఁ దోడ్తెర నన్నుఁ బనిచిన నేనును నీపాల నాకుఁ జనవు గలుగుటం జేసి యెల్ల విధంబులం దెత్తునని పూని వచ్చితి నీవును నాపలుకులు గుఱుచసేయక నీ పెంపునుం బ్రకటంబుగా నయ్యుత్తర కుమారునకు రథంబు గడప నియ్యకొని యియ్యాపదఁ దలుగవలయు నిట్లొడంబడక తక్కుట నావలని వాత్సల్యంబు గొఱంత పఱచుట యనిన నమ్ముద్దియ పలుకులు ముద్దుసేసి. 27

క. నగుచు బృహన్నల యిట్లను
జగతీశ్వరపుత్రి నాకు సారథ్యము నే
ర్పు గలదె నీమాటకు నే
మిగులంగా వెఱతుఁ బొదము మీఁ ద ట్లుండెన్. 28

క. భవదీయప్రార్థనచేఁ
దివిరి పరమదుష్కరములు దీర్చి యయిన ను
త్సవ మొనరించెద సార
థ్యవిధం బొకఁ డనఁగ నేల యంబుజవదనా. 29

వ. అనుచు సంగీత నిలయంబు వెలువడి సలీలంబుగా మెత్త
మెత్తన నడ తెంచు మత్తశుండాలంబునుంబోలె. 30

ఆ. అరుగుదెంచు బృహన్నల నంత నంతఁ
గని నృపాలసుతుం డను గారవమునఁ
గారవులతోడఁ గయ్యంబు గలిగె నాకుఁ
గడఁగి నేఁడు రథ మ్మిామ్మవు గడపవలయు. 31

క. వే రమ్ము మైమఱువుఁ దొడి
తే రెక్కుము దప్పఁ గ్రుంకఁ దీఱదు నీకున్
సైరంధ్రి సెప్పె నీదగు
బీరమ్మును బెంపు లావు వెరవును మాకున్. 32

చ. అనుటయు నాటపాట గలయప్పటికిఁ నను్ఁగోరి పిల్వఁ బం
చినఁ దగుఁ గాక సంగరముసేఁతకు సారథి గమ్ము రమ్ము నీ
వను టుచితంబె యెల్లెడల నారసి బాహుబలాఢ్యుఁడైన యొ
క్కనిరథ మేత్తెఱం గడపఁగా నియమింపుము రాజనందనా

వ. అనిన విని వైరాటి గిరీటి కి ట్లనియె : 34

ఉ. ఖాండవ మేర్చునప్పుడు దగన్ రథచోదకవృత్తి సల్పి యా
ఖండలసూతికిన్ జయము గల్ల నొనర్చినయట్టి బుద్ధియున్

దండితనంబు నీయెడన తక్కెనె నాదెస మైత్రి పెన్పు మిం
కొండొకమాట దక్కుము రణోత్సహనం బొనరింపు
గ్రక్కునన్. 35

తే. అనిన నాతనిమాటకు నడ్డమాడ
వెఱచినట్టి తెఱంగు భావించి యల్ల
నియ్యకొనుటయు నమ్మనుజేంద్రసుతుఁడు
దృఢతను త్రాణ మతనికిఁ దేరఁ బనిచె. 36

క. తెప్పించి తొడుగు మీ వని
యొప్పించిన నిట్టు నట్టు నొఱవలుగా మైఁ
గప్పికొని యాబృహన్నల
యప్పుడు నగుపించె నచటి యబలాజనమున్. 37

క. ఉత్తరుఁడు సత్వరంబుగఁ
దత్తనువున మఱువు దొడిగి తానును హృద్యో
దాత్తం బగుకంకట మిడి
చిత్తము పసిఁ గ్రమ్మఱింపఁ జిడిముడిపడఁగన్. 38

వ. బృహన్నల నవలోకించి. 39

క. హయములఁ బూన్పుము రథమున
రయమున సిడ మెత్తు మిపుడ రావలయును గో
చయము గొని యస్మదీయ వి
జయ మభినందింపఁ బురముజను లెదురుకొనన్. 40

తే. అనిన నీ వేమి పనిచిన నట్ల చేయ
వలయు నీ వున్న యెడ నుండవలయు నీవు
సన్న దెసఁ జనవలయు నాశక్తి మెఱఁగి
పంచి పనిగొని కడిమిమైఁ బగఱ గెలుము. 41

వ. అని పలుకుచు మనంబున ముదం బొదవ నా ధనంజయుండు.

క. కాంచనమాలాలంకృత
చంచత్తనులీల మెఱయ జవనాశ్వములం
బూంచి రథంబున మణిమయ
పంచానన కేతు వెత్తె బంధురభంగిన్. 43

వ. ఇట్లు సన్నాహంబు మెఱసినసారథిం జూచి యుత్తరయుం
జెలులు నిట్లనిరి. 44

*క. కురువీరుల గెలిచి తదం
బరములలోఁ జిత్రవర్ణభాసురములు గాఁ
దర మెఱఁగి లోచనోత్సవ
కరములుగా బొమ్మపొత్తికలకుం దెండీ. 45

క. అనుడు బృహన్నల యిట్లను
జనపాలకనందనుండు జయలక్ష్మిం జే
కొను నపె చీరలు దెచ్చుట
పనియే యటు సూడుఁ డెల్లభంగులఁ దెత్తున్. 46

వ. అనుచు ధనుస్తూణీరకృపాణముద్గరాది వివిధసాధనంబులు
రథంబుపైఁ బదిలంబుగా నిడి నొగలెక్కి పగ్గంబులఁ ద్రుక్కు

సక్కంజేయ సుత్తరుండును బసులంబట్టినదెస గోపాలకు నడిగిన వాఁడు పితృవణంబువలనని చెప్పిన వినుచు రథారోహణంబుసేసి వెడలి పౌరవృద్ధపుణ్యాంగనాభూసుర సమూహంబులు బృహన్నలంజూచి తొల్లి ఖాండవదహనంబున నర్జునునకు నీకతంబున నయిన మాంగల్యంబెట్టిదట్టిద భవత్సాహాయ్యంబున భూమింజయున కయ్యెడుమని దీవించి సేసలు సల్లం బురంబు నిర్గమించి నిరర్గళపరాక్రముండయిన యాఫల్గును నైపుణ్యంబున వల్గదశ్వంబగు రథంబు రయంబునకు మెచ్చుచుం బరేతనిలయప్రాంత ప్రదేశంబు సేరంజని. 47

*సీ. అభినవజలధరశ్యామంబు లగునెడ
లాకుజొంపంబుల ననుకరింప
సాంధ్యరాగోపమచ్ఛాయంబు లగుపట్లు
కిసలయోత్కరములఁ గ్రేణి సేయ
రాజమరాళగౌరము లగుచోటులు
దళుచుఁబూఁబొదలఁ చందంబు నొంద
హారిద్రరుచిసమానాకృతు లగుతావు
లడరెడుపుప్పొడులట్లు మెఱయఁ

తే. గలయ నెగసి ధరాధూళి లలితవనము
దివికి నరిఁగాఁపు వోయెడు తెఱఁగు దాల్ప
గోగణము ముంగలిగ నేల గోడివడఁగ
నడుచు కౌరవరాజసైన్యంబుఁ గనియె. 48

క. కని యుత్తరుండు గరుపా
టిన మేనును దలఁకుమనము జెచ్చవడినచూ
పును నై తొట్రుపడుచు ని
ట్లనియె దిగులు సొచ్చి యా బృహన్నలతోడన్. 49

*శా. భీష్మద్రోణకృపాదిధన్వినికరాభీలంబు దుర్యోధన
గ్రీష్మాదిత్యపటుప్రతాపవిసరాకీర్ణంబు శస్త్రాస్త్రజా
లోష్మస్ఫారచతుర్విధోజ్జ్వలబలాత్యుగ్రం బుదగ్రధ్వజా
ర్చిష్మత్త్వాకలితంబు సైన్య మిది దేఁ జేరంగ శక్తుండనే! 

క. అకృతాస్త్రుఁడ బాలుఁడఁ గా
ర్ముకవిద్యాప్రౌఢిమై నియోధు లయినయా
శకునిజయద్రథదుర్ముఖ
వికర్ణకర్ణాదియోధవీరుల కెదురే? 51

క. ఇట్టగు లెఱుఁగక వచ్చితి
మెట్టొకో మనభంగి వీర లిందఱును గడున్
బెట్టిదులు మనకు మార్కొను
నట్టిదొలఁది గాదు భీతి యడరెడుఁ దోడ్తోన్. 52

ఉ. కౌరవసేనఁ జూచి వడఁకం బొడఁగెన్ మదిలోన మేను నీ
వూరక పోవు చున్కి యిది యొప్పునె యిప్పటిభంగిఁ జూచిన
న్వీరల నేను మార్కొనమి నిశ్చయ మట్లగుటన్ రయంబునం
దేరు మరల్పు ప్రాణములు దీపన మున్ వినవే బృహన్నలా,

వ. అనిన దరహాసితవదనుం డగుచు శతమఖతనయుం డతని
కి ట్లనియె :

చ. అసదృశలీలఁ బోల్చురథికావలిమీఁద జనంగ వెట్టినే
మసలక యామిషంబు గొని మార్గము వట్టిన తుచ్ఛసైన్య
మున్
వెసఁ జని ముట్టి గోధనము వేగ మరల్తము గాక
యిమ్మెయిం
బసు లటు వోవఁగా మరలఁ బాడియె నీకు నరేంద్ర
నందనా ? 55

ఉ. అంతిపురంబులోనఁ గలయంగన లెల్లను నెమ్మనంబులన్
సంతస మందఁగాఁ బసులఁ జయ్యనఁ దెచ్చెద నంచుఁ
బూని నీ
వెంతయు మేటివై యరద మెక్కి రయంబున వచ్చి
యిచ్చటన్
దంతితురంగసద్భటకదంబముఁ జూచి కలంగు టొప్పునే ?

ఆ. అనినపలుకులకు బృహన్నలఁ గనుఁగొని
యెలుఁగు వడఁక నాతఁ డిట్టు లనియెఁ
బసుల దయ్య మెఱుఁగుఁ బడఁతులసంతోష
మేల నాకు ననికిఁ జాల నేను. 57

వ. అనవుడు. 58

చ. తనభుజశక్తియుర్వి రిపులదర్పము నేర్పడఁ జూచిచూచి యె
ట్లును దెగ కున్నఁ బోక యిది లోకముచక్కటి శూరులైన దీ
నిని మది మెచ్చ రేబలము నీదెసఁ దేఱియుఁ జూడ దింతకున్
మును భయహేతువైనవిధముం దగఁ జెప్పుము నాకు నిత్తఱిన్. 59

*సీ. దెసలు బీఁటలు వాఱఁ దివురు చిందంబుల
కోలాహలములకుఁ గుదియఁబడక
యురవడి సేనలు దెరలఁ బైఁ దోఁతెంచు
ధూళి పెల్లడరినఁ దూలపోక
చతురంగబల మతిసాంద్రతఁ గవిసిన
యగ్గలికమునకు బెగ్గడిలక
శస్త్రాస్త్రములు రథ్యసారథివర్మాంగ
తతి నాఁటుతఱచునఁ దల్లడిలక

తే. బహువిధంబులఁ బగతుర బరవసమున
నిత్తెఱంగునఁ గలుగు క్రందెల్ల నోర్చి
నిల్చి గెల్చిన సత్కీర్తి నెగడుఁ గాక
దవ్వుదవ్వుల నిల్చిన నవ్వ రెట్లు. 60

చ. అను దివిజేంద్రనందనున కమ్మనుజేంద్ర తనూజుఁ డిట్లనున్
వినుము త్రిగర్తవాహినులు విక్రమసంపద సొంపుమీఱ గో

ధనములఁ బట్టినం బతి యుదగ్రత సైన్యములెన్ని
యన్నియుం
గొని యట వోయెఁ గాన మనకుం బురి బాసట లేర
యెవ్వరున్.

తే. ఒంటిఁ దలపడి కురుసేన నోర్చువాఁడ
నే యి దేటికి వెడమాట లిట్టు లాడ
వారు గానక ముందఱ తేరు దోలు
కొని రయంబునఁ బురి కరుగుటయ నీతి. 62

వ. అనినం బార్థుండు పార్థివనందనున కిట్లనియె. 63

క. వెగ డొంది యిట్లు వలుకఁగ
నగునే పగతురు ప్రమోద మందఁగఁ బసులన్
దిగ విడిచి పురజనంబులు
దెగడంగా మగిడిపోక దీనత గాదే? 64

వ. అట్లుం గాక. 65

మ. నను సైరంధ్రి గడంగి పేర్కొనియె
దానం బెంపుమైఁ బిల్చి తో
డని తోడ్తెచ్చితి నీవు బంటుతన మట్లగ్గించి పౌరాలి దీ
వన లిచ్చెం దుదిఁ బోయి కౌరవులు గోవర్గంబుఁ
గొంపోవఁగాఁ
గని యేఁ గ్రమ్మఱి రిత్త వోదునె భయోత్కంపంబు నీ
కేటికిన్? 66

తే. చిత్తవృత్తి యొకించుక చిక్కఁబట్టి
మిపుడ కౌరవసైనికు లెల్లఁజూచి
వెఱఁగువడ వేగమును లావు వెఱవు మెఱయఁ
గదుపుఁ బెట్టించి పోదము గ్రమ్మఱంగ. 67

వ. అనుచు విన్వాచ్చుండు గడంగి తేరు వోవనిచ్చుటయుఁ నాన
నంబు పల్లటిల్ల మానసంబు దల్లడిల్ల నాభూవల్లభ కుమా
రుండు. 68

క. దవ్వుల విఱిగినఁ బౌరులు
నవ్వుదురకొ మేలుమేలు నను నాఁగకు నీ
క్రొవ్వుఱుగ దేనిఁ దలవడు
మెవ్విధిఁ జని తేని యనుచు నెత్తినభీతిన్. 69

క. శరములు శరాసనము న
య్యరదముపై డిగ్గ విడిచి యతిరభసమునన్
ధరణికి లంఘించి వెసం
బురిదెసకును లజ్జ వీటఁ బ్రోవం బాఱెన్. 70

వ ఇట్లు వాఱినం దనమనంబునఁ గుత్సించుచు బీభత్సుండు
యుగ్యంబులపగ్గంబుల నొగల ముడిచి రథంబు డిగ్గ నుఱికి
లంబకేశ భారుండును నాందోళిత రక్తాంబరయుగళాం
చలుండును నగుచు నతని వెనుకం బఱచుసమయంబున
సిలిచి కనుంగొను కౌరవబలంబునందు. 71

ఉ. అజ్ఞులు కొంద ఱప్పు డపహాసము సేయుచు గూఢరూపరే
ఖాజ్ఞత లేమిఁ దద్విక్రుతకాయముమీఁదను దృష్టి నిల్పఁగాఁ
బ్రాజ్ఞులు మూర్తిసౌమ్యతయు బాహులదీర్ఘతయుం భటత్వత
త్త్వజ్ఞతయున్ గతిస్ఫురదుదాత్తతయుం గని సంశయంబుతోన్. 72

తే. ఆఁడుచందంబుఁ బురుషసమాకృతియును
గలిగి యున్నది యొప్పు నూమ్మలతసొంపు
వికృతవేషాకృతంబునై వెలయఁ డితఁడు
నివుఱు గవిసిన మెఱయని నిప్పువోలె. 73

ఉ. బాహులచాయయున్ గమనభంగియు నర్జునునట్ల దీన సం
దేహము లే దితండు దన తేజము డాఁపఁగ మత్స్యభూమిభృ
ద్గేహమునందుఁ బేడియనఁ గీడ్పడి యుండెనొ కాక యీకురు
వ్యూహముతోడికయ్యమున కొండొకరుం డిటు లొంటి వచ్చునే ? 74

చ. విరటుఁడు దక్షిణంబునకు వీరుల సారథులన్ నిజాజికై
పురిఁ గలవారి నెల్లఁ గొనిపోయిన నొండులు లేమిఁ జేసి యు

త్తరుఁ డిట వచ్చుచుండి యరదంబు దగం గడపంగ నెవ్వరుం
దొరకొన కున్నఁ దా నితనిఁ దోడ్కొని వచ్చినవాఁడు
సూడఁగన్. 75

చ. పరి సనుదెంచి గోగణముఁ బట్టి రనన్ విని పిన్న గాన మీఁ
దరయక రాజనందనుఁ డహంకృతిమైఁ బఱతెంచి సైన్యవి
స్ఫురణముఁ జూచి భీతిఁ దనబుద్ధి గలంగినఁ బాఱఁజొచ్చె ని
ప్పురుషుని శౌర్యసంపదయు భూరిబలంబు నెఱుంగఁ
డేమియున్. 76

వ. అనుచు నిశ్చయరహితహృదయు లగుచుండ శుండాలరయ
లీలాసమ రేఖంబగు గమనంబునం బురుహూతపుత్రుండు
పదశతమాత్రప్రదేశపలాయితుండైన భూమింజయు
నెయిది పట్టుకొనిన నతండు. 77

*సీ. వెలవెలఁ బాఱుచుఁ వెగడొందుఁ బెదవుల
తడియాఱ నెంతయుఁ దల్లడిల్లు
జల్లన నంగంబు లెల్ల నిండఁ జెమర్చుఁ
బదములుఁ గరములుఁ గుదియ వడఁకు
హృదయంబు దటతట నదరంగఁ బెలుకుఱు
దీనదృష్టుల మోముఁ దేఱి చూచు
నెలుఁగు గద్గదికఁ దొట్రిల నేడ్చు విడు మని
ప్రార్థించు మాటఁ గీడ్పాటు దోఁప

తే. నిష్కళతశుద్ధహేమంబు నిర్మలోజ్జ్వ
లాప్తవైడూర్యములుఁ దురగాఢ్యరథముఁ
గరటిదశకంబు నొకయూరుఁ బురము సొచ్చి
నపుడ యిచ్చెద నీ కను నార్తుఁ డగుచు. 78

క. నాతోడి ప్రేముడిం గడు
నాతురమైౖ యెదురుచూచు నంబకుఁ జేతః
ప్రీతిగఁ జని యాయుమఁ బొడ
సూతుం బో నీఁగదే విశుద్ధచరిత్రా. 79

వ. అని మఱియు నానావిధదీనాలాపంబులం బ్రార్థించుచుండం
బార్థుండు నగుచు నతనిం దేరు సేరం దెచ్చి. 80

చ. వెఱవకు మన్న పోటు కురువీరులతోడ నశక్యమేని న
త్తెఱఁ గది యేల నీ కుడుగు తేరికి సారథి గమ్ము నాకుఁజి
చ్చఱపిడు గెట్టు లట్టడరి శూరులమొత్తము నుగ్గుసేసెదం
బఱపెద సేన రాజుభృతిఁ బాపెద గోవులఁ గ్రమ్మఱించెదన్.

క. అనుచు నొడఁబాటు లేకు
న్నను నయ్యుత్తరుని నొగల నడుకొన నిడి తా
నును రథ మెక్కి రథికుఁ డయి
చనియె నరుఁడు జమ్మి సేర సమ్మదలీలన్. 82



తిక్కనసోమయాజి – ఆంధ్రమహాభారతము

ఉద్యోగపర్వము ౩.౧. ౯.౩౪

# శ్రీకృష్ణునిరాయబారము

వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె. 1

తే. సంజయుఁడు దన్ను వీడ్కొని చనిన ధర్మ
సుతుఁడు మఱునాఁడు దమ్ముల సుతుల నిష్ట
భృత్యవరులను దొరలను బిలువఁ బనిచి
యెల్లవారును వినుచుండ నిట్టులనియె. 2

క. మనము జనార్దనుపాలికిఁ
జని కౌరవసభకు నతనిఁ జను మని ప్రార్థిం
చిన మేలు, బంధుహితగురు
జనములతో రణము గాక సంప్రీతి యగున్. 3

వ. అని పలికి వార లందఱు బలసి చనుదేర మాధవుమందిరం
బున కరిగి యతనిచేత సత్కృతుండయి సమస్తపరిజనంబు
లుం బరివేష్టింప నొక్కపార్శ్వంబునం బాంచాలియు
సముచితపరివారపరివృతయై యుండ నతండునుం దానును
సుఖాసీనుం డై యుండి యతనితో నిట్లనియె. 4

క. ఆపదఁ గడవం బెట్టఁగ
నోపి శుభం బైనదాని నొడఁగూర్పను మా

కీపుట్టువునకుఁ బాండు
క్ష్మాపాలుఁడు నిన్నుఁ జూపి చనియె మహాత్మా. 5

తే. సమయ మిది మిత్త్రికార్యంబు చక్కఁజేయ
నీకతంబున నే మవనీతుఁ డైన
యాసుయోధనుతోడిపోరాట దక్కి
యనుభవింతుము మాయంశ మగుధరిత్రి. 6

వ. నీకు నేము ప్రద్యుమ్నాదికుమారులతోడివారము, మమ్ము
దురితంబులు వొరయకుండ నరసి రక్షింపు మనవుడు
వాసుదేవుండు నీపంచినయట్ల జేయం గలవాఁడ నెయ్యది
తలంపు సెప్పు మనిన నజాతశత్రుండు నీవు కరినగరంబున
కరిగి కౌరవులతోడం దగిన మాట లాడి తెలుంగు సేయ
వలయు నని ప్రార్థించి యతని నియ్యకొలిపి యిట్లనియె. 7

సీ. మాతండ్రితలఁపును నాతనినందను
చందంబు నిన్న యాసంజయుండు
పలికినపలుకులఁ దెలిసెఁగదా నీకు
వారిచిత్తముభంగి వాఁ డెఱుంగుఁ
బాలుపం పని యీక యేలిమాటలన మ
మ్మలుక దీర్చెదరు తా రధికదుష్క
ర్మం బైనయాసమయం బేము పదుమూఁడు
వత్సరంబులు సల్పి వచ్చి యుండఁ

ఆ. గులముపాడి నడపఁ దలఁపఁడ పతి సెడఁ
దలఁచెనేనిఁ గొడుకు వలచినట్టి

వాఁడు గాన యతనివక్రత మాన్ప లేఁ
డింతకంటెఁ గలదె యెడరు మాకు. 8

క. జననియు సమస్తబాంధవ
జనములుఁ బ్రియమంద వారి శాంతులఁగాఁ జే
యను నెమ్మిగ నొక్కటియై
మననుం దెలుఁ గేది యునికి మాపౌరుషమే. 9

క. ఇచ్చటిబంధులు నీవును
నచ్చెరువడి వినుచు నుండ నయిదూళ్లను మా
కిచ్చినను జాలు నంటిని
బొచ్చెము గా దింతపట్టు పూర్ణము సుమ్మా. 10

శా. ఆదుర్యోధనుఁ డంతమాత్రయును జేయం జాలఁడో

కాని పైం
పేదం గ్రూరత కోర్వ రాదు, సిరి నా కే లందునే,

గ్రాసవా
సోదైన్యంబులు వచ్చు నాయురయునీచుట్టాలకుం గావునన్
మోదం బందుట గల్గుఁ గౌరవులు నేముం బొంది

శ్రీ నొందినన్. 11

ఉ. అక్కట లాఁతు లైన, పగతైనను, జంపన కోర నేల

యొం
డొక్క తెలుంగు లేదె, యది యొప్పదె, బంధు

సుహృజ్జనంబు లా

దిక్కు-న నున్నవారు, గణుతింపక సంపదకై వధించి దూ
ఱెక్కుట దోష మందు టనునీదురవస్థల కోర్వవచ్చునే.12

వ. అని పలికి పాండవాగ్రజుండు వెండియు. 13

ఆ. క్షత్రధర్మ మింత కష్ట మగునె పెఱ
ధర్మ మాచరింపఁ దగ దటంచు
గాన శస్త్రజీవికయ తగి యున్న ది
యైన వంశనాశ మనభినుతము. 14

వ. అదియునుం గాక. 15

ఆ. కలహ మగుట లక్ష్మిఁ గావించుఁ బ్రాణహా
నియును జేయు నింత నిక్క-వంబు
పలువు రొకని కోడి పాఱుట, బల్లిదు
లనదచేతఁ జెడుటయును ఘటించు. 16

క. జయ మగు నోడుదు మనుని
శ్చయ మొక్క-ఁడు లేదు, వినుము సమరమునఁ బరా
జయము మరణంబుకంటె హృ
దయపుటభేదనము సేయుఁ దథ్యం బనఘా. 17

క. కాన యవశ్యము బెనఁకువ
గానియుపాయమునఁ బగఱ గడతేర్చుధృతిం
బూని నడచు నెవ్వఁడు డెం
దానం జెయి వెట్టుకొని యతఁడు నిద్రించున్. 18

ఆ. పగయ కలిగెనేని బామున్న యింటిలో
నున్నయట్లకాక యూఅడిల్లి
యుండునెట్లు చిత్త మొకమాటుఁ, గావున
వలవ దధిక దీర్ఘవైరవృత్తి. 19

చ. పగ యడఁగించు టెంతయు శుభం, బది లెస్సయడంగునే పగం,
బగ వగ గొన్న మార్కొనక పల్కక యుండఁగ వచ్చునే, కడుం
దెగ మొదలెత్తి పోవఁ, బగ దీర్పఁగ వచ్చినఁ గ్రౌర్య మొందు, నే
మిగతిఁ దలంచినం బగకు మేలిమి లేమి ధ్రువంబు కేశవా. 20

ఉ. కావున శాంతిఁ బొందుటయ కర్జము, దా నది యట్లు లుండె, శ్రీ
గావలెనంచుఁ బోరితము గామియుఁ గోరెద, మెల్ల సొమ్ములుం
బోవుటయుం, గులక్షయము పుట్టుటయున్, వెలిగాఁగ నొందుమై
నేవిధి నైన జక్కఁబడు టెంతయు నొప్పుఁ జుమీ జనార్దనా. 21

చ. మనమునఁ బక్షపాతగతి మాదెస మానుము, ధర్మనీతివ
ర్తనముల రెండుదిక్కుల హితంబును బెంపును గల్గునట్టిచో

ప్పున, విదురాది సజ్జనుల బుద్ధికి రా నుచితంబుతోడిమె
ల్పునఁ బరుసందనంబునను భూపతులెల్ల నెఱుంగ
నాడుమీ. 22

చ. తగవునఁ బోక, రాజు బెడిదంబులు వల్కెనయేని
సైఁచి, యొ
ప్పుగ నిలుమీ, గురుత్వముఁ బ్రభుత్వమునుం గల
పెద్దవారిమా
ట గొనమి, యాసుయోధనుకడన్ నిలువక, మన
మెల్ల, గారవం
బుగఁ గురువృద్ధపల్కుఁదలఁపుం జన నిచ్చిన, మెచ్చరే
జనుల్. 23

మ. సుతువాఁడై వినయంబు సేకొనక, యేచొప్పుం దగం
జెప్ప కా
ధృతరాష్ట్రుం డవినీతిఁ జేసినను సంధింపంగ రా దంచు వే
గ తెగం బాఱకు, తెంపు సేయునెడ లోకం బెల్ల
మెచ్చుం బ్రకా
శితధర్మస్థితి నొంది మామనము నిశ్చింతంబు గాఁ
జేయుమీ. 24

ఆ. ఇన్ని సంకటముల నిబ్బంగి నెంతయు
నొగులు చిత్తవృత్తినొవ్వుదీర్ప
వెజ్జవీవ కావె వేయేల యేగతి
నడపఁ దలఁచి తదియ నాకుఁ బ్రియము. 25

వ. అని చెప్పి తలంచికొని వెండియు నిట్లనియె. 26

క. నీవు సుయోధనుపాలికిఁ
బోవఁగ వలదనియు నొక్కబుద్ధి యొడమెడున్
గోవింద యతఁడు మంత్రులుఁ
గావరమునఁ జక్క వినరు కార్యవచనముల్. 27

తే. కుటిలమతు లవినీతులు క్రూరకర్మ
లట్టినీచులకడకు నిన్ననుపఁ జాల
నీవు సంకట పడియెదు దేవపదవి
యైన నే నొల్ల, నొంటి యందరుగు టుడుగు. 28

చ. అనవుడుఁ గృష్ణుఁ డిట్లనియె నా ధృతరాష్ట్రుఁడు నట్టివాఁడ త
త్తనయుఁడ యేల, నీపలుకు తథ్యము నీతలఁ పే నెఱింగితి
న్మనమున శంక దక్కుము వినన్ వలతే, విను మేను నిక్క మ
ల్గిన నచటంగలండె రణకేళికి మార్కొన నొక్కఁ డేనియున్. 29

క. పనుపుము కౌరవసభ కేఁ
జను టెట్లును మేల, యర్థసంసిద్ధి యగున్
మన కొకటం బాపము రా
కునికికిఁ గత మైనపలుకు లొండెను గలుగున్. 30

వ. అని పలికిన యుధిష్ఠిరుం డి ట్లనియె 31

ఆ. మేలు గాక నీకుఁ బోలిన ట్లయిన నం
దరిగి నేము వారు నర్థిఁ బొంది
యుండునట్లు గాఁగ నొడఁబాటు గావింపు
మెల్ల భంగి మనకు నిదియ లెస్స. 32

క. మ మ్మెఱుఁగు దెదిరి నెఱుఁగుదు
నెమ్మి మెఱుఁగు దర్థసిద్ధి నెఱిమెఱుఁగుదు వా
క్యమ్ముల పద్ధతి నెఱుఁగుదు
పొ మ్మెవ్వఁడ నేను నీకు బుద్ధులు సెప్పన్. 33

కృష్ణుఁడు ధర్మరాజుతోఁ గౌరవుల దుర్ణయంబు సెప్పుట

సీ. అనిన ముకుందుఁ డిట్లనియె సంజయుని మా
టలును నీ వన్న పల్కులును వింటి
నీమది ధర్మైకనిష్ఠమై యున్నది
వైరంబు విడువరు వారు ద్రోణ
భీష్ములు గల రని బిరుదులై యున్నవా
రగునె రాజన్యుల కడఁగి కుడువ
నక్లేశవృత్తి రాజ్యము చవి గొన్నవా
రేల యిత్తురు నీకుఁ బాలు సెపుము

తే. ధార్తరాష్ట్రులు సడికి నధర్మమునకు
నలుక రెన్నఁడు విడువు దైన్యంబు పొడువు
కయ్య మరివర్గజయమునఁ గలుగు నిహాప
రములుఁ జిరకీర్తియును బాండురాజతనయ. 34

మ. గురుభీష్మాదులు సూచు చుండ సభ మీాకుం
గీడు నాఁ డట్లు ము
ష్కరు లై చేసిరి, యంత సేసియును బశ్చాత్తాపముం
బొంద నో
పర వా రెన్నఁడు నట్టిచోటఁ గృపయున్
బంధుత్వముం దక్క మె
వ్వరుఁ గోపింపరె యాదురాత్మకులఁ గర్వక్రౌర్యముల్
సూచినన్. 35

వ. కపటపునెత్తంబు నెపంబుగా మిమ్ము వెడలనడుచునప్పుడు దుర్యోధన దుశ్శాసన శకుని సూతనందనులు పులిలోట దక్క కలకల నవ్వుచుం బలికినపలుకు లుగ్గడింపవచ్చునే వాని విని సమస్తజనంబులు ధృతరాష్ట్రు నిందించుచు మీారు బలవంతుల రయి యుండియు సత్యంబు వాటించి యూరక పోక సూచి యచ్చెరుపాటుతో నుమ్మలించు చుండిరి తిట్టువాట్లం బోయెడువారు దైవోపహతులై మున్న చెడియుండుదురు గావున వారలం జెలపనుం జులుకన, క్రూరాత్ములగు కౌరవు లెల్లవారికి వధ్యులు గాఁ దగుదురు నీ కేల యవధ్యు లైరి. పాపాత్మకులగు హింసకులం బాముల నెట్లట్ల నిర్విచారంబుగా వధియిం చుట కర్తవ్యంబు. 36

క. మీాతండ్రికి భీష్మునకుం
జేతోముద మొదవ భక్తి సేయన తగు నీ

కాతలకు నేనుఁ జని వి
ఖ్యాతంబుగ నీదువినయ మభివర్ణింతున్. 37

క. చెలులుం జుట్టలు దేశం
బుల రాజులు వినఁగ నీదుపుణ్యచరిత్రం
బులు నీవు ధర్మమార్గము
దలఁచుటయుం దెలియఁ బలికెదం గురుసభలోన్. 38

వ. దానికి దుర్యోధనుం డియ్యకొనక తెఱంగు మాలిన మాట లాడుటయుఁ దండ్రి యతని వారింపనేరమికిఁ దో డుపేక్షకుం డగుటయుఁ జూచి మీ తొల్లింటిపాట్లునుం దలంచి యెల్లవారును వారిన గర్హింతు రింతియ కాక మనకు నొండేమి వలయు. నా యొపినంతయుఁ బెక్కు-భంగుల సంధియ కావింపం జూచెద, నవ్విధంబు సిద్ధించిన మేలుగాదె, యట్లు గాక తక్కి-న నచ్చోటి యుత్సాహంబు చందంబును నందుఁ జేయం గలవారివర్తనంబులుఁ గొలందులు నెఱింగి నీకు విజయంబగు విధంబునం జనుదెంచెద.

తే. ఆసుయోధను ముక్కు-న నావి గలుగఁ
బుడమి నీ కీడుఁ, గావునఁ బోర కలుగు
నేను గయ్యపుశకునంబు లెన్నియేనిఁ
గంటి నీ వనుత్సాహివి గాఁగ వలదు. 40

వ. చతురంగబలంబుల నాయితంబు గావించుచు దొరలం బురికొల్పికొనుచు నాలస్యంబు లేక సమరంబునకు సన్నా

హాంబు సేయుచుండ వలయు నని పలికిన విని వృకో
దరుండు దామోదరున కిట్లనియె. 41

క. సమరంబు గలుగు ననుచును
మము వెఱపింపంగ వలదు మాధవ నీ వా
కుమతియగుధార్తరాష్ట్రుఁడు
శమించు కార్యంబు నడపు సౌజన్యమునన్. 42

వ. అని వెండియు. 43

శా. పాపాత్ముండు మదాంధుఁ డాతులువ నీపం బెట్లునుం
జేయఁగా
నోపం డడ్డము సెప్ప రెవ్వరును మానో(ద్రేకమున్
గర్వమున్
గోపంబుం దనుఁ ద్రిప్ప నాప్తజనులం గుందించుటం
బోయిన
ట్లే పోనిత్తురు గాన నిన్నతఁడు జాలిం బెట్టెడుం
జూడుమీ. 44

ఉ. చొచ్చినచోన చొచ్చి తెగఁజూచెద నంచుఁ గడంగు
చుండు న
న్మెచ్చఁడు బాహుగర్వమున నీచు సుయోధనుఁ
డట్టివానితోఁ
బొచ్చెము లేక కూడి మనఁ బోవక పోవఁగ రాదు నాకు వి
వ్వచ్చుఁడు రాచవారుఁగురువంశము చేటునకోపకుండుటన్

ఉ. పాండవకౌరవుల్ గలసి పాలును నీరును బోలె నెమ్మిమై
నుండఁగ దుష్టచేష్టల సుయోధనుఁ డింతలు సేసె నాతఁడొ
క్కండ కులక్షయంబునకుఁ గారణమం ద్రది దప్పదైన నీ
వొం డన నేల యీబిరుదు నోపినయంతయుఁ దీర్ప
నేర్పునన్. 46

చ. తనపొరిపోవునంతకు నుదగ్రతయుం గపటంబు మాన నే
ర్చునె ధృతరాష్ట్రిసూనుఁడు యశోభరితం బగుభారతా
న్వయం
బున కొకనింద వచ్చు ననుబుద్ధి దురాత్మున కేల కల్గు నా
యనమెయిఁ బోయి హీనగతి నైన ఘటించిన నెంత
యొప్పనో. 47

వ. మాకును వారికిఁ బితామహుం డగుభీష్ముండు విను చుండ
సుయోధనుతోడం గురుకులేశ్వరు నాస్థానంబున నావచ
నంబులుగా ని ట్లనుము. 48

తే. అన్నదమ్ములమై యుండి యొకట మనల
నొరులు దలయెత్తి చూడ నొండొరులతోడఁ
బెనఁగ నేటికి నీ సేల పెద్దవారి
బుద్ధి విని పంచి కుడుచుట పోలదొక్కొ. 49

క. అని యెవ్విధమున నైనను
వనజోదర సంధిసేయ వలయుం దగ నే
మును వారును గలయుట భూ
జనులకు నెల్లనుహితంబు సౌఖ్యకరంబున్. 50

చ. అనుటయుఁ బిన్ననవ్వునగి యంబుజనాభుఁడు వల్కె నెన్నఁడుఁ
వినని భీముపాలఁ గడు వింతలు వింటిమి మ్మాట, లగ్గి చ
ల్లనగుట, భూరిభూధరము లాఘవ మొందుట గాదె యివ్విధం
బున నితఁ డిప్డు మార్దవముఁ బొందుట యింకిటఁ జెప్ప నేటికిన్. 51

శ్రీకృష్ణుఁడు భీమసేనునిఁ గౌరవులతోడియుద్ధమునకుఁ బురికొల్పుట

తే. అని సహోదరు లాజి నాయాసపడుట
కోర్వమియుఁ గౌరవులఁజంప నొల్లమియును
గలుగునెయ్యంబుపెంపుఁ గరుణ నార్ద్రుఁ
డైన పవనజుఁ బురికొల్ప నాత్మఁ దలఁచి. 52

వ. మురమర్దనుం డతనితో నిట్లనియె. 53

ఉ. యుద్ధముమీఁది వేడ్కయు, మహోగ్రవిరోధులనల్కఁ జేయుద
రోద్ధతియున్, సుయోధనునియున్నతి సైఁపనియేపు, రాజ్యసం
సిద్ధి నిజాగ్రజన్మునకుఁ జేయుతలంపును గల్గునీ వసం
బద్ధములైనవాక్యములు వల్కుట యొప్పునె, కీచకాంతకా.

వ. అని యంత నిలువక. 55

క. వెఱ పెట్టిదియో యెన్నఁడు
నెఱుఁగని నీయట్టివాని కెవ్వరొకో యీ
పిటికితన మింత యలవడఁ
గఱపినవా రనుచు శౌరి గలకల నవ్వెన్. 56

వ. దానికి దరహాసితవదనుం డగుచు భీమసేనుండు వసుదేవ
సూనున కిట్లనియె. 57

ఉ. బంటుతనంబు మాటలకుఁ బాఱకు, పాండునృపాలుపాలుగై
కొంటయ చాలునన్న నృపకుంజరుపల్కుల కడ్డ మాడ రా
కుంట యెఱుంగవే మును, సుయోధనుచందము జూపి యప్పు డే
మంటి యుపేంద్ర నన్నని రణాగ్రమునన్ నిను మూదలించెదన్. 58

క. నాకొలఁది విచారింపక,
నీ కిట్లనఁ దగునె మిన్ను నేలయు నిమ్మైఁ
గాక తిరుగంగఁ బడినం
బో కే ముంజేతు లొడ్డి పోవఁగఁ ద్రోతుఁ 59

ఉ. నావుడు నవ్వుటాల కనినం బవనాత్మజ! యింత యేటికిం
గేవల యోధవే, పరులకిల్బిషముల్ దలపోయకిమ్మెయిన్
జావడ మైనఁ జూచి, యిది చందము గా దని యంటి గాక నీ
చేవయు లావు నీవు మును చేసినభంగులు నే నెఱుంగనే.

వ. అని చెప్పి మాధవుండు మఱియును. 61

ఉ. పార్థుఁడు పోరఁ దేరు గడపం దనకున్ ననుఁ గోరి యెంతయుం
బ్రార్థన సేసె, దానికనురాగము వొందితి నేను, గాన యు
ద్ధార్థులమైన మాకు నిను నాసపడం దగదే, యశంబు నా
నార్థములున్ విరోధి విజయంబునఁ దక్కఁగఁ నొంటఁ గల్గునే. 62

వ. అనవుడు. 63

శా. ఏమీ పార్థుఁడు నీవు దండిమగలై యీ వచ్చు కౌరవ్యసం
గ్రామక్షోభము బాహుదర్పమునఁ దీర్పం, బెద్దమి త్రెక్కఁ మి
మ్మెల్లన్ వెఱఁగంది చూచెదము గా కీ సారెకుం బోయి రా
భీముం డిత్తఱి రిత్తమాటలకుఁ గోపింపండు సూ, పెంపఱన్. 64

వ. అని పలికి యివ్విధంబున గోపాలదేవు మేలంపు మెయివడి
కార్యవచనంబులకుం దగం దానును దోడ్తో సరసం
బాడుటయ కా మఱుమాట లాడి యంతటఁ దని వోవక
బకమర్దనుం డతనితో నిట్లనియె. 65

ఉ. కయ్యము గల్గిన ట్లయిన గంధగజప్రకరంబు కుంభముల్
వ్రయ్యఁ దురంగపంక్తులు ధరంబడఁ దేరిగముల్ బడల్పడన్

డయ్యమి కీవు వెక్కసపడన్ దగపండువు సేయఁ గోరునా
దయ్యపుమునె త్తికోలు దుదిఁ దాఁకుట గాదె భుజంగభంజనా.

చ. అన విని దేవకీతనయుఁ డాతని కిట్లనుఁ జెప్పినంతకం
టెను మిగులంగఁ జేయుదు, గడెందిమగండవు, నిన్నుఁ
దెప్పగాఁ
గొని పలుమాఱు నాపదలకున్ భయమొందక దుఃఖ
వార్థు లీఁ
దినముపు నెల్ల నిక్కఅత దీర్చి సుఖాత్ములఁ జేయుపావనీ!

క. ఇదె పోయెదఁ గౌరవ్యులఁ
బదసికిఁ రాఁ బలికి సంధి వాటించెద నా
కది యొప్పదె కాని తుదిం
గుదు రింతకు నీవ కావె గుణరత్ననిధీ! 68

అర్జునుఁడు శ్రీకృష్ణునితోఁ దన యభిప్రాయంబు సెప్పుట

వ. అనిన వాసుదేవున కర్జునుం డి ట్లనియె, 69

తే. చెప్పఁ గలయంతవట్టును జెప్పె నీ క
జాతశత్రుండు వింటి పీ వాతెఱంగు
మాకు నెల్లను బలుకంగ మాట లొండు
గలవె మైనను జెప్పెదఁ గన్నయంత. 70

మ. ధృతరాష్ట్రుం డతిలోభదూషితుఁడు ధాత్రీభాగ
మీఁ నేర్చునే
సుతుఁడుం గష్టుఁడు సంధి యేల యగు నంచున్
మున్నకై పెక్కిన
ట్టితలం బచ్యుత! నీకు గల్గినది గాండీవంబు దివ్యాస్త్రసం
తతియుం బెట్టినయట్ల యుండ మముఁ జింతం బాపరాదో కదే.

ఉ. నీ వొనరింపఁ బూనినపనిం గమలోదర! కీడు పుట్టునే
కా వనిసట్ల యుండి యవుఁ గార్యము ల ట్లగుటం
బ్రయత్నసం
భావన సేత పౌరుషముపద్ధతి తత్ఫలసిద్ధి వొందుచో
దైవము దోడ్పడఁ గ్వలయుఁ దథ్యము రెండును
నీవినోదముల్. 72

ఉ. వేరిమి ధర్మజుం బరిభవించిన ద్రోహులు వధ్యు లన్న నె
వ్వారికిఁ బోలదే సుజనవత్సల! నీ విటు లంట వారు మ
మ్మారస మెత్తి కీడ్పఱిచి యింతలు సేసినదాన నీమదిం
గూరిననొవ్వుసొంపునను గోపము పెంపునఁ గాదె
యూరయన్. 73

ఉ. ఐనను జిత్తగింపు ద్రుపదాత్మజ నాసభ నట్లు సేసినం
దానికి సైఁప లెస్స యని దైన్యముఁ బొందుట
కోర్చి యమ్మెయిం
గానసభూమికిం జనుట కారుణికోత్తమ! నీ వెఱుంగవే
కాన సహించి పాండవులఁ గౌరవులం దగఁ గూర్పు
నేర్పునన్. 74

తే. అలవిమెఱుఁగక ధార్తరాష్ట్రులు గడంగి
మమ్ము బఱచినపాటులు మానసమునఁ
జవుటఁ బెట్టినవిత్తులచంద మొంది
యంకురింపక చెడిపోయె నంబుజాక్ష! 75

వ. అమ్మొఱకుల నెమ్మొయి నయినను, 76

క. ఒడఁబఱచి మాకు వారికిఁ,
బుడమిసగము గాఁగఁ జేసి పొంది పొసఁగి యుం
డెడు నట్టి తెఱఁగు సేయుట,
కడు మే లది గౌరవముసుఖంబును జేయున్. 77

క. నీ కిట్టిది చిత్తమునకు,
రాకుండిన నేని వలదు రం డిమ్మొయి మీ
రీకార్యము సేయుం డని
మా కానతి యిమ్ము కంసమర్దన! తెలియన్. 78

మ. హితమిబ్భం గిది మాకు ధర్మము తెఱం గిట్లుండు
నం చేను నీ
మతి బోధింప వలంతినే హితము ధర్మంబున్ విచారించి చూ
చి తగం బొమ్మని యేది పంచితది నిశ్చింతంబునం జేసియు
న్నతిఁ బొందం గలవార మై యునికి గృష్ణా! నేఁడుగా
వచ్చెనే. 79

వ. అనిన విని కృష్ణుండు విజయున కి ట్లనియె. 80

చ. వెరవున లావునం గృషికి వేయువిధంబుల మే లొనర్చినం
దొరకొనునే ఫలంబు దఱితోఁ దగువర్షము లేకయున్న నె

ప్పరుసున లెస్స సేసినను బౌరుషముల్ ఫలియించు జెల్లనా
దరణమునం బ్రసన్న మగుదైవము చేతన చూవె ఫల్గునా!

ఉ. కావున సంధికిం బురుషకార మొనర్చెద నోపినంతయున్
దైవముచేత యెట్లగునొ దాని నెఱుంగ,

సుయోధనుండు సం
భావన సేసి పాలొసఁగు పాడియ కల్గిన బాల్య మాదిగా
నేవిధి నైననుం జెఱుప నింతలు పాపము లాచరించునే?

వ. అది యెల్లన ట్లుండె నిచ్చట విరాటుపసులన్ బెట్టింప
నీవు వోయినయప్పుడు భీష్ముండు దుర్యోధనుతో, జెప్పిన
తెఱంగు. 83

ఉ. వచ్చినవాఁడు ఫల్గునుఁ డవశ్యము గెల్తు మనంగ రాదు రా
లచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చుగుఁ గుం దగుం దొడరు లెల్ల విధంబుల కోర్చు,

టట్లు గా
కిచ్చ దలంచి యొక్కమెయి నిత్తతిఁ బొం దగుచేతయుం
దగున్. 84

వ. అనియె దాని కతం డుత్తరం బిచ్చిన తెఱంగు. 85

ఆ. మనకుఁ బాండురాజతనయవర్గమునకు
నెట్లు పొందు గలుగు, నేను రాజ్య
భాగ మీను, సమరభంగిక విక్రమ
నిరతిఁ బూను టిదియ నిశ్చయంబు. 86

వ. అని పలికె నది యంతయుఁ బదంపడి మన మెల్ల వింటిమ
కాదెఁ యామాటల ఫలంబప్పుడ కనియు నాకష్టాత్ముండు
వెంజియు, దెలియుండు. 87

తే. అతనిగుణదోషముల చంద మట్ల యుండె
నాకు ధర్మజుబుద్ధిన నడప వలయు
నిత్తెఱం గాచరింపంగ నేఁగి యచట
నెల్ల తెఱఁగును నేర్పడ నెఱిఁగి వత్తు. 88

చ. అనిన ముకుందుతో నకులుఁ డల్లన యిట్లను నీకు ధర్మజుం
డును బవనాత్మజుండు నరుఁడుం దగఁ జెప్పుట
రిత్తగాదు మా
మనము లరణ్యవాసమున మత్స్యమహీపతిపాల నున్న య
ద్దినములభంగి గాదు కృపఁ దీవ్రతఁ గుందినచంద
మయ్యెడున్. 89

క. కడవఁగ నొకళ్ళు పసరము
నడిచిన నొక్కళులుఁ బెయ్య నడువ వలయునే
చెడు తెరు వాకౌరవ్యుల
కడ నిలుచుం గాకమనకుఁ గ్రౌర్యం బేలా. 90

సీ. గోగ్రహణంబునఁ గోలె నెంతయు మెత్తఁ
బడ కుండుదు రె వారు పద్మనాభ
నీయనుగ్రహమున నెమ్మిమైఁ గూడిన
బలము లే డక్షౌహిణులును దొరలుఁ

బాంచాలయాదవపాండ్య కేకయమాత్స్య
లోకతెంపు నెఱుఁగకయున్నవారె
భీమార్జునులలావుపెంపును నీసహా
యంబును గలుగుట కలుక రెట్లు

ఆ. గురుఁడుఁ గృపుఁడు బాహ్లికుఁడు భీష్ముఁడునుబుద్ధి
సెప్పి వారిఁ జక్కఁజేయరెట్లు
కార్య మీవు సెప్పఁగా విదురుండు వి
నంగ నెట్లు గాదనఁగ వచ్చు. 91

వ. అట్లుం గాక నీవు దమపాలికిం బోవుట ధార్తరాష్ట్రులాద
రింపకుండ వెఱవరే నీపోయినప్పుడ యీ కార్యంబు
చక్కనగు ననిన విని సహదేవుండు వాసుదేవున కి
ట్లనియె. 92

ఉ. రక్కసమాట లాడెదరు రాజును దమ్ములు వానిలోన నీ
వొక్కటియైనఁ గాదనక యూఁకొనుచుండుట యంత
కంటె మే
లక్కట యిట్లు వేఁడికొన నైనను బోయెదు వో
సుబోధనుం
డెక్కడ భూమిలోన సగ మిచ్చుట యెక్కడ
దానవాంతకా. 93

మ. తలఁపం గూడునె యింతలేసిదొరలీద్దైన్యంబు,
చుట్టంబులుం
జెలులుం దిట్టరె, లాఁతిరాజులకు మెచ్చేయివ్విధం;బిట్టిదిం

గలదే, వేఁడఁగ ధర్మజుం, డడుగఁబోఁగాఁ గృష్ణఁ
డాధా ర్తరా
ష్ట్రులు పా లీక చలంబునం బెనఁగ, నిట్లుం గూడు
దీ పయ్యేనే. 95

ఉ. వీరలు ధర్మమార్గము సవి స్తరతం దగ నాడిరేనియు,
న్వారలు దాని కియ్యకొ నినన్, విను మచ్యుతయట్టిసంధి పెం
పారఁగ నేర్చునే, యుచితమైనది కయ్యము, వంకమాటలే
నేరఁ, గురుప్రవీరుసభ నిశ్చయ మిట్టిద కాఁగఁ జెప్పుమీ.

మ. తుదిరాజ్యమ్మునగమ్ము గొ మ్మడవియందుం బేరు
వంచించియుం
బదుమూఁ డేఁడులు నీవునుం దిరిగి రా పా లీక పోవచ్చునే
యది గాదేఁ దెగి బంటవై యఖుము, మాయల్ వన్ను
నేర్పింకఁ జె
ల్లదు సూ నీ కని యాసుయోధనుని యుల్లంబుచ్చి
పో నాడుమీ. 96

మ. అనినన్ సాత్యకి ప్రీతుఁడై యితఁడు లెస్సైనయుండఁ
బల్కెం, బ్రయో
జనముం గల్గదు, గారవంబుఁ జెడు, దుశ్చారిత్రకుం
డా సుయో
ధను బోధింపఁగఁ బోయినన్ సరభసోత్సాహంబులై
నున్న నీ
రనిశాయంబున కెల్లనుం బ్రియము సంగ్రామంబు
మేలెమ్మోయినన్. 97

వ. అనిన విని రథికవడు లందఱు సహదేవుం డింత యొప్ప
నాడునే, సాత్యకి పలుకు లిట్లుండునే, తక్కటివి యెక్కడి
మాటలు, పగవారి నడిగికొనం బోవుట యుచితం బఁట,
కయ్యంబు కర్జంబు గా దఁట, భంగంబు సైఁగికొనం దగ
దఁట యనునివి మొదలుగా ననేకు లనేక ప్రకారంబుల
వీరాలాపంబులం గొలువెల్ల నొక్క మ్రోతఁగా జెలంగిన
యెలుంగులు నింగి ముట్టెఁ దదనంతరంబ. 98

ద్రౌపదిఁ గృష్ణునితోఁ దన మున్ను పడిన భంగపాట్లు సెప్పుట

తే. ధర్మనందను పలుకులు దనకు హృదయ
తాప మొనరింప మోమున దైన్య మొంద
నున్న పాంచాలి యిట్లని యొయ్యఁ బలికెఁ
గనలి శౌరితో గద్గదకంఠి యగుచు. 99

ఉ. అంతలు సేసి పో నడచి యక్కట సంజయుచేతఁ జెప్పి పు
త్తెంతురె, యిట్టి యూఱట మదిం బ్రియమంది యుధిష్ఠిరుండు, దా
నంతన యూళు లేవురకు నైదు సుయోధనుఁ డిచ్చునొక్కొ, యీ
కంతకృపావిహీనమతి, నాతఁడు నొంచునె యన్నదమ్ములన్.

చ. తనమునుపడ్డ బన్నములుఁ దమ్ములపైఁగల కూర్మి పేర్మి నీ
జనపతి సైఁప కున్నె, యది సక్కన, రాజ్యముపాలు లేక దీ

ఁబున కోడఁబాటు గల్గిన నెఱుంగమి వెట్టరె, చాలరైరి వీ
రనరొకో, నాన లేమి యని యాడరె, లోకమువారు
కేశవా! 101

శా. పెంపేదం దమ కిట్టి తక్కువలు రూపింపంగ నేలా, విచా
రింపన్ వారిక మేలు సంధి దము వారిం జూచినం, దారు సా
ధింపం జాలరొ కాక పోరఁ దగ మర్దింపం దలంపేని శం
కింపం బట్టొకో, వారు బ్రాహ్మణులె యేకీడైన సైరింపగన్.

ఉ. ఓటమొకింత యేనియు సుయోధను చిత్తమునందు లేదు నీ
మాటలఁ బోవునే, దురభిమానమ యెక్కుడు పూనుఁ
గాక య
చ్చోటన సంగరంబు లగు చొప్పులు పుట్టిన నైనఁ
బాండవుల్
పోటున కిచ్చగింతురొకో పోదురొ కానల నుండ నచ్యుతా!

ఉ. ఏ నిటు లంటి నావలవ దింకను నీవును రాజుఁ దమ్ములుం
గా నుచితంబుసూచి మనకార్యము మీసుజనత్వముం జెడం
గా నొకభంగి సేయక, తగం గురువర్గముతోడి సంధి మీ
కైన తెఱంగునన్ వలచినట్టుల చేయుఁడు నేర్పు లేర్పడన్,

వ. అని మఱియు నిట్లనియె. 105

ఉ. ఆఱడిఁబోక యున్, ఫలము నందుటయుం గని పల్క
నేరమిన్
మాఱటనోరిడ్వాన నయి, మాటలు చిత్తమునందు నిల్పకేఁ

గాఱులు ప్రేలెదన్ విను౦డు కర్ణము నెగ్గును గాన నల్కమై
వీఱిఁడి మైనమానిసికి వెండి వివేకము గల్గ నేర్చునే.

చ. వరమునఁ బుట్టితిన్ భరతవంశముఁ జొచ్చితి నందుఁ బాండు భూ
వరునకుఁ గోడలైతి జనవంద్యులఁ బొందితి నీతివిక్రమ
స్థిరులగుపుత్రులం బడసితిన్ సహజన్ముల ప్రాపుగాంచితిన్
సరసిజనాభ! యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్

వ. అట్లుంగాక 108

ఉ. నీవు సుభద్రకంటెఁ గడు నెయ్యము గారవముం దలిర్ప సం
భావన సేయు దిట్టిననుఁ బంకజనాభ! యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై పెను పొందిన వేణి పట్టియీ
యేవురుఁజూడఁగా సభకు నీడ్చెఁ, గులాంగన నిట్లొనర్తురే!

ఉ. ఆసభ నేకవస్త్రయగునట్టి ననుంగొని వచ్చి నొంచుదు
శ్శాసనుఁ జూచుచుం బతు లసంభ్రములై, తగు చేష్టలేక, నా
యాసలు మాని, చిత్రముల యాకృతి నున్నయెడన్ ముకుంద! వి
శ్వాసముతోడ నిన్ గొలువవచ్చె మనం; బదియుం దలంపవే. 110

చ. అరయమిఁ జేసి కోడలన కప్పుడు దాసిగఁ జేసె నమ్మహా
పురుషుని పాలికిం బతులు వోవఁగ వీరలతోన యేను జె

చ్చెరఁ జని కోటరంబు దగఁ జేయుదునో, యటు గాక
పాడిమై
వరవుడ మోపి చేయుదునొ వారికి మాధవ!
నిశ్చయింపుమా. 111

వ. అని య ట్లుగ్గడించి. 112

ఉ. ద్రోవది బంధురం బయిన క్రొమ్ముడి గ్రమ్మన విడ్చి
వెంద్రుకల్
దా వలచేతఁ బూని యసితచ్ఛవిఁ బొల్చు మహా
భుజంగమో
నా విలసిల్లి వ్రేలఁగ మనంబునఁ బొంగు విషాదరోషముల్
గావఁగ లేక బాష్పములు గ్రమ్మగ దిగ్గనలేచి
యార్తయై. 113

వ. గోవిందుముందటం బెట్టి యి ట్లనియె. 114

క. ఇవి దుస్ససేనుఁ వ్రేళ్ళం,
దవిలి సగము ద్రెవ్వి పోయి దక్కినయవి, కౌ
రవులకడఁ దీఱుమాటల
యవసరమునఁ దలఁపవలయు నచ్యుత! వీనిన్. 115

సీ. ఈ వెంద్రుకలు వట్టి యీడ్చిన యా చేయి
దొలుతగాఁ బోరిలో దుస్ససేను
తను వింతలింతలు దునియలై చెదరి రూ
పఱియున్నఁ గని యుడు కాఱుఁగాక

యలుపాలఁ బొనుపడునట్టి చిచ్చేయిది
పెనుగద వట్టిన భీమసేను
బాహుబలంబును బాటించి, గాండీవ
మను నొకవి ల్లెప్పుడు వహించు

ఆ. కట్టి విక్రమంబుఁ గాల్పనే, యిట్లు బ
న్నములు వడిన ధర్మనందనుండు
నేను రాజరాజు పీనుంగుఁ గన్నారఁ
గానఁ బడయమైతి మేనిఁ గృష్ణ! 116

ఉ. నెట్టన యిట్టియల్క మది నిల్పితి రక్కసతాల్మిఁ జిచ్చోడిం
గట్టినయట్లు పెద్దయును గాలము, దీనికి నాఱు పెన్నడుం
బుట్టదు, దుష్టనిగ్రహము పూని జగంబులు గాచునట్టి తోఁ
బుట్టువు నీవుఁ దేజమునఁ బొల్చినఁ భర్తలు గల్గఁ
నచ్యుతా. 117

శ్రీకృష్ణుఁడు ద్రౌపది నూరార్చుట

వ. అనుచు నెలుంగు రాలుపడ నేడ్చిన యాజ్ఞసేనిం గృపా
యత్తచిత్తుఁడయి నారాయణుం డూరార్చి కూర్చుండ
నియమించి కన్నీరుదుడువను బెన్నెఱివేణి ముడువనుం దగు
వారి నియోగించి యమ్మానినితో నిట్లనియె. 118

ఉ. క్రుచ్చిర నేల నేఁ గలుగ ముద్దియ, నాకు
వృకోదరుండు వి
వ్వచ్చుఁడుఁ దోడుగాఁగ జనవంద్యుఁడు ధర్మసుతుండు
వంప, నీ

మెచ్చుగ శత్రుసంక్షయము మేకొని చేసెదఁగాక
వే తోకం
డచ్చుపడంగ నేర్చునె, దురాత్ములు గౌరవు లుర్వి
యిత్తురే. 119

క. లలనా యుడుగుము నీ యే
డ్పులకోలఁడియె, కురునృపాల పుత్రకళత్రం
బులయేడ్పు లింక, వానిం
గలగల నవ్వుచు వినంగఁ గాలంబయ్యెన్. 120

క. యమమహిష ఘంటికానా
దము వినఁ గౌతుహలంబు దళుకొత్తెడు చి
త్తములు గల కౌరవుల కి
ష్టము లగునే సంధికార్య శాంతవచనముల్. 121

క. మొదల విధినియతియును న
ట్టిద యందుకు పెద్ద లది ఘటింపక పో దే
మది జూచి చెప్పినను ద
ప్పదు మేరువు దిరిగెనేని బాంచాలసుతా. 122

తే. పూని పలికెద వినుము రిపుక్షయంబుఁ
జేసి యుజ్జ్వలపుణ్యలక్ష్మీసమేతు
లైన పాండుకుమారుల యధికవిభవ
మీవు సూచెదు తడవు లే దిది నిజంబు. 123

క. అని యూఱడిలఁగఁ బలికిన
విని యంకిలి దేఱుచిత్తవృత్తి గలుగునం

గన యేడ్పుడిగెం దగఫ
ల్గునుఁడి ట్లని పలికె నపుడు గోవిందునితోన్. 124

తే. పాండవులు ధార్తరాష్ట్రులుఁ బుండరీక
నేత్ర! చుట్టఱికంబున నీకు నొక్క
రూప కావునఁగోరి యేరూపునందు
నుభయపక్షంబులకుఁ జేయు ముచితహితము. 125

క. ధర్మార్థసంగతంబుగ
ధర్మతనయు చెప్పినట్ల తగఁబల్కఁగ నా
దుర్మతులు కౌరవులు స
త్కర్మమునకుఁ జొరకయున్న దైవమ యెఱుఁగున్. 126

క. అన విని కౌరవులకు మీ
కును హితముఁ బ్రియంబుఁ జేయఁ గోరియ కుంతీ
తనయాగ్రజుపని ధృతరా
ష్ట్రునికడకుం బోయెదను గడుం బ్రీతిమెయిన్. 127

క. అని పలికిన హరి ధర్మవ
చనముల తెఱఁగున కజాతశత్రుఁడు చిత్తం
బునఁ బొంగి యట్ల చేయుము
మన నిశ్చయ మిదియ దీని మఱవకు మనఘా. 128

వ. అని కార్యంబు నిశ్చయించి దినశుద్ధి నిరూపించి నారాయ
ణుం జూచి నీ నక్షత్రంబు రోహిణిగదా యెల్లి రేవతి
నీకుఁ జంద్రతారాబలంబులు గలవు, గమనంబునకు రేప
కడయ మేలు పయనం బగుట లెస్సయని చెప్పిన నప్పలు

కుల కతంబు సగౌరవంబుగా నియ్యకొన్నిన పాండవాగ్ర జుండు గొలువుం గలయం గనుంగొని యెల్లవారును విన నది యట్లకాక యని పలికి తదనంతరంబ తానునుం దమ్ములుం బాంచాలియుం బరివారంబును నుచితప్రకారం బున నిజనివాసంబులకుంజనిరి. మఱునా డరుణోదయంబునం గృష్ణుండు గాలోచితకృత్యంబులు నిర్వర్తించి సూర్యో పాస్తి సేసి యగ్నిసమారాధనం బాచరించి ధరణీసురులం బ్రణామపూర్వకంబుగాం బ్రయాణదాన ప్రముఖపూజా విశేషంబులం బ్రీతులంగావించి వారల యిచ్చు నాశీర్వా దంబులును సమంత్రాక్షతదూర్వాంకురాదులునుం గైకొని యుచితప్రదేశంబున నుండి సాత్యకి రావించి. 129

క. మన ప్రజలో గరిపురికిం
జనుదేరంగ వలయువారి సవరణతో రం
డని యేర్పడ నియమింపు ప
యనమై యేతెమ్ము నీవు నని తగ మఱియుఁ. 130

వ. దుర్యోధనుండు దుష్టాత్మకుం డతండుమన్నించు మాను సులునుం గుటిలబుద్ధులు గావునం జక్రగదాద్యాయుధం బులు రథంబునం బెట్టింపవలయునని చెప్పి పనిచి సమ యజ్ఞతం బొడసూపి నిలుచున్న దారుకుం జూచి తేరు పూన్ప నియోగించిన నతండును మణిగణప్రభాపటల జటిలం బగు నరదంబు వన్ని శైలసుగ్రీవమేఘపుష్పవలాహ కంబు లనం బరఁగు తురంగంబులం బూన్చి గరుడధ్వజం

బెత్తి తెచ్చినం దానునుం బయనంపుఁ జందంబునఁ గట్టా
యితంబై జనంబుల చూడ్కులకుం బండువగుచుఁ బుండరీ
కాక్షుండు మంగళతూర్యంబులు సెలంగఁ జామరంబు
లుల్లసిల్ల రథంబెక్కిన యవసరంబున యాదవపరివారం
బుతో నరుగుదెంచిన సాత్యకిం దన రథం బెక్కించుకొని
యాంగికంబులైన శుభసూచకంబులు గైకొనుచుఁ బూర్ణ
కలశవృషభాదిభద్రపదార్థంబుల నవలోకించుచుఁ
బుణ్యాంగనలు సేస లొలుకఁ జిత్తంబు ప్రసన్నతం బొంద
వెడలునప్పుడు. 131

సీ. పాండవ యాదవ పాంచాల కేకయ
పాండ్య మాత్స్యాదులు భద్రదంతి
హయ రథంబులతోడ నతికుతూహలమున
వచ్చినఁ గనుఁగొని వారినెల్ల
సంభావనంబుల సంభాషణంబుల
నాదరించుచుఁ దగ నల్లనల్ల
విభవంబు మెఱయంగ, విడిదలపఱ పెల్లఁ
గడచిన యత్తఱిఁ గరము శుభము

ఆ. లైనశకునములకు నందఱుఁ బ్రియ మంద
నరుగు చున్నయట్టి యవసరమున
రథము రథముఁ గదియ రానిచ్చి ధర్మనం
దనుఁడు [illegible] నిట్టులనియె హరికి. 132

ఉ. వచ్చె జనార్దనుండనినవార్తకుఁ బ్రాణము మేని కంతకున్
వచ్చిన, సేద దేఱుఁ గురువంశపవిత్రచరిత్ర గొంతి, నీ
వచ్చుట కేగి పాండవుల యందఱిమాఁ అని చెప్పి
మ్రొక్కుచున్
గ్రుచ్చియ కౌఁగిలించుకొని కుందినచిత్తమునొప్పి దీర్పుమీ.

చ. అడవికి నేఁగునాఁడు మము నంపఁగ నెంతయు దవ్వువచ్చిన
ప్పుడు దనమోము దైన్యమునఁబొందెదునశ్రులుఁ జూచి
చూచి య
ట్లొడఁబడి డించి పోవలసె నుమ్మలికమ్మున గొంతి యింతకున్
బడుగయి పాలలోఁ బడిన బల్లివిధంబున నుండ
కుందునే. 134

క. ఉక్కయిలు గాలినది మొద
లక్కట మాతల్లి మాకు నై నెవ్వగతోఁ
జిక్కెడుమలఁ బడుచున్నది
దిక్కెవ్వరు లేనియట్లు దీనత్వమునన్. 135

క. ఏ ననుట గాఁగ దుఃఖము
లైనవి దెగుసమయమయ్యె నని చెప్పుము, మా
మేనత్త నూఱడింపుము,
దా నెప్పుడు నీవు గలవు తన కనుచుండున్. 136

వ. అని చెప్పి వెండియు. 137

ఆ. గురుఁడు బాహ్లికాదికురువృద్ధులును సుహృ
ద్బాంధవులు నశేషధరణిపతులుఁ

ప్రీతిఁ బొంద నెవ్వరికి నేది దగుఁ బ్రణా
మాదివిధుల నడపు నాదుపలుకు. 138

క. పరమప్రియమున నాకై
పరిరంభణ సేసి గాఢబాంధవసాంద్రా
దరమున సంభావింపు వి
దురుతో, మధ్యస్థుఁ డగుహితుం డతఁ డనఘా! 139

వ. అనియెఁ దదనంతరంబ యర్జునుండు. 140

చ. జనులు వినంగ రాజ్యమును సాముగొనంగలవార మన్న యీ
జనపతికార్య నిశ్చయము సమ్మతి గైకొని జేసినన్ సుయో
ధనుఁడును దమ్ములున్ సఖులు; దానికి నేమును నియ్యకొందు; మొం
డనిన సపుత్రమిత్రముగ నద్దెస నందఱ గ్రొచ్చి పాఁతుదుర్. 141

మ. అనినన్ మెచ్చి వృకోదరుం డితఁడు కార్యం బింత దెల్లంబుగాఁ
బొనరం బల్కెనె యంచుఁ బేరెలుఁగుసొంపుంబొంద వక్త్రంబు పొ
ల్పున దర్పంబొలయంగ నంగములకుం, బొంగారు నుద్యృంహిత
ధ్వనిమై పొల్చు మహోగ్రసింధురముచందం బొంది యొప్పెంగదుర్. 142

క. నకులసహదేవులును దా
నికి సంతసమంది యిట్లు నెయ్యము కయ్యం
బౌక తెఱఁగు సేసికొని తడ
యక రమ్మని పలికి రప్పు డచ్యుతుతోడన్, 143

వ. ఇవ్విధంబునం బాండునందను లందఱును గోవిందునకు వలయు మాటలు సెప్పి యతనిఁ గౌఁగిలించుకొని యథోచితప్రకారంబున వీడుకొని, మగిడిరి, తక్కినవారలు నర్హ్వంబులగు తెఱంగుల నామంత్రితులై మరలిరి, మాధవుండును బ్రయాణసర్వసంభారనిర్వాహకులఁ గలయం గనుంగొని తగినసల్లాపంబులు సేసి కరినగరంబు పెండెఱుఁవుగైకొని దారుకుని చతురత్వంబునఁ దురంగంబుల పటుత్వంబున నత్యంతసమీచీనంబైన యానంబున మనం బలరం జనిచని సూర్యాస్తమయసమయంబునఁ గుశస్థలంబు సేరం జనునప్పు డందలివిప్రు లెదుఱు వచ్చి కాంచి నిజనివాసంబులకుం జనుదెం డని పిలిచినం బ్రసన్నవదనుండగుచు సమ్మర్దంబు వలవదని పలికి విశాలరమణీయంబైన బహిరంగణంబునం బటకుటీరప్రకరం బెత్తించి విడిసి తగువారును దానును వారల గృహంబుల కరిగి యభ్యాగత పూజలు గైకొని వారిని సంభావించి విడిదలకుం జని సమయసముచితవృత్తిం బ్రవర్తిల్లుచుండె నంత నక్కడ.

# తిక్కన సోమయాజి— ఆంధ్రమహాభారతము

## శల్య సౌప్తిక పర్వములు

## అశ్వత్థామ

దుర్యోధనుఁడు భీమునితోడి గదాయుద్ధమునఁ గాళ్లు విఱిగిపడి యుండఁగా నశ్వత్థామ మొదలగువారాతనిని జూచిరి. పాండవులు రాజరాజునకుఁ జేసిన పరాభవమునకు ప్రతీకారమును, అశ్వత్థామ చేయుట కుపక్రమించిన కథ యిందు వర్ణింపఁబడినది.

అశ్వత్థామ బ్రాహ్మణుఁడై యహింసామార్గము ననుసరించవలసినవాఁడయ్యును, క్రూరవృత్తియయిన క్షత్రియకర్మమునఁ బాల్పడి, ధర్మయుద్ధమున నేమియుఁ జేయుట కవకాశములేక, తుదకు నిద్రించుచున్నవారలను జంపి, పాపము మూటగట్టుకొనికూడ, తాననుకొనినట్లు పాండవులను సంహరించవలఁయుననుప్రతిజ్ఞను సాధించుకొనలేకపోయెను.

వ. కొందఱశ్వత్థామ ప్రముఖ రథికత్రయం బయ్యెడ మెలం
గుట యెఱింగి వారలకు రాజరాజువార్త చెప్పిన వారలు
సత్వరంబున నచ్చటి కరుగుదెంచి యరదంబులు డిగ్గి. 1

సీ. కడుబెట్టిదంబగు గాలిచేఁ గూలిన
మహనీయసాలభూరుహముపోల్కిఁ
బ్రబలకిరాత మార్గణములఁ ద్రెళ్లిన
రాజితవన్యవారణము మాడ్కిఁ

గల్పాంతవాయుసఖస్ఫురణంబున
నివిరిపోయిన మహార్ణవము కరణిఁ
గాల పర్యయమునఁ దూలి మేదినిమీఁదఁ
బడిన పూర్ణేందు బింబంబుపగిది

తే. దుఃస్థుఁడై యుండియును నొప్పు దొరుఁగకున్న
యన్న రేశ్వరుఁ గనుఁగొని యడలునెదల
తోడ మేనులు దూలఁగఁ దొట్రువడుచుఁ
జేరి యాతనిచుట్టు నాసీనులైరి. 2

వ. ఆసీనులైన యెడ నగ్గురుసుతుండు. 3

ఉ. అక్కట యెప్డుఁ బల్వురు ధరాధిపతుల్ గొలువంగ నుండు నీ
వొక్కరుఁ డున్నవాఁడవు మహోన్నతపీఠ మలంకరించునిన్
డెక్కలిఁ దాకిఁ ధాత యిలఁ ద్రెళ్లెడునట్లుగఁ జేసె నీ బలం
బెక్కడఁ బోయె సైన్యపతు లేలొకొ యిక్కడ రారు భూవరా! 4

తే. కడలుకొనఁ జుట్టుఁ బట్టెడు గొడుగులెవ్వి
యెసక మెసఁగంగ సీవురు లేలవట్ట
రంగమున నాననంబున నవనిధూళి
గదిరె జలకమేలాడవు కౌరవేంద్ర! 5

చ. అనిమిష వాహినీతనయుఁ డస్త్రగురుండును నీకు నెప్పుడున్
గనుపెలుఁగై చరింతురు, వికర్ణుఁడుఁ గర్ణుఁడు
దుస్ససేనుఁడున్
నిను నొకయప్డుఁ బాయ రవినీతులొకో నృప! వారలెల్ల నె
మ్మనమున శంక లేక యొకమాటును నిక్కడఁ
జేర రెవ్వరున్. 6

క. నీయెడఁ జంచలయయ్యెను
శ్రీ, యెవ్వరి నచలవృత్తిఁ జెందెడు విధియ
ట్లై యున్నవారి నిట్టులు
సేయఁడె యేనింక నేమిసేయుదు నధిపా!

తే. అని విలాపంబు సేసిన విని విభుండు
గన్నుఁగవ నశ్రులురలంగఁ గరపుటములఁ
దుడిచికొనుచు డగ్గుత్తిక దొడరు నెలుఁగు
నెట్టకేలకు నూల్కొల్పి యిట్టులనియె. 8

క. మనుజులకు నిట్టి చందము
మును ధాత సృజించినది ప్రమోదము ఖేదం
బున వచ్చును బర్యాయం
బున దీని నెఱుంగవలదె? పురుషుండనఘా! 9

వ. అని యా రథికవరుల నాలోకించి 10

సీ. పయి పయి నెంతలాపదలు వచ్చిననైన
నుత్సాహమెడలక యుద్ధమరులు

సేద్పడునట్లుగాఁ జేసెడి బంధులు
మిత్రులు సోదరుల్ పుత్రులట్లు
బలసమేతంబుగా భండనంబునఁ ద్రుంగ
నొక్కఁడు నిల్చుట యొప్పునెట్లు
మద్బాహు వీర్యంబు మహితధైర్యంబును
దలముక్కలైన సధర్మవృత్తి
తే. సంగరము సేయఁజాలక శత్రులిట్లు
నొంప సద్గతి వడయుట సొంపుగాదె
యదియుఁగాక విద్వేషులచే నాజిఁబడక
యుండ మిముఁగాంచు నమ్మేలు నొదవెనాకు. 11

చ. వినుఁడు మహానుభావుఁడగు విష్ణునెఱింగి యెఱింగియే మిముం
గొని వెఱపేది కాదె పగకుందలకొంటి జయంబుగోరి మీ
రును బలశౌర్యసంపదనురూపముగాఁ బొగడొందు భంగులం
బెనఁగితి రేమిసేయుదురు బెట్టిదుఁడై విధి తప్పఁజూచినన్.

వ. వగవకుండుండని యేఁ బొదలోనం బొంచియున్నది మొదలుగ గదాయుద్ధంబు పాడివిడిచి వడముడి పుడమితేనిం బడవైచి తలఁ దన్నుట తుదిగానైన వృత్తాంతంబెల్ల నప్పుడారథికవరులకుఁ దేటపడంబలికిన విని, పాండవులదెస రోసంబునెత్తి గురునందనుం డరుణాననుండగుచు నవుడు గఱచి కఠినాత్మరకలితంబుగా నక్కౌరవేశ్వరున కిట్లనియె.

ఉ. పాండవులట్లు మజ్జనకుఁ బాపవిధిం దెగఁ జూచినప్పుడుం
జండతరప్రకోపము సహాస్యపుశోకము నిట్టుచిత్త మొం
డొండ గలంప వేనిపుడ యొక్కఁడుఁ దక్కకయుండ వారిను
ద్దండ మదస్రవహ్నిఁ బరిదగ్ధులఁ జేయక యెట్టులుండుదున్.

తే. వినుము సత్యంబు వల్కెద మనుజనాథ!
యడరి యందఱఁ బాంచాలురాది గాఁగఁ
గలుగు బాంధవమిత్ర సంఘములతోడఁ
గూడ నేఁడిదె కృష్ణుండు సూడఁద్రుంతు. 15

వ. అనుపుమనిన హృష్టుండై యజ్జనపతి గృపాచార్యుం గను గొని యొక్క కలశంబున జలంబు నినిచికొని రమ్మను టయు నమ్మహీసురవరుండు దమ్ముం జూడవచ్చి యచ్చట నున్న సమీపాశ్రమ మునికుమారులం బ్రార్థించి యొక్క కలశంబు దెప్పించి దానిం దోయపూర్ణంబు గావించి తెచ్చిన 16

చ. అతనికి నెమ్మి నిట్లనియె నమ్మనుజేంద్రుఁడు నీవు వేగ మం
చితముగ ద్రోణపుత్త్రు నభిషిక్తునిఁ జేయుము ప్రీతి మచ్చమూ
పతియగఁ భూసురుండు నృపుపంపునఁ గయ్యముసేత లోకవి
శ్రుతమగు ధర్మమట్లగుటఁ జూవె యొనర్చెద నవ్విశేషమున్. 17

వ. అనవుడు నతఁడు సంప్రీతుండై యగ్గురునందనునకు సేనాధి
పత్యాభిషేకం బాచరించిన 18

ఉ. ఆరథికోత్తముండధిక హర్షముఁబొందుచు
నమ్మహీశ్వరున్
గారవమొప్ప గ్రుచ్చి యిటిగాఁగిటఁజేర్చి యుదాత్త
సింహనా
దారవ ముల్లసిల్లఁగఁ బ్రియంబుమెయిం గృపయాద
వోత్తముల్
సేరి కెలంకులంజనఁగఁ జెచ్చెర నేఁగె నుదగ్రమూర్తియై.19

వ. ఇట్లశ్వత్థామ కృపకృతవర్మలును మహోద్యోగంబున. 20

క. అరి నిరవశేష నిరసన
పరమానంద ప్రచరిత పాండవ పుత్రో
త్కర బాంధవ నికరపరి
స్ఫురణాఢ్య తదీయ శిబిరమున కభిముఖులై. 21

వ. చని యవ్వీటి కెలన కనతిదూరంబుగా నరిగి యా రథిక
వరులాలించి 22

ఉ. అందలి వారలెల్లను జయంబునఁ బొంగుచుఁ
బేరెలుంగులం
దంద చెలంగఁగాఁ బలుకనార్వఁగ నొత్తిలినవ్వ నాకసం
బందినయట్టి మ్రోఁతవిని యక్కడ వోవఁగ నుల్కిరప్పుడ
మ్ముం దడవన్ వడిన్ వెడలుమూఁకలు మ్రోయుటగాఁ
దలంచుచున్. 23

వ. ఉలికి యటవోవుటుడిగి యెచ్చటికేనియుఁ దొలంగి నిలిచి మఱి కర్జంబుఁ జూచుకొనువారై యా రథికవరులుమగిడి తూర్పుదెస కొంతదవ్వేఁగిరని సంజయుఁడు సెప్పిన నమ్మాటలు వెడవెడ వినుచుం దనకుం బాటిల్లిన దురవస్థ చింతించుచు నాంబికేయుం డిట్లనిమె. 24

సీ. సంజయ! కురురాజుసమయునే యిట్లు భీ
మునిచేత బలశౌర్యముల నజయ్యుఁ
డని నమ్మియుండితిఁ దనయులు నూర్వురు
మడియుట వినియు నామనము పెక్కు
వఱియలై వోవనిభంగిఁ జూడఁగ బాత
నొనరించినది గాఁగనోపు నింక
నడియరితనమున నప్పాండవుల నాశ్ర
యింపఁగఁ జాలనే నెక్కుడేనిఁ

ఆ. బోదుఁగాక యట్టి భూపాలు తండ్రినై
ప్రాభవమునఁ బేర్చి పరమదైన్య
వృత్తి కోర్వఁదగునె వినవశమేమాట
లాపరుత్తనూజుఁ డాడనాకు. 25

వ. అని పలికి యశ్వత్థామ ప్రభృతు లేమిసేసిరనుటయు నజ్జనపతికి సంజయుం డిట్లనిమె. 26

క. ఇమ్మెయి నారథికవరులు
గ్రమ్మఱి చని యడవిసొచ్చి కనిరొక మడువం

దిమ్ముల సూతజనులు ర
థ్యమ్ముల నీళ్ళకును దిగువనప్పుడు దారున్. 27

వ. రథంబులుడిగ్గి యంబుపానంబుసేసి యాత్రామోత దెస
నాలించుచుండిరి. 28

తే. అంతఁ బశ్చిమధరణీధరాగ్ర పశ్చి
మంబునకుఁబోఁయె మార్తాండమండలంబు
సాంధ్యసమయ కృత్యంబులు సలిపిరపుడు
రథికవర్యులు మువ్వురు రాజముఖ్య! 29

వ. సలిపి వారొక్క వటవిటపి సమీపంబున నాసీనులై రా
సమయంబున. 30

* తే. వారి ముఖమండలములతో వారిజములు
మొగిడె, శోకతమంబుతో నిగిడెఁ దిమిర
పటలి, బహువిచారములతోఁ బరఁగఁబొల్చె
భూత బేతాళగణములు భూపవర్య! 31

క. కలుగు గురుసుతున కెట్లుం
గలహంబని చూడ నమరగణమధిక కుతూ
హలమున వచ్చెనో యనఁ జు
క్కలు దోఁచెం గగనవీథిఁ గౌరవనాథా! 32

వ. ఇట్లు రాత్రియగుట దివాచరంబులైన జంతువు లుపశాంత
వర్తనంబులయ్యె. రాత్రిచరంబులైనవి సంచరింపఁ
దొడంగె; నప్పు డమ్మువ్వురు నెవ్వగల గూరినమనంబు
లతోఁ గురుబలం బకారణంబ పొలియుట యుగ్గడించి

తత్సంబంధకలితంబులైన భాషణంబులు చెల్లుచుండ నుండి
డప్పిగూరి కొండొకసేపునకు మహీతలంబున మేనులువైచి
పండుకచుండి రందుఁ గృపకృతవర్మలు నిద్రవోయిరి.
గురునందనుండు క్రోధాతిశయంబునం జేసి నిదురవోవక
వటవిటపంబు కలయం గనుంగొనువాఁడు తదీయ శాఖోప
శాఖల నానాకాకంబులు నిలీనంబులై నిద్రించుచుండ
నాలోకించె నయ్యవసరంబున. 33

సీ. మిడుఁగుఱుగములు గ్రమ్మినయట్లు నిగిడెడు
రోచులుగల మిడిగ్రుడ్లు దనర
మెఱుఁగారు కెంజాయ మెఱసిన యెఱకల
మోపునఁ నెసఁగు పెన్ ద్రోవఁతతోడఁ
గాళుల భీషణాకారత గ్రేళ్ళతో
లీలమై నెగసిన శైలమనఁగఁ
గరముగ్రమగు మొగ మిరుదెస మురియించి
యామిషంబుల యిక్కలరసికొనుచు

తే. నచటి బయలెల్లఁ దానయై యక్కజంపుఁ
జందమును ఘోరమైన నిస్స్వనముజండ
గలియు భూతవితాన భీకరముగా ను
లూక మొకటివచ్చె భూలోకనాథ! 34

వ. వచ్చి యవ్వటపివిటపంబులనూఁది యక్కాకంబుల నాలో
కించి యంగంబుల యుద్భటత్వంబుడిపికొని గమనంబు
తిన్న ధనంబు దలకొనఁ జొచ్చి వారి నాక్రమించి 35

ఉ. కొన్నిటి కంఠముల్ నులుపుఁ, గొన్నిటి కాళులుద్రుంచు
నుగ్రతం
గొన్నిటి పక్షముల్ నఱుకుఁ, గొన్నిటి పొట్టలువుచ్చు
లీలమైఁ
గొన్నిటి నప్పళించుకొని కోలెముకల్ నుఱుమాడు, నిట్టుల
య్యన్నిటి నయ్యులూకము రయంబెసఁగన్ వధియించె
భూవరా! 36

వ. ఇవ్విధంబున నిద్రావివశంబులైన యవ్వాయసంబుల వివి
ధంబులగు వధంబుల గీటడఁగించి యా కౌశికంబు శత్రు
వులం బొదివి సమయించిన మేటిమగని మాడ్కి మోదం
బునొందినం గని యగ్గురునందనుండా చందంబొనర్పుటకు
డెందంబున నుత్సాహంబు వొడమి పొంగి తనలోన 37

తే. ఇవ్విహంగము ముపదేశమిచ్చె నాకు
నిద్రవోవంగ శత్రుల నిగ్రహింతు
నింత లెస్సగునే ముందఱేమి తెలిఁగు
గాననై తిని నాపూను కార్యమునకు. 38

వ. అని వెండియు 39

ఉ. పాండునరేంద్రనందనుల బాంధవపుత్త్రయుతంబుగాఁగ ను
ద్దండత నే వధింతునని దర్పమెలర్పఁగఁ గౌరవాధి నా
థుండు వినంగఁ బల్కితిని దుర్దమదోర్బలు లమ్మహాత్మకుల్
గండున బెట్టుపైఁబడుట కార్యముగాదు తలంచి
చూడఁగన్. 40

క. అరవాయి గొనక బెట్టుగ
బరిగొని యక్కడిఁది మగలపై నడరుట యు
ద్ధురగతి నగ్నిజ్వాలో
త్కరముపయిన్ మిడుతయురుకు కరణియ కాదే. 41

వ. పాండవులం బరిమార్చుపని నేఁడ చేయక మఱిచేసిన రారాజు నిర్గతప్రాణుండైన నాకెలసం బెవ్వరికెక్కుడుఁ జక్కటితోడి బవరంబున నబ్బలుమగల గెలువరాదని యిట్లురియాడు నాచిత్తంబు చింతాపరంపర వాయ నీపక్షి విచేష్టితంబు లోచనగోచరంబయ్యె. పగతురఁ దెగటార్చు నెడ నన్యాయంబనక యుపాయంబెయ్యది దొరకొనిన దాన నుత్సహింపవలయుట శాస్త్రసిద్ధంబకాదే. ఎట్లనిన

తే. ఎత్తినప్పుడు విడియుచో నిఱకటంపుఁ
జెరువునందు నడకసెడి తిరుగఁబడిన
యట్టియెడ నిద్రవోయెడు నవసరమున
శాత్రవుల బెట్టుపైఁబడి చంపవలయు. 43

వ. అను నీతివాక్యంబులు విఁదు నంగీకృతక్షత్త్ర ధర్ముండగు వానికి నిట్టివి కర్తవ్యంబు లట్లుఁగాక పాండవేయులు పితామహగురులైన భీష్మద్రోణులఁ దెగటార్చునెడఁ జక్కటి గల తెఱంగున సంగరంబు జేసిరె, యంగరాజును రారాజును బరిమార్చిన భంగులఁ దలంపంగూడునె, కావునఁ గల్మషోపాయులగు కౌంతేయుల నిద్రాసమయంబున గొబ్బున నిగ్రహించుట నీతియకాని నింద్యంబుగాదని నిశ్చ

యించె. అట్లు క్రూరవ్యవసాయుండగు నగ్గురుసుతుండు దనమామను గృతవర్మను మేలుకొల్పి యిట్టిసమయంబున నిద్రించితిమని లజ్జించుచున్న యారథికవరులతో నిట్లనియె.

సీ. మొగదప్పితిమి రణమున మనమకట ము
వ్వురము రారాజునొక్కరునిఁ బాండు
తనయులు దమవారుఁ దారునుబెక్కండ్రు
గూడి చుట్టునుముట్టి గుల్ల పఱచి
రేకాదశాక్షౌహి ణీశ్వరుఁ డట్లొంటి
మెయిఁ జిక్కి పోరుచుండియునుబాడి
దప్పఁడివ్విభుని నధర్మ విక్రమమునఁ
బాపాత్మకుండగు బకవిరోధి

ఆ. గూల్చె నంతఁబోక కురుదేశరాజ్యాభి
షిక్తమైన యతని శిరము దన్నెఁ
బరిభవంబు నొంచెఁ బ్రాణాంతకరవేద
నాతిశయముకంటె నన్నరేంద్రు. 45

క. లావును వెరవునుగలుగు మ
హావీరు లనేకు లట్టు లన్నిదినములా
భూవిభునకై పెనఁగి జయ
మీ వలఁతులు గాకపోయి రేమనవచ్చున్. 46

ఆ. ఎవ్వరెంతఁ జేసిరేనియు విధియొండు
దలఁపనాఫలంబు దలఁగకేల

యుండు నిట్లుగాఁగ నున్నదిగా కేమి
యెసక మెసఁగుఁ గౌరవేంద్రుమనుపు. 47

వ. అని పలుమాటలాడి మీమది కలంగకున్నదేని నీ మహా వ్యసనంబునకుఁ గర్తవ్యం బెద్ది చెప్పవలయు ననినఁ గృపాచార్యుండు ధనురాచార్యనందను మొగంబు గనుంగొని నీవు చెప్పఁదలఁచిన యంతవట్టునుం జెప్పి కార్యం బడిగితేని నాకుం దోఁచినదానిం జెప్పెద వినుమని యిట్లనియె.

సీ. ప్రారంభములకెల్లఁ బౌరుషమ్మును దైవ
మును సాధనమ్ములు వినుము వాని
లోన నొక్కటిచేతఁ గానేరదనఘ! త
త్ఫలసిద్ధు లెట్లన్నఁ దలఁచు వాన
కారు పొలంబునఁ గల్గెనేనియుఁ గొల్చు
గావింప నేర్చునే యేవిధమున
వలనేర్పడఁగ దున్నఁ బొలములోనైన వ
ర్షంబు లేకున్న ధాన్యంబు లగునె

ఆ. కాఁపు లావు వెరవుగల్గి కర్షనము సే
యంగ వృష్టి దగినయట్లు గలుగ
ఫలముగల్గునట్లు పౌరుషంబునకు దై
వంబుతోడుపాటు వలయునెందు. 49

వ. అదియునుం గాక. 50

క. తగుపని కుద్యోగించుచుఁ
దగ వెఱిగెఁడు హితుల కనుమతంబుగఁ జేయన్
జగతీసురవర! కార్యము
లగు వారికిఁ గలుగు విధిసహాయత్వంబున్. 51

క. ధర్మము తప్పక నయగతిఁ
గర్మాచరణంబు నడపఁగా ఫలసిద్ధిన్
నిర్మలయశమగుఁ దప్పినఁ,
బేర్మిసెడదె నిందరా నభేద్యోత్సాహా! 52

ఉ. నీతిదొలంగి కార్యములనెట్టన యాగ్రహవృత్తిఁ జేసినం
బ్రీతిగ సిద్ధిఁ బొందినను భీతియు గుత్సయుఁ బుట్టు భూజను
ల్వేతురు చేటుసేతలు ఫలింపక తక్కిన మున్నవచ్చున
త్యాతురతాస్పదంబులగు నాపద లిద్ధవివేకవైభవా! 53

ఉ. క్రోధము లోభమున్ భయము గూరిన చిత్తముతోడ దుష్క్రియా
సాధనవృత్తి దుర్జనుఁడు సజ్జనులాఁగఁగ జేయు కార్యముల్
బాధలఁ బెట్టకున్న సిరిపాయఁగఁ జేయక యున్న వానిఁ దీ
వ్రాధి నితాంత దుఃఖహృదయత్వము దేరక యున్న వానికిన్, 54

చ. వినుము కురుక్షితీశుఁడు వివేకవిదూరుఁడు క్రోధలోభముల్
మనమునఁ బేర్చినన్ దురభిమానమునన్ హితులెంత చెప్పినన్

వినక బహుప్రకారముల నిందకునోర్చి పరాభవించె స
జ్జనులగు పాండుపుత్రుల నసత్పథవృత్తికిఁ జేటు తప్పునే!

వ. అని పలికి యతండు మీామది కలఁగక యున్నదేనిఁ గర్త
వ్యంబు చెప్పవలయునని యడిగిన మాట లుగ్గడించి 56

క. జగమెఱుఁగఁగ దుశ్శీలుం
డగు భూనాథుండు వోయినట్టులె పోఁగాఁ
దెగడుం జేటుగలిగి పగ
మిగులను మదిగలఁగదే యమిత్రధ్వంసీ! 57

వ. అది యట్లుండె మన కిప్పుడిది కర్తవ్యంబని నిశ్చయింప
మనమేమి నేర్తుము తగవు తెలంగెఱింగించెదనాకర్ణింపుము.

క. మనమందఱమును ధృతరా
ష్ట్రుని కడకుంబోయి కార్యసూత్ర మతనిచే
వినవలయు నాతఁ డెయ్యది
గని పలికిన నదియె మనకుఁ గర్తవ్యమగున్.

వ. అమ్మహీకాంతుండు. 60

క. తానును గాంధారియునె
ద్దానిం గార్యంబుగాఁగఁ దలఁచి పనిచినన్
దానికిఁ గాదన వలవదు
పూని యనుష్ఠింత మదియ పొగడొందించున్. 61

వ. వారలకడ విదురుండునుండు నమ్మువ్వురు విచారించి
చెప్పిన కార్యంబునకు నిందగలుగ దట్లుం గాక యెట్లు

పొరలినను దైవోపహతంబులగు కార్యంబులు సిద్ధిఁబొం
దునె, యడిచిపడ వలవదు, విచారించి కొందమనవుడు
శోకదందహ్యమానమానసుండగుచు నగ్గురుపుత్రుండు
కృతవర్మను నతని నాలోకించి. 62

సీ. వెరవిట్టి దెఱఁ గిది వెంగలితనమని
యెల్లవాఁడును దన యెఱిఁగినట్టి
తెఱఁగున నిజకార్య దృష్టియుక్తిఁ గొను
నొరుల నేర్పులు పట్టనొల్లఁ డాత్మ
బుద్ధియ మేలని పొగడు, నన్యుల చిత్త
వృత్తుల నిందించు వివిధగతులఁ
జెందెడు నాత్మీయ చేతఃప్రవర్తన
మరయఁడు, దాన బాల్యమునఁ దలఁచు

ఆ. తలఁపు గీడుచేసి యెల్లప్రాయమున నొండు
తలఁపునందుఁ బట్టుకొలుపుఁ బ్రీతి
ముదిమి వచ్చినతఱి నదియును విడిచి య
న్యంబులైన నేర్పులాచరించు. 63

క. ఆపదఁబడి యొక్కఁడు స
ద్వ్యాపారము గాఁగఁ జూచి దానినడపు శ్రీ
ప్రాపించిన నరుఁ డొండొక
చూపున వర్తించునది విశుద్ధపదముగన్.

క. తగునని మరణాదులకై
తెగువ దెసన్ మానవుండు దృఢనిశ్చయతన్

దగిలినయది పరమహితం
బుగ వదలక నడుపు నన్యబుద్ధులు గొనమిన్. 65

వ. మీ రెఱుంగనియదిలేదు నాకుందోఁచిన కర్జంబు మన కందరకును శోకనాశంబగునట్టిది, దాని వినుండు చెప్పెద. ప్రజాపతి ప్రజల సృజించి విప్రునకు దమంబును, క్షత్త్రి యునకుం దేజంబును, వైశ్యునకు దక్షత్వంబును, శూద్రు నకుఁ ద్రివర్ణానుకూలతయు వలయు గుణంబులుగా విధిం చెం గావున శాంతుండుగాని విప్రుండును దేజస్విగాని రాజును దక్షుండుగాని వైశ్యుండును ద్రివర్ణానుకూలుఁండు గాని శూద్రుండును నిందంబడుదు రదియట్లుండె. నేనును విప్రకులంబునందు జనపూజితంబైన వంశంబునందు జని యించి భాగ్యహీనతవలన రాజోచిత ధర్మంబనుష్ఠించితి. నడుమ నానిష్ఠవదలి విప్రధర్మంబు మహనీయంబైన నది యాచరించువాఁడనగుట నామదికింజూడ మేలైయుండ దదియుంగాక. 66

తే. మేటివిల్లును దివ్యాస్త్రకోటియును ధ
రించి మెఱయంగ నాజి వధించెఁ దండ్రి
నొకఁడు వాఁడును రూపుతో నుండునట్టె
యెట్లు తలయెత్తి మెలఁగుదునేను జెపుఁడ. 67

క. వాఁడు మొదలుగాఁ బగతుర
వాఁడి గలుగు తూపుగముల వలనుమెఱసి యే

నేఁడు వధింతును నెవ్వగ
వేడిమిఁ బడఁజాల నొక్క వెరవు దలఁచితిన్. 68

క. లేదింకం బగయని ధను
రాదుల దెస వాహనములయందును సంత్య
క్తాదరులై పగతురు నేఁ
డాదమఱచి నిద్రవోదు రది తఱి పొడువన్. 69

ఆ. ఓడిపోయి డప్పినూని గట్టును జెట్టుఁ
జేరియొదిఁగి యున్నవారిఁ గాఁగ
మనలఁదలఁతు రరులు మనములనావంత
శంక లేదు సంతసంబు ఘనము. 70

చ. మదమునఁ దేలి యేమఱినమార్తుర దాడిగఁబోయి బెట్టు ము
ట్టెద శరజాలసత్వరపటిష్ఠతఁ బల్వురఁద్రుంతుఁ గొందఱిం
జదుపుదు నుల్లసత్పరిఘ సంహననంబునఁ గొన్ని కంఠముల్
చిదుముదు నేలరక్తపరిషిక్తముగాఁ గరవాల లీలలన్. 71

తే. గెలుపునూఱట నగ్గల మొదవు నిద్రఁ
బీనుఁగులుఁ బోలెనున్న యాబిరుదుమగలఁ
జంపి పీనుంగుపెంట గావింపవలయు
శిబిరమెల్లను భూతముల్ సెలఁగుచుండ. 72

వ. అని వెండియు. 73

క. కరిహయ నరశవముల భ
గ్న రథంబులనెరసి ద్రుపదనందనగాత్రో

త్కారము పడియుండఁ జూడక
పరిభవతాపోపశాంతి పడయఁగ నగునే. 74

శా. ధృష్టద్యుమ్నుని ముట్టిపట్టుదు మదోద్రేకం బడంగింతు న
త్కృష్టాస్త్రంబులఁ జంప నల్క పశుభంగిన్ జంపినంగాని పో
దిష్టావాప్తియనంగ నాకిదియె భూయిష్ఠంబు కౌంతేయులన్
గష్టస్వైరవిధాభియోగ మృతులం గావింతు నుగ్రాకృతిన్.

క. అలిగిన పినాకిచందం
బలవడ శిబిరంబుఁజొచ్చి యందఱఁబగఱం
బొలియింతును శుద్ధుఁడఁగా
వలదే జనకునకు నాదు వలనేర్పడఁగన్. 76

క. పాండవులం బాంచాలురఁ
జండభుజావిభవమెసఁగ సమయించి కృతా
ర్థుండనయి పెంపుఁ దేజము
గండ్రును దక్కొండులేదు కార్యము దలఁపన్. 77

వ. అనవుడు కృపాచార్యుం డిట్లనియె. 78

సీ. పఱచినవారికిఁ బగ మాఱుపఱుపంగ
నుత్సహించుట గడునొప్పుగాదె
దైవయోగంబునఁ దగినయుద్యోగంబు
నీమానసంబున నెలవుకొనియె
మాకునీపూన్కి సమ్మతమేము దీనికి
నీతోడి వారము నీవుడస్సి
యున్నవాఁడవు నిద్రయును లేకయున్ననీ
వెడగరపడియె దీ యడవిలోన

ఆ. నెమ్మి డప్పిదేటి నిద్రించి వేగినఁ
దెలిసితోడ సత్యుదీర్ణవృత్తిఁ
గడఁగి మేముతోడ నడతేర నడరిన
నరిగణంబు గెలుతు వశ్రమమున. 79

మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుఘనుఁడశ్వత్థామపైఁబోవను
ద్ధుర లీలంగృతవర్మయుంగృపుఁడు నుద్యోగస్ఫురన్మూర్తులై
వెరవుం జేవయుఁ జూపి తోనడవ దోర్వీర్యోద్ధతిన్ మార్గోన
న్నరయోధావళిగాదు దేవతతికి న్నాదెమ్మెయిం జూడఁగన్

వ. అని మఱియును. 81

చ. విను కృతవర్మ దివ్యశరవేది బలాఢ్యుఁడు శౌర్యశాలి యే
నును సమరోద్యమంబునకు నూల్కొనఁజాలుట
నీవెఱుంగు ది
ట్లని గణుతింపరాదు గురునట్టిఁడ యాతఁడనంగవచ్చు ని
న్ననఘచరిత్ర! యిట్టి రథికావళివైరుల నెట్లుచేయదే.

వ. కావునఁ గోదండంబు నెక్కుడించి కంకటంబూడ్చి నిద్రింపు
మేము నిద్రాగమనంబున జడులమైయున్నవారము ప్రభా
తంబగుటయు నెల్లవారలకు నుల్లంబు తెలివొందునప్పుడు
కడంగి యోధులం బొదివి పేరువాడి పోలియింతము
మనము పాంచాలసహితంబుగాఁ బాండవులఁ దెగటా
ర్చుట యొండె వారిచేతం దెగుట యొండె నమ్యోడుంగాక
రిత్తమరలుదుమే యనిన మామకు నశ్వత్థామ యిట్లనియె.

తే. అలుక యెత్తినవానికి నర్థచింత
గునకు నాతురునకుఁ గామగోచరాత్ము
నికిని వచ్చునే విను నిద్ర నీవు నెఱుఁగు
దెఱఁగియుండి యిట్లేఁటికి నేఁప నన్ను. 84

క. ఎన్నఁబడి జనులెఱింగిన
యిన్నాలుగు తెఱఁగులందు నెయ్యదియైనన్
గన్న మొగుడ నీదఁటె నా
కిన్నియుఁ గలుగంగ నిద్ర యేటికి వచ్చున్. 85

చ. గురుదెస వంత నాతురతఁ గూరెద, వైరిఁదలంచి కోపసం
భరితుఁడ నయ్యెదన్ సమరభంగి నిరూపణచింత
నొందెదన్
గురుపతికిం బ్రియంబెసఁగఁ గోరుట నుత్తలపాటు సెందెదం
బురుషవరేణ్య! యేనిదురవోవఁగ నెమ్మెయి నేర్తుఁ జెప్పుమా?

శా. సారాచారనిరూఢుఁడైన ధనురాచార్యున్ వధింపంగఁ గ
న్నారం జూచితి నీవుఁ దత్పరిభవం బట్టుండె భగ్నోరుఁడై
రారాజెంతయు దీనవృత్తిఁ జెవులారం బల్కఁగా విన్నయే
నీ శేయూరక నిద్రవోదునఁటె యిట్లేలంటి వీరోత్తమా!

ఆ. మనము వినఁగ రాజు పనవినభంగికే
క్రూరచిత్తుఁడైనఁ గుందకున్నె!
కరుణ లేకయున్న పురుషున కేనిఁ గ
న్నీరు దొరఁగకుండునే మహాత్మ! 88

చ. అతఁడు మదీయసఖ్యపరుఁ డక్కట యేఁగసుగందకుండ నా
క్షితిపతి యిమ్మెయిం బరులచేతఁ బరాభవమొందె దానిఁ జూ
చితి మును లోకులవ్విభుని చేటును బాండుతనూజకోటి యు
న్నతియును జెప్పవింటి నది నామది సూఁడెడు నిద్రవచ్చునే! 90

వ. అదియునుఁ గాక.

మ. కవ్వడియున్ముకుందుఁడును గావలిగా భయమేదియున్న వీ
డెవ్వరికైన ముట్టుకొని యేనని పేర్చి జయింప వచ్చునే
యెవ్విధినైననుం బగఱ యేపడగించుట పౌరుషంబ యే
నొవ్వక గెల్తు రాత్రిమెయి నూల్కొని తాఁకితినేని మాతులా! 91

ఆ. ఇట్లు నిశ్చయించి యెసకంపుఁ గడఁకతో
నున్నవాఁడ నిట్టి నన్ను మాన్ప
రామి యెఱుఁగకంటి రారాజు మన్నన
వమ్ముచేసి మరల నచ్చునెట్లు. 92

క. సమయింతుఁ బాదివి సౌప్తిక
సమయంబున నెల్లభంగిఁ జతురంగ సమే
తముగాఁగఁ బాండునృప సుత
సముదయమును ద్రుపదభూపసంతానంబున్. 93

వ. సమయించి మఱి విశ్రమించియు నిద్రించియు సుఖించెద, నీవు నిద్రపేరుసెప్పి యుద్యోగంబుమాన్పి మరల్పఁ జూచెద విది తగవగునే యనిన గురునందనునకు గౌతముండిట్లనియె.

చ. అలుక మనంబునం గదిరి నాతఁడు దాను
నెఱుంగఁడొడ్ల చేఁ
దెలియఁడు కార్యతంత్రములు ధీమహితుండగువానికైననుం
జెలులును జుట్టలుం దగిలి చెప్పఁగఁ జొప్పడుఁ గాక తక్కు ని
ర్మలమగు నీతితంత్రము దిరంబయి చిత్తమునందు నిల్చునే?

క. మతి నెప్పుడుఁ దాధర్మ
స్థితి నూహించుచును హితులు సెప్పెడి వెరవు
ద్ధతి దక్క యాచరించుచు
జితేంద్రియత గలిగి నడవఁజెందు శుభంబుల్. 96

తే. దుష్పథంబులఁ జొరనీక తొలఁగఁ దివుతు
రాప్తజనములు తగ వశ్యులయినవార
లందుఁ బుణ్యంబు సొలఁగనియతఁడు తొలఁగుఁ
దొలఁగ నేరఁడు భాగ్యంబు తొలఁగువాడు. 97

క. మతిమంతులైనవారికి,
హితులగు వెరవుగలవార లెఱిఁగింతురు దు
స్థితి గాకుండఁగఁ గార్యము
గతి యొత్తియుఁ దప్పులిడియుఁగడవఁ బలికియున్. 98

క. నా పలుకు వట్టి యాగ్రహ
దీపితుఁడగుటుడిగి మదికిఁ దిన్నఁదనమునీ
వాపాదింపుము చలమును
గోపముఁ గ్రౌర్యంబు విడువు గుణరత్ననిధీ! 99

వ. అట్లైనం బశ్చాత్తాపంబునం బడవు. నిద్రించినవానిని నాయుధంబులు విడిచినవానిని వాహనవైకల్యంబు నొందినవానిని శరణుజొచ్చినవానిని దలవీడినవానిని వధియించుట ధర్మంబుగా దీ సమయంబున సమస్తసైన్యంబును, బాండవ పాంచాలురు నిద్రవోవుదురు, నిద్ర చావునట్టిద కాదె! పీనుంగులుంబోలెం బడియున్న వారిం బొడిచి పాపంబు గట్టుకొని నరకంబునం బడుట మేలె! మహాస్త్రవిదులగు రథిక ముఖ్యులయందు మేటియనం బరఁగి యింతకుము న్నెమిటం గల్మషంబులేని నీయట్టివాని కిట్టి దుష్కర్మంబు గర్తవ్యంబగునే? ఇది మడుఁగుఁజీరయందు మసి దాఁకి నట్లయ్యెడు. సూర్యసంకాశుండవగు నీవు సూర్యోదయ సమయంబునఁ బ్రకాశప్రకారంబైన పరాక్రమంబున నుపక్రమింపు మనవుడు నశ్వత్థామ కృపాచార్యున కి ట్లనియె. 1్0

సీ. నీ చెప్పినదియెల్ల నిజము శాసింపంగఁ
దగువాఁడవై హితంబగు తెఱంగు
నా కెఱిఁగించితి నీకేను జెప్పెద
నేర్పడ వినుమయ్య యెల్ల నృపులు
గనుఁగొనుచుండ మజ్జనకుని సన్న్యస్త
శస్త్రుని నట్లు పాంచాల రాజ
సుతుఁడు ధృష్టద్యుమ్నుఁ డతి పాతకంబని
కొంకక తలపట్టుకొని వధించె

ఆ. భీష్ము నాశిఖండి పేరఁ గృత్రిమసమ
రమ్మున నర్జునుండు సమయఁజూచె
నరద మూర్వి(?)గ్రుంగి యనువుదప్పిన డిగ్గి
యెత్తుచుండఁ గర్ణు నేసె నరుఁడు. 101

ఆ. చేయి నరుఁడు దునుమఁ బ్రాయోపవేశప్ర
వృత్తిమైఁ బ్రశాంతచిత్తుఁడైన
పుణ్యపురుషునట్టి భూరిశ్రవునిఁ గృష్ణు
ననుజుఁడట్లు సంపె నాగ్రహమున. 102

చ. పలువురుగూడి కౌరవనృపాలకునొక్కరుఁ జుట్టుముట్టి వి
చ్చలవిడిఁ బాపకర్మ మనుశంక యొకించుక యేని లేక యూ
రులు గద నుగ్గుసేయఁగ మరుత్సుతునింబురికొల్పిరిన్ని భం
గుల మును వారెకాదె చెడగ్రొచ్చిరి సంగరధర్మసేతువున్.

వ. వారినెట్లు నిందింపవు మమ్మునెట్లు వారించెద వాలింపుము.

ఆ. తొడలు విఱిగి నేలఁబడియుండి ననుఁ గని
మానవేంద్రుఁడట్లు దీనవృత్తి
నాడెఁ గొన్నిమాటలవి యంతరంగంబు
నందుఁ జిక్కి కినుక యలఁత సేసె. 105

వ. వాని వెలార్పవలయు మజ్జనకహనన సంతుష్టుఁడగు ధృష్ట
ద్యుమ్నుండులోనైన యప్పాపాత్ములఁ బాపంబు తెరువున
రూపుమాపెద. దీనంజేసి కీటజన్మంబు పాటిల్లినను మేల
కాని యీగడంక మాననేర. నన్ను వారింప నెవ్వారివశం

బగునని దిగ్గన లేచి యగ్గురుతనయుండు రథంబెక్కి నం
గనుంగొని యగ్గౌతముండును గృతవర్మండును. 106

ఆ. ఏకనిశ్చయమున నిట యేఁగుదెంచితి
మనఘ, నీవు నేము నధిపునికి
నిట్టిమమ్ము వేఁడుపెట్టి యెక్కటికార్య
మాచరించువాఁడ వగుట దగునె. 107

చ. అనవుడు నాతఁ డిట్టులను నమ్మహితాత్ముల కేనవశ్యముం
జని ద్రుపదాత్మజుంబాదివి చంపెద దుర్గతిఁ బోవుచావుగా
ఘనభుజశక్తి శౌర్యము నకంపితధైర్యమునున్ వెలుంగమీా
రును దెలివొంది కూడికొన రూఢికినెక్కుద మెల్లభంగులన్.

ఆ. ఒండుతలఁపులుడిగి రండనిపోవ నా
రథికవరులు గడఁగి రథము లెక్కి
మొనసి చనిరి వారు ముష్వురు నగ్నిత్ర
యంబుఁ బోలి యొప్పియప్పుడధిప! 109



## తిక్కనసోమయాజి — ఆంధ్రమహాభారతము

### శాంతి పర్వము

# భీష్ముఁడు ధర్మరాజునకు ధర్మరహస్య మెఱింగించుట

సీ. అవనీశ! పారియాత్రాచలంబున నుండు
నొకబోయ ధర్మసంయుక్తబుద్ధి
వింట నేర్పరి మృగవితతిప్రకారజ్ఞుఁ
డారణ్యదేశసంచారశాలి
తల్లికిఁ దండ్రికిఁ దద్దయు భక్తుఁ డై
ఫలమూలమధుమాంసములను మేలి
కూడుగూరలు దొరకొల్పి వారికిఁ దృప్తి
యావహించుచు శయనాసనాదు

తే. లగుపదార్థముల్ హృద్యంబులుగ నొనర్చు
వలయునాహారములు మునివరుల కిచ్చుఁ
బగఱఁ దోఁచినఁ బరిమార్చు భండనమున
నొకఁడ వేవురనైన మహోగ్రగతుల.

క. కాపవ్యుం డనుపేరను
దీపించిన యతనిభూరి తేజము గని ర
క్షాపరుఁడు వలయు మన కని
యాపాలమునఁ గలుదస్యులందఱుఁ దమలోన్.

ఆ. అతనిఁ దమకు నెల్ల నాధిపత్యము సేయు
వానిఁగా వరించువారు గాఁగ
నిశ్చయించి కూడి నెమ్మిమైఁ జనుదెంచి
కాంచి యిట్టు లనిరి గారవమున. 3

క. బలవిక్రమసంపన్నుఁడ
వలఘుచరిత్రుఁడవు మమ్ము నందఱఁ బ్రభు వై
తలకొని రక్షింపుము నీ
వలచినపని గొనుము పుత్రవర్గముఁ బోలెన్. 4

వ. అనిన విని యతండు వారల కి ట్లనియె. 5

సీ. శిశుజనమునిజనస్త్రీజనంబులఁ జంపఁ
గా దెట్టివాఁడైనఁ గడఁగి మీఁదఁ
గవియక పోడుచుట కల్మషం బంగనఁ
జెఱపట్టఁ దగదు విశేష మొకఁడు
వినుఁ డెల్లసత్త్వంబులను బెంటిఁ జంపుట
పాపంబు, గోవుల బ్రాహ్మణులను
సంకటపెట్టంగఁ జనదు తదీయహి
తము గోరి పూని యుద్ధంబు సేఁత

తే. యధికపుణ్యంబు సస్యక్రియావిఘాత
మాచరించుట గడుదోష మవనిప్రజకు
బాధ గావించి కుడిచి శవంబు దోలుచు
బ్రువ్వగతి నది వోలియంగఁ బొలియు నతఁడు. 6

వ. అని చెప్పి మీర లీధర్మాధర్మంబు లెఱింగి నాపంచిన తెఱఁగున బ్రదికెదరేని మీకు ముఖ్యుండ నయి సఖ్యంబు సౌఖ్యంబుఁ బెనుప మీయోగక్షేమంబు లరసెద ననియె. దానికి వార లందఱుఁ బ్రీతిం బొంది యాతని వశంబున వర్తించి వర్ధిల్లి రిట్లు కాపవ్యుండు సాధులకు హితంబగు నట్లుగా దస్యులం బాపంబులకుం బాపి తానును వారును నిహపరసిద్ధులం బ్రశస్తి వహించె. 7

క. కాపవ్యోపాఖ్యానము
పాపహరము దీనిశ్రవణపఠనము లటవీ
వ్యాపారక్షేమంకర
రూపము లగు దస్యుమృగవిరోధము లడఁచున్. 8

వ. అని చెప్పి భీష్ముండు వెండియు నిట్లను దీర్ఘదర్శియుఁ బ్రాప్తకాలజ్ఞుండును దీర్ఘసూత్రుండును ననుమత్స్యంబులు మూఁడు జలచరబహుళంబగు నొక్కయేటి మడువునఁ దమలోనం బొందుగలిగి యుండునవి వేసవి సొచ్చిన దీర్ఘదర్శి దక్కటి రెంటెనిం గూడం బిలిచి. 9

క. మడు వింకఁగఁ బాఱెడు నీ
రెడ్రెవ్విన నొండుపోటి కేఁగఁగ రా దె
ప్పుడు నింకనినీళ్లులు గల
మడువునకుం బోవ వలదె మన కిట్టియెడన్. 10

తే. అనినఁ బ్రాప్తకాలజ్ఞుఁ డిట్లనియె నేది
ప్రాప్తమయ్యెనక్కార్యంబుభంగి నెఱిఁగి

యప్పటికిఁ దగునట్లు సేయంగవలయు
మానితోపాయవృత్తి నేమఱుటలేక. 11

వ. అనిన నయ్యిరుదెఱంగులపలుకులు విని దీర్ఘసూత్రుం
డిట్లనియె. 12

క. జడనిధిచందంబున ని
మ్మడు వొప్పఁగ నిప్పు డేమి మాఁడెనె యిమ్మై
నడిచిపడ రిత్తనెవ్వఁగ
లుడుగుఁడు మఱి చూచికొంద మొయ్యన తఱితోన్. 13

క. అనుటయు నిది కర్జము గా
దని పల్కుచు దీర్ఘదర్శి యంబుస్రోతో
జనితాభయ మగుపథమునఁ
జని చొచ్చెం బెద్దమడువు సమ్మదలీలన్. 14

వ. తక్కిన రెండును నంద నిలిచె నిట్లు నిలిచిన యమ్మత్స్య
ద్వయంబునకు భయంబు జనియింపంగతిపయదివసంబులకు,

క. పాఱెడునీ రెడ్రెవ్వఁగ
డాఱ బెడిద మైనయెండ దనుకఁగ నివురం
బాఱె మడు వంత వేడుక
కాఱులు జాలరులు సొచ్చి క్రందుకొనంగన్. 16

క. వెరవున నూఁతల నెత్తెలఁ
గరముల మత్స్యములఁ బట్టి కడుసంతసముం
బొరయుచు, ద్రాళ్ళం గ్రువ్వఁగ
గర మూహించి మదిఁ బ్రాప్తకాలజ్ఞుండున్. 17

క. ఇం దొక్క త్రాడు గలచి యే
నొందం గా గ్రుచ్చినట్లు యుండెద వీ రీ
త్రందుకొనుట మానంగ న
మందత నది యెడల విడిచి మడువు దఱిసెదన్. 18

క. అని యొకగుదిమీలనడుమ
నెనయంగాఁ దూఱి కలచి యిరుదాడలఁ ద్రా
డొనరంగఁ బట్టుకొని గ్రు
చ్చినచందము దోఁప మూర్ఛఁ జెందినభంగిన్. 19

వ. ఉన్నంత వేఁట దీఱి యగ్గుది గలయతండు. 20

క. తెలిసీట రొంపి వోవం
దొలుచు నెడం ద్రాడు విడిచి దురితంబునకుం
దొలఁగి పొరదప్పి యం దొక
జలచర మున్నయెడ కేఁగె సంభ్రాంతగతిన్. 21

క. ముట్టఁబడి దీర్ఘసూత్రుం
డి ట్ట ట్టరుగఁగ నుపాయ మేది యొకనిచేఁ
బట్టువడెఁ దనదు డెందము
పట్టు వదలి చకితవికలభావేంద్రియుఁడై. 22

క. విను డాదవ్వులఁ గార్యము
గనికొని వలయుపని మున్న కావింపఁగ నే
రనిజడుఁడు దీర్ఘసూత్రుం
డనునమ్మత్స్యంబుభంగి నాపద నొందున్. 23

తే. అప్పటికిఁ దోఁచినట్టులు దప్పకుండ
ననువుతో ధృతి గల్గి కార్యంబు నడపు
నతఁడు ప్రాప్తకాలజ్ఞాఖ్యు నట్లపోలెఁ
బరమసంశయ మయ్యెడు బ్రదుకుఁగాంచు. 24

క. ధుర్యత ననాగతము లగు
కార్యము లూహించి పని తగం జేయు నయా
చార్యుఁడు సౌఖ్యముఁ బొరయును
నార్యస్థితి దీర్ఘదర్శి యనుమీనుక్రియన్.

వ. అనిన విని ధర్మనందనుండు పెక్కండ్రు పగఱకు నగ్గమై
హీనబలుండైన నరపతి యెప్పుడును నాపద నిస్తరించు
వాఁ డనియడిగిన నప్పుడమి తేనితో భీష్ముండు మార్జాల
మూషికసంవాదం బనునితిహాసంబు గలదది నీదగు ప్రశ్నం
బునకు సదుత్తరంబగువిను మని యి ట్లనియె. 26

సీ. అడవిలో నొకమఱ్ఱియడుగున లాఁగలఁ
బలితుండు నానొక్కయెలుక యుండు
నమ్మహీజమువీఁద ననిశంబు లోమశుం
డనుపిల్లి వసియించు నాసమీప
మున సంజకడ నిత్యమును మృగంబుల కురు
లొడ్డి వేఁకువ వచ్చి యొక్కమాలఁ
డగపడ్డవాని ఁగొం చరుగు నొకప్పు డా
హారంబునకుఁ బిల్లి యచట దిరుగఁ

తే. బోయి యురిఁ బడి యుండఁగఁ బొంచి చూచి
భయము దక్కి యచ్చోటన పలితుఁ డెరకుఁ
గ్రుమ్మరఁగఁ జంద్రకుం డను గూబపులుఁగు
హాలికుఁ డను ముంగియు నింత నంతఁ దోఁచె. 27

వ. ఎరలకై వచ్చి యిట్లు దోఁచిన నయ్యెలుక యారెంటి బారికిం దప్పి పోవ రామిదలంచి బెగ్గలించియు ధైర్యంబు కలిమిం గార్యం బూహించి యప్పిల్లిఁ గొండొక సేరం జనుచు దానితో నిట్లనియె. 28

క. ఉరి ద్రెవ్వఁ గొఱికి యిప్పుడ
వెర వారఁగ నీకు నేను విడుగర సేయం
దొరకొనుట నీదు భాగ్యం
బరిత్వము దొఱఁగి మైత్రి యలవఱుపు మదిన్. 29

క. ముంగికి గూబకు నగపడి
యంగంబులు వడఁకుచున్నయవి నా కిమ్మై
సంగతి గలిగిన నీయు
త్సంగంబుననుండి భయము దక్కుదు నేనున్. 30

చ. అనవుడుఁ బిల్లి యిట్టు లను నార్తశరణ్యుఁడ వయ్యె దిట్టి నీ
కనఘ! హితంబు సేయ వల దయ్యె జగత్పతి సాక్షిగాఁగ ని
ప్పని దగఁ బూనితిన్ వెఱపుఁ బాచి ననుం
గదియంగ రమ్ము వ
చ్చిన నకులంబు గూబయును జేరఁగ నేరవు నాకు నోడుటన్.

ఆ. అనిన నట్లు యగుట నాత్మనెఱింగియు
కాదె సంధి మైన నాదు బ్రదుకు
నీదువిడుగరయును నిజమగు టూహించి
నిన్నుఁ జెందె బుద్ధినిశ్చయంబు. 32

క. అని పలికి పిల్లి పొదిగిట
ననయము నిశ్శంకవృత్తి నయ్యేలుక వసిం
చినఁ జూచి యయ్యులూకం
బును నకులము నచటు వాసిపోయె నిజేచ్ఛన్. 33

క. నకులము నులూకమును బో
కకు సంతస మంది యుండి గ్రక్కున నమ్మా
షిక మయ్యురిచేరులు గొఱు
కక యలసత నల్ల నల్లఁ గఱచుచు నుండెన్. 34

వ. అమ్మొయిఁ బలితుండు గానకొని యయ్యురిం గొఱుక
కుండుట యఱింగి రోమశుం డి ట్లనియె. 35

క. తగునే యిట్లు కృతార్థుఁడ
వగునీ కురి గొఱుక కిట్టు లాలస్యము సేఁ
త గటా కృతఘ్నతకు నెల
వగు టొప్పునె కొఱుకు కడఁక నద్రోహుఁడ వై. 36

చ. అనుటకు నెల్క యిట్టులను నాశ్రితరక్షణశీలు నిన్నుఁ గీ
డున్న బొరయింతునే యిది కడుం జెడుగుందన మేను భీతి నూ

నినమదితోడ నమ్మమిన నెట్టన యియ్యురిఁ ద్రెంప
నయ్యేదన్
మనమున నెగ్గుగాఁ గొనకు మాలనిఁ గాంచినయప్డ
త్రెంచెదన్. 37

క. ఉరిఁ బాసి యేమి దలఁతో
యరిత్వమున వినుము ప్రబలుఁడై నయతనితో
వెరవున సంధి యొనర్చియుఁ
గరంబు నమ్మమియ నీతిగాఁ గొంద్రు బుధుల్. 38

ఉ. మాలనిరాక చూచి భయమర్దిత మైనమనంబుతోడ న
క్కాలమునందు నీకుఁ జనఁగా వలయున్ వెస
మ్రానిపైకి నా
యాలయముం జొరన్ సమయ మప్పుడ నాకును గాన
యత్తఱి
న్నే లొనరింతు నమ్మ మిది నిక్కము గర్జము నీవెఱుంగ వే? 39

క. అనవుడు న ల్లెలుక తలఁప
వినుము భవత్ప్రాణరక్ష వెసఁ జేసితి నే
ననఘా! నీవును నమ్మియు
నను నాపదఁ బాపవలదె నమ్మి రయమునన్. 40

ఆ. అనినఁ బిల్లి కిట్టులను నెల్క వేగిర
పడకు ముచితకాలభావ్య మైన
యత్నవిధిగదా సమగ్రఫలత్వంబు
నొందు నొందు దలఁప కూరకుండు. 41

వ. అని యిట్లుప్పలితుండును రోమశుండును నొండొరులతో
మాటలాడుచుండ వేకువ యయ్యె నట్టియెడ. 42

క. తనతోఁ గొందఱు గుక్కలఁ
గొని యే తేరంగఁ గేలఁ గ్రూరకృపాణం
బును భీకరభంగిగ వెసఁ
జనుదెంచెన్ మాలఁ డధికసంరంభమునన్. 43

ఆ. పరిఘునామఁ డైన పాపాత్ముఁ గని భయ
మడరఁ బిల్లి యిట్టు లనియె నింక
నేమి సేయువాఁడ నిదె వచ్చె జముదూత
పోలె సత్వరముగ మాలవాఁడు. 44

క. అనిన విని యోడ కోడకు
మనుచుం దెగఁ గొఱికె వేగ మయ్యుఱిఁబలితుం
డనయముఁ జకితాత్ముండై
చనియెన్ రోమశుఁడు నవనిజముపైకి వెసన్. 45

చ. ఎలుకయు బొక్కలోపలికి నేఁగి ముదంబునఁ బొంచి
చూడ సం
కులముగ నేఁగుదెంచి పరిఘుం డురి నుగ్గగు టెల్లఁ జూచి ని
ష్ఫలతకుఁ జిత్త మెంతయు విషాదము పొందఁగ
బోయెఁ బిల్లి య
య్యెలుకకు నిట్లనుం జెవికి నింపగురీతి నుదాత్తభంగిగన్.

ఆ. మేలు సేసి తగినమిత్రునిఁ బడసి త
త్సుచరితముల వచ్చు సుఖము లనుభ
వింపఁ జూచు టుడిగి వేర్పడియుండుట
యరయ నీతివిదుల తెరువు గాదు. 47

చ. అనఘ! భయంబు నొందు టిది యారయ బేలతనంబు నెమ్మిమై
మును ననునమ్మి చెంది భయమోక్షణముంగనినాకుఁజాల మే
లొనరఁగఁ జేసి తీవు దుది నుల్లమునం దగ విశ్వసింప కి
ట్లునికి సుఖంబె నాదుసిరి కుత్తుఁడ వయ్యెదు రమ్ము ప్రీతితోన్. 

క. బలవంతు లైనచుట్టం
బులు నేనును నీకు మేలు వొనరింపఁగ ని
మ్ముల మనుట యొప్పదే ననుఁ
గలసిమెలఁగు విడువు శంకఁ గనుమభిమతముల్. 49

వ. అనిన విని యుప్పలితుండు రోమశునితో నీపలుకు లుచి
తంబులు, నామాటలు వినుమని యి ట్లనియె. 50

చ. అరులను మిత్రులం దెలియ నారయు టెంతయు సూక్ష్మ
కృత్య మ
వ్వైర మతిదుర్లభం బరులు వీ రన నుండియు మిత్త్రభావముం
బొరయుటయున్ సుహృజ్జనులపోలికి గల్గియు శత్రుతాగుణ
స్ఫురణ మొకప్డు సూపుటయుఁ జూతుము గాదె ధరిత్రి
నెల్లెడన్. 51

వ. కావున నిన్నుఁ బెద్ద గదియుట గర్జంబు గాదు నీవును

మద్వ్యశగతిం బొందుటఁ జూచి తేనియు నేమఱం జన
దెట్లంటేని. 52

క. బలవద్రిపులు ప్రయోజన
ములకై లోఁబడుట గల్గుఁ బొలముల నేనుం
గులు దీమంబులపజ్జఁ ద
గిలి నెట్టన పట్టువడినక్రియఁ జతురమతీ! 53

చ. అరియెడ మిత్రభావ మొకయప్పుడు కార్యముపొంటెఁ గల్గిన
న్వైరవునఁ బాముఁ బట్టునెడ నిక్కము నమ్మక దానివాతికిం
గరము దొలంగఁ జేయునరుకర్జము వట్టి చరించు టొప్పదే
పొఱుగున నుండి నీకు హితముం దగఁ జేసెద నెప్ట పంచినన్. 51

మ. విను నీ కామిష మేను నీయెడఁ గడుం విశ్వాసముం బూని చే
రిన నీచిత్త మొకప్పు డుదుద్గతవికారీభూత మై దుర్వినో
దనహింసా రుచి నొందు నీసుతసుహృద్బంధువ్రజం బేని మఱ్ఱ
ననుఁ గన్నఁ సహియింప దాత్మఁ గరుణ న్మన్నింపు మి ట్లుండెదన్. 55

వ. అని యంత నిలువక. 56

క. బలుపుటురిఁ జిక్కి పేరాఁ
కలితో రే యెల్ల నున్న కతమున నీకుం

జలిది వలసి పిలిచెద నిటు
వలయును నీపల్కు నమ్మి వత్తును చేరన్. 57

ఆ. అసుడు నిట్లు దలఁప నగును మత్ప్రాణర
క్షకుఁడ వైననిన్ను శత్రుఁ గాఁగ
దలఁతునే కృతజ్ఞతయుఁ బౌరుషంబును,
గలుగ నేను వెఱవ వలవ దనఘ! 58

వ. అనిన రోమశునకుఁ బలితుం డి ట్లనియె. 59

క. నీవలన నేను బ్రదికితి
నీవును నాకతన మూలనికి నగపడ వై
తీవిధమునఁ గల్గుసుహృ
ద్భావము చాలు నినుఁ జేరఁ దగ దిటమీఁదన్. 60

వ. ఇవ్విధంబునకు శుక్రువాక్యంబులుం గల వాకర్ణింపుము. 61

క. బలవంతుఁ డైనశత్రుని
వలనఁ బ్రయోజనము గలిగి వలను కలిమిఁ దాఁ
గలసియు నది గడచనఁగాఁ
దొలగఁ వలయు నమ్మనేనిఁ దుదిఁ గీ డొలయున్. 62

ఆ. నమ్మఁ దగనివారి నమ్మకయున్నది
తగినవారి నైనఁ దద్ద నమ్మి
యుండఁ దగదు తన్ను నొరులు నమ్మెడునట్లు
యుండి యొరుల నమ్మకునికి నీతి. 63

వ. ఇట్టిద బ్రతుకుఁదెరు వగుటం జేసి. 64

క. నినుబోంట్లను నమ్మక యే
నును బ్రతికెద ననఘ! నీవునుం గని చండా
లునియట్టివారి మాయలు
నినుఁ బొందక యుండ బ్రదుకు నెఱిఁ బొ మ్మింకన్. 65

క. అనిన విని సిగ్గువడి తన
చనుచోటికిఁ జనియె బిల్లి సమ్మతిఁ బలితుం
డును వేఱొకతగులాఁగకుఁ
జని సముచితవర్తనమున సౌఖ్యముఁ బొందెన్. 66

క. బలుపగఅవలని నూపద
దలుఁగుటకును రిపుని హీనతరు నైనఁ దనుం
గలిపికొని బ్రదుకుటకు ని
య్యెలుకయుఁ బిల్లియును వెరవు లెఱిఁగించెఁ దగన్. 67

వ. అనిన విని కౌంతేయాగ్రజుండు శాంతనవునితో నెవ్వారి యెడ విశ్వాసింపకున్నం జిత్తంబునకు విశ్రామంబుగల్గదు విశ్వసించిన దురితంబులు దొడరున ట్లగుటం జేసి విశ్వసించుటయు విశ్వసింపక యుండుటయు నను రెంటిలోనను బరమకర్తవ్యం బెయ్యదియో నిశ్చయింప నేరననుటయు నమ్మహీపతి కమ్మహాత్ముం డిట్లనియె. నీయర్థంబు దేట పరచునట్టి యితిహాసంబు సెప్పెద నాకర్ణింపుము. 68

సీ. బ్రహ్మదత్తుం డనఁ బరఁగిననరపతి
నగరఁ బూజని యనునామ మొప్పఁ
జతురభాషిణి యొక్క శారిక వర్తించు
నది పిల్లఁ బెట్టి యింపారుపండ్లు
దెచ్చి యర్మిలి దాని కిచ్చుచో మే లేటి
యధిపుపుత్రున కిచ్చు నందుఁ గొన్ని
వాఁడును మచ్చిక వచ్చి యప్పిల్లతోఁ
జర్లాట మాడుచు సంచరించు

ఆ. నొక్కనాఁడు దాది యొద్ద లేకుండ న
ద్దారకుండు పిల్లతల నొగిల్చి
చంపె దానితల్లి సనుదెంచి కని మది
నిట్టు లనియె శోక మెసక మెసఁగ. 69

తే. అకట కూడి మెలంగి యేమొకటియైన
నర్థి నిదియును దానును ననుభవించుఁ
బట్టి యాడుచు నుండు నిష్పాపజాతి
పడుచు సంపునె యిటు దీని మిడుకమిడుక. 70

ఆ. రాచకొడుకు గాఁడె రాచవారికి నేటి
పరిచయంబు వేగ కరుణ విడుచు
హితవు మఱచు రాజు లెందు నమ్మికకుఁ బా
త్రములె సమదమతులు క్రౌర్యరతులు. 71

వ. అని నిందించి. 72

క. ఈపగ దీర్చెద నంచుం
గోపంబున రాజుకొడుకు గ్రుడ్డులు రెండుం
బోపడు నట్లుగ గోళ్ళన్
వే పెఱికి రయమున గగనవీధికి నెగసెన్. 73

వ. ఎగసి యచ్చోట.నిలిచి బ్రహ్మదత్తుండు విన ని ట్లనియె.

క. చేసె నఘము దత్ఫలముం
జేసేతం గుడిచెఁ గాని శిశువునెడన్ నా
చేసినక్రౌర్యము లే దేఁ
జేసితి మా ఱొండు గీడు సెందదు నన్నున్. 75

చ. అనవుడు బ్రహ్మదత్తుఁ డది యట్టిద నీదెసఁ గీడు లేదు నీ
చనుటకు నామనం బతివిషాదము బొందెడుఁ దొంటియట్ల నె
మ్మిన నిలు మన్నఁ బూజని శమించునె యొండొరుచేతఁ
బడ్డయా
పెనుఁబగ నొంచి మాటపస బేల్పడి క్రమ్మఱఁ జేరు
టొప్పునే, 76

వ. అనిన విని యతండు, 77

క. చేసినదానికి మాఱుగఁ
జేసినఁబగ యంతతోడఁ జెడుఁ గాక గుణుల్
డాసిన నమ్మేలు విడిచి
దోసముఁబట్టుదురె యెట్టితుచ్ఛులుఁ జతురా! 78

వ. అనిన నతనికి శారిక యిట్లనియె. 79

క. నెయ్యము సెడినను మాటల
తియ్యఁదనము వట్టి పగ మదిన్ మఱచినఁ జా
వయ్యెం జే టయ్యెఁ గలఁక
యయ్యె నొకటి మూఁడుఁ గాక యది మేలగునే. 80

ఆ. వినుము నేల దోఁచికొనినను దాయాదు
లైన మాటమాట కేని నాఁడు
వారియెడను గీడు వారక చేసినఁ
బగ జనించు నిట్లు భంగులైదు. 81

ఆ. పగయుఁ గల్గెనేని పాయునె గూఢ మై
ప్రమాన నగ్ని యున్నమాడ్కి నుండుఁ
గాన నమ్మ బేల కాలాంతరంబున
నైనఁ జెడును సందియంబు వలదు. 82

క. జననీజనకసహోదర
తనూభవుల సఖుల నమ్మఁ దగ దనినను నె
మ్మనమునఁ బగ గలవారలఁ
జనునే నమ్మంగ విడువు చతురవచనముల్. 83

వ. అనుటయు బ్రహ్మదత్తుం డి ట్లనియె. 84

క. కాలవశంబునఁ గీడు
న్మేలును జనులకును మూఁడు నీకును నాకున్
వాలి యవి సేయ వచ్చునె
బేలనె యే నంత యేల వెడఁబాయంగన్. 85

వ. అనిన విని శారిక యతనిమొగంబు దేఱకొనం జూచి. 86

క. విను చల్లనిమాటలలో
మునిఁగి యలుక గుబ్బతిలు సముద్రజలములో
నన యుండి యూఱ కెప్పుడు
గనగన మనుబాడబాగ్ని కరణి నరేంద్రా! 87

క. అని పలికి యవిశ్వాసము
మనమున నెలకొల్పి రాజుమాటలకుం దే
లనివెరవుతోడ నాపూ
జని దన కిమ్మైనయెడకుఁ జనియెఁ గుమారా! 88



# తిక్కనసోమయాజి - నిర్వచనోత్తర రామాయణము

## సీతాపరిత్యాగము

13వ శతాబ్దియందుండిన తిక్కన మహాకవిచే రచింపఁబడిన నిర్వచనోత్తర రామాయణమునుండి యీ క్రిందిభాగ ముద్ధరింపఁబడినది. ఉత్తర రామాయణమందలి యీ కథాభాగమువలన ప్రజాభిప్రాయము ఎట్లు అనిశ్చితమో, అన్యాయమో, అపరిశీలితమో తెలుపుచు, అయినను ఆది ప్రభువునకు అతిక్రమింపరానిదని కవి సూచించుచున్నాఁడు.

ఉ. రావణునింట నుండఁగ ధరాసుత నే మరలంగఁ దెచ్చి సం
భావన సేఁత కష్టమని పల్కిరి చూచితె లక్ష్మణా! మహా
దేవుఁడు బ్రహ్మయున్ మునులు దేవగణంబులు మెచ్చ నయ్యెడం
బావకుఁ డిచ్చె నాకు సతిఁ బాపపుమాటలు పుట్టె నియ్యెడన్

ఉ. వేవురు నేల నేను పృథివీసుతచిత్తము పెంపెఱుంగ నే
భూవలయంబు సంచలత బొందిన వారిధి మేరదప్పినన్
దేవనగంబు పాఁతగలి త్రెళ్ళిన నందొకకీడు గల్గునే?
యావనజాక్షి నిట్లు సెడనాడిన నక్కట నోరుప్రువ్వదే? 2

ఉ. ఐనను మీకు నొక్క తెఱఁగస్ఖలితంబుగ నేను జెప్పెదన్
దానికిఁ గాదునాక, భువనంబులకున్ నను శుద్ధుఁ జేయుఁడ
జ్జానకి నెల్లభంగుల నిజంబుగ నిప్డు పరిత్యజించినం
గాని యకీర్తి వాయ దటుగాదని నోళ్ళుల మూయవచ్చునే!

క. జడమతులయిన జనంబుల
వెడమాటలు మాన్పనిదియ వెరవెబ్భంగిన్
సడికంటెం జావుమేలని
యెడి పలుకు దలంపవలదె యిలం బురుషులకున్. 4

ఆ. పూని జీవితంబులైన మిమ్మైనను
వలయుచోట విడువవచ్చుం గాని
వర్తనంబు గౌరవం బొకయించుక
యైన విడువ దుస్సహంబు నాకు. 5

క. ఒకభంగిం బాపికొనరా
దొకొ మిథ్యానింద యనుచు నొండు తెఱంగు మీ
రకుటిల చిత్తులరై చూ
డకుఁడీ నామదికి సంకటం బది యెల్లన్. 6

క. ఏనెఱిఁగి యైన నెఱుఁగక
యైనను నిత్తెఱఁగ నిశ్చయము సేసితి నా
యాన సుఁడీ నాకడ్డము
గా నొకపలుకైనఁ జెప్పఁ గడఁగితిరేనిన్. 7

చ. అనవుడు వారలొండొరుల యాననముల్ గలయంగఁ జూచి య
జ్జనపతి తెంపువాపెడు విచారము చిత్తములం దొకింతయై
నను మొలతేర కవ్విధమునం దమ నిశ్చయమైన లేక నే
మనియును బల్కరాక వెఱఁగందఁగ నెడియు నాతఁడిట్లనున్.

ఉ. సూక్ష్మముగాఁ దలంచిన విశుద్ధచరిత్రము దుఃఖహేతువే
లక్ష్మియుఁ బ్రాణముల్ సరియె లజ్జకు రిత్తవిచారమేటికిన్
లక్ష్మణ! యెల్లి నీవు చటులస్థిరవాజులఁ దేరఁ బూన్చి యా
పక్ష్మలనేత్రఁ గోరికనెపంబునఁ దోకొని పొమ్ము కానకున్.

క. ఇమ్ములఁ జని గంగా తీ
రమ్ము తపోవనములందు రమియింపఁగ నా
సమ్ముఖమునఁ గోరినయది
యమ్ముద్దియ యచటి కనుపనగు సుకరముగాన్. 10

క. కొనిచని వాల్మీకి తపో
వన పరిసరభూమిఁ ద్రోచివచ్చెడి దయ్యం
గనకును నాకును నిదె విధి
యనుమానింపకుఁడు నిశ్చయంబైన యెడన్. 11

క. అని పలికి తనదు తెగువకు
ననుజన్ములు తలలు వాంచు టనుమతిగాఁ గై
కొని వారి నిండ్లకును బోఁ
బనిచి యచటువాసి ధరణిపాలుం డరిగెన్. 12

క. ధాత్రీపతి కనుజులకును
నేత్రంబుల బాష్పవారి నిద్రనుడుప నా
రాత్రి యొకభంగిఁ జనిన సు
మిత్రానందనుఁడు వంత మిగిలిన మదితోన్. 13

చ. దివస ముఖోచితక్రియలు దిగ్గన సల్పి సుమంత్రుఁజూచి దా
నవకులమర్దనుండు రఘునాయకుఁ డెక్కు రథంబుఁ
బూన్పు గా
రవమున దేవి నిర్ఝరతరంగిణి పొంతఁ దపోవనంబులన్
వివిధ వినోదముల్ సలుపు వేడుక నాథుననుజ్ఞ నేఁగెడున్.

ఆ. అనుడు నతఁడు కడఁక నరదంబు సక్కఁగాఁ
బెట్టి ఘోటకములఁ గట్టి తెచ్చి
సవినయంబుగాఁగ సౌమిత్రిముందట
నిలిపె నంత మేదినీవిభుండు. 15

క. అడలడఁచి నెమ్మనంబున
వెడ తెలి వోడఁగూర్చి మాట వేర్పడకుండం
జిడిముడి పడక నయంబున
నెడమడు వొక్కింత లేక యిట్లను సతితోన్. 16

చ. పొలఁతుక, గంగచేరువ తపోవన భూములు చూడ నీ
మదిన్
మొలచిన కౌతుకంబు తుదిముట్టఁగ లక్ష్మణ దేవు నిన్ను నం
దులకు మనోముదం బెసఁగఁ దోకొనిపో నియమించితిన్
సము
జ్జ్వల మణికాంతమైన రథసత్తమ మెక్కుదు రమ్ము
నావుడున్. 17

ఉ. అక్కట నాదు వేడ్క కుచితానుచితంబులు సూడకే విభుం
డొక్క తలంపువాఁడయి సముత్సుకత న్ననుదవ్వుపుచ్చఁగా

నిక్కమ యియ్యెడ్ లరయ నెయ్యము తియ్యముగాదె యంచు నిం
పెక్కఁగ రాముడెంద ముదు కెక్కరథంబు లతాంగి యెక్కినన్. 18

ఉ. అత్తతినున్న ధైర్యమున కచ్చెరువందుచు జీవితేశు హృ
ద్వృత్త మెఱుంగమిన్ మదిని దీనికి నమ్మట కుమ్మలించుచున్
జిత్తము ఖేద మానసముఁ జెందిన మాన్పఁగ లేక లక్ష్మణుం
డుత్తలమందుచున్న విభుఁ డుగ్మలి కాతనిఁ జూపి యిట్లనున్.

ఉ. దూరమునాక ఘోరవనదుర్గతలంబులఁ గేలి సల్పగాఁ
గోరెడు భామలం బ్రియలఁ గోరినయట్టుల పుచ్చు రాజులన్
ధారుణి నెందుఁ గానమని తా మును దీనికి నడ్డపెట్ట నేఁ
బోరితమాడి యిట్లు నిను బుచ్చుట కల్గినవాఁడు చూచితే.

క. అని తన మొగమొప్పమి క
మ్మనుజేంద్రుఁడు నెపముదప్పి మాటాడినఁ దా
నును దదనురూపవచనము
లను సంభాషణ మొనర్చె లక్ష్మణుఁడు దగన్. 21

క. జననాథుఁ డుడుగరలు భూ
తనయ మనం బలరఁ గట్టి తగ నొప్పించెన్
మునివరుల పత్నులకు ని
మ్మని మణిమయభూషణాంబరాదులు ప్రీతిన్ 22

తే. ఇవ్విధంబునఁ దనతలం పించుకంత
యైన జానకి యెఱుఁగని యట్లు గాఁగఁ
బాలతోఁడ విషంబిడు పగిది ననిచి
పుచ్చి రాఘవుఁ డుల్లంబు నొచ్చి మరలె. 23

చ. లలితగతిన్ సతోయ కమలస్ఫుట మార్గమునన్ శరీర ర
క్షులు వినయంబుతో నడపి గౌరవ మొప్పఁగ భక్తి పెంపుమై
నలయక పంపుసేయుచు మహాశ్రమభూములు వీడుపట్టుగా
లలనఁదగన్ సుమంత్రుఁడును లక్ష్మణుఁడున్ గొనిపోయి రిమ్ములన్. 24

క. చనిచని జనక తనూభవ
తన తనువున దుర్నిమిత్తతతి గలయఁగఁ దోఁ
చిన నిట్లనియె సుమిత్రా
తనయునితో నెమ్మనంబు దలఁకుచునుండన్. 25

ఉ. తప్పక మున్ను గన్గొనువిధంబ యమంగళ సూచకంబులే
నిప్పుడు నా శరీరమున నెన్నియొ కాంచితి నంతరంగముం
ద్రిప్పికొనందొడంగెఁ బతిదిక్కున బంధులవెంట భృత్యులం
దొప్పమి యేమి వాటిలుటకో వెఱపయ్యెడు నాకు లక్ష్మణా!

క. అనవుడు నమ్మాటలు గీ
టునఁ బుచ్చుచు నతఁడు లలిత డోలాయత వీ
చి నిచయ సుభగాకృతియగు
ననిమిషనదిఁ జేరనరిగె నత్యంత ధృతిన్. 27

ఉ. అయ్యెడ రేవుఁబోయలఁ బ్రియంబుమెయిం బిలిపించి దేవికిం
జయ్యన నోడ వెట్టుమని శాంతతఁ బిల్చి సుమంత్రుఁ జూచి నీ
వియ్యెడనున్న తేరనుచు నింతినిడించినఁ బోతపాత్రపై
కొయ్యనపోవఁ దాను కని యుత్తరణక్రియ నిర్వహించిసన్.

ఉ. సంతసమందుచున్న రఘుసత్తము దేవికి లోకవాద వృ
త్తాంతము నన్న తన్ బిలిచి యన్న తెలుంగును దత్తపోవనో
పాంతము గావునం దెలియఁబల్కఁదలంచుచు నల్లఁజేరి య
త్యంతవిషాదివై రఘువరానుజుఁ డాత్మ
చలించుచుండఁగాన్. 29

శా. నాకింకన్ మరణంబ కార్య మిటు లన్యాయ
ప్రవృత్తాత్ముఁడై
కాకుత్ స్థాన్వయదీపకుండు నను లోకత్యాజ్యుఁ
గావించె నం
చాకాంతాతిలకంబు పాదముల పర్యంతంబుగాఁ బుణ్యాగ
ణ్యాకారుండిలఁ జాఁగి మ్రొక్కిన మనం బాకంపమున్
బొందఁగాన్.

ఉ. కారణమేమి నన్ను దళకంఠకులాంతకుఁ డెగ్గువల్కెనో
నేరమిగల్గెనో యకట నిక్కము నాకెఱిఁగింపు మిట్టి దు
ర్వారమనోవ్యథం బొరయువాఁడవుగావు వివేకవిశ్రుతా
చారుఁడవైన నీవని విశాలవిలోచన గారవించివన్. 31

ఉ. ఇత్తెఱఁ గాచరించుటకు నేనిది యేటికి నియ్యకొంటి నీ
యుత్తమురాలి నోఁబలుక నోపఁగవచ్చునె యంచు వెండియుం
జిత్తము గూడఁ దెచ్చుకొని చెప్పకపోదని నిర్ణయించి డ
గ్గుత్తికవెట్టి లక్ష్మణుఁడు కోమలిఁజూచుచు నశ్రులొల్కఁగా. 32

శా. ఏనింకేమని చెప్పుదున్ రఘుకులాధీశున్ జగంబెల్ల నీ
కై నిందింపఁగఁ జాలనొచ్చి యది మిథ్యావాదమైనన్ సమా
ధానం బేర్పడఁ జేయకున్న నిజవృత్తం బెంతయున్ దూషితం
బై నీచత్వము రాకతక్కదని యూహాపోహసంవేదియై.

క. పురజనుల భూజనంబుల
పరివారం బొందుభంగిఁ బాయమి జీవ
న్మరణంబగుచున్న భవ
ద్విరహంబున కియ్యకొనియె విభుఁ డధికధృతిన్. 34

ఉ. ఏకతముండి నన్ బిలిచి యేర్పడ నింతయుఁ జెప్పి తేరిపై
వే కొనిపోయి నీవు పృథివీసుత కోరినయట్లకాఁగ వా
ల్మీకుల యాశ్రమంబున సమీపమునన్ మనకృత్య నిశ్చయం
బా కమలాక్షికిం దెలుపుమన్న నృపాలకు నాజ్ఞసేసితిన్.

క. ఆశ్రమమల్లదె మునిచర
ణాశ్రయపు నిరస్తశోకవై యుండు జగ
ద్విశ్రుతియగు నీపతియును
నాశ్రమ విరహితుఁడయింక ననిపల్కుటయున్. 36

క. తాలిమి కొలఁదులఁ బోవని
వాలాయపు దిగులుగుండె వ్రయ్యఁ గదిరినన్
గీలెడపిన జంత్రము క్రియ
నేలపయిం బడియె మేదినీతనయ వెసన్. 37

క. పడి మూర్ఛిల్లి మగుడ నొక
వడికిం దెలివొంది బాష్పవారి కనుఁగవం
గడలు కొనుచుండ వాతెఱ
తడుపుచు వెలవెల్లనగుచుఁ దల్లడపడుచున్. 38

క. పలుకుడిగి పెద్దప్రొద్దా
కులదృష్టి మఱందిఁ జూచుఁ గొండొక నవ్వుం
దలయూఁచు ముక్కుపై నం
గుళమిడు వెఱఁగందు వగలకుం గొలువిచ్చున్. 39

ఆ. సందియంబువడ విచారంబునకుఁజొర
మాఱువలుక నొండుమాడ్కిసేయ
వెరవుగాక పిడుగు వ్రేసినయట్లైన
మాటకియ్యకొనుచు బోఁటిపలుకు. 40

క. అగుఁగాక యట్లు చేసెద
జగతీపతి పనుపుసేసి చను నీవును నీ

తెగువ రఘుపతికి నీకుం
దగవఁట యేననెడిదేమి తమ్ముఁడ చెపుమా. 41

సీ. అఖిల ధర్మస్థితి నపచారి యందునే!
యాావనంబునఁ దపమాచరించె
కరుణాసముద్రుండు గాఁడందునే! యట్టి
యపరాధిఁ గృతక వాయసముఁ గాచె
నాశ్రితరక్షమై నర్థి లేడందునే!
పగతుతమ్ముని రాజ్యపదవి నిల్పెఁ
బాటించి నన్ను సంభావింపఁ డందునే!
నాకుఁగా నెన్ని యత్నములు చేసె

పతి జనించిన కోలెను బరహితైక
లోలమతి యొడల్ సిదిమినఁ బాలువచ్చు
నాతఁడిది కార్యమని నిశ్చయంబుచేత
నాయభాగ్యంబ యొండొక వేయునేల! 42

క. ఇడుమలు గుడువఁగఁ బుట్టిన
యొడలిది యిటులోపుఁగాక యొడ్డులు నాచేఁ
బడిరి తొలుభవమునం ది
ప్పుడు తత్ఫలమందకున్నఁబోవునె నాకున్. 43

ఉ. ఉల్లము పొక్క నెవ్వగల కోటటి యే మరణంబుగోరినం
జెల్లదె జాహ్నవీ సలిలసేచన మూర్ధ్వగతిప్రదంబు సం

ఫుల్ల యశోభిరామమగు భూపతివంశము నిల్చునంతలో
న్నొల్ల దురంతదుఃఖముల కోర్చుట మేలు తలంచి
చూడఁగన్. 44

చ. అతులిత పుణ్యమూర్తులగు సత్తులకెల్లను నేనుభక్తిఁ బ్రెమొ
క్కితి నెఱిఁగింపు సూర్యకుల కేతువునా విలసిల్లు రాము సం
తతి భరియించి యున్నయది దానికి శోభనమందఁ గచ్ఛప
స్థితినయినం దలంపు దయసేయుఁడు మీరని యప్పగింపుమీ

క. జనపతికి నింక నే నే
మని చెప్పిన నేమియగును నదిగడచనె నై
నను నూసుఁబోక వెండియు
ననియెద నొకమాట రఘువరానుజ, నీతో. 46

చ. తనమది నొక్కయుమ్మలిక దక్కిన మంచిది దానిఁబాపఁగా
నని తలపోసి చేయుపని కక్కట యేనును లోనుగానె నా
కు నెఱుఁగఁజెప్పి పొమ్మనుటకుం దగనే
మొగమోటలేక మ
న్నన యెడనైన రాజులమనంబులు ద్రిప్పఁగ బల్మిగల్గునే!

క. కానిమ్ము నాకుఁ జెప్పినఁ
గానియ కాదధిపుపనుపు గడతేర్పఁగ నేఁ
బూనిన పనియిది నీవును
బూని యొనర్చు టదియెల్లఁ బొచ్చెమె చెపుమా. 48

తే. పతియె చుట్టంబు పక్కంబు పతియె చెలియుఁ
బతియె తల్లియుఁ దండ్రియుఁ బతియె గురుఁడు

పతియె దైవంబుగావున నతనిపంపొ
నర్చుటయ కాదె ధర్మంబు నాతికరయ. 49

ఉ. మేనికి నంతవంతఁబడ మిక్కిలి కాఱియఁబెట్టి నొంపఁగాఁ
బూనితి నోర్వకున్న నదివోవునె యట్లు జగంబువారలున్
మానము లేక యీతులువమాటల నాదెస నాడ దుస్సహం
బై నది దీనిమానుపు నుపాయము చొప్పడ
దేమి సేయుదున్. 50

మ. అనుచుండన్ మఱుమాటపల్కక సముద్యద్బాష్పుఁడై లక్ష్మణుం
డినవంశాగ్రణి దేవిపాదయుగళంబీక్షించి ధాత్రీతలం
బును ఫాలంబునఁబొంద మ్రొక్కి వినయంబుం దీవ్రశోకంబు నె
మ్మనముం జుట్టుకొనం బ్రదక్షిణముగా మందప్రచారంబునన్. 51

క. వడినంటఁదాఁకు బలితపు
టడలున రూపఱిన మనమునం దోరిమి పాఁ
తెడలి వెసఁబురికిఁబోఁ దెగు
వడరిన వావిడిచి దిక్కులద్రువ నఱచుచున్. 52

చ. అరిగి మరుత్తరంగిణి యుపాంతము డాయుచు రోదనంబుతో
బెరయఁగిరాతు దీనమతిఁబిల్చి తదాహితయానపాత్ర మా

తురగతినెక్కి యద్దరికి భూతకళంకుఁడువోయె మేదినిం
బొరలుచు నోడదిక్కరయు భూతనయం బలుమాఱు
చూచుచున్. 53

క. చని యరదమెక్కి యల్ల
ల్లన పోవుచు నిలిచి నిలిచి లక్ష్మణుఁ డయ్యం
గనఁ బొరిఁబొరి మరలి కనుం
గొనుచుండఁగఁ గోమలియును గొందలపడుచున్. 54

సీ. మున్నా తెలుంగున నున్నట్టి యేనిప్పు
డిమ్మెయి వనమున కెట్లువోదు!
నిదియేమి యొంటిమై నే తెంచితనిన నె
ప్పాటనే మఱుమాట పలుకనేర్తు!
నెవ్వారితోడ నేనేమని యీ దుర
వస్థమాటికిఁ జెప్పి వనరుదాన!
బతియిల్లువాపిన కతము నన్నడిగిన
నేను దప్పేదిగా నేర్పరింతు!

మునిసతీజనంబు ముందటఁ గొంకక
యెవ్విధమున మెలఁగి యిచట నిలిచి
కాలమెట్టిభంగిఁ గడపుదు నేనని
యడలి యేడ్చుచున్న యవసరమున. 55

క. మునిపుత్రకు లేటికిఁ జని
చని యమ్మెలుఁగునకుఁ జేరి చంద్రాస్యఁ గనుం

గొని యటఁబోవక యరిగిరి
మనములఁ గృపగదుర నాశ్రమములకు మరలన్. 56

ఆ. సరభసముగ నేఁగి సంయమి చరణార
విందములకు నధికవినయమెసఁగ
మ్రొక్కి మోడ్పుఁగేలుఁ ముందట నిగిడించి
యిష్టమెఱుఁగ నతని కిట్టులనిరి. 57

మ. ఒక నారీతిలకంబు కాననములో నుద్దామశోకార్తయై
వికలాలోకన మశ్రుధారలును బృథ్వీరేణు లిప్తాఁగముం
బ్రకటాక్రందనమున్ వికీర్ణకబరీభారంబు వక్త్రాబ్జశో
షక నిశ్వాసగమోహ్యముం గలయవస్థంబొందఁగా
నమ్యేడన్. 58

తే. అరిగి యరిగి కనుంగొని యటఁ జనంగఁ
గాళ్ళులాడక మీకెఱుఁగంగఁ జెప్పఁ
బాఱు తెంచితి మేమహాభాగు సతియొ
నిరుపమోదాత్తమూర్తి యన్నీరజాక్షి. 59

చ. అనవుడు నమ్మునిప్రవరుఁ డా రఘువంశవరేణ్యు దేవిగాఁ
దనమహనీయ బుద్ధిఁగని ధర్మవిధిన్ మహితార్ఘ్యపాత్ర చే
కొని రభసంబునం జనియె ఘోరదశాపరిపాకతప్త చే
తన యగుచున్ మహిం బొరలు తామరసానన
యున్నచోటికిన్. 60

మ. చని సంతర్పణవాక్యపూర్వముగ నాశ్వాసంబుగావించినన్
వనితారత్నము భక్తి నమ్ముని పదద్వంద్వంబునం దశ్రులం
గొని పాద్యంబొనరించె నాతఁడు మనఃక్షోభంబు సంధిల్ల ని
ట్లనియెన్ గద్గదికానిరుద్ధవచనుండై యాసరోజాక్షికిన్. 61

క. జనకుఁడు తండ్రియు దశరథ
జననాథుఁడు మామయఁట విశాలయశశ్శ్రీ
ధనుఁడగు రాముఁడు పతియఁట
వనితలతో నిన్ను నెన్నవచ్చునె సాధ్వీ! 62

క. నీవచ్చిన తెఱఁ గెడఁదను
భావించి యెఱింగి నీదు పావనచరితం
బీవెడమాటల నాఱడి
పోవుట కత్యంతచింతఁ బొందితి నబలా! 63

తే. లోకముల నెద్ది యేనియు నాకు నెఱుఁగ
రాని యట్టిది లేదు నిర్మలతనొప్పు
నీదుచరితంబు తెల్లంబుగాదె రాము
నేరమియ చూవె యింతయు నిక్కమరయ. 64

చ. ఇదె మనయాశ్రమం బిచట నీవు వసింపు తపస్వినుల్ ప్రియం
బొదవఁగ నీకు నెల్లపనియుం బరమాదరవృత్తి నాచరిం
చెద రిదె నీగృహంబునకుఁ జేరితి గావున నీదుగర్భ మ
భ్యుదయముఁబొందు దుర్యశముపోవుఁ బదంపడినమ్ము
మెమ్మెయిన్. 65

క. కైకొను మర్చన మనవుడు
నా కోమలి తెలిసి యర్ఘ్య మందుకొనియె సు
శ్లోకుఁడగు నమ్మునీశ్వరు
సాకతమున శోకవహ్ని శాంతతఁ బొందన్. 66

తే. ఇత్తెఱంగున నూరార్చి యింతిఁ దఱిమి
యల్ల నల్లన తోకొని యాశ్రమమున
కరుగు దేరంగ నమ్మునీశ్వరున కర్థి
నెదురువోయి తపస్విను లెఱఁగుటయును. 67

చ. జనకునికూఁతు రార్యగుణశాలిని రాముని దేవి సీత యా
తని కొఱఁగామి నియ్యెడకుఁ దాపసవృత్తిఁ జరింపవచ్చె ని
వ్వనితకు నెల్లకృత్యము దివానిశముం బరికించి బాంధవం
బు నెఱయఁ జేయుఁడీ యని తపోధనసత్తముఁ
డప్పగించినన్. 68

ఆ. ఆతపస్వినులు ప్రియంబున జానకిఁ
బొదివి యాత్మవాస భూమి కర్థి
తోడ గారవించి తోకొనిపోయిరి
మునియు నిజనివాసమునకుఁ జనియె. 69



## ఎఱ్ఱాప్రెగ్గడ – హరివంశము

# స్యమంతకోపాఖ్యానము

14వ శతాబ్ది మధ్యభాగముననుండిన యెఱ్ఱన హరివంశములోని పూర్వభాగమును తెనిఁగించి కొండవీటిప్రభువైన వేమారెడ్డికి అంకిత మిచ్చెను. పఠనీయభాగము అందలి మూఁడవ యాశ్వాసములోనిది. ఎంతజాగరూకులైనను మనుష్యులు అపనిందపాలగుట సంభవింపవచ్చు ననియు, అద్దానిని సమర్థులగువారే పాపుకొనఁ గలరనియు దీనివలన తెలుఁగఁదగినది.

క. సత్రాజిత్తు విమల చా
రిత్రమునకు నాత్మలోనఁ బ్రియమంది తగన్
మిత్రుండయ్యెను త్రిభువన
మిత్రుఁడు మిత్రుండు కృప నమిత్రధ్వంసీ!

వ. ఇట్టి సత్రాజిత్తు సముద్రతీరంబున నిలిచి నియతుండై పదునొకండు దినంబులు సూర్యునారాధించినం బ్రసన్నుండై యద్దేవుండతనికి మేలుసేయు తలంపునం బెంపారు మూర్త్యంతరంబు ధరించి తదగ్రభాగంబున నిలిచిన నతనికిఁ బ్రణతుండై వివిధవాక్యంబులఁ బ్రస్తుతించి. 2

తే. దేవ, నీవు నభంబున నేవిధమున
వెలుఁగుదట్ల దురాలోకవిపులమూర్తి

నిచ్చుటకిని విచ్చేసితి వెట్లు నిన్ను
గన్నులారఁగఁ గని మేలుగాంచువాఁడ. 3

వ. అనుటయు సూర్యుండు నగుచు నిదియొక్క రత్నంబు
స్యమంతక నామధేయంబు కంఠావలంబియైన న త్తేజంబు
వలన నతిసౌమ్యంబయ్యును మదీయరూపంబు నీకుం దేఱి
చూడ రాకున్నది యటు చూడుమనుచు నదిపుచ్చి యత
నికి నలుతంబెట్టి వరంబు వేడుమని పలికిన, 4

క. అతఁడమ్మణి యీగియ యభి
మతవరముగ నడుగుటయును మార్తాండుఁడు న
ట్ల తగంగ నిచ్చి యంత
ర్హితుఁడయినఁ బ్రమోదమాత్మ నెసకంబెసఁగన్. 5

వ. మగిడి సత్రాజిత్తు ద్వారకానగరంబున కరుగుదేరం గని
యెల్లవారును విస్మయ సమ్మోహ సంభ్రమంబులం గమల
నాభు పాలికిం బోయి 6

క. దేవర దర్శించుటకై
తావచ్చుచు నున్నవాఁడు తపనుండిదె తే
జో విసర మెసఁగ ననవిని
యావిభుఁడల్ల నగి వారలందఱతోడన్. 7

వ. అతని నర్కప్రసాదలబ్ధరత్నుండైన సత్రాజిత్తుంగా
నెఱింగించె నట్లు సనుదెంచి సత్రాజితీ బాంధవసఖుండు
సుఖంబున నున్నంత, 8

ఉ. నిచ్చలు నమ్మహామణి వినిర్మలకాంచన రత్నభారముల్
పొచ్చెము లేక యెన్మిదిప్రభూతముగాఁ గురియున్ ధరిత్రిఁదా
నెచ్చటనుండె నచ్చటికి నేయుపసర్గము నేభయంబు నే
యచ్చికమున్ జనింపక సమంచితసుస్థితి నిచ్చు నిచ్చమై.

మ. అది దామోదరుఁ డుగ్రసేనునకు నొయ్యం జేర్పఁగాఁ గర్జమున్
మదినూహించుచునుండుఁ గృష్ణుఁ డడుగన్ మానోచితుం డివ్విభుం
డిది యీకుండనురాదు వేఱొరుల కే నెట్లిత్తునంచుం బొరిన్
దదనుధ్యానము సేయుచుం దలఁకు సత్రాజిత్తుఁ డెల్లప్పుడున్. 10

వ. కృష్ణుండును గులంబులోనం గలహంబు పుట్టునని తలంచి
తాను శక్తుండయ్యును గొననొల్లక యయ్యె ప్రసంగంబులం
గోర్కి సన్న వాఱం బలుకుచుండం జుట్టంబు లందఱు
నెఱింగియుండుదు రిట్లుండ సత్రాజిత్తు జనార్దనునివలన
శంకించి యమ్మాణిక్యంబు ప్రసేనున కిచ్చె నదియు నశుచి
యైనవాఁడు దాల్చినం దనగుణంబులు సూపక ప్రాణాపద
నొనర్చు నత్తెఱం గయ్యిరువురు నెఱుంగరంత. 11

సీ. ఆ ప్రసేనుఁడు తురగారూఢుఁడై మహా
విపిన దుర్గంబుల వేఁటలాడ
నొకసింహ ముగ్రమై యుఱికి గుఱ్ఱమ్ము నా
తనిఁ జంపి బలుగండ యను తలంపు

గ్రమ్మ రత్నము నోరఁ గబళించునంతలో
నేతెంచి మృగపతి నెలుఁగుఱేఁడు
జాంబవంతుఁడు మహాసత్త్వుండు వధియించి
యమ్మణిఁ గైకొని సమ్మదమునఁ

తే. జని బిలంబు ప్రవేశించి తనతనయుఁడు
శిశువు సుకుమారుఁడనువాని చేతి కాడ
మానికంబును నిచ్చె నమ్మాణిక్య మవధి
చనిన నారాజసుతుబంధుసముదయంబు, 12

క. మృగయా తత్పరుఁడై చని
మగుఁడండు ప్రసేనుఁ డేమిమాయయొ రమ్యం
బగు మణికై యేపాపులు
తెగిరో ప్రాణమున కేమి తెఱఁగిఁక ననుచున్. 13

వ. ఇవ్విధంబు కృష్ణకృత్యంబ కానోపునని యొండొరులతోడ నొయ్యనొయ్యన పలుకుచుండం గర్ణపరం బరివాదంబు ప్రకటంబగుటయు లోకవేదియగు నయ్యాదిపురుషుండా కీడు మాన్పుకొనుటకై యెవ్విధంబుననైనం బ్రసేనుచావు చేటరసెదనని చుట్టంబులు వినంబలికి యాప్తులు వెరవరులు నగు పరిచరులం గొని చని వింధ్యంబు ఋక్షవంతంబు నను పర్వతంబులు గ్రుమ్మరి యొక్క ప్రదేశంబున. 14

మ. బలవత్సింహ చపేట పాటిత తను ప్రభ్రష్టభూషాంబరా
కులకేశప్రకరుం గరస్ఖలితఖడ్గు న్ముక్తపల్యాణ సం

వలితగ్రీవ వికీర్ణకేసరమ్ృతాశ్వప్రాంతసంస్థున్ రజః
కలుషశ్మశ్రుముఖుం బ్రసేనుఁగనియెం గ్రవ్యాదసంవేష్టితున్

వ. కని తదీయశరీరంబున నమ్మహారత్నంబు గానక యనతి
దూరంబునఁ బడియున్న సింహశవంబు నాలోకించి
యచ్చోట ఋక్షపదంబు లుపలక్షించి సర్వాపేక్షణీయం
బగు మణికింగల గౌరవంబు నూహించి యయ్యెలుగు
నడుగులజాడ బిలద్వారపర్యంతంబు ననుసరించి వచ్చిన
సహచరవర్గంబు నిలిపి బిలంబు సొచ్చి కొంతదవ్వుపోయి
జాంబవత్పుత్రునకు ధాత్రి యొనరించు బుజ్జవంబులయందు

క. వీరుఁ బ్రసేను వధించె మృ
గారి యదియు జాంబవన్నిహతమయ్యె మహో
దారమగు రత్నమిదె సుకు
మారక నినుఁజేరె నేడ్పుమానుము యింకన్. 17

వ. అను నెలుంగాకర్ణించి రయంబున 18

క. అంతర్బిలమున కేఁగి య
నంతద్యుతి నూత్నమైన యారత్నమునం
తంతఁ గని కదియుటయు మది
నెంతయు భయమంది దాది హృదయంబదరన్. 19

వ. కావరే యని పలుక నయ్యార్తరవంబునకు జాంబవంతుండు
పఱతెంచి 20

మ. అతనింగాంచి యుదగ్రకోపమున బాహాబంధురవ్యూహానో
ద్ధతిమైఁ దాఁకినఁగృష్ణుఁడుం బటుభుజ వ్యాఘాతసర్ఘాతసం
పతనాభీలబలంబునం దొడరె నిబ్బంగిన్ రణం బేక విం
శతిసంఖ్యాకలితాహముల్ హరికిఋక్షస్వామికింజెల్లఁగన్.

వ. యాదవేశ్వరుని యనుచరులక్కడ నేఁడెనిమిది దివసంబులు
గాచుకొనియుండి బలదేవానుజుండు బిలాంతరంబు వెలు
వడఁడయ్యె, ప్రాణంబులతోనున్న నిన్నాళ్ళల తడయు
ననుచుం జేటుచొచ్చి మగిడిపోయి కృష్ణుండు నిహతుం
డయ్యెనని చెప్పిన. 22

క. శోకించి చుట్టములు పర
లోకవిధులు నడుప నిర్విలోపత విహితా
నేకతిలపిండ దానము
లాకృష్ణున కట యొనర్చె నాప్యాయనమున్. 23

వ. దానంజేసి యతండు సత్త్వహానింబొందక యెప్పటియట్ల
యుండె జాంబవంతుండు నిరాహారత్వంబు కతనను ప్రబల
సంప్రహార ఖేదంబువలనను బలహీనుండై యోటువడి
యద్దేవునకు సవినయ ప్రణామం బొనర్చి 24

మ. సురగంధర్వభుజంగమ ద్యుచర రక్షోముఖ్యులు నీ దెసం
బరిభావంబొనరింప నోపరని మద్భావంబునందోఁచె నె
వ్వరు తిర్యగ్భవులైన మాదృశులు దేవా! నిన్ను
మత్స్వామి దా
శరథిం బ్రాప్తపునస్సముద్భవునిఁగా శంకించెదం జెప్పవే!

క. అనిన నగుచు నవ్విభుఁ డా
యనఘాత్మావతరణంబు నఖిలము నెఱిఁగిం
చిన నాతఁడు భ క్తిసమ
ర్చినలు దగనొనర్చె నధిక సమ్మోదమునన్. 26

వ. తదీయ కరతలస్పర్శనంబున నాయత సమర శ్రమంబు నుజ్జగించి ఋక్షేశ్వరుండు, 27

క. తనకూఁతు జాంబవతి నాఁ
జను కన్నియఁ దెచ్చియిచ్చె సస్నేహత న
వ్వనజేక్షణునకతఁడును
వనజాస్యఁ బరిగ్రహించె వాంఛ యెలర్పన్. 28

వ. అట్లు కన్యారత్నంబు నివేదించిన యనంతరంబ స్యమంతక రత్నంబును సమర్పించినం బ్రణతునిచేతిది గొనఁదగనిదై నను బరివాద పరిహారార్థం బయ్యర్థవిదుండు గైకొని చరితార్థుండై జాంబవతిం దోడ్కొని పురంబున కరుగుదెంచె. 29

# శ్రీనాథుఁడు - హరవిలాసము.

## గిరిజాకల్యాణము

శ్రీనాథుఁడు తన యపూర్వరచనలచే నాంధ్రభాషామతల్లి నలంకరించినాఁడు. తన శేముషీమహిమచే నాంధ్రకవితాప్రపంచమున నద్వితీయస్థాన మాక్రమించినాఁడు. రసోల్లసితములగు ననేక గ్రంథముల నీయన రచియించెను. అందు శృంగార నైషధము, హరవిలాసము, కాశీ ఖండము, భీమఖండము మొదలగు గ్రంథములు ప్రశస్తి వడసినవి. శ్రీనాథుఁడు భారతదేశసంచార మొనర్చి యనూనానుభవమును గడించెనని తెలియవచ్చుచున్నది. ఆంధ్రకవులలో నీతఁడనుభవించిన భోగముల నితరు లెవ రనుభవించలేదనియే చెప్పవచ్చును. తన కవితాప్రభావముచే రాజుల మన్ననల నొనర్చి కనకాభిషేకమొందిన సుకృతి. ఈయనకు కవిసార్వభౌముఁడను బిరుదు కలదు. శ్రీనాథుఁడు తన జీవితకాలమునఁ జాల భాగము రెడ్డిరాజుల యాస్థానములయందే గడపెను.

సంస్కృత సమాస భూయిష్ఠమై భాషాపాండిత్యమును దెలుపుచు నీతని కవిత మనోహరమై భావసంపద గలిగియుండును.

మనపాఠ్యభాగము "హరవిలాసము" నుండి గ్రహింపఁబడినది. పార్వతీదేవి ఈశ్వరునిగూర్చి తపస్సుచేయుచుండఁగా వడుగురూపమున నాతఁడు ప్రత్యక్షమగుటయు, సప్తఋషులు పార్వతీ పరమేశ్వరులకు వివాహము జరిపించుటయు నిందు వర్ణింపఁబడియున్నది.

తే. అవ్విధంబునఁ దనప్రమోల ససమశరుఁడు
తనకుఁగా నీశ్వరునిచేత దగ్ధమైన
ధరణిధరకన్య నిందించెఁ దనదురూపుఁ
బతులు మెచ్చని చెలువు నిష్ఫలముగాదె? 1

వ. అనంతరంబ వసుంధరాధరకన్య యవంధ్యప్రతిజ్ఞయై తప
స్సమాధి నియతత్వంబున సుధాకరకళాధరు వరియించు
నదియై నిజాభిప్రాయంబు మేనకాదేవి కెఱింగించిన. 2

ఆ. గ్రుచ్చి కౌఁగిలించుకొని యమ్మహీధర
సార్వభౌము దేవి చతురభంగి
బుజ్జగించి కూర్మి పొంపిరివోవంగ
హితమితోక్తిఁ బుత్త్రి కిట్టులనియె. 3

ఉ. ఇక్కడ లేరె వేల్పులు? సమీప్సితదాతలు ముద్దుకూన! నీ
వెక్కడ? ఘోరవీరతపమెక్కడ? యీ పటు
సాహసిక్యముల్
*తక్కు, శిరీషపుష్ప మవధానపరత్వమునన్ మధువ్రతం
బెక్కిన నోర్చునో? విహగమెక్కిన నోర్చునో?
నిశ్చయింపుమా. 4

తే. అని నివారించె గిరిపత్ని యనుఁగుఁగూఁతుఁ
బార్వతియుఁ దల్లిమాట చేపట్టదయ్యె!
నీప్సితార్థంబునకుఁ బాఱు హృదయరుచియు
నిమ్నమున కొడిగిలు నీరు నిలుపరాదు. 5

వ. అంత నాచంద్రానన సఖీముఖంబున నిజమనోరథంబు
తండ్రికెఱింగించి, యమ్మహానుభావుచేత నరణ్యనివాసంబు
నకును, ఫలోదయాంతంబైన తపస్సమాధికిని నానతివడసి
దృఢప్రతిజ్ఞా నిర్వాహంబున. 6

మ. భూధరరాజకన్య మణిభూషణముల్ దిగఁద్రావి,
యీశ్వరా
రాధనకేళికౌతుకపరాయణయై ధరియించెఁ బాండుర
శాధృతిపూర్వకంబుగఁ బ్రగాఢపయోధర మండలీసము
త్సేధవికీర్ణసంహతులఁజెల్లు మహీరుహ వల్కలంబులన్.

తే. పాశుపత దివ్యదీక్షఁ జేపట్టి గౌరి
చంచరీ కాంగనాగరుచ్ఛాయ నేలు
కుటిల కోమలతరదీర్ఘ కుంతలములు
మడమ లంటంగ నిడుపాటి జడలు కట్టె. 8

*సీ. ముత్యాల మొలనూలు మురుపు చూపెడునట్టి
జఘనంబుపై మౌంజి సవదరించెఁ
గందుకక్రీడపై గారాబు పచరించు
హస్తాబ్జములఁబూనె నక్షమాల
కస్తూరికాంగరాగములతో విలసిల్లు
తనువల్లి హత్తించె ధవళభూతి
బొమ్మపెండిలిపాటఁ బ్రొద్దుపుచ్చు నెలుంగు
నీలకంఠస్తోత్ర నియతిఁగూర్చెఁ

తే. బసిడికమ్ముల యందంపుఁ బట్టుచేల
కొంగు గప్పిన యురమునఁ గోర్కి మీఱ
గంతగావైచెఁ బులితోలు కళవసంబుఁ
బరమ కల్యాణి గిరిసార్వభౌమతనయ. 9

తే. హంసతూలిక పాన్పుపై నలరు మొగ్గ
యొత్తు నునుమేను గల్గు నీలోత్పలాక్షి
బాహువల్లితలాడగాఁ బవ్వళించె
శైలపాషాణ పట్టికా స్థండిలమున. 10

తే. పాశుపతమంత్రదీక్షావిభాసమాన
దివ్యతేజోవిశేష సందీప్తమూర్తి
శాలతాంగికి, శతవృద్ధులైన మునులు
ప్రణతు లగుదురు భావిప్రభావశక్తి. 11

వ. ఇవ్విధంబున నబ్బింబాధరధరాధరశిఖరంబులయందలి హరిణకిశోరంబులకు నరణ్యాబీజాంజలిదానంబును దరులతాకుంజంబులకు నిర్ఝరధారాసేకంబును, బొనర్చుచుఁ గృష్ణాజినోత్తరాసంగవతియు సర్వాంగభసితాభ్యంగ మంగళస్నానయునై, యంబుచుళుకంబులును, నుడుపతికరంబులును, సురకరువలిం డుల్లినజీర్ణతరుపర్ణంబులును, నాహారంబులుగా దుష్కరంబైన తపంబుచేయుచుండ నొక్కనాడు.

*మ. అజినాషాఢ ధరుండు, ప్రౌఢతర భాషాతిప్రగల్భుండు, నీ
రజ బంధుప్రతిమానతేజుఁడు, జటారాజిచ్ఛటాతామ్రమూ
ర్ధజుఁ, డేకాకి, వటుండు, బ్రాహ్మణుఁడు విశ్రామార్థముంబోలె నా
త్రిజగన్మోహనమూర్తి సన్నిధికి నేతెంచె వనాంతంబునన్. 13

తే. ఇవ్విధంబున నేతెంచి, యెదుటనిలిచి,
గౌరి నాశీర్వదించె నక్కపటవటుఁడు,
కలితకోమల నవకుశ గ్రంథియైన
యంగులీ పల్లవంబుల హస్తమెత్తి. 14

వ. పార్వతియు బహుమాన పురస్సరంబుగ నయ్యుర్వీసుర వటునకు నతిథిపూజయొనర్చిన నతండును గొండరాచూలి చేయుసత్కారం బంగీకరించి, ముహూర్తమాత్రంబు విశ్రమించి మెయివడి చూపునంజూచి ప్రస్తావోచితంబుగా నిట్లనియె. 15

*తే. అభ్రవీథీ పరిచ్యుతం బైనయట్టి
యమరతటినీ జల ప్రవాహమ్ము కంటె
ధరణిధరరాజు నీచరిత్రంబుకతనఁ
బరమ పావనుఁడయ్యె నో పద్మనయన! 16

వ. సంబంధంబు సాప్తపదీనంబుగావున నీతోడఁ గదిసి పలుకు చునికింజేసి యేనాప్తుఁడఁగావున నొక్కమాట యడిగెద. బ్రాహ్మణజాతి స్వభావసులభంబైన చాపలంబుఁ జూచి హెచ్చు కుందాడఁ బనిలేదు. రహస్యంబు గాకుండెనేనిం జెప్పుము. 17

సీ. ప్రథమప్రజానాథ పావనకులమునఁ
బ్రభవించి తబల! ప్రపంచసార
సౌందర్యసంపద సడి సన్నదాన వ
నశ్వరంబైశ్వర్య నైపుణంబు

సౌఖ్యంబు నిరవధి, సర్వసామగ్రి నీ
యుఱచేతి భాగ్య మత్యాయతంబు
భాగ్యంబునీకేమి భ్రాంతియైనది ? మనో
రథమేమి చెప్పుమా రాజవదన !

తే. దుష్కరంబైన తపమిట్లు తొడరిచేసి
మేను డయ్యించుకొనఁగ నేమిటికి వచ్చెఁ?
జిత్తము విచారమార్గంబుఁ జేరఁ దెచ్చి,
తత్త్వము దెలియఁజెప్పు చూతము మృగాక్షి ! 18

వ. పితృగేహంబున నవమానంబు పుట్టదుగదా! పన్నగ
ఫణారత్నంబు మీఁదఁ జెయిచాఁచువాఁడుగలఁడే ? నిండు
జవ్వనంబునకుం దగినవిభూషణంబులు తొలంగఁబెట్టి వార్ధ
కోచితంబులగు వల్కలంబు లెట్లు ధరించితివి ? దేవలోక
నివాసంబున కాసపడెదేని యది వృథాశ్రమంబు, నీపుట్టి
నిల్లు దేవభూమియకాదే! తగినవరునిం గామించి సమాధి
వహించితివేని యదియు నీకుం దగదు. రత్నం బొరునిచే
నన్వేషింపఁబడుఁగాని యొరున న్వేషించునే! వేఁడినిట్టూర్పు
గాడ్పులచే దుర్లభజనానురాగంబు నీ యందుఁ దేటపడు
చున్నది. అట్టి కఠినహృదయుం డెవ్వండొకో ! వాఁడెవ్వం
డేని నీవు తపంబుసేయుచుఁ గలమాగ్ర పింగళంబగు జటా
భారంబు నుంప నుపేక్షించునే! యని యంత నిలువక
యక్కపటవటుండు. 19

*ఉ. ఏనును బ్రహ్మచారిఁ దరళేక్షణ! నీవును గన్య వింతకా
లానకు నీకుఁ బెండ్లియ ఫలంబగునేని విచారమేల? స
మ్మానముతోడనన్ను మునిమాన్యవివాహముగమ్ము
లెమ్ము, కా
దేని తపంబులోని సగమిచ్చెద మాను తపోభిమానమున్.

వ. అనినం బార్వతి య మ్మిథ్యావటునకుఁ దన మనోరథం బెఱిఁగింప నొల్లక వయస్యం గనుసన్న చేసిన నచ్చెలి కత్తెయు న త్తపోధన కుమారునితో నిట్లనియె. "అయ్యా! నీకుఁగుతూహలంబు గలదేని వినుము, కాలకంఠ కఠోరకంఠ హుంకార నివర్తితం"బగు పుష్పచాపుని సమ్మోహనాస్త్రం బీకన్యహృదయంబున నాటిననాఁటంగోలె దుస్సహం బగు తపోభారంబున భర్గువశీకరింపం దలంచియున్నయది. అంత.

చ. వికవిక నవ్వి యక్కపట విప్రకుమారుఁడు మేలు లెస్స! వా
నికినయి రాగబంధమును నిల్పె మదిం దరళాయతాక్షి మీ
సకియ వివాహవేళఁ బురశాసనుపాణిఁ బరిగ్రహించుచో
మొకమున బుస్సుమంచు నహి మ్రొగ్గిననెట్లుభయంబు
చెందునో? 23

*ఉ. పుట్టువెఱుంగ నెవ్వరికిఁ బోలదు, మూఁడవకన్నుచూచిచే
పట్టెఁడు వెట్టివాఁడయినఁ, బ్రాణహరుండఁట
జంతుకోటికిన్

గట్టినతోలుచీర కలకల్మిఁ బ్రకాశము చేయుచున్న దె
ప్పట్టునఁ జూచినన్ శివుని బైసి యెఱుఁగఁగరాదె
భామినీ! 24

తే. మాటలేటికిఁ జాలింపుమా తపంబు,
హరునిగూర్చి, సరోజపత్త్రాయతాక్షి!
వధ్యుఁ దివియంగఁ బోఁతిన వాఁడికొల్లు
యూప సత్క్రియ కర్హమైయున్నె? చెపుమ! 25

వ. అనిన నక్కపటవటునకు నవ్వధూటి యి ట్లనియె. 26

ఉ. చాలు వివాదముల్ వడుగ! శంభునిగూరిచి; యిట్టిపల్కులీ
వాలముచేసి పల్కె తెటులైనను నా, విను చంద్రమఃకలా
మాళిపయిన్ మదీయమగు మానస మెంతయుఁ
జిక్కె, నింక నేఁ
జాలుదునయ్య! యెవ్వెయి భుజంగ విభూషణునిం
దొఱంగఁగఁ. 27

వ. అని జయావిజయులం గనుంగొని యపాంగంబులఁ గెంపు
గదుర నీ బ్రహ్మచారి శంకరుని గుఱించి యింకను వంకర
కొంకర మాటలాడ నుంకించుచున్నవాఁ డితని మెడవట్టి
నూకుండని పల్కి కోపావేశంబున. 28

చ. జిలుఁగగు వల్కలాంచలము చెన్నలి యొమ్మననుండి
జాఱఁగా
నలుకఁ దుషారశైలసుత యవ్వలి మోమయి నాలుగే
న్పదం

బులు చని, భ్రూకుటీకుటిల ముగ్ధ లలాట ముఖేందు బింబయై,
మలఁగికనుంగొనెన్ భుజగమండనుఁడైన జరద్విజోత్తమున్.

*శా. సాక్షాత్కారముఁ జెంది నవ్వుచు గిరీశానుండు, ధాత్రీధరా
ధ్యక్షాపత్యముఁ బ్రేమనిర్భర కటాక్షాలోకనప్రౌఢిమన్
వీక్షించెన్, దరళాక్షియున్ మనమునన్ వ్రీడాప్రమోద క్షమా
దాక్షిణ్యంబులు సందడింప నిలిచెన్ దత్సన్నిధానంబునన్.

చ. అరుదగు నీతపమ్మునకు సమ్ముదుఁబోయితి నేలుకొమ్ము నీ
వరవుడ నంచు శూలి ప్రియవాక్యములం దగ గారవింపఁగా
ధరణిధరేంద్రనందన యుదగ్రతపోమహనీయ వేదనా
భర మఖిలంబు వీడ్కొలిపి భావమునం బరితోషమందుచున్.

వ. కన్యకను బితృపరాధీన నగుట దేవరచిత్తంబున నవధరింప
వలయునని సఖులచే విన్నపంబు చేయించిన. 32

తే. అమృతకరమౌళి యట్లగాక యనుచుఁ బలికి
వేడ్క గిరిరాజనందన వీడుకొలిపి
తారగిరికేగి దివ్యచిత్తమునఁ దలఁచె
సప్తమునుల నరుంధతి సంయుతముగ.

# శ్రీనాథుఁడు - హరవిలాసము

## కిరాతార్జునీయము

తే. తండ్రి చెప్పినమాటలు దప్ప కప్పు
డాదరించి ధనంజయుం డభవుఁ గూర్చి
యింద్రకీలాచలంబుపై నేకనిష్ఠ
ధీరుఁ డొనరించె నతిఘోరవీరతపము. 1

మ. భసితోద్ధూళితనిర్మలావయవుఁడు న్పంచాక్షరీసంతతా
భ్యసనవ్యాప్తిపరాయణుండునుశివధ్యానానుసంధాతయున్
మసృణస్నిగ్ధతరక్షుచర్మమయకంథాభద్రపీఠుండు నై
ఘనసమస్థేమఁ గిరీటి పాశుపతదీక్షారంభముం గైకొనెన్. 2

సీ. ప్రథమసంధ్యారాగపరిపాటి మిన్నేటి
కనకపంకజకోరకములు దెలుపఁ
గందువాఱినమించుగచ్చుటద్దమువోలె
విధుమండలము కాంతి వీడుకొనఁగ
దరమైన వేఁబోకఁ దఱపి వెన్నెలఁ గ్రోలి
దివిఁ జకోరములు మత్తిల్లి యాడ
మందరాచలకూటమధ్యభాగమ్మునఁ
గృత్తికానక్షత్ర మత్తమిల్ల

తే. మృదులభస్మరజశ్శయ్య మేలుకాంచి
యమల రుద్రాక్షధారణం బాచరించి

యర్జునుఁడు పర్ణశాలికాభ్యంతరమున
హరున కొనరించు నరుణోదయార్చనంబు. 3

క. కపికేతుఁ డింద్రకీలా
ప్రపాతపతయాళు నిర్ఝరస్నాతుండై
యుపచారవిధుల నన్నిటఁ
దపనోదయవేళ వాళధరుఁ బూజించున్. 4

మ. అవధానంబునఁ బాకశాసనసుతుం డర్ధేందుకోటీరు సం
గవకాలంబునఁ బూజసేయు హిమవాఃకర్పూర కస్తూరికా
ద్రవకాలాగురుగంధసారసురభిద్రవ్యంబులం బూవులన్
లవలీసర్జవసాగురుప్రముఖ నానాధూపధూమంబులన్. 5

శా. పంచబ్రహ్మషడంగబీజసహిత ప్రాసాద పంచాక్షరీ
చంచన్మంత్రపరంపరాపరమనిష్ఠాతత్పరత్వంబునన్
మంచుంగొండయనుంగుఁ బెండ్లికొడుకు న్మధ్యాహ్న
కాలంబు సే
వించు న్నిర్జరరాజసూనుఁడు మనోవీధీసదాధ్యాసితన్. 6

శా. వైయాఘ్రాజినఖండమధ్యమున తేవన్ బద్ధ పద్మాసనుం
డాయింద్రాత్మజుఁ డింద్రకీలశిఖరీంద్రారూఢబిల్వద్రుమ
చ్ఛాయానిర్మలచంద్రకాంతమణి పాషాణప్రదేశంబున
న్సాయంకాలము పూజసేయు నభవు న్సంధ్యానటుం
ధూర్జటిన్. 7

ఉ. అంచితభక్తితో శివుని నర్ధనిశాసమయంబునందు సే
వించు గురూపదేశపదవీపరిశుద్ధసమర్చనావిధిన్

గాంచనకోరకంబుల, బిసప్రసవంబులఁగొండగోఁగులన్
గాంచనకందరాముఖగృహంబులఁ బార్థుఁడు సంస్కృ
తార్థుఁ డై. 8

వ. ఇట్లు పాశుపతదీక్షాధురంధరుండై కాలకంధరుంగుఱించి
తపంబు సేయుచుండఁ గొండొకకాలంబునకు. 9

మ. ఒకనాఁ డింద్రతనూభవుండు గిరికూటోత్సంగభాగంబున
న్నొకచానేకలతాతరుప్రతతులన్ దేవార్చనాపుష్పకో
రకము ల్గోయుచు నుండఁ గాఁ వినఁబడెన్ శ్రవ్యంబులై
కుక్కుర
ప్రకరోదంచితకంఠనాళకుహాలీభౌ భౌ మహారావముల్. 10

తే. చాయగోసులకంటెఁ గేసరులకంటెఁ
బులులకంటెను బిఱుసులై పొగరు మిగిలి
జల్లుకొని వచ్చెఁ బైపైని సారమేయ
యూథములు వేదమయమూర్తి యుద్ధతముగ. 11

తే. ప్రకటలీలఁ నుదాత్తంపుఫణితిఁ గొన్ని
క్రమముతో ననుదాత్త స్వరములఁగొన్ని
స్వరితములఁబ్రచయుంబులవరుసఁగొన్ని
ఘోషణముసేయఁదొడగె నాకుక్కురములు. 12

క. కనకపుశృంఖలలఁ ద్రయీ
శునకంబులఁ బట్టుకొనఁగ సూరెలఁ బ్రమథుల్
తను నిరు చక్కియ లీలా
వనచరులై కొలువఁ గపటవైహారికుఁ డై. 13

సీ. వికటపాటలజటామకుటికాభారంబు
కలుషైకెనజుంజుఱు నెఱులు గాఁగఁ
జారుసుధాధామశకలావతంసంబు
పెడకొప్పుపై నుండుపీఁకె గాఁగ
ఘనలలాటంబునఁ గనుపట్టుకనుచిచ్చు
గైరికద్రవతిలకంబు గాఁగ
భుజమధ్యమునఁ గ్రాలుభుజగహారంబులు
గురిజపూసలగుబ్బసరులుగాఁగ

తే. శంకరుండు కిరాతవేషంబు దాల్చి
యగజ చెంచెత యై తోడ నరుగు దేరఁ
బాణి నోంకారదివ్యచాపము ధరించి
వచ్చె విప్వచ్చువరతపోవనముకడకు. 14

వ. అట్టి సమయంబున. 15

చ. జలధరనీలదేహమును జంద్రకళాయుగళీసమానదం
ష్ట్రలు భిదురోపమానముఖసంపుటపోత్రము ఫుల్లమేచకో
త్పలదలవర్ణకర్ణములుఁ బాటలవర్తులలోచనంబులుం
గలిగి కఠోరకంఠఘనఘుర్ఘుర ఘట్టనఘోషజన్మమై. 16

ఉ. ముట్టియ నింద్రకీలతటమూలమహీప్రభవంబు లైనపె
న్బుట్టలుగ్రొచ్చివైచుచును భూరుహమండముఁజాఁపకట్టుగా
మట్టుచు ఘుర్ఘురధ్వనుల మాటికిమాటికి దిక్పుటంబులన్
ఘట్టన చేయుచు న్వెడఁదకన్నుల నిప్పులు వెళ్లఁగ్రాయుచున్

క. పంది వడిఁ బాఱుదెంచెఁ బు
రందరనందననిశాకరధరులనడుమన్
దందడి గొరిజలతాఁకునఁ
గందుకములువోలె శిలలు గరువాఱంగన్. 18

ఉ. ఏసెఁ బినాకచాపమున నీశుఁడు గాండివకార్ముకంబునన్
వాసవసూతి యాప్రబలవజ్రసమానము లైనబాణముల్
రాసెఁ బరస్పరంబును వరాహముప్రక్కలు గాడిపాఱ మూ
కాసురసూకరంబు తిరుగాడె వడి న్నరఘాతవేదనన్. 19

క. అథవార్జున శరపాత
ప్రభవవ్యథఁ దిరిగి నవ్వరాహము కదు సం
క్షుభిత మయి విలయవేళా
నభస్వదుద్భ్రాంతఘనఘనాఘనము క్రియన్. 20

క. దీర్ఘతరహరనరాశుగ
నిర్ఘాతనిపాతజాతనిబిడవ్యథ నం
తర్ఘూర్ణమాన మగుచును
ఘుర్ఘురఘోషంబుతోడఁ గ్రోడము కూలెన్. 21

వ. అప్పుడు కిరాతవేషధారి యగుపురారి యోంకారచాపంబు నేల నిలువంబెట్టి తదీయ శిఖరంబున నఱచేయి మోపి యొరగి యొయ్యారంపు నిలుకడ నిలిచి వలకేల వాలమ్ము ద్రిప్పుచుఁ గట్టెదుర నున్నజగజెట్టి యగు నింద్రునిపట్టిం గనుంగొని ప్రావృషేణ్య పయోవాహగరాగంభీరంబైన

స్వరంబున నింద్రకీలగిరిగహ్వరంబులు ప్రతిధ్వనియొసఁగ
సాటోపంబుగా సగర్వంబుగా సావష్టంభంబుగా నిట్లనియె.

తే. ఎవ్వఁడవురోరి నీవు నాయెదురఁ బాఱు
పంది నేసితి బాహుదర్పంబు మెఱసి
యెఱుఁగవుర! యోరి నన్ను నీయింద్రకీల
పర్వతం బేలు వనచరసార్వభౌము. 23

ఉ. ఏనును నాకుటుంబ మగునీతరళాక్షియు వెంట వెళ్ళి యి
క్కాననభూమిలో బహుమృగంబులఁజంపుచు వచ్చివచ్చి యే
నీనిశితాస్త్రపాతమున నిక్కిటిఁ జంపుదు నంచు వాఙ్ప్రతి
జ్ఞా నియమంబున న్వెనుకజాడఁగఁ కూడఁగ వచ్చు
చుండఁగన్. 24

క. ఏటలవి నేసి చెంచెత
యోటమి వెట్టం గడంగి యున్నట్టియెడన్
గాటెఱుకున గొఱఁ తిడి యిట
జీటంబున వేడ్కయెల్లఁ జెఱచితి కదరా? 25

తే. తపసి వై యుండి తగు రోరి ధనువుఁ బట్ట
శాంతిపరులకు నేలరా సత్వహింస
కపటధార్మిక! యత్యంతకల్మషాత్మ!
యెవ్వడవు రోరి నాపంది నేయ నీవు. 26

క. మంటెడుబలునారసమున
గుండియ పగులంగ నేసి కూల్చితి దీనిన్

వెండి ప్రయోజన మేదీ
రండాసుత! దీనిపై శరము నిగుడింపన్. 27

చ. తబిసివి గానఁ జావునకుఁ దప్పితి నీ కిది వేఁటపంతమా
యబలుఁడ నీ తెఱంగునఁ బరాటవికాయతచాపవల్లరీ
నిబిడశరాహతంబగు వనేచరజంతువు నేసి తీగతిన్
సబముపయి న్నిగుడ్చిన నిశాతశిలీముఖ మెట్టివెఱ్ఱిదో.

వ. అనినం గిరీటి యయ్యాటవికచక్రవర్తి కిట్లనియె. 29

క. పై వచ్చుక్రూరజంతువుఁ
జేవెరవున నేయు టెందు సిగ్గే చెపుమా
యీవక్రభాషణంబులు
నీ వాడెదు శబర! పొమ్ము నీచనుత్రోవన్. 30

క. పంది నపేక్షించితివో
పందెము గెలువంగ వేడ్క పడియెద వేదో
కందువుగా శాఫలము పు
ళిందాధిప! యేమిటికిఁ బలికె దీభంగిన్. 31

మ. తడవే లోఁరి పుళిందరాజ! చను మధ్యాహ్నంబు డాయంగ న
య్యెడు నీవేళ శివార్చనంబునకు మా కేకాంతమై యుండఁగాఁ
బడు నీవుం గడు డస్సినాఁడ వటవీపంక్తి ప్రచారంబులన్
విడు కోపం బిఁక శాంతి గైకొనుము వాగ్వ్యావాద మిం తేటికిన్. 32

క. జోటియు నీవును గుఱ్ఱ-ర
కోటియు ననుచరులు దప్పికొన్నారు మహా
ధాటిపరిశ్రమమున ని
చ్చోట వసించెదర యేని సుఖ ముండఁ దగున్. 33

వ. అని యర్జునుండు పల్కిన నాగజ్జులాఁడు మోఱకంబున మొగ మడ్డంబు గదల్చి యీ యెడ్డిమాటలం బనిలే దీపంది యొక ప్రయోజనంబె వేఁట పంతంబు దప్పిమమ్మ నధిక్షేపించితి వీతప్పునకుఁ దపసివి గాన నిన్ను శిక్షింపను పొమ్మ్మదియునుం గాక. 34

ఆ. తాటియంతవిల్లు ధరియించినాఁడవు
జ్యాకిణాంకితము భుజాయుగంబు
గర్వరేఖ మిగులఁ గానంగ నయ్యెడు
దాంభికంబు నీదుతబిసితనము. 35

శా. ఏమో నాహృదయంబు నిన్నుఁ గని యిట్లే చాపమందాసమై
భామాసన్నిధి నుబ్బుచున్నయది నీబాహాప్రతాపంబు ని
స్సీమం బే నొకకొంతసే పిచట నుజ్జృంభించరాఁ జేయుమా
నామీఁద న్నిగుడింపుమా నిశితనానాక్రూరనారాచముల్

క. చెం చని నన్నుం జూడకు
వంచింపకు హీనజాతివాఁ డని సంగ్రా
మాంచలమున నిదె నను మె
చ్చించెదవే నపుడు నిన్ను సేబాసందున్. 37

మ. శివలింగార్చన మెందువోయెడుఁదపస్విత్వమ్ము నెందే నుప
ద్రవముం బొందదులే యొకింతవడిలో ధ్యానాను
సంధానముల్
వ్యవధానం బొకయింత సైఁచవొకొ బాహావిక్రమశ్రీ
మహో
త్సవముం జూపుదుగాక నాయెదుర నాశ్చర్యం
బవార్యంబుగన్. 38

తే. ప్రదర మరివోయు మేయుము ప్రాక్ప్రికార
కౌతుకాధీన హృదయుండఁ గాను నేను
ఔర కులపత్నియైన యీసీరజాక్షి
యాసపడుచుండు ఘోరవీరాహవములు. 39

వ. అనిపల్కి యాక్రీడాకిరాతుండు గుణధ్వని చేసిన జలధర
ధ్వానగంభీరంబై దేతెంచు నాశ్రోతకు సిళ్ళుచూపినఁ
గోపించు గంధద్విపంబుంబోలె రోషించి యర్జునుండు
గాండీవగుణగర్జాడంబరంబున నంబరంబు పిక్కటిల్ల నాట
క్కరి విలుకానిపై భల్లంబులు నిగుడించె. 40

శా. గాండీవప్రవిముక్త నిష్ఠురమహాకాండప్రకాండమ్ములన్
ఖండించె న్నృలిబాణఘట్టనమునం గందర్పవిద్వేషి యా
తం డాశ్చర్యము నొంది బాపురె! పులిందశ్రేష్ఠ!
యంచు న్భుజా
దండాహంకృతి వెండియుంబఱపె శాతక్రూరనారాచముల్.

శా. ప్రారంభం బొకయింత లేకను దృణప్రాయంబునట్లొందఁగాఁ
గ్రూరాజిం దెగనేసెనో నటికెనో క్రొవ్వాఁడిబింపంబుచే
నీరీతిం దునుమాడవచ్చునె యనన్ హేలాగతిం ద్రుంచె దు
ర్వారాహంకృతి నీశ్వరుండు విజయాస్త్రవ్రాతమున్
ద్రేల్మిడిన్. 42

క. శితికంఠుఁ డేయుశరములు
ప్రతిహతములు సేయు నరుఁడు పార్థునిశరముల్
శితికంఠుఁ డేయుఁశరములఁ
బ్రతిహతములు సేయు బహుళబాహాప్రౌఢిన్. 43

క. క్రూరతరహరనరాశుగ
నారాచశిలీముఖాదినానాస్త్రఘటా
నీరంధ్ర మైననభమునఁ
గారుకొనెమె గాఢ మంధకారము దిశలన్. 44

క. ఓంకారగాండివజ్యా
టంకారంబులు నభఃకటాహము నిండెన్
శంకర కపికేతుభుజా
హంకారనిరంకుశాహవాంగణభూమిన్. 45

వ. ఇట్లోహరిసాహరి నల్లాడుహరార్జునులయందు. 46

క. శరధులు యుగాంతవేళా
శరధులునుం బోలె నయ్యె శరశూన్యంబుల్
సురపతిసూతికిఁ బరమే
శ్వరమాయాశక్తి నపుడు సమరాగ్రమునన్. 47

మ. తెలివిం బొందక యుండె నెమ్మనమునం దివ్యాస్త్రమంత్రాక్షరం
బులు శారద్వతకుంభసంభవులసంబోధంబు సర్వంబు ని
ష్ఫల మయ్యెన్ వృథ యయ్యె నాంతరకృపాభ్యాసంబు గాండీవికిన్
గలహాక్షోణిఁ బినాకపాణికుహనాకౌటిల్యశిల్పంబునన్. 48

క. నిటలవిలోచనమాయా
ఘటనమునఁ గిరీటి తనప్రగల్భత చెడినన్
గుటిలముగ బొమలు ముడిచెను
గటకటఁబడఁ దొడఁగె నపుడు కరము సెమర్చెన్. 49

శా. కాండక్షీణత నాయిషుచ్ఛటలకుం గల్గెంగదే నాధనుః
పాండిత్యం బెటువోయె నొక్కొ యని చెప్పం జిట్టలోఁ గాక యీ
తం డీలాగునఁబోవువాఁడెమయిమైఁ దా నంచుగర్వోద్ధతిన్
గాండీవంబునఁ బూన్చి వేయఁ దొడఁగె న్గాండీవి గంగాధరున్. 50

క. మృదు వెన్నఁడు శరములఁ గ
వ్వడి బొదువం దొడఁగె గాండివంబున నపుడే
యుడుగక పొడమెడు భయమున
వడఁకులగుబ్బలికుమారి వడవడ వడకెన్. 51

సీ. కఱకువెంద్రుకలలోఁ బఱచుమందాకిని
సుకుమారదేహంబు స్రుక్కఁబాఱ

నవతంసకుసుమమాల్యంబైన శశిరేఖ
బ్రహ్మకపాలరంధ్రమునఁ దూఱె
నెట్టియంబుగ బిగ్గఁజుట్టినపెనుబాము
బిగియూడి నొసలిపై డిగఁగ జాఱె
నలికనేత్రముకిత్తి యారజ్యమానమై
తెప్పలసందుల నిప్పు లుమిసె

తే. నగజ భయమందెఁ బ్రమథులు బెగడుగుడిచి
రుపనిమత్తులు ఘోషించె నొక్కపెట్టఁ
గాలకంఠునిమౌళిశృంగాటకంబు
గాండివంబునఁ దాడింప పాండవుండు. 52

తే. పాండునందనఘనభుజాదండకలిత
చండగాండీవతాడితఖండపరశు
పృథుజటామండలంబునఁ బిండుగట్టి
తాండవం బాడె మిన్నేటితరఁగదండు. 53

తే. వింటఁ గొని వ్రేయ వ్రేయంగ విసుగుపుట్టఁ
జెట్టిబిరుదింతె పొమ్మని పట్టి యణఁచె
సురతనూభవునిం బట్టి శూలపాణి
మల్ల సంగ్రామకేళిసంభావనముల. 54

క. కపికేతు వృషభకేతను
లుపజాతనియుద్ధకౌతుకోత్సాహమునన్
నిపుణతఁ బెనఁగంగఁ దొడఁగి
రుపతాయిన్ గతివిశేష ముపలాస్యముగన్. 55

తే. తోరహస్తంబునందుఁ బార్థుండు గడిమి
సలిపె నూరులుఁ బీడించె సరభసమున
హరుఁడు సీసాన హత్తించి యర్జునునకు
బరువు గావించె నిశ్వాసపవనమునకు. 56

క. ముక్కంటి కంఠమూలము
డొక్కరమున నిఱికెఁ బార్థుఁడు ప్రబంధుండై
చక్కని ప్రకోష్ఠపీడన
మిక్కిలికను వేఁకి నుఱికె మినుమినుకుమనన్. 57

క. తాఁచుచుఁ బొడుచుచుఁ బడుచును
నేఁచుచు నుడుకుచును బిట్టు నెగయుచు గూలం
ద్రోఁచుచుఁ దూలుచుఁ బెనఁగిరి
ప్రాచీపతిసుతుఁడు హరుఁడు బాహాబాహిన్. 58

శా. నిష్టంకించి శశాంకశేఖరుఁడు గాండీవాయుధుండున్ భుజా
వష్టంభంబులు సిద్ధచారణులుఁ గై వారంబు గావింపఁగా
దిష్టాంతాంతకఘోరమూర్తు లయి సాదృశ్యం బదృ
శ్యంబుగా
ముష్టాముష్టి రణంబు చేసిరి యసన్మోహప్రకారంబులన్.

క. చెమరుచుట యూడు గలచుట
బొమ ముడుచుట నిర్వికారమును మును నపరి
శ్రమమును సరిసరిఁ బెనఁగిరి
సమవిషమనియుద్ధకేలి శంభుఁడు నరుఁడున్. 60

క. తాటించెఁ బేరణము నా
స్ఫోటించెఁ గిరీటివక్షము వృషాంకుఁ డతం
డాటోపమడఁక పిడికిటి
పోటున ధూర్జటియురంబుఁ బొడిచెం గడిమిన్. 61

శా. అంతం జంద్రకళాధరుండు నిజబాహాగాఢపీడాపరి
శ్రాంతుండై యటఁ బాండుసూతియెదురం బ్రత్యక్షమయ్యెం గృపా
వంతుండై యహిరాజహారములతో స్వర్వాహినీవేణితో
దంతిత్వక్పరిధానపల్లవముతోఁ దామ్రజ్జటాపంక్తితోన్.

ఉ. చెంచెత యయ్యెఁ బార్వతియుఁ జెంచులు భూతములై నిజాకృతి
న్మించిరి వేలుపు ల్నభముమీఁద లలాటమునందు నంజలు
ల్నించి నమస్కరించిరి వినీతియు భక్తియు నుల్లసిల్లఁ గా
వించెఁ బ్రణామము ల్గరము విస్మయ మందుచుఁ బార్థుఁ డత్తఱిన్. 63

తే. వేదముల్నాల్గు నుపనిషద్విద్యఁ గూడి
ప్రణవ మంత్రాక్షరములతోఁ బ్రస్ఫుటముగ
విశ్వకర్తాత్మ యొయ్యొయ్య వీడుకొనుచు
నభినుతింపంగఁ దొడఁగెఁ జంద్రార్ధమౌళి. 64

వ. అప్పుడు పార్థుఁడు కృతార్థుఁడై రోమాంచితకంచుకితాఖిలాంగుండై యానంద బాష్పలోచనుండై కేలుదోయి ఫాలభాగంబునం గీలుకొల్పి యిట్లని స్తుతించె. 65

## విద్దళి (సార్వవిభక్తిక స్తవము)

క. నీవ పరబ్రహ్మంబవు
నీ వఖిలాండాండ పతివి నీవు ప్రసన్న
శ్రీవిభవారోగ్యాయుః
ప్రావీణ్యప్రాభవైకఫలదుఁడవు శివా! 66

క. నిన్నుఁద్రిజగన్నివాసుని
బన్నగకంకణుని భక్తపరతంత్రుని స
ద్భ్యన్నతకరుణాగుణసం
పన్నుని గనుగొంటి మంటి బాలేందుధరా! 67

క. నీచేతఁ గృపానిధిచే
వాచాగోచరవివేక వైయాత్మ్యనిచే
నోచంద్రకలాశేఖర!
యాచించి మనోరథార్థ మర్థిం గందుఁ. 68

శా. నీకై యేను దపంబు చేసితి మహానిష్ఠాగరిష్ఠస్థితిన్
నీకై సంస్తుతి సేయుదుం గడగి నానేర్పొప్పఁగా నెంతయు
న్నీకై పూజ యొనర్తుఁ గొంత విరుల న్నిత్యంబు సద్భక్తితో
నీకై సేవ యహర్నిశం బొనరుతు న్వేదండచర్మాంబరా!

తే. సాటి యెవ్వరు నీకు నిశాటభూష!
కైటభారాతిహాటకగర్భవంద్య!
ఘనజటాజూటవాటికాఘటితవికట
గగనగంగాస్రవంతిక! కరటివైరి! 70

క. నీయందు జగము లుండుఁ
బాయక యాజగములందుఁ బాయక నీ వుం
దీయనువు దెలియ నజునకుఁ
దోయజనేత్రునకు నైనఁ దోఁపదు శర్వా! 71

మ. జయ సర్వేశ్వర! సర్వలోకజనకా! చంద్రార్ధచూడామణీ!
జయ కామాంతక! కామితార్థఫలదా! చక్షుశ్శ్రవఃకుండలా!
జయ సంపూర్ణకృపాగుణైకవసతీ! శైలేంద్రజావల్లభా!
జయ దక్షాధ్వరమర్దనా! జయ గిరీశా! యీశ! రక్షింపవే.

ఉ. కొండకిరాతుఁ డంచుఁ గయికోక యసంగతభాషణంబులు
ద్దండత నాడితిన్ గర ముదగ్రత నొంచితి ముష్టిఘట్టనం
గాండివచాపదండమునఁ గ్రచ్చర మోదితి మాళి భోగభృ
త్కుండల! పెక్కుచందముల ద్రోహము చేసితి నేమి
చేయుదున్. 73

వ. అని మఱియు మఱియు సాష్టాంగప్రణామంబు లాచరించి
నిలిచిన పాండవమధ్యముం జూచి ఖండపరశుండు నీతపం
బునకుఁ బాశుపతవ్రత నిష్ఠాగరిమతకు భుజాశౌర్యంబునకు
సంతసించితి నీవరం బేదియొ వేఁడుమనుటయు. 74

తే. అభవ! యీ నాకు నీప్సితం బగువరంబు
దయఁ బ్రసాదించి రక్షింపఁదలఁచి తేని
రౌద్రమై ఘోరమై లోకరక్ష యైన
పాశుపతసంజ్ఞ మగుదివ్యబాణ మిమ్ము. 75

వ. అనినం బ్రీతచేతస్కుండై శంభుండు శాంభవీహృదయానురాగంబునను బ్రమథపరివారసమక్షంబునను మందస్మితంబు కందళింపఁ గరుణాకటాక్ష వీక్షణంబున నప్పాండుకుమారుం జూచి త్రిపురదైతేయసుందరీవదనారవింద వాసరావసానసంధ్యాసమయ సమారంభంబును గరటిదనుజకుంభ కూటకూటకపాలజ్వర(శిర) స్తోమంబును జలంధరజలధరవ్యూహ ఝుంఝూసమీరంబును నంధకాసుర ప్రద్యోతన ప్రభామండలంబును శార్దూల దానవారణ్య హవ్యవాహంబును నగు నమ్మహనీయదివ్యాస్త్రంబు ససంప్రయోగంబు సోపసంహారంబు సకీలకంబు సరహస్యంబుగా నుపదేశించె నపుడు సేవాసమాపన్ను లగుకిన్నర కింపురుషగరుడ గంధర్వవిద్యాధరులు తమతమ దివ్యాయుధంబు లిచ్చిరి. పార్వతీదేవి యక్షయబాణతూణీరంబు లొసఁగె, దండధరుండు దండంబును, పాశపాణి పాశంబును నింద్రుండు వజ్రంబును సమర్పించి రిట్లు వరప్రదానంబు సేసి యీశానుండు సపరివారుండు సాంబుండు నై యంతర్ధానంబు సేసె. 76

---

# శ్రీనాథుఁడు - భీమేశ్వరపురాణము

## వ్యాసనిష్కాసనము

15 వ. శతాబ్ది నడిమిభాగమున కవిసార్వభౌముఁడు శ్రీనాథుఁడు సంస్కృత స్కాందపురాణములోని గోదావరీఖండమను భాగమును భీమేశ్వరపురాణమను పేర నాంధ్రీకరించి బెండపూడి అన్నయ్యామంత్రికిఁ గృతి యిచ్చెను. ఆంధ్రవాఙ్మయమున క్షేత్రమాహాత్మ్యములు ఒక విశిష్ట స్థానమును బొందియున్నవి. కాశీఖండము, భీమఖండ మనఁబడెడి యీ భీమేశ్వరపురాణము; కాళహస్తీశ్వర మాహాత్మ్యము, పాండురంగమాహాత్మ్యము మొదలైనవి యీజాతివే. ప్రకృతగ్రంథమున గోదావరి సమీపమున నున్న దక్షారామము గొప్పక్షేత్రమని చెప్పుట ముఖ్యోద్దేశ్యము. కాశిపై కోపగించి శివుని యాగ్రహమునకు గురియై వ్యాసునంతటివాఁడు దక్షారామము నాశ్రయించి కృతకృత్యుఁడయ్యెనని యిందలి యర్థము.

ఉ. యోజనగంధినందనుఁడు పూర్వశిపట్టియు నిర్నిరోధ ని
ర్వ్యాజ నిరంకుశ ప్రణయవైభవసంపద సొంపు మానసాం
భోజములందలిర్ప మునిపుంగవులొండొరుఁ గౌఁగిలించి వి
భ్రాజితలీలఁ జల్పిరి పరస్పరముం గుశలప్రసంగముల్. 1

క. వినయము భక్తియు సంభ్రమ
మును సౌహార్దంబు హృదయముల మొలతేరన్
వినతిమొనర్చి రగస్త్యున
కును వైశంపాయనాదికులుమునిశిష్యుల్. 2

వ. అనంతరం బాతుల్యభాగాతీర బిల్వతరువనాంతరంబున శశి
కాంతశీతలశిలాతలప్రదేశంబున నాసీనులై యిల్వలాసుర
దమనుండును బరాశరనందనుఁడును గొంతతడవిష్టకథా
వినోదంబులఁ బ్రొద్దుపుచ్చిరప్పుఁ డగస్త్యుండు సాత్యవతే
యున కిట్లులనియె. 3

తే. ఆననమునందు వైవర్ణ్య మగ్గలించెఁ
గన్నుగవయందు దైన్యంబు గానఁబడియె
నార్తియేదేనియొకటి నీయంతరంగ
మూనియున్నది యిదియెట్టు లొక్కొ ? యనఘ ! 4

సీ. లోలార్కునకు నీకు లోలోన నేమేనిఁ
బోటిపుట్టదుగదా మాటమాట
వెనకయ్య శ్రీఢుంఠి విఘ్నేశ్వరస్వామి
ధిక్కరింపఁడుగదా తెగువ నిన్ను
నాఁకొన్ననిన్ను మధ్యాహ్నకాలంబున,
నరయకుండదు గదా యన్నపూర్ణ,
నెపమేమియును లేక నీయెడాటమ్మునఁ
బాటిఁదప్పఁడుగదా భైరవుండు

తే. ఎట్లుపాసితి మిన్నేటి యిసుకతిప్ప
లెట్లుపాసితి వాస్థలం బేనుకోసు
లెట్లుపాసితి వవిముక్త హట్టభూమి
యెట్లుపాసితి విశ్వేశు నిందుధరుని. 5

కం. కాళీనందన కంతే
కాలురశిరములకు విరులు కల్పించునొకో
లీలావనాంతరమునను
మాలోపాముద్రయిడిన మల్లీవల్లుల్. 6

శా. ఆమందాకిని యా త్రివేణి వలనం బాబాహ్యకక్ష్యాస్థలం
బామధ్యాంతరకక్ష్యలావిమలదివ్యజ్యోతిరుజ్జృంభణ
శ్రీమద్విశ్వపతీశలింగము మదిం జింతింపఁ గాశీమహా
గ్రామంబిప్పుడు నాకనుంగవకు సాక్షాత్కారముం
గైకొనున్. 7

శా. ఆనందంబున నర్ధరాత్రములఁ జంద్రాలోకముల్ కాయఁగా
నానాసైకతవేదికాస్థలములన్ నల్దిక్కులన్ శంభుఁ గా
శీనాథున్ దరుణేందుశేఖరు శివున్ శ్రీకంఠునిన్ బాడుదు
న్మేనెల్లంబులకాంకురప్రకరముల్ నిండార మిన్నేటిలోన్.

క. గంగాయమునాతీరో
త్సంగమునఁ బ్రయాగను స్సదాశివు విశ్వే
శుం గూర్చి తపము చేసితి,
నంగుష్ఠము ధరణిమోపి యతిఘోరముగన్. 9

తే. విస్మయము నాకు మదిలోన విస్తరిల్లెఁ
బరమధర్మజ్ఞ! కాశికాపట్టణమున
నుండు మాహాత్మ్యమైనను నొందుకడకుఁ
బోవఁదలఁపడు నీకెట్లు బుద్ధిపుట్టె. 10

వ. అనినఁ బారాశర్యుండు వాతాపి దమనున కిట్లనియె. 11

చ. సమధికసత్కవీశ్వరులు జైమినిపైలసుమంతు లాదిగా
శమదమ సద్గుణాన్వితులు సాధులుశిష్యులుతోడఁగూడి రాఁ
గ్రమమున క్షేత్రయాత్రకు ధరాతలమందఖిలంబు ద్రొక్కి భా
వము భవభక్తియుక్తముగ వచ్చితిఁ గాశికిఁ బుణ్యరాశికిన్.

క. ఏమి శకునమునఁ జొచ్చితి
మో మన్మథదమను వీ డహోరాత్రంబుల్
మే మేడునాళ్ళ దనుకను
స్వామీ! యుపవాసముండి జడిసితిమి మదిన్. 13

కం. గేహముల కేగి 'భిక్షాం
దేహి' యన నీట నొక పతివ్రతయైనన్
సౌహార్దంబునఁ దెడ్డెం
డాహారము పెట్టదయ్యె నాదినములలోన్. 14

శా. శ్రీ విశ్వేశ్వర దేవదేవుని కృపా శ్రీచే దివోదాసు బా
హావిక్రాంతబలంబుచేత ధవళన్యాయప్రజావృద్ధి నొ
ప్పైవిశ్రామముగల్గి సుస్థిరతరంబై యుండి భాసిల్లఁగా
నీవారాణశిలోన భిక్ష కఱవయ్యెం జూడుమో కుంభజా! 15

శా. వైశంపాయనుఁ డెంతయున్ సుడివడెన్వ్యాడెన్ సుమంతుం డతి
క్లేశంబందిరి పైలజైమినులు దుఃఖంచెన్ మదిన్ దేవలుం
డాశాంతంబులు చూచె దాల్భ్యుఁడుదరోదగ్రక్షుధాక్షోభచేఁ
గాశీపట్టణ విప్రవాటికల భిక్షాలబ్ధి లేకుండుటన్. 16

తే. అక్కటా యేమిచెప్ప వింధ్యాద్రిదమన,
కాశిలో నేడు నాళ్లు నిష్కారణంబ
శిష్యులును నేను నిట్టు పాసెంబు వడితి
మమర గంగానదీ సైకతములయందు. 17

వ. అష్టమదివసంబునం దరుణోదయకాలంబున గంగాపులినో త్సంగంబులం గుశశయనంబున మేలుగాంచి యభ్యుదితం బైన మార్తాండ మండలంబాఖండల దిశావేదండకంఠ గ్రైవేయ కనకఘంటికాలంకారంబునుంబోలె నుదయగిరి శిఖరతట సవిధంబునఁ గుంకుమ రజస్త్రసరేణు విసరంబునుం బోని నిగనిగని నునుజిగిగీలుకొని జిలుఁగు జిగికొనలు గగన తల మలమికొనుకొలఁది మణికర్ణికాంభఃప్రవాహంబున నఘమర్షణ స్నాన మాచరించి యత్తీరవాసిజనవిరచిత వాలుకాలింగంబులకుఁ బీఠార్చనాశంభులింగంబులకును మంత్రాక్షతపుష్ప పూర్వకంబుగా నభివాదనంబుచేసి పంచ బ్రహ్మ పంచాక్షరీమంత్ర ప్రధానంబులు జపియించి సిద్ధముని పరంపరాసంకులంబైన ఘంటాపథంబున గంగా బహిర్గేహ దేహళీవిభాగంబును నంతర్గేహ సౌధవీథికాట్ట కుట్టిమ ప్రఘణంబులును గడిచి లోలార్క కాలభైరవ డుంఠివినాయకవిశాలాక్షీ ప్రముఖపరివార దేవతాకోటికి నేటికోళ్లుసమర్పించి విశ్వేశ్వరు విరూపాక్షు నక్షీణమోక్ష లక్ష్మీ సామ్రాజ్యసింహాసనారూఢుం దారకోపదేశ దేశికు దాక్షిణ్యపుణ్య కరుణాకటాక్షవీక్షాపేక్షుని బ్రదక్షిణ

ప్రక్రమదండప్రణామపురస్సరంబుగా సేవించి ముక్తి మంటపంబునఁ గొంతతడవుండి మధ్యాహ్నకాలంబగుట నిరూపించి భిక్షాపాత్రంబులఁ గేలఁబూని యతికఠోర జఠరక్షుధాగ్ని తాపంబునకుఁదోడగు తపనమయు ప్రచండ కిరణకాండప్రకాండంబులు నెత్తి మండింప లేదు, నడు వుండు, పొండు, కూడదను నిషేధవాక్యంబులు చెవులునిండు కొన విప్రవాటంబులఁ బ్రతిగేహంబును బరిభ్రమించి విసికి విసిమాలి వేసరి యలసి యారటఁబొంది సొలసి జూఁకించి తూలి, దూఁపటిలి యుల్లంబునఁ గ్రోధంబుద్భవించిన. 18

శా. కుక్షిప్రోద్భవ నిష్ఠురక్షుధిత దుష్క్రోధాంధకారంబునం
జక్షుల్ రెండును జిమ్మచీఁకటులుగా సంరంభశుంభద్గతిం
బ్రేక్షచ్ఛాత్రులు భీతిఁబొందఁ గడునుద్రేకించి హట్టంబునం
భిక్షాపాత్రము రాతిమీఁద శతధా భిన్నంబుగా వైచితిన్.

క. అటు పౌరవీథి చక్కటిఁ
బటుకునఁ బడవైచి క్రోధపరిపాటిమెయిం
గటము లదరంగ భ్రూకుటి
నిటలములను జెమటనీరు నిండ ఘటిల్లన్. 20

క, ఏమియని చెప్పుదును లో
పాముద్రాప్రాణనాథ! ప్రజ్ఞావిభవం
బేమో యయి చెడిపోవఁగ
నామది నెన్నండులేని నైచ్యము పొడమెన్. 21

సీ. ఏలా విచారింప నిందురేఖామాళి
వివిధమౌక్తికధాతు విశ్వనాథు
నేలా వితర్కింప హిమశైలశేఖరో
ష్ణీషకౌశేయంబు సిద్ధతటిని
నేలా పరీక్షింప నిభరాజవదనుని
డుంఠివిఘ్నేశు మండూకజఠరు
నేలా విలోకింప శ్రీకాశికాశూన్య
కటిఁ గాలభైరవు వటుకనాథు

తే. నిఖిలకైవల్య కల్యాణనిలయమైన
కాశిపైఁగూడు లేకుండు కారణమున
నలిగి శపియింపఁగాబూని యందుకొంటి
ధృతకమండలుభాగీరథీజలంబు. 22

ఉ. కోపముసంహరింపు మునికుంజర! యంచు లలాటదేశ సం
స్థాపిత పాణిపద్మయుగ సంఘటితాంజలిబంధులై మహా
తాపసశిష్యబృందములు ధర్మపథంబును దెల్పిచెప్పఁగా
శాపజలంబు పూనితిఁ బ్రశాంతివిహీనత నేమిచెప్పుదున్.

వ. ఇవ్విధంబున సప్తవాసరోపవాసాయాస సంభూత ప్రభూత
రోషావేశంబున నంగుళీపవిత్రసనాథంబైన హస్తంబున
మణికర్ణికాజలంబులు ధరియించి యిట్లని శపియింప
నుద్యోగించితి. 24

శ్లో. మాభూ త్త్రైపురుషీ విద్యా
మాభూ త్త్రైపురుషం ధనమ్
మాభూ త్త్రైపురుషీ భక్తిః
కాశ్యాం నివసతాం సదా. 25

తే. అని శపింపఁగఁ బూను నయ్యవసరమున
నేమిచెప్పుదు నో సంయమీంద్రవంద్య!
యుదిలకొని కంపమందుచు నుండఁగాని
శాపజలమందుకోఁ గేలు సాఁగదయ్యె. 26

వ. ఆసమయంబునఁ గాశికానగర సోమవీథికాభవన వాటికా మధ్యంబున నొక్కయింటిమచ్చుకంటి పంచాశద్వర్ష దేశీయపలితశారంబైన వేణికాభారంబు గైవడఁ దన తనూవల్లి జలదరింపఁ గంకణఝుణఝుణత్కారంబు దోరంబుగా గ్రక్కున గోపురద్వారంబు బోరుతలుపు వాయందట్టి యందియలరవళితోడంగూడి మట్టియలమ్రోఁత త్రిభువనంబులు నురుజగొనం దెరువుగడపయోరం జరణపల్లవంబుఁ జాచి యనంగధ్వజ పట కశోరపాఠీన చ్ఛాయా దాయాదంబులైన పెడఁదకన్నులు తలచుట్టునుం బలసి పొలయఁ గలమధుర వీణాక్వాణ పాణింధమంబైన మెలుంగునెత్తియో బ్రాహ్మణోత్తమా! శాపము సంహరించి యిటురమ్మని నన్నుఁ జేరంబిలిచిన, 27

ఉ. సంతసమంది యేనపుడు శాపజలంబులు పాఱ జల్లి వే
దాంతవచోమహోపనిష దర్థమయిన్ శుభరూప వృద్ధ సీ

మంతినిఁ గాశికానగర మధ్యనివాసిని విశ్వనాథు శు
ద్ధాంతముడాయఁబోయితిఁ బ్రియంబును భక్తియునుం
దలిర్పఁగన్. 28

ఆ. డాయఁబోయి యప్పుడాయమ్మ యెవ్వరో
యే కులంబునదియొ యెఱుఁగకయును
నే జొహారు నిడితి హృదయంబ నేరుచు
నెదురు ప్రాభవంబు నేర్పరింప. 29

వ. అంత నన్నుం జేరఁబిలిచి యక్కాంత యిట్లనియె. 30

తే. భిక్ష లేదని యింత కోపింతురయ్య
కాశికాపట్టణముమీఁదఁ గాదు సేయ
నీమనశ్శుద్ధిఁ దెలియంగ నీలకంఠుఁ
డింత చేసెను గాక కూడేమి బ్రాఁతి. 31

తే. శ్రీవిశాలాక్షి బంగారు క్రెడ్డునందు
నమృతపాయస మొసఁగు నభ్యాగతులకుఁ
గాశికాపురి మధ్యాహ్న కాల మనఁగ
వినియు నెఱుఁగవె? యాతిథ్య వేళలందు. 32

ఉ. ఏడుదినంబు లన్నమున కెడ్డముపుట్టిన యంతమాత్రలో
నేఁచుచున్న వాఁడవు మునీశ్వర! నేఁడును నీదు ధీరతల్
పాడటిపోయెనే శివునిభార్యకుఁ గాశికిఁ బుణ్యరాశికిం
గాడు నొనర్పఁజూచెదవు కంతపుఁగ్రోధము
పెచ్చులెచ్చఁగన్. 33

ఉ. క్రొన్నెలపువ్వుదాల్పునకుఁ గూరిమిభోగపురంధ్రి కగ్గ్కటా
యిన్నగరీలలామమున కీపరిపాటికి నిట్టికోపమే
లన్న! ఘటించెదో మునికులాగ్రణి! సిక్కముపో 'బుభుక్షితః
కిన్నకరోతిపాప' మను కేవలనీతిఁ దలంచిచూడఁగన్. 34

తే. కాశిపైఁ గోపగింపఁగఁగాదు నీకు
నెంతకోపించునో యింత కిందుమౌళి
విప్రుఁడవు గాన నేరము వెదకఁ దగదు
భిక్షఁగొనరమ్ము మాటలు పెక్కులేల. 35

వ. అనిన నవ్వాలుఁగంటికి నిట్లంటి. 36

శా. తల్లీ! యిన్నిదినాల కేనియు సుధాధారారసస్యందివై
యుల్లంబున్ సుఖియింపఁజేయు పలుకెట్లోవింటి నివ్వేటిలోఁ
బెల్లాకొన్నతనాన నేనొకఁడనే భిక్షానకున్ వత్తునో?
యెల్లన్ శిష్యులఁ గొంచు వత్తునో? నిజం బేర్పాటుగాఁ
జెప్పవమా. 37

తే. ఈవు పెట్టిన భిక్షమే మిందఱమును
బంచుకొని చేయువారము ప్రాణరక్ష
నాతి! యందఱివియును బ్రాణములుగావె?
నాయదియె ప్రాణమని వత్తునా? భుజింప. 38

వ. అనిన మందస్మితవదనారవిందవై యయ్యిందుబింబానన
యి ట్లనియె. 39

శా. అంతేవాసులు నీవుఁగూడుకొని మధ్యాహ్నభిక్షైకక్రియల్
శాంతస్వాంతతఁ జాహ్నవిం జలిపి పెల్పున్ రండు నేనింతలో

నంతర్గేహమునన్ సమగ్రముగ మీకాహారముల్ వేగఁగ
ల్పింతున్ భోజనమిష్టమిందఱకుఁ దృప్తిన్ బొందఁగాఁ
బెట్టెదన్. 40

క. ఆఁవొంటి రిన్నిదినములు,
పోఁ కంతయు భిక్షు వీటఁ బుట్టకయునికిన్
ఆఁకట దూఁకట నలిగితి
రేఁకట వాయంగ భిక్షులిడి మెద రండీ. 41

వ. అనిన నేమును వియల్లోకకల్లోలినికిం జని యాప్లవనం బాచరించి యుభయ పవిత్రంబులు ధరియించి వేదంబులు పఠియించుచు వచ్చి యమ్మచ్చెకంటి యింటిమొగసాలఁ గూర్చుంటిమి. 42

క. మున్నాఱు శిష్యులును నే
నన్నెలఁతుకతోడ మాటలాడిన యయ్యౌ
భ్యున్నతసౌధముమీఁదను
సున్నము నిగిడించినట్టి జోడరుగులపై. 43

వ. ఉండి ఘనసార ప్రసారంబులుచేయు శంభళీజనంబుల చేతను మారాక మెఱుంగించిన నబ్బోటి హాటకమయం బైన గొడుగుపావలు గిలుకలు గులుకరింపఁ గుసుమ కోదండసమ్మోహనకాండంబునుఁ బోనియొక్క రెండవ వయసు తాంబూలకరండవాహినిం గైదండ పట్టుకొని యేతెంచి రండు విచ్చేయుండని సబహుమానంబుగాఁ దోడ్కొనిపోయి చంద్రికాసంకాశ కౌశేయశత సహస్ర

సందానితవితానోపశోభితంబును, గాలాగురుధూపధూమ వాసనాసనాథంబును, గర్పూరరచితరంగవల్లీ వేల్లితంబును, గస్తూరికా లేపనసురభి శశికాంతమణిశిలాకుట్టిమంబును నగు చతుశ్శాలభోజనమందిరంబున వృద్ధానుపూర్వకంబుగ నుచితాసనంబులం గూర్చుండ నియమించిన

క. మొగి విరిసి కలకు గూడక
పగులక వెడలుపును నిడుపుఁ బసిమియుఁ గల లేఁ
జిగురరటాకులు పెట్టిరి
దిగదిగ నద్దేవియాజ్ఞ దివ్యపురంధ్రుల్. 45

వ. అనంతరంబ. 46

తే. అర్చనలు చేసి గంధపుష్పాక్షతముల
ధూపమిచ్చెఁ గాలాగురు ధూమరేఖఁ
గప్పురంబు నివాళించెఁ గమలనేత్ర
పంక్తిపంక్తికి నేతెంచి బ్రాహ్మణులకు. 47

ఉ. ఇందఱుఁ గూడి శాంతి పఠియింపుడు మజ్జనమాచరింపుఁడ
ర్ధేందు కళాకిరీటునకు నీ యమృతాన్నము లీపదార్థముల్
మందగతిం భుజింపుఁడు సమస్తజగత్పతి కాశికాపురీ
మందిర విశ్వనాయకుఁ డుమాపతి ప్రీతి వహించుఁగావుతన్.

వ. అని పంక్తిపంక్తి నడుమ నిలుచుచు నయ్యంతి భక్తిశ్రద్ధాతాత్పర్య విశ్వాసపూర్వకంబుగా నుర్వీగీర్వాణవర్గంబుల ప్రార్థించుచు నాపోశనంబులు వోయింపనుండె నప్పుడేనుఁ

బైలసుమంతుజైమినివైశంపాయనాది శిష్య ప్రకరంబు
నెమ్మనంబుల నిట్లని వితర్కించుచుంటిమి. 49

ఉ. వండినచొప్పనుం బోగపువాసనయుం బోగపాలు
చందమున్
భాండసమృద్ధిసంపదయుఁ బానవిభూతియు సర్వమంగళం
బండజయాన రిత్తప్రియమాడెదు నేఁడును భోజనంబు లే
కుండుట గాననయ్యె నసితోత్పలగంధియు నేమి మాయయో

ఉ. చల్లనిసౌమ్యదృష్టియుఁ బ్రసాదము మాధురియునివ్వేకము
న్నొల్లదనంబు హార్ద్యముసు నిర్మలినత్వముఁ జూడవచ్చినం
గల్లయొకింత యేనిఁ బొడగానఁగ రా దరఁటాకుఁ జూచినన్
ఝల్లనె గుండె యోగిరము శాకములుంబొడగానరామికిన్.

తే. పాత్రసంశుద్ధి కాజ్యంబు ప స్తరించి
యూరకుండిరి యిది యేమి యొక్కొ వీరు
కానరావిష్ట శాకపాకములు నెదుర
మనకు నిజమయ్యె నల చందమామ ఘుటిక. 52

మ. అవుఁగాకేమి నిజంబు తేటపడఁగా నర్చించె గంధాక్షతా
దివిశేషంబుల శాంతిపాఠమును సందీపించె విశ్వేశ్వరున్
శివునుద్దేశముచేసి మ్రొక్కి వివిధాశీర్వాదముల్ గైకొనెం
ధవళాంభోరుహనేత్ర యింతయునుమిథ్యాదృష్టిగానేర్చునే.

క. కాసీ యీా దివసంబును
నే నిన్నఁటి యట్లశాక యేమనఁగ నహో

సానంబులు వడ్డించిరి
మానవతీజనులు లీల మహిదివిజులకున్. 54

తే. పోసిరామెల్ల వారి కాపోశనములు
నారగింపుఁడు లెండు మీ కమృతమస్తు
ప్రొద్దుపోయెను జుండని బుజ్జగించి
మ్రొక్కి యంజలియెత్తి నమ్ముదుక పణఁతి. 55

శా. ఆముత్తైదువ యాజ్ఞ విప్రనికరం బాపోశనం బెత్తినన్
సామర్థ్యంబది యెట్టిదో నిఖిలమున్ సంపూర్ణమై పత్రపా
త్రీమధ్యంబునఁ బిండివంటకములుం దివ్యాన్నముల్ మద్రసీ
సామగ్రీరుచిమత్పదార్థచయము ల్సంధిల్లె నొక్కుమ్మడిన్.

ఉ. పప్పును బిండివంటలును బాయసముల్ ఘృతముల్
గుడంబులుం
గుప్పలుగాఁగఁ జుట్టు నొనఁగూర్పఁగ గూడిన యేరుఁబ్రాలతే
ల్గప్పురబోగివంటకము గమ్మని తాలిపు సాజ్జపిండితో
నొప్పులుగా భుజించిరి బునా త్తము లాఁకటి
చిచ్చుపెచ్చునన్. 57

కం. తరుణి యిది యన్నపూర్ణా
పరమేశ్వరి గాని యితరభామిని గాదం
చరవాయిగొనక మెసఁగిరి
పరమమునీశ్వరులు పంచభక్ష్యాన్నంబుల్. 58

శా. ద్రాక్షాపానకఖండశర్కరలతో రంభాఫలశ్రేణితో
గోక్షీరంబులతోడ మండెగలతోఁ గ్రొన్నేతితోఁబప్పుతో
నక్షయ్యంబగు నేరుఁబ్రాల కలమాహారంబు నిశ్శంకతం
గుక్షుల్ నిండఁగ నారగించితిమి యక్షుద్రక్షుధాశాంతికిన్.

ఆ. ఎవ్వఁడేపదార్థ మెంతేనిఁ జింతించు
నతనికా పదార్థ మంత గలిగి
యరఁటియాకు మీఁద నవతారమైయుండు
నిట్టిమహిమ చూడ మెన్నఁడేని. 60

ఉ. వేలుపుగిడ్డియుం బరుసవేదియుఁ గల్పకుజంబుఁ దోడరా
లాలితపాదనూపుర ఝుళంఝుళనాదము లుల్లసిల్లఁబైఁ
జేల చెఱంగు దూలఁగ విశృంఖలవృత్తిఁ జరించుచుండె నీ
లాలక యన్నపూర్ణ యమృతాన్నముఁ బెట్టుచు
నన్నిపంక్తులన్. 61

వ. ఇవ్విధంబున నాజ్యధారాప్రవాహంబును, శర్కరాక్షోద
సికతాంచితంబును, పాయసాపూపసంపన్నంబగు కలమా
న్నపూర్ణంబును, ద్రాక్షాగోక్షీర క్షౌద్రపుండ్రేక్షు ఖండ
మండితంబును, రంభా నారికేళ ఫలపాక శాకసాకల్యంబును,
షాడబరసావళీ పానకప్రచురంబును, శరచ్చంద్రచంద్రికా
ధవళదధిసమృద్ధంబును నైన భోజనోత్సవంబు వైశం
పాయనమనః ప్రమోద సంపత్సంపాదనలంపటంబును,
సుమంతుసంతోషకారణంబును, పైలరసనాతపఃఫలంబును
జైమినికామనాకామధేనువును, దేవలముదావహంబును,

రోమహర్షణ హర్షోత్కర్షావహంబును, సూతకౌతూహల
హేతుభూతంబును, నస్మన్మనోరథ విహారఘంటాపథం
బునునై ప్రవర్తిల్లెఁ దదనంతరంబ. 62

ఆ. హస్తములను గడిగి యాచమనక్రియా
వ్యాప్తిదీర్చి దేవియాజ్ఞ మేము
విమలసౌధమధ్య వేదికాస్థలమున
విశ్రమించియున్న వేళయందు. 63

వ. అభ్యంతర భవనంబునందుండి 64

సీ. చంద్రబింబానన చంద్రరేఖామౌళి,
నీలకుంతలభార నీలగళుఁడు,
ధవళాయతేక్షణ ధవళాఖిలాంగుండు,
మదనసంజీవని మదన హరుఁడు,
నాగేంద్రనిభయాన నాగకుండలధారి,
భువనమోహనగాత్ర భువనకర్త,
గిరిరాజకన్యక గిరిరాజనిలయుండు,
సర్వాంగసుందరి సర్వగురుఁడు

తే. గీ. గౌరి శ్రీవిశ్వనాథుండు కనకరత్న
పాదుకలు మెట్టిచట్టలు పట్టికొనుచు
నేఁగుదెంచిరి యొయ్యార మెసక మెసఁగ
విహరణక్రీడ మాయున్న వేదికపుకు. 65

తే. గీ. జయయు విజయయు నొకవంక సరస రారు
నందికేశుండు ముందర నడచిరాఁగ

ప్రథమ దంపతులేమి సంభ్రమము లేక
యరుగుదెంచుట యద్భుతమయ్యె మాకు. 66

శా. గౌరిం జూచినయప్పు డంచితమహాకారుణ్యసంపత్తియుం
దారానాయకమౌళిఁజూచినపుడు ద్యత్రోద్ధసంరంభముం
దోరంబై యపు డంతరంగముల సంతోషంబు
సంత్రాసముం
బూరించెన్విను మేమిచెప్పుదు మహాపుణ్యాత్మ!
కుంభోద్భవా! 67

తే.గీ. కాశి శివునకు శుద్ధాంత కాంతగాన
దానిపై నల్గి కోపపాత్రంబనైతిఁ
గాశి గౌరికి సవతియౌఁ గాన నేను
దానిపై నల్గి ప్రేమపాత్రంబనైతి. 68

వ. అనంతరంబ మేము ప్రత్యుత్థానంబుసేసి యాపురాణ దంపతులకుఁ బ్రణామంబు లాచరించి మడిసందులం జేతు లిడి యొక్కకెలన నిలిచియుండితిమి. పార్వతీపరమేశ్వరులు వేదికాస్థలంబున విజయంచేసి కూర్చుండిరప్పుడు శంభుండు కోపసంరంభంబున నాదిక్కుచూచి ధిక్కరించి యిట్లనియె. 69

సీ. ఓరి దురాత్మ! నీవారముష్టింపచాభాస!
యోజనగంధిప్రథమపుత్ర!
దేవరన్యాయ దుర్భావనాపరతంత్ర!


బహుసంహితాపృథక్పాఠపఠన!

భారతగ్రంథగుంభన పండితమ్మన్య !
నీవా మదీయపత్నికి సశేష
కైవల్య కల్యాణ ఘంటాపథమునకుఁ
గాశికాపురికి నిష్కారణంబ

తే. శాపమిచ్చెదనని యనాచారసరణి
నడుగు వెట్టినవాఁడ వహంకరించి
పొమ్ము నిర్భాగ్య ! మాయూరి పొలము వెడలి
యెచటి కేన్ శిష్యులును నీవు నీక్షణంబ. 70

కం. పోక నడగొట్టితేనియు
రాకింతుఁజుమీ మొగంబు రాచట్టుపయిం
శ్రీకాశిక నిందించిన
నీకింతట నేలపోవు నీచచరిత్రా. 71

కం. వడి విడువక యివ్వడువున
నుడుపతిమకుటుండు చెవుల కొనరని నుడుగుల్
నొడివిన నే నయ్యెదువుర
యడుగులఁబడి కాశి వెడలి యరిగెదు వేళన్. 72

చం. వెఱవకుమో కుమార ! పదివేలవిధంబులనైన నిన్ను నే
మఱవ, మఱేడకుం జనుటమాని సుఖంబున దక్షవాటికిన్
దుఱఁగలిగొన్న సమ్మదముతో గమనింపుము భీమనాయకుం
డఱగొఱలేని వేల్పు నిఖిలాభ్యుదయంబులు నీకునయ్యెడున్.

వ. అనిన నంబవచనంబులు విని విశ్వేశ్వర దేవ రచితన్యక్కార మహోపద్రవసంభూత వేదనాదోదూయమానమానసుండ నయ్యును భవానీ కృపాపాంగవీక్షావిక్షేపదాక్షిణ్యంబున నొక్కింత యంకిలి దెలిసి శిష్యసహితుండనై యెన్నఁ డెన్నఁడు భీమేశ్వరు దర్శింతునో యని యువ్విళ్ళూరి యేతెంచుచున్న వాఁడఁ బరమ మాహేశ్వరుండవైన నిన్నుం గనుంగొంటినింక నామనోరథం బవ్యాహతగతిం బ్రవర్తింపఁగలయది. 74

తే. గీ. అనవధానత నావగింజంత నూవె
పర్వతంబంత యపరాధభరముఁగొలిపి
కాశివెడలంగ మొత్తినఁ గాసిబొంది
తిరుగుచున్నాఁడ నిదె యేను దిక్కుమాలి. 75



# వేమన పద్యములు

ఆ. గంగిగోవు పాలు గంటెడైనను చాలు
కడవెడైననేమి ఖరముపాలు
భక్తికలుగుకూడు పట్టెడైనను చాలు
విశ్వదాభిరామ వినురవేమ! 1

ఆ. కోపమునను ఘనత కొంచెమై పోవును
కోపమునను మిగుల గోడు జెందు
కోపమడచెనేని కోరిక లీడేరు, విశ్వ. 2

ఆ అనువుగానిచోట అధికుల మనరాదు
కొంచెముండు టెల్ల కొదువకాదు
కొండ అద్దమందు కొంచెమైయుండదా, విశ్వ. 3

ఆ. పదుగురాడుమాట పాటియై ధరజెల్లు
నొక్కడాడుమాట యెక్కదెందు
ఊరకుండువాని కూరెల్లనోపదు, విశ్వ. 4

ఆ. నీళ్ళలోన మొసలి నిగిడి ఏనుగు బట్టు
బయట కుక్కచేత భంగపడును
స్థానబలిమిగాని తనబల్మి కాదయా, విశ్వ. 5

ఆ. అల్పబుద్ధివాని కధికారమిచ్చిన
దొడ్డవారినెల్ల దొలగగొట్టు
చెప్పుతినెడికుక్క చెఱకు తీ పెరుగునా, విశ్వ. 6

ఆ. తప్పు లెన్నువారు తండోపతండము
లుర్విజనులకెల్ల నుండుఁ దప్పు
తప్పు లెన్నువారు దమతప్పు లెఱుఁగరు, విశ్వ. 7

ఆ. అల్పు డెపుడు పల్కు నాడంబరముగాను
సజ్జనుండుపల్కు చల్లగాను,
కంచుమ్రోగునట్లు కనకంబుమ్రోగునా? విశ్వ. 8

ఆ. ఉప్పు కప్పురంబు నొక్కపోలిక నుండు
చూడ చూడ రుచుల జాడవేరు
పురుషులందు పుణ్యపురుషులు వేరయా, విశ్వ. 9

ఆ. చెప్పులోనిఱాయి చెవిలోనిజోరీఁగ
కంటిలోనినలుసు కాలిముల్లు
యింటిలోనిపోరు నింతంతగాదయా, విశ్వ. 10

ఆ. వేము పాలుఁ బోసి వేయేండ్లుబెంచిన
చేదు విడిచి తీపుఁ జెందనటుల
నోగుగుణము విడిచి యుచితజ్ఞుఁ డగునెట్లు, విశ్వ. 11

ఆ. కన్ను పోవువాఁడు గాళ్లు పోయినవాఁడు
నుభయు లరయఁ గూడి యుండునట్లు
పేద పేదఁ గూడి పెనఁగొనియుండును, విశ్వ. 12

ఆ. చిత్తశుద్ధి గల్గి చేసినపుణ్యంబు
కొంచెమయిన నదియుఁ గొదువ గాదు
విత్తనంబు మఱ్ఱివృక్షంబునకు నెంత?, విశ్వ. 13

ఆ. తల్లిదండ్రిమీఁద దయ లేనిపుత్రుండు
పుట్ట నేమి ? వాఁడు గిట్ట నేమి ?
పుట్టలోనఁ జెదలు పుట్టదా గిట్టదా ?, విశ్వ. 14

ఆ. మేడిపండుఁ జూడ మేలి మైయుండును
పొట్ట విచ్చి జూడఁ బురుగు లుండు
బెరుకువానిమదిని బింక మీలాగురా, విశ్వ. 15

ఆ. అనఁగ ననఁగ రాగ మతిశయిల్లుచునుండుఁ
దినగ దినఁగ వేము తీయ నుండు
సాధనమునఁ బనులు సమకూఱుధరలోన, విశ్వ. 16

ఆ. ఇనుము విఱిగెనేని యినుమారు ముమ్మారు
కాఁచి యతుఁక నేర్చు కమ్మరీఁడు
మనసు విఱిగె నేని మఱి యంట నేర్చునా ?, విశ్వ. 17

ఆ. చంపఁ దగినయట్టిశత్రువు దనచేతఁ
జిక్కెనేని కీడు సేయరాదు
పొసఁగ మేలుచేసి పొమ్మనుట చాలు, విశ్వ. 18

ఆ. ఓగు నోగు మెచ్చు నొనరంగ నజ్ఞాని
భావ మిచ్చి మెచ్చు పరమలుబ్ధు
పంది బురద మెచ్చు పన్నీరు మెచ్చునా ?, విశ్వ. 19

ఆ. చిక్కియున్న వేళ సింహంబు నైనను
బక్క కుక్క చేరి బాధసేయు
బలిమి లేనివేళఁ బంతంబు చెల్లదు, విశ్వ. 20

ఆ. ఎంతచదువుఁ జదివి యెన్ని విన్నను గాని
హీనుఁ డవగుణంబు మానలేఁడు
బొగ్గు పాలఁ గడుగ బోవునా మలినంబు, విశ్వ. 21

ఆ. భూమి నాది యన్న భూమి పక్కున నవ్వు
దానహీనుఁ జూచి ధనము నవ్వు
కదనభీతుఁ జూచి కాలుఁడు నవ్వును, విశ్వ. 22

ఆ. ఆపదందుఁ జూడు మారయ బంధుల
భయమువేళఁ జూడు బంటుగుణము
పేదపడ్డవెనుక పెండ్లాముగతిఁ జూడు, విశ్వ. 23

ఆ. ఆత్మశుద్ధి లేనియాచారమదియేల
భాండశుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధి లేనిశివపూజలేలరా ?, విశ్వ. 24



# అల్లసాని పెద్దన - మనుచరిత్రము

## ప్రవరుని కథ

(ఆశ్వాసములు. I. II.)

మ. వరణాద్వీపవతీతటాంచలమునన్ వప్రస్థలీచుంబితాం
బరమై సౌధసుధాప్రభాధవళితప్రాలేయరుఙ్మండలీ
హరిణంబై యరుణాస్పదం బనఁగ నార్యావర్తదేశంబునం
బుర మొప్పున్ మహికంఠహారతరళస్ఫూర్తిన్
విడంబించుచున్. 1

సీ. అచటివిప్రులు మెచ్చరఖిలవిద్యాప్రౌఢి
ముది మది దప్పిన మొదటివేల్పు
నచటిరాజులు బంటునంపి భార్గవు నైన
బింకానఁ బిలిపింతు రంకమునకు
నచటిమేటికిరాటు లలకాధిపతి నైన
మునుసంచి మొద లిచ్చి మనుప దక్షు
లచటి నాలవజాతి హాలముఖాత్తవిభూతి
నాదిభిక్షువుభైక్షమైన మాన్చు

తే. నచటివెలయాండ్రు రంభాదులైన నోరయఁ
గాసెకొంగున వారించి కడపఁగలరు
నాట్యరేఖాకళాధురంధరనిరూఢి
నచటఁ బుట్టినచిగురుఁగొమ్మైన జేవ. 2

ఉ. ఆపురిఁ బాయకుండు మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి భా
షాపరశేషభోగి వివిధాధ్వరనిర్మలధర్మకర్మదీ
క్షాపరతంత్రుఁ డంబురుహగర్భకులాభరణం బనారతా
ధ్యాపనతత్పరుండు ప్రవరాఖ్యుఁ డలేఖ్యతనూవిలాసుఁ డై.

ఆ. వానిచక్కఁదనము వైరాగ్యమునఁ జేసి
కాంక్ష సేయు జారకామినులకు
భోగబాహ్య మయ్యెఁ బూచినసంపెంగ
పొలుపు మధుకరాంగనలకుఁబోలె. 4

ఉ. యౌవనమందు యజ్వయు ధనాఢ్యుఁడు నై కమనీయకౌతుక
శ్రీవిధిఁ గూఁకటుల్ గొలిచి సేసినకూరిమిసోమిదమ్మ సా
ధ్వీవహ యై భజింప సుఖులై తలిదండ్రులు గూడి
దేవియున్
దేవరవోలె నుండి యిలుదీర్పఁగఁ గాఁపుర మొప్పువానికిన్.

సీ. వరణాతరంగిణీ దరవికస్వర నూత్న
కమలకషాయగంధము వహించి
ప్రత్యూషపవనాంకురములు పైకొను వేళ
వామనస్తుతిపరత్వమున లేచి
సచ్ఛాత్రుఁ డగుచు నిచ్చలు నేగి యయ్యేట
నఘమర్షణస్నాన మాచరించి
సాంధ్యకృత్యముఁ దీర్చి సావిత్రి జపియించి
సైకతస్థలిఁ గర్మసాక్షి కెఱఁగి

ఫలసమిత్కుశకుసుమాది బహుపదార్థ
తతియు నుదికినమడుఁగు దోవతులుఁ గొంచు
బ్రహ్మచారులు వెంటరా బ్రాహ్మణుండు
వచ్చు నింటికిఁ బ్రజ దన్ను మెచ్చి చూడ. 6

శా. శీలంబుం గులమున్ శమంబు దమముం జెల్వాబు లేఁబ్రాయముం
బోలం జూచి యితండు పాత్రుఁ డని యే భూపాలుఁ డీవచ్చినన్
సాలగ్రామము మున్నుగాఁ గొనఁడు మాన్యక్షేత్రముల్ పెక్కుచం
దాలc బండు నొకప్పుడుం దఱుఁగదింటం బాఁడియుం బంటయున్. 7

తే. వండ నలయదు వేవురు వచ్చిరేని
నన్నపూర్ణకు నుద్ది యా నతనిగృహిణి
యతిథు లేతేర నడికిరేయైనఁ బెట్టు
నలయు భోజ్యంబు లింట నవ్వారి గాఁగ. 8

సీ. తీర్థసంవాసు లేతెంచినా రని విన్న
నెదురుగా నేగు దవ్వైంత యైన
నేగి తత్పదముల కెఱఁగి యింటికిఁ దెచ్చుఁ
దెచ్చి సద్భక్తినాతిథ్య మిచ్చు

నిచ్చి యిష్టాన్నసంతృప్తులఁ గాఁజేయుఁ
జేసి కూర్చున్నచోఁ జేర వచ్చు
వచ్చి యిద్దరఁ గల్గు వనధిపర్వతసరి
త్తీర్థమాహాత్మ్యముల్ దెలియ నడుగు

తే. నడిగి యోజనపరిమాణ మరయు నరసి
పోవలయుఁ జూడననుచు నూర్పులు నిగుడ్చు
ననుదినము తీర్థసందర్శనాభిలాష
మాత్మ నుప్పొంగ నత్తరుణాగ్నిహోత్రి. 9

క. ఈవిధమున నభ్యాగత
సేవాపరతంత్ర సకలజీవనుఁడై భూ
దేవకుమారకుఁ డుండం
గా విను మొకనాఁడు కుతపకాలమునందున్. 10

సీ. ముడిచిన యొంటికెంజడ మూయ మువ్వన్నె
మెగముతోలు కిరీటముగ ధరించి
కకపాల కేదార కటకముద్రితపాణిఁ
గుఱుచలాతాముతోఁ గూర్చి పట్టి
యైణేయమైనయొడ్డాణంబులవణిచే
నక్కళించినపొట్ట మక్కళించి
యారకూటచ్ఛాయ నవఘళింపఁగఁ జాలు
బడుగుదేహంబున భస్మ మలఁది

తే. మిట్టయురమున నిడుయోగపట్టె మెఱయ
జెవుల రుద్రాక్షపోఁగులు చవుకళింపఁ

గావికుబుసంబు జలకుండికయును బూని
చేరెఁ దద్గేహ మౌషధసిద్ధుఁ డొకఁడు. 11

తే. ఇట్లు చనుదెంచు పరమయోగీంద్రుఁ గాంచి
భక్తిసంయుక్తి నెదురేగి ప్రణతుఁ డగుచు
నర్ఘ్యపాద్యాదిపూజనం బాచరించి
యిష్టమృష్టాన్నకలన సంతుష్టుఁ జేసి. 12

క. ఎం దుండి యెందుఁ బోవుచు
నిందుల కేతెంచినారలిప్పుడు విద్వ
ద్వందిత! నేఁడు గదా మ
న్మందిరము పవిత్ర మయ్యె మాన్యుఁడ నైతిన్. 13

క. మీమాటలు మంత్రంబులు,
మీమెట్టినయెడ ప్రయాగ మీపాదపవి
త్రామలతోయము లలఘు
ద్యోమార్గఝురాంబుపౌనరుక్త్యము లుర్విన్. 14

ఉ. వానిది భాగ్యవైభవము వానిది పుణ్యవిశేష మెమ్మెయిన్
వాని దవంధ్యజీవనము వానిది జన్మము వేయు నేల యె
వ్వానిగృహాంతరంబున భవాదృశయోగిజనంబు పావన
స్నానవిధాన్నపానముల సంతసమందుచుఁ బోవునిచ్చలున్.

తే. మానినాథ! కుటుంబజంబాలపటల
మగ్నమాదృశగృహమేధి మండలంబు
నుద్ధరింపఁగ నౌషధ మొండు గలదె
యుష్మదంఘ్రిరజోలేశ మొకటి దక్క. 16

క. నా విని ముని యిట్లను వ
త్సా! విను మా వంటి తైర్థికావళి కెల్లన్
మీవంటి గృహస్థుల సుఖ
జీవనమునఁ గాదె తీర్థ సేవయుఁ దలఁపన్. 17

సీ. కెలఁకుల నున్నతం గెటిజున్ను గృహమేధి
యజమానుఁ డంకస్థితార్థపేటి
పండిన పెరటికల్పకము వాస్తవ్యుండు
దొడ్డిఁబెట్టిన వేల్పుగిడ్డి కాఁపు
కడ లేనియమృతంపు నడబావి సంసారి
సవిధమేరునగంబు భవనభర్త
మరుదేశపథమధ్య మప్రప కులపతి
యూఁకటికొదవు సస్యము కుటుంబి

తే. బధిరపంగ్వంధభిక్షుక బ్రహ్మచారి
జటిపరివ్రాజకాతిథి క్షపణకావ
ధూతకాపాలికాద్యనాథులకుఁ గాన
భూసురోత్తమ! గార్హస్థ్యమునకు సరియె? 18

క. నావుడుఁ బ్రవరుం డిట్లను
దేవా! దేవర సమస్త తీర్థాటనముం
గావింపుదు రిలపై నటు
కావున విభజించి యడుగఁ గౌతుక మయ్యెన్. 19

శా. ఏయేదేశములన్ వసించితిరి మీ రేయేగిరుల్ చూచినా
రేయేతీర్థములందుఁ గ్రుంకిడితిరే యేద్వీపముల్ మెట్టినా
రేయేపుణ్యవనాళిఁ ద్రిమ్మరితిరే యేతోయధుల్ డాసినా
రాయాచోటులఁ గల్గువింతలు మహాత్మా! నాకెఱింగింపవే.

తే. పోయి సేవింప లేకున్న' బుణ్యతీర్థ
మహిమ వినుటయు నఖిలకల్మషహరంబ
కాన వేఁడెద ననిన నమ్మాన్యవర్యుఁ
డాదరాయత్తచిత్తుఁడై యతని కనియె. 21

ఉ. ఓచతురాస్యవంశకలశోదధిపూర్ణశశాంక! తీర్థయా
త్రాచణశీలి నై జనపదంబులు పుణ్యనదీనదంబులుం
జూచితి నందునందుఁగలచోద్యములుంగనుఁగొంటి నాపటీ
రాచలపశ్చిమాచలహిమాచలపూర్వాదిశాచలంబులన్.

శా. కేదారేశు భజించితిన్ శిరమునం గీలించితిన్ హింగుళా
పాదాంభోరుహముల్ ప్రయాగనిలయుం బద్మాక్షు సేవించితిన్
యాదోనాథసుతాకళత్రు బదరీనారాయణుం గంటి నీ
యాదేశం బన నేల చూచితి సమస్తాశావకాశంబులన్. 23

వ. అది యట్లుండె వినుము గృహస్థరత్నంబ! లంబమానరవి
రథ తురంగ శృంగార చారుచామరచ్ఛటాప్రేక్షణక్షణో
ద్గ్రీవచమరసముదయం బగునుదయంబునం గలవిశేషం
బులు శేషఫణికి నైన లెక్కింప శక్యంబె. అంధకరిపుకం

ధరావాసవాసుకి వియోగభవదుర్వ్యథాభోగభోగిసీభోగ భాగ పరివేష్టితపటీరవిటపివాటికా వేల్లదే లాలతావలయం బగుమలయంబునం గలచలువకు విలువ యెయ్యది? అకట కట వికట కూటకోటివిటంక శృంగాట కాఘాకమాన జర దిందుబింబగళ దమృతబిందు దుర్దినార్ద్రీకృతసల్లకీపల్లవప్ర భంజన పరాంజనః హస్తిహస్తం బగునస్తంబునం గల మణిప్రస్తరంబుల విశ్రాంతి జింతించిన మేనం బులక లిప్పు డుంబొడమెడు. స్వస్వప్రవర్ధిత వర్ధిష్ణుధరణీరుహాసందోహ దోహదప్రధానాసమాన ఖేలదైలబిలవిలాసినీవిలాసవా చాలతులాకోటికలకలాహూయమాన మానసమదాలసమ రాళం బగురజతశైలంబునోలంబులం గాలగళువిహారప్ర దేశంబులం గన్న సంసృతిక్లేశంబులుహాయవే? సతతమదజల స్రవణపరాయణైరావణవిషాణకోటిసముట్టంకితకటకపరిస్ఫు రత్కురువింద కందళప్రవాతజాతాలాతశంకాప సర్పదభ్రము భ్రమీవిభ్రమధురంధరం బగుమేరు ధరాధరంబు శిఖ రంబుల సోయగంబులు గలయం గనుంగొనుట బహుజన్మ కృతసుకృత పరిపాకంబునంగాక యేల చేకూఱనేర్చు? నే నిట్టి మహాద్భుతంబు లీశ్వరానుగ్రహంబున నల్పకాలంబున గనుంగొంటి ననుటయు నీషదంకురితహాసనగ్రసిష్ణుగండ యుగళుండగుచుం బ్రవరుం డతని కిట్లనియె. 24

చ. వెలసక మీకొనర్తునొక విన్నప మిట్టివి యెల్లఁ జూచి రా
నెలకలు గట్టుకొన్న మటి యేండ్లును బూండ్లును బట్టుఁ
బ్రాయపుం

జిఱుతతనంబు మీ మొగము సెప్పక చెప్పెడు
నద్దిరయ్య మా
కెఱుఁగఁ దరంబె మీమహిమలీర యెఱుంగుదు రేమి
చెప్పుదున్. 25

క. అనినఁ బరదేశి గృహపతి
కనియెన్ సందియముఁ దెలియ నడుగుట తప్పా
వినవయ్య జరయు రుజయును
జెనకంగా వెఱచుమమ్ము సిద్ధుల మగుటన్. 26

మ. పరమం బైనరహస్యమౌ నయిన డాఁపం జెప్పెదన్
భూమిని
ర్జరవంశోత్తమ! పాదలేప మను పేరన్ గల్గుదివ్యౌషధం
పురసం బీశ్వరసత్కృపన్ గలిగెఁ దద్భూరిప్రభావంబునం
జరియింతున్ బవమానమానసతిరస్కారిత్వరాహంకృ
తిన్. 27

క. దివి బిసరుహబాంధవసై౦
ధవసంఘుం బెంతదవ్వు దగ లే కరుగున్
భువి నంతదవ్వు నేమును
తవతవ లేకరుగుదుము హుటాహుటినడలన్. 28

మ. అనినన్ విప్రవరుండు కౌతుకభరవ్యగ్రాంతరంగుండు భ
క్తినిబద్ధాంజలిబంధురుండు నయి మీదివ్యప్రభావం బెఱుం
గనినాప్రల్లదముల్ సహించి మునిలోకగ్రామణీ సత్కృపన్
నను మీశిష్యునిఁ దీర్థయాత్రవలనన్ ధన్యాత్ముఁగా జేయ రే.

క. అనుటయు రసలింగము నిడు
తనవత్రువప్రేపసజ్జ దంతపుబరణిన్
నినిచినయొకపస రిది యది
యని చెప్పక పూసెఁ దత్పదాంబుజయుగళిన్. 30

క. ఆమం దిడి యతఁ డరిగిన
భూమీసురుఁ డరిగెఁ దుహినభూధరశృంగ
శ్యామలకోమలకానన
హేమాఢ్యదరీఝరీనిరీక్షాపేక్షన్. 31

చ. అటఁ జని కాంచె భూమిసురుఁ డంబరచుంబిశిరస్సరజ్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగతరంగమృదంగనిస్స్వన
స్ఫుటనటనానుకూలపరిఫుల్లకలాపకలాపిజాలముం
గటకచరత్కరేణుకర కంపితసాలము శీతశైలమున్. 32

వ కాంచి యంతరంగంబునఁ దరంగితం బగుహర్షోత్కర్షంబున

క. నరనారాయణచరణాం
బురుహద్వయభద్రచిహ్న ముద్రితబదరీ
తరుషండమండలాంతర
సరణిన్ ధరణీసురుండు సనఁ జన నెమరన్. 34

క. ఉల్లలదలకాజలకణ,
పల్లవితకదంబముకుళ పరిమళలహరీ
హల్లోహలమదబంభర
మల్లధ్వను లెసఁగ విసరె మరుదంకురముల్. 35

సీ. తొండములాఁచి యందుగుఁజిగుఁళ్లకు నిక్కి-
కరులదంతచ్ఛాయ గడలుకొనఁగ
సెలవుల వనదంశములు మూఁగి నెఱెవెట్టఁ
గ్రోల్పులుల్ పొదరిండ్ల గుఱక లిడఁగ
సెలయేటి యిసుకలంకల వరాహంబులు
మొత్తంబులై త్రవ్వి ముస్తె లెత్త
నడ్డంబు నిడుపు నా పడ్డలగితి మనుఁ
బిల్లు డొంకలనుండి క్రేళ్లు దాఁటఁ

తే. ప్రబలభల్లూకనఖభల్ల భయదమథన
శిథిలమధుకోశవిసరవిశీర్ణ మక్షి
కాంతరాంతరదంతురితాతపమునఁ
బుడమి తిలతండులన్యాయమున వెలుంగ. 36

క. పరికించుచు డెందంబునఁ
బురికొనుకౌతుకముతోడ భూమీసురుఁ డ
గ్గిరికటకతటనిరంతర
తరుగహనగుహావిహార తత్పరమతి యై. 37

సీ. నిడుదపెన్నెఱిగుంపు జడగట్ట సగరుము
మ్మనుమఁడు తపము గైకొనినచోటు
జరఠకచ్ఛప కులేశ్వరు వెన్ను గానరా
జగతికి మిన్నేఱు దిగినచోటు

పుచ్ఛడీకతనంబు పోఁ బెట్టి గిరికన్య
పతిఁ గొల్వ నాయాసపడినచోటు
వలరాచరాచపాఁడలికాత్యుకను వెచ్చఁ
గరఁగినయలకనికరపుఁ జోటు

తే. తపసియిల్లాండ్ర చెలువంబు దలఁచితలఁచి
మున్ను ముచ్చిచ్చునను పిరాళిగొన్నచోటు
కనుపపులు వేల్పుఁబడవాలుఁ గన్నచోటు
హర్షమునఁజూచి ప్రవరాఖ్యుఁ డాత్మలోన. 38

చ. విలయకృశానుకీలముల వేడిమిఁ బోఁడిమి మాలి వ్రేల్మిడిం
గలిసినభూతధాత్రి మఱి క్రమ్మర రూపయి నిల్చి
యోషధుల్
మొలవఁగఁ జేయునట్టినయమున్ బ్రతికల్పమునెట్లు
గాంచు నీ
చలిమలవల్ల నుల్లసిలు చల్లఁదనంబును నూనకుండినన్.

సీ. పసుపునిగ్గులు దేఱు పాఁపజన్నిద మొప్పఁ
బ్రమథాధిపతియింటిప ట్టెఱింగె
శచి కేఁతఁ గఱపుచుఁ జదలేట సురరాజు
జలకేళి సవరించు చెలు వెఱింగె
నదనుతోఁ జేఁపి చన్నవిసి యోషధుల మ
న్నొదపు కొండల కెల్లఁబిదుక నెఱిగె
వేల్పుటింతులలోన విఱ్ఱవీఁగుచు మేన
నవరత్నరచనల రవణమెఱిఁగెఁ

తే. బరిపరివిధంపుజన్నంపుఁ బరికరంపు
సొంపుసంపద నిఖలనిలింపసభయు
నప్పటప్పటికిని జిహ్వాత్రుప్తి డుల్ల
నామెత లెఱింగె నీతుషారాద్రికతన. 40

మ. తలమే బ్రహ్మకు నైన నీనగమహత్త్వంబెన్న నేనియ్యెడం
గలచోద్యంబులు తేపుగన్గొనియెదం గాకేమి నేఁ డేగెదన్
నలినీబాంధవభానుతప్తరవికాంతస్యందినీహారకం
దళచూత్కారపరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నముం దెల్పెడిన్. 41

తే. అనుచుఁ గ్రమ్మఱువేళ నీహారవారి
బెరసి తత్పాదలేపంబు గరఁగి పోయెఁ
గరఁగిపోవుట యెఱుఁగఁ డద్ధరణిసురుఁడు
దైవకృతమున కిల నసాధ్యంబు గలదె.

మ. అతఁ డట్లౌషధహీనుఁ డై నిజపురీయాత్రామిళత్కౌతుకో
ద్ధతిఁ బోవన్ సపదిస్ఫుటార్తిఁ జరణద్వంద్వంబు రాకుండినన్
మతిఁ జింతించుచు నవ్విధం బెఱిఁగి హా నన్నిట్లు దైవంబ తె
చ్చితె యీఘోరవనప్రదేశమునకున్ సిద్ధాపదేశంబునన్.

క. ఎక్కడియరుణాస్పదపుర
మెక్కడితుహినాద్రి? త్రొవ్వ యేరాఁ దగునే
యక్కట! మును సనుదెంచిన
దిక్కెది యని తెలియఁగ [illegible] యో. 44

మ. అకలంకౌషధసత్త్వముం దెలియ మాయాద్వారకావంతికా
శికురుక్షేత్రగయాప్రయాగములు నే సేవింప కుద్దండగం
డక వేదండవరాహవాహరిపుఖడ్గవ్యాఘ్ర మిమ్మంచుఁగొం
డకుఁ రాఁ జెల్లునె ? బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా !
శ్రోత్రియుల్. 45

సీ. నను నిముసంబు గానక యున్న నూ రెల్ల
నరయుమజ్జనకుఁ డెంతడలునొక్కొ
యెపుడు సంధ్యలయందు నిలు వెళ్ళనీక న
న్నోమెడుతల్లి యెంతొ యలునొక్కొ
యనుకూలమతి నాదు మనసులో వర్తించు
కులకాంత మది నెంత కుందునొక్కొ
కెడఁ దోడునీడలై క్రీడించుసచ్ఛాత్రు
లింతకు నెంతచింతింతురొక్కొ

తే. యతిథిసంతర్పణంబు లేమయ్యెనొక్కొ
యగ్ను లేమయ్యెనొక్కొ నిత్యంబులైన
కృత్యములఁ బాపి దైవంబకినుక నిట్లు
పాఱవైచితె మిన్నులు పడ్డచోట. 46

క. నను నిలు సేర్చునుపాయం
బొనరింపఁగ జాలుసుకృతి యొకఁ డొదవఁ డొకో ?
యనుచుం జింతాసాగర
మున మునిఁగి భయంబు గదురఁబోవుచు నెదురన్. 47

సీ. కులిశధారాహతి పొలుపునఁ బైనుండి
యడుగు మోవగఁ జేగుఱైనతటులఁ
గనుపట్టులోయ గంగానిర్ఝరము వాఱఁ
జలువ యానయ్యేటికెలఁకులందు
నిసుక వెట్టిన నేల నేచి యర్కాంశులఁ
జొర నీక దట్టమై యిఱులు గవియ
క్రముకపున్నాగనారంగరంభానాళి
కేరాదివిటపిశాంతారవీథిఁ

తే. గెరలుపికశారికాకీర కేకిభృంగ
సారసధ్వనిఁ దనలోని చంద్రకాంత
దరులు ప్రతిశబ్దమీన గంధర్వయక్ష
గానఘూర్ణిత మగునొక్కకోనఁ గనియె. 48

క. కనుఁగొని యిది మునియాశ్రమ
మను తహతహ వొడమి యిచటికరిగిన నాకుం
గన నగు నొకతెఱువ యని
మనమునఁ గలదిగులు కొంతమట్టువడంగన్. 49

చ. నికటమహీధరాగ్రతట నిర్గతనిర్ఝరధారఁ బాసి లో
యకుఁ దలక్రిందుగా మలఁకలై దిగుకాలువ వెంటఁ బూచుమ
ల్లిక లవలంబనంబుగ నళిప్రకరధ్వని చిమ్మిరేఁగ లో
నికి మణిపట్టభంగసరణిన్ ధరణీసురుఁ డేగి చెంగటన్. 50

శా. తావుల్ క్రేవలఁ జల్లు చెంగలువకేదారంబుతీరంబునన్
మావుల్ క్రోవులు నల్లిబిల్లిగొనుకాంతారంబునం దెందవ

గ్రావాకల్పితకాయమానజటిలద్రాక్షాగుళుచ్ఛంబులం
బూవుందీవెలనొప్పునొక్కభవనంబున్ గారుడోత్కీర్ణమున్.

క. కాంచితదీయవిచిత్రో
దంచితసౌభాగ్యగరిమ కచ్చెరువడియ
క్కాంచనగర్భాన్వయమణి
యించుక దఱియంగ నచటి కేగెడువేళన్. 52

క. మృగమదసౌరభవిభవ
ద్విగుణితఘనసారసాంద్రవీటీగంధ
స్థగితేతరపరిమళమై
మగువపొలుపు దెలుపునొక్క మారుతమొలసెన్. 53

మ. అతఁడావాతపరంపరాపరిమళవ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చోటని చేరఁబోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీకచికురన్ జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్ నవలా నొకానొకమరున్నారీశిరోరత్నమున్.

తే. అమలమణిమయనిజమందిరాంగణస్థ
తరుణసహకారమూలవితర్దిమీఁద
శీతలానిలమొలయ నాసీనయైన
యన్నిలింపాబ్జముఖియు నయ్యవసరమున. 55

సీ. తతనితంబాభోగ ధవళాంశుకములోని
యంగదట్టపుఁ గావిరంగువలన
శశికాంతమణిపీఠి జాజువాఱఁగఁ గాయ
లుత్తుంగ కుచపాళి నత్తమిల్లఁ

దరుణాంగుళీధూత తంత్రీస్వనంబుతో
జిలిబిలిపాట ముద్దులు నటింప
నాలాపగతిఁ జొక్కి యరమోడ్పుగనుదోయి
రతిపారవశ్యవిభ్రమముఁ దెలుపఁ

బ్రౌఢిఁ బలికించు గీతప్రబంధములకుఁ
గ్రమకరపంకరుహారత్న కటకఝణఝ
ణధ్వనిస్ఫూర్తి తాళమానములు దెలుపఁ
నింపుదళుకొత్త వీణ వాయించుచుండి. 56

ఉ. అబ్బురపాటుతోడ నయనాంబుజముల్ వికసింపఁ గాంతిపె
ల్లుబ్బి కనీనికల్ వికసితోత్పలపంక్తులఁ గ్రుమ్మరింపఁగా
గుబ్బమెఱుంగుఁజన్నవ గగుర్పొడువన్ మదిలోనఁ
గోర్కు లా
గుబ్బతిలంగఁ జూచె నలకూబరసన్నిభు సద్ధరామరున్. 57

ఉ. చూచి ఝుళంఝుళత్కటక సూచితవేగపదారవింద యై
లేచి కుచంబులున్ దుఱుము లేనడుమల్లలనాడ నయ్యెడం
బూచిన యొక్క పోఁకనునుబోదియఁ జేరి విలోకనప్రభా
వీచికలం దదీయపదవీకలశాంబుధి వెల్లిగొల్పుచున్. 58

మ. మునుమున్ పుట్టెడుకొంకు లౌల్యము నిడన్ మోదంబు
విస్తీర్ణతం
జొనుపం గోర్కులు గ్రేళ్లు ద్రిప్ప మదిమెచ్చుల్ చెప్ప
లల్లార్ప న

త్యనుషంగస్థితి జిచ్చుపాటొసఁగ నొయ్యారంబునన్ జంద్రికల్
దనుకంజూచె లతాంగి భూసురుఁ బ్రఫుల్లన్నేత్ర పద్మంబులన్. 59

క. పంకజముఖి కప్పుడు మై
నంకురితములయ్యెఁ బులకలావిష్కృతమీ
నాంకానలసూచకధూ
మాంకురములుఁబోలె మిటియు నతనిం జూడన్. 60

ఉ. తొంగలిరెప్పలం దొలఁగఁ ద్రోయుచుఁ బైపయినిస్తరిల్లుక
న్నుంగవ యాక్రమించుకొనునో ముఖచంద్రునటంచుఁ బోవనీ
కంగజుఁడాన వెట్టి కదియన్ గుఱిజ్రేవాసెననంగజాతి సా
రంగమదంబు లేఁజెమటఁ గ్రమ్మె లలాటముఁడిగ్గి చెక్కులన్. 61

మ. అనిమేషస్థితి మాన్పె బిత్తరపుఁ జూపస్వేదతావృత్తిమా
న్పె నవస్వేదసమృద్ధి బోధకళ మాన్పెన్ మోహవిభ్రాంతి తో
డనె గీర్వాణవధూటికిన్ భ్రమరకీటన్యాయమొప్పన్ మను
ష్యుని భావించుట మానుషత్వము మెయిన్ జూపట్టె నాసత్తఱిన్. 62

వ. ఇట్లు తని రూపరేఖావిలాసంబులకుం జొక్కి యక్కమల పత్త్రేక్షణ యాత్మగతంబున. 63

ఉ. ఎక్కడివాఁడొ యక్షతనయేందుజయంతవసంతకంతులం
జక్కఁదనంబునన్ గెలువఁజాలెడువాఁడు మహీసురాన్వయం
బెక్కడ నీతనూవిభవమెక్కడ నేలనిబంటుగా మరున్
డక్కఁగొనంగరాదె యకటా నను వీఁడుపరిగ్రహించినన్.

సీ. వదనప్రభూత లావణ్యాంబుసంభూత
కమలంబు లన వీని కన్నులమరు
నిక్క వీనులతోడ నెక్కసక్కెములాడు
కరణి నున్నవి వీని ఘనభుజములు
సంకల్పసంభవాస్థానపీఠికవోలె
నెడఁదమై కనుపట్టు వీనియురము
ప్రతిఘటించుచిగుళ్లపై నెత్తివాతిన
రీతి నున్నవి వీని మృదుపదములు
తే. నేరెటేటియసల్ తెచ్చి నీరజాప్తు
సానఁ బట్టినరాపొడిచల్లి మెదిపి
పదను సుధ నిడి చేసెనో పద్మభవుఁడు
వీనిఁగాకున్న గలదె యీ మేనికాంతి. 65

క. సురగరుడోరగ నర ఖే
చర కిన్నర సాధ్య చారణవిద్యా
ధర గంధర్వకుమారుల
నిరతము గనుఁగొనమె పోలనేర్తురె వీనిన్. 66

మ. అని చింతించుచు మీనకేతనధనుర్జ్యాముక్తనారాచదు
ర్దినసమ్మూర్ఛితమానసాంబుజయై యీలోలాక్షి పెందత్తఱం

బునఁ బేటెత్తినలజ్జ నంఘ్రికటకంబుల్ మ్రోయనడ్డంబు ని
ల్చిన నయ్యచ్చరఁజూచి చేరఁ జని పల్కెన్ వాఁడు
విభ్రాంతుఁడై. 67

ఉ. ఎవ్వతెవీవు భీతహరిణేక్షణ! యొంటిఁజరించె దోట లే
కివ్వనభూమి భూసురుఁడనేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవతప్పితిం
గ్రొవ్వున నిన్నిగాఁగమునకుం జనుదెంచి పురంబుఁజేర నిం
కెవ్విధిఁగాంతుఁ దెల్పఁగదవే తెరువెద్ది శుభంబునీకగుఁన్.

క. అని తనకథ నెఱిఁగించినఁ
దనకనుఁగవ మెఱుఁగు లుబ్బఁ దాటంకములుం
జనుఁగవయు నడుము వడఁకఁగ
వనిత సెలవివాఱ నవ్వి వానికి ననియెన్. 69

ఉ. ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు
భూసురేంద్ర! యే
కాంతమునందు నున్నజవరాండ్ర నెపం బిడి పల్కరించు లా
గింతియ కాక నీ వెఱుఁగవే మును వచ్చినత్రోవ చొప్పు నీ
కింత భయంబు లేకడుగ నెల్లిద మైతిమి మాటలేటికిన్. 70

వ. అని నర్మగర్భంబుగాఁ బలికి క్రమ్మఱ నమ్మగువ యమ్మహీ
సురున కిట్లనియె. 71

సీ. చిన్ని వెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ
బొడమిన చెలువ తోఁబుట్టు మాకు
రహిపుట్ట జంత్రగాత్రముల తాల్గరఁగించు
విమలగాంధర్వంబు విద్య మాకు

ననవిలు శాస్త్రంపు మినుకు లావర్తించు
పని వెన్నతోడఁ బెట్టినది మాకు
హయమేధరాజసూయము లనఁ బేర్వడ్డ
సవనతంత్రంబు లుంకువలు మాకుఁ

తే. గనకనగసీమఁ గల్పవృక్షములనీడఁ
బచ్చఱాచట్టుగమి రచ్చపట్టుమాకుఁ
బద్మ సంభవ వైకుంఠ భర్గసభలు
సాముగరిడీలు మాకు గోత్రామరేంద్ర! 72

క. పేరు వరూథిని విప్రకు
మార! ఘృతాచీతిలోత్తమాహరిణీహే
మారంభాశశిరేఖ లు
దారగుణాఢ్యలు మదీయలగుప్రాణసఖుల్. 73

మ. బహురత్నద్యుతిమేదురోదరదరీ భాగంబులం బొల్చుని
మ్మహికాహార్యమునం జరింతు మెపుడుం బ్రేమన్
నభోవాహినీ
లహరీశీతలగంధవాహపరిఖే లన్మంజరీసౌరభ
గ్రహణేందిందిరతుందిలంబు లివి మత్కాంతార
సంతానముల్. 74

క. భూసుర! కైతవకుసుమశ
రాసన! మాయింటివిందవై తివి గైకొ
మ్మా సముదంచన్మణిభవ
నాసీనత సేదదేఱి యాతిథ్యంబున్. 75

తే. కుందనమువంటి మేను మధ్యందినాత
పోష్మహతిఁ గందె నడదాఁకె నొప్పు లొలుకు
వదన మస్మద్గృహంబు పావనము సేసి
బడలికలు వాసి చను మన్న బ్రాహ్మణుడు. 76

ఉ. అండజయాన! నీ వొసఁగు నట్టిసపర్యలు మాకు వచ్చె నిం
దుండఁగ రాదు పోవలయు నూరికి నింటికి నిప్పు డేను రా
కుండ నొకండు వచ్చి మఱి యొండునె భక్తియ చాలు సత్క్రియా
కాండముఁ దీర్ప వేగ చనఁగా వలయుం గరుణింపు నాపయిన్. 77

ఉ. ఏ నిఁక నిల్లు సేరుటకు నెద్ది యుపాయము మీమహత్త్వముల్
మానిని! దివ్యముల్ మదిఁ దలంచిన నెందును మీకసాధ్యముల్
గానము గానఁ దల్లి ప్రజలన్ ననుఁ గూర్పు మటన్న లేఁతన
వ్వాననసీనుఁ దోఁప ధవళాయతలోచన వాని కిట్లనున్.

ఉ. ఎక్కడియూరు కాల్నిలువ కింటికిఁ బోయెద నంచుఁబల్కెదీ
వక్కట మీకుటీరనిలయంబులకున్ సరి రాక పోయెనే
యిక్కడి రత్నకందరము లిక్కడినందనచందనోత్కరం
బిక్కడిగాంగసైకతము లిక్కడియాలవలీనికుంజముల్. 79

ఉ. నిక్కము దాఁప నేల ధరణీసురనందన! యింక నీపయిం
జిక్కె మనంబు నాకు ననుఁ జిత్తజుబారికి నప్పగించెదో
చొక్కి మరందమద్యముల చూఱల బాటలు వాడు తేంట్లసొం
పెక్కినయట్టి పూవుఁబొదరిండ్లను గౌఁగిట గారవించెదో.

క. అనుటయుఁ బ్రవరుం డిట్లను
వనజేక్షణ! యిట్లువలుక వరుసయె వ్రతులై
దినములు గడపెడువిప్రులఁ
జనునే కామింప మది విచారము వలదే. 81

ఉ. వేలిమియుఁ సురార్చనయు విప్రసపర్యయుఁ జిక్కె భుక్తికిన్
వేళ యతిక్రమించె జననీజనకుల్ కడువృద్ధు లాఁకటన్
సోలుచుఁ జింతతో నెదురు సూచుచు నుండుదు రాహితాగ్ని నేఁ
దూలు సమస్తధర్మములుఁ దొయ్యలి నేఁడిలు సేరకుండినన్.

ఉ. నావుడు విన్నఁబాటు వదనంబున నించుక దోఁపఁ బల్కెనో
భావజరూప యిట్టియెల ప్రాయము వైదికకర్మనిష్ఠలన్
బోవఁగనింక భోగములఁ బొందుట యెన్నఁడుయజ్ఞకోటులం
బావను లౌటకున్ ఫలము మాకవుఁగిళ్ళసుఖించుటేగదా.

సీ. సద్యోవినిర్భిన్న సారంగనాభికా
హృతమై పిసాళించు మృగమదంబు
కసటువో బీటెండఁ గరఁగి కట్టిల నంటి
గమగమ వలచుచొక్కపుజవాజి

పౌర లెత్తి ఘనసార తరువులఁ దనుఁదాన
తొరఁగినపచ్చకప్పురపుసిరము
గొజ్జంగిపూఁబొదల్ గురియఁగఁ బటికంపు
దొనల నిండినయట్టి తుహినజలము

తే. వివిధకుసుమకదంబంబు దివిజతరుజ
మృదులవసనఫలాసవా మేయరత్న
భూషణంబులుగల విందు భోగపరుఁడ
వయి రమింపుము నన్నుఁగూడి యనుదినంబు. 84

క. అంధునకుఁ గొఱయె వెన్నెల
గంధర్వాంగనలపొందు గాదని సంసా
రాంధువునఁ బడియె దకట ది
వాంధము వెలుఁగుఁ గని గొందినడఁగినభంగిన్. 85

ఉ. ఎన్నిభవంబులన్ గలుగు నిక్కుశరాసనసాయకవ్యథా
ఖిన్నత వాడి వత్తలయి కేలఁ గపోలము లూఁది చూపులన్
విన్నఁదనంబు దోఁపఁ గను వేఁదుఱునన్ బయిగాలి సోఁకినన్
వెన్నవలెన్ గరంగు నలివేణులఁ గౌఁగిటఁ జేర్చు భాగ్యముల్ 86

క. కుశలతయే వ్రతముల నగు
నశనాయాపీడ నింద్రియనిరోధమునన్
గృశుఁడవయి యాత్మ నలఁచుట
సశరీరస్వర్గసుఖము సమకొని యుండన్. 87

 

తే. అనినఁ బ్రవరుండు నీ వన్న యర్థమెల్ల
నిజము కాముకుఁడైనవానికి నకామఁ
డిది గణించునె ! జలజాక్షి ! యెఱిఁగితేని
నగరమార్గంబుఁ జూపి పుణ్యమునఁ బొమ్ము. 88

క. బ్రాహ్మణుఁ డింద్రియవశగతి
జిహ్మాచరణైకనిపుణ చిత్తజనిశితా
జిహ్మగములపాలై చెడు
బ్రహ్మానందాధిరాజ్య పదవీచ్యుతుఁడై. 89

వ. అనిన నత్తెఱవ యక్కఱకరిపలుకుల కులికి గ ఱి గ ఱి ం
గఱవఁ గరకరిం జెఱకువిలుకాఁడు పరఁగించు విరిదమ్మి
గొరకలు నెఱఁకులఁ జురుకుచురుక్కనం గాఁడినఁగడుం
గెరలి పరిణతవివిధవిబుధతరుజనిత మధురమధురసం బాను
మదంబు నదటునం జిదిమిన నెఱుఁగక మదనహరు నైనఁ
జదురునం గదియ గమకించుతిమురునం గొమరెప్రాయంపు
మదంబునను ననన్యకన్యాసామాన్యలావణ్య రేఖామదంబు
నను నొంటిపాటునం గంటికిం బ్రియుండై తంగేటిజుంటి
చందంబునం గొంటుఁదనం బెఱుఁగక కుఱంగ్రట నున్న
యమ్మహీసురవరకుమారు తారుణ్య మాధ్యంబులం జేసి తన
వైదగ్ధ్యంబు మెఱయఁ గలిగెనని పల్లవించు నుల్లంబు
నుల్లాసంబునం గదురుమదంబున నోసరింపక చంచల
దృగంచలప్రభ లతని ముఖాంబుజంబునం బొలయ వలయ
మణిగణచ్ఛాయాకలాపంబు లుప్పరం బెగయఁ గొప్పు
చక్కం[illegible] జెక్కుచు జక్క వగిబ్బలుం[illegible] గుబ్బలం

జొబ్బిల్లు కుంకుమరసంబునం బంకిలంబులగు హారముక్తా
తారకంబులం నఖకోరకంబులన్ గీటి తీరువడం జేయుచుం
బతితవనతరుకుసుమ కేసరంబులు రాల్చు నెపంబునం
బయ్యెద విదిల్చి చక్క సవరించుచు నంతంతం బొలయు
చెలులం దలచూపక యుండం దత్తఱంబునం జేసి బావ
ముడిపాటుతో మగిడిమగిడి చూచుచుం జిడిముడిపాటు
చూపుల నంకురించుజంకెనల వారించుచుం జేరి యి
ట్లనియె. 90

శా. ఎందే డెందముకందళించురహిచే నేకాగ్రతన్ నిర్వృతిన్
జెందున్ గుంభగతప్రదీపకళికా శ్రీదోఁప నెందెంచుఁ బో
కెందే నింద్రియముల్ సుఖంబుఁగను నా యింపే
పరబ్రహ్మ "మా
నందో బ్రహ్మ" యటన్న ప్రాఁజదువు నంతర్బుద్ధి
నూహింపుమా. 91

తే. అనుచుఁ దన్నొడఁబఱుచు నయ్యమరకాంత
తత్తఱముఁజూచి యాత్మనతండు దనకు
సిగ్గు వెగటును బొడమ నిస్పృహత దెలుపు
నొక్క చిఱునవ్వునవ్వి యయ్యువిదకనియె, 92

శా. ఈపాండిత్యము నీకుఁదక్క మఱి యెందేఁ గంటిమే
కామశా
స్త్రోపాధ్యాయివి నా వచించెదవు 'మే లోహో త్రయీ
ధర్మముల్

పాపంబుల్ రతి పుణ్య'మంచు నిఁక నేలా తర్కముల్
మోక్ష ల
క్ష్మీపథ్యాగమసూత్రశక్తికిదివో మీసంప్రదాయార్థముల్

మ. తరుణీ రేపును మాపు హావ్యములచేతన్ దృప్తుఁ
డౌవహ్ని స
త్కరుణాదృష్టి నొసంగు సౌఖ్యము లెఱుంగన్ శక్యమే
నీకు నా
కరణుల్ దర్భలు నగ్నులున్ బ్రియములై న ట్లన్యముల్
గా వాడల్
తిరమే చెప్పకు మిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపై
తేనియల్. 94

చ. అనుటయు మాటలేక హృదయాబ్జము నల్లన మోము
వెల్లనై
కనలుచు నీరు దేఱు తెలిగన్నుల నాతనిఁ బుల్కుపుల్కునం
గనుఁగొని మాటలన్ బొదువు గద్గదికన్ దలయూఁచి
యక్కటా
వనిత తనంతఁ జావలచివచ్చిన జుల్కనగాదె యేరికిన్.95

మ. వెతలన్ బెట్టకుమింక న న్ననుచు నీవీబంధ మూడన్
రమో
ద్ధతి నూర్పుల్ నిగుడన్ వడిన్ విరులు చిందన్ గొప్పు
వీడన్ దనూ
లత తోడ్తోఁ బులకింపఁగా ననునయాలాపాతిదీనాస్యయై
రతిసంరంభము మీఱ నిర్భరవధూరత్నంబు పైఁ బాటునన్.

శా. ప్రాంచద్భూషణబాహుమూలరుచితోఁ బాలిండ్లు
పొంగారఁబై
యంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరంబాసింప 'హా
శ్రీహరీ'
యంచున్ బ్రాహ్మణుఁడోరమోమిడి తదీయాంస
ద్వయంబంటి పొ
మ్మంచున్ ద్రోచెఁ గలంచునే సతుల మాయల్
ధీరచిత్తంబులన్. 97

క. త్రోపు వడి నిలిచి ఘన ల
జ్జాపరవశ యగుచుఁ గొప్పు సవరించి యొడల్
దీపింప నతనిఁ జూచుచుఁ
గోపమునన్ జూచి గేఁటుకొనుచుం బలికెన్. 98

ఉ పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక! నీవు త్రోవ ని
చ్చోట భవన్నఖాంకురము సోఁకెఁ గనుంగొనుమంచుఁ
జూపి య
ప్పాటలగంధి వేదన నెపంబిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చుగుబ్బచనుమిట్టల నశ్రులు చిందువందుగన్.

క. ఈవిధమున నతికరుణము
గా వనరుహనేత్ర కన్నుఁగవధవళరుచుల్
కావి గొన నేడ్చి వెండియు
నా విప్రకుమారుఁ జూచి యలమటఁబల్కెన్. 100

ఉ. చేసితి జన్మముల్ తపము చేసితి నంటి దయావిహీనతం
జేసినపుణ్యముల్ ఫలము సెందునె పుణ్యము లెన్ని యేనియుం

జేసినవానిసద్గతియె చేకురు భూతదయార్ద్రబుద్ధి నో
భూసురవర్య! యింత దలపోయవు నీ చదువేలచెప్పుమా?

సీ. వెలిపెట్టిరే బాడబులు పరాశరుఁ బట్టి
దాశకన్యాకేళిఁ దప్పుసేసి
కులములో వన్నెతక్కువ యయ్యెనే గాధి
పట్టికి మేనక చుట్టఱికము
ననుపుకాఁడై వేల్పు నాగవాసముఁగూడి
మహిమ గోల్పడియెనే మాండకర్ణి
స్వారాజ్య మేలంగ నీరైరె సుర లహ
ల్యాజారుఁడైన జంభాసురారి

తే. వారికంటెను నీమహత్త్వంబు ఘనమె
పవనపర్ణాంబుభక్షు లై నవసి యినుప
కచ్చడాల్ గట్టుకొను మునిమ్రుచ్చులెల్లఁ
దామరసనేత్ర లిండ్ల బందాలు గారె. 102

తే. అనిన నేమియు ననక యవ్వనజగంధి
మేనిజవ్వాదిపస కదంబించునొడలు
గడిగికొని వార్చి ప్రవరుండుగార్హపత్య
వహ్ని నిట్లనిపొగడె భావమునఁ దలఁచి. 103

మ. దివిషద్వర్గము నీముఖంబుననతృప్తిన్ గాంచు నిన్నీశుఁగా
స్తవముల్ సేయు శ్రుతుల్ సమస్తజగదంతర్యామివీ
నీవ యా

హావనీయంబును దక్షిణాగ్నియును నీయందుద్భవించున్

ప్రతూ

త్సవసంధాయక! నన్నుఁ గావఁగదవే స్వాహావధూవల్లభా!

ఉ. దానజపాగ్నిహోత్రపరతంత్రుఁడ నేని భవత్పదాంబుజ
ధ్యానరతుండ నేనిఁ బరదారధనాదులఁ గోర నేని స
న్మానముతోడ నన్ను సదనంబుననిల్పు మినుండు పశ్చిమాం
భోనిధిలోనఁ గ్రుంకకయమున్న రయంబున హవ్యవాహనా!

వ. అని సంస్తుతించిన నగ్నిదేవుం డమ్మహీదేవు దేహంబున సన్నిహితుండగుటయు నమ్మహాభాగుండు గండు మీఱి పొడుపుఁగొండ నఖండసంధ్యారాగప్రభామండలాంతర్గతుం డగు పుండరీకవనబంధుండునుంబోలె నుత్తప్తకనకద్రవ ధారాగౌరంబగు తనుచ్ఛాయాపూరంబున నక్కానవెలిం గించుచు నిజగమననిరోధిని యగు నవ్వరూథిని హృదయ కంజంబున రంజిల్లు నమందానురాగ రసమకరందంబు నందంద పొంగం జేయుచుఁ బావకప్రసాదలబ్ధంబగు పవన జవంబున నిజమందిరంబున కరిగి నిత్యకృత్య సత్కర్మ కలాపంబులు నిర్వర్తించె. 106

## నందితిమ్మన

# పారిజాతాపహరణము

## ప్రథమాశ్వాసము

### కథాప్రారంభము

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన పారిజాతాపహరణంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 1

క. జనమేజయనృపవల్లభుఁ
డనుదినమును హరికథాసుధాస్వాదమునం
దనివిసనక వైశంపా
యనముని కిట్లనియెఁ గౌతుకాయత్తమతిన్. 2

సీ. హరివంశకథ లెల్ల నానుపూర్విగ నిట్టు
విని కృతార్థుఁడ నైతి మునివరేణ్య!
యాదానవారాతి యమరులఁ బ్రోవంగఁ
బూని యా యదువంశమున జనించి
యతఁడు గ్రమ్మఱ వారి కాధారమగు పారి
జాతంబు పుడమి కేరీతిఁ దెచ్చె
ననుమతి నిచ్చిరో యా వేల్పు లొండేని
బలిమిఁ జేకొనియెనో పాడి దొఱఁగి

తే. తెలియ నానతియిమ్ము సందియముదీఱ
వినఁగ వేడుకయయ్యె సవిస్తరముగ
ననిన నా వ్యాసమునిశిష్యుఁ డతనితోడ
నధిప! వినుమని పలికె నత్యాదరమున. 3

చ. హరి నరకాసురుం గెలిచి యద్దనుజేంద్రునియింట నున్న య
చ్చరలఁగోలంబువారి నెలజవ్వనముం బొలివోనివారిఁ ద
న్వరునిగఁ గోరువారి లలనామణులం బదియాఱు వేవురం
బరిణయమయ్యె నారదునిబంపున సౌఖ్యరసైకలోలుఁడై.

తే. మఱియు రుక్మిణి సత్యజాంబవతి మిత్ర
వింద భద్ర సుదంత కాళింది లక్ష్
ణ యనఁగా మున్న కల రబ్జనాభునకును
మహిషు లెనమండ్రు సమతాభిమానవతులు. 5

ఉ. ఆరమణీలలామముల నందఱఁగూడి యదూద్వహుండు త
ద్ద్వారవతీపురోపవనవాటికలం గృతకాద్రిసీమల
న్వారిధితీరకుంజ సదనంబులఁ గేళితరంగిణీతటీ
కైరవిణీసహాయమణికల్పిత సౌధముల న్వసించుచున్. 6

శా. ఏయే వేళల నేసరోజముఖి యేయేలీలలం గోరుఁదా
నాయా వేళల నాసరోజముఖి నాయాలీలలం దేల్చి యే
చాయంజూచినఁ దానయై మెలగుఁచు న్సౌఖ్యాబ్ధి నోలాడు భో
గాయత్తుండయి పెక్కురూపముల మాయాకల్పనా చాతురిన్. 7

క. హరి యిట్లు సతుల నందఱ
సరిగాఁ జూచియును భోజజనపాలసుతం
దరుణీమణి సాత్రాజితి
నిరువుర మన్నించి మిగుల నిచ్చుం జనవుల్. 8

చ. కులమును రూపము న్మగని కూరిమియుం గలదాననంచు నీ
వల నలరుక్మిణీరమణి వాసిఁ జెలంగఁగ సత్యభామయుం
గులమును రూపము న్మగనికూరిమియుం గలదాననంచు నా
వలఁ బచరింపఁగా రవరవ ల్వొడమె న్మది వారి
కెంతయున్. 9

ఉ. అంత నొక్కనాఁడు ధవళాంబుజ నేత్రుఁడు వచ్చి రుక్మిణీ
కాంతగృహంబులోన శశికాంతశిలామయ వేదిమీఁద నే
కాంతమునందుఁ గొందఱు మృగాయత నేత్రలుగొల్వ
జూడ మ
త్యంతవినోదకేలిమెయి నాడుచునుండఁగ నద్భుతంబుగన్.

శ్రీకృష్ణునియొద్దకు నారదుఁడు వచ్చుట

సీ. స రి గ మ ప ధ ని స సంజ్ఞ స్వరంబుల
మహతి నభోవాయునిహతి మొరయ
భాగీరథీపయఃపరిపూర్ణ మణిక మం
డలువు హస్తంబునఁ జెలువు మిగులఁ
బ్రణవమంత్రావృత్తి పావనస్ఫటికాక్ష
వలయంబు కర్ణశష్కులిక వ్రేల
సమరనృత్యోచిత చమర వాలంబును
గక్షపాలయు భుజాగ్రమున మెఱయ

తే. దేహకాంతు లకాలచంద్రికల నీన
జడలు మోక్షద్రుపల్లవశంక సేయ
గగనముననుండి వచ్చె నాకస్మికముగ
నారివేరంపుఁదపసి ద్వైత్యారికడకు 11

క. వచ్చిన మునిపతి కెదురుగ
వచ్చి నమస్కృతులొనర్చి వనితయుఁ దానుం
బొచ్చెంబులేని భక్తి వి
యచ్చరరిపుభేది సలిపె నాతిథ్యంబున్. 12

తే. అపుడు రుక్మిణికనుసన్న నబ్జముఖులు
రత్నసింహాసనంబు నారదున కిడిరి
హరియు నమ్మౌనియనుమతి నర్హపీఠ
మున సుఖాసీనుడయి కరంబులు మొగిడ్చి. 13

క. సురసంయమివర! మీరిట
కరుదేరఁగ నిప్పుడేఁ గృతార్థుఁడ నయితిన్
నిరతంబు మీరు నాపయిఁ
గరుణ గలిగి యునికి యిది యకారణము *సుమీ. 14

క. నావుడు శౌరికి నిట్లను,
నావేలుపుఁదపసి మర్త్యుఁ డాడెడి రీతిన్
నీవిట్లు పలుక నుచితమె?
యే విశ్వజననీన చరిత! యెఱుఁగనె నిన్నున్. 15

---

* సుఁడీ పాఠాంతరము

—◆ నారదుఁడు శ్రీకృష్ణుని నుతించుట ◆—

సీ. ప్రామినుకులదొంగఁ బాతాళకుహరంబుఁ
జొరఁబాఱి చీఱిన-చోఱ వీవ
తరిగొండ వెన్నుపైఁదాల్చి వేల్పులఁగూటి
చవిఁ దేల్చినట్టి కచ్ఛపమ వీవ
నీటిలో మునిఁగిన నేలచేడియఁ గొమ్ము
కొన నుబ్బనెత్తిన ఘోణి వీవ
మునిమాపు బలుగంబమునఁ బుట్టి బంటు న
క్కఱఁ గాంచినట్టి సింగంబ వీవ
తే. దితిజుమెట్టిన యాపొట్టిదిట్ట వీవ
పుడమిఱేఁడుల నడఁచినప్రోడ వీవ
కడలిఁ గోలకుఁ దెచ్చిన గబ్బి వీవ
యిపుడు ద్వారక వసియించునీవు నీవ. 16

క. రక్కసిమగువల యాలువు
మొక్కపఱిచె దీవ పాపములగమిఁ గాలం
ద్రొక్కెదవు నీవ యింకిట
నిక్కముగా నిన్నుఁ బొగడ నేర్తునె కృష్ణా! 17

క. ద్వారక వైకుంఠపురం
బీరుక్మిణి లక్ష్మి మీర లిచ్చటనునికిన్
సారెకుఁ గొల్వఁగ వత్తును
గోరికతోఁ గంసహర! ముకుంద! మురారీ! 18

వ. అని యిట్లు బహుప్రకారంబులం బ్రశంసించి యవ్విరించి
నందనుం డమందానందంబు డెందంబునం గ్రందుకొన
నిజవాసనా బిరుదగాథాకథనవందిబృందాయమానేందింది
రంబును, సుచితోపయోగజనితానందబాష్పసందోహ
శంకావహ మకరంద బిందుతుందిలంబును, నిఖిలమనోరథ
ప్రదాన కీర్తి శంకాకర విదళప్రభానిచుళితంబును నగు
పారిజాతంపుఁ గ్రొన్ననమిన్నేటి పసిండినెత్తమ్మిచిగురు
టాకునం బొదివియిచ్చిన. 19

క. వినయంబు విస్మయంబును
మనమునఁ బెనఁగొనఁగ నపుడు మాధవుఁ డాక్రో
న్ననఁగయికొని భీష్మక నం
దనఁ గనుఁగొని సత్యభామ తలఁపున నిలునన్. 20

మ. ఇది భోజాత్మజ కిచ్చినం గినుకతో నేమంచు నూహించునో
మది సాత్రాజితి, దాని కే నిపుడు ప్రేమంబంపినన్ దీని నె
ల్లిదముం జేసినజాడ దోఁచునొకో యాలెమ్మిందు
నేనున్కిఁజె
ల్లదువో యేరికిఁ బంపఁగాననుచు లీలన్ రుక్మిణీకాంతకున్.

చ. కనుఁగవఁ బిన్న నవ్వుఁ దొలఁక న్మునినాథుని కన్నుసన్న ని
చ్చినఁ దగ భోజనందనయుఁ జేకొని మానికి మ్రొక్కి
యవ్విరిం
దన నెఱిగొప్పునం జెరివిన న్వలిగుబ్బలిముద్దుపట్టి లేఁ
తనెల ధరించినట్లమరె దద్దయు మోహన కాంతిసంపదన్.

సీ. మగమీల నగఁజాలు తెగఁ గీలుకొనువాలుఁ
గనుఁగవ కొకవింత కాంతి యొదవె
వలిజక్కవల పెక్కువలు దక్కవగ నిక్క
చనుదోయి కొకవింతచాయ దోఁచె
నెలతుమ్మెదలదిమ్ము వెలిఁజిమ్ము చెలువమ్ము
గలవేణికొకవింత నలుపుమీఱె
నలచెందొవలవిందు చెలువెందు వెదచిందు
మొగమున కొకవింతజిగి దొలంకెఁ

తే. జక్కదనమున కొకవింత చక్కఁదనము
జవ్వనంబున కొకవింత జవ్వనంబు
విభ్రమంబున కొకవింతవిభ్రమంబు
గలిగె నద్దివ్యకుసుమంబుకతన సతికి. 23

క. కలకంఠకంఠి యీగతిఁ
బులుగడిగిన ముత్తియంపుఁ బొలుపొందంగా
నెలనవ్వ్వాలయఁగ బలికెను
జలజాసనుపట్టి కలహసంభ్రమపరుఁడై. 24

నారదుఁడు పారిజాతప్రభావంబు రుక్మిణీ దేవికిఁ జెప్పుట

సీ. జలజాక్షి! యిది పారిజాత ప్రసూనంబు
నరులకు ధరియింప నరిదిసూవె
పౌలోమి పార్వతి పద్మ పద్మజురాణి
యును శిరంబునఁ దాల్తు రనుదినంబు

హారిబహిఃప్రాణంబ వగుట నే డెఱుఁగంగ
వచ్చె నీ కిపు డిది యిచ్చెఁ గాన
వెలఁదులు పదియాఱు వేవురలో నెన్న
సరిలేదు సౌభాగ్య గరిమ నీకు

తే. నీవు దాల్చిన కతన నీపూవు నేఁడు
భాగ్యము వహించె నుచితోపయోగ్య వృత్తి
నీప్సితార్థంబు నొడఁగూర్చు నిది లతాంగి
దీనిమహిమంబు చెప్పెదఁ దెలియ వినుము. 25

క. పరిమళము సెడదు వాడదు
పరువము దప్పదు పరాగభరభరితంబై
నిరతము జగదేక మనో
హరమగు నీ కుసుమరాజ మంబుజవదనా! 26

మ. అలినీలాలక! నీవు నీ పతి రహస్యక్రీడ వర్తించువే
ళ లతాంతాయుధ సంగరంబునకు నుల్లాసంబు గల్పించు ను
జ్జ్వల దీపాంకురమై రతిశ్రమ తనూసంజాత ధారాళ ఘ
ర్మలవంబు ల్దొలఁగింపఁగా సురటియై రంజిల్లు నిచ్ఛాగతిన్.

చ. అడిగినయంతలోన సరసాన్నముల న్సమకూర్చు నాఁకట
న్బడలికఁ జెందనీక యశుభంబు లడంచు జగత్త్రయంబునం
బడయఁగరాని సర్వగుణభవ్యము సుమ్మిది దీనిఁ దాల్చి యి
ప్పడఁతులలోఁ గనుంగొను మపార మహామహిమాను
భావముల్. 28

చ. కువలయపత్రనేత్ర! నెఱిగొప్పున నీకుసుమంబు దాల్చుటన్
సవతులు వచ్చి నీ చరణసారసయుగ్మము నాశ్రయింపఁగా

ధవుఁ డఱలేనికూర్మి జవదాఁటక నీపలు కాదరింపఁగా
నవిరళ భోగభాగ్యమహిమాన్వితవై విహరింతు గావుతన్.

క. నెలకొని వేసవిఁ జలువయుఁ
జలివేళల నుష్ణగుణము సముచితభంగిం
గలిగించు నీ లతాంతము
కొలఁదులు చెప్పంగ నిచ్చక్రొత్తలు సుమ్మా. 30

క. అలరుంబోఁడులలోపల
నలరుం బోఁడుములు నీకు నగ్గలమగుచున్
దలపూ వాడక యుండుము
తలపూవు ధరించి వికచ తామరసాక్షీ. 31

ఉ. ఇన్నిదినంబులున్ సవతు లిందఱలో నల సత్యభామ కన్
సన్నలఁ ద్రిమ్మరున్ హరి వశంవదుఁడై యన
విందుఁగాని యో
కన్నియ! నీ యెడం గలుగు గారవ మెయ్యెడఁజూచి
కాన లే
కున్న ననర్ఘ్యదివ్యకుసుమోత్తమ మేరికినైన నిచ్చెనే! 32

ఉ. చక్కనిదాననంచు నెలజవ్వని నంచు జగంబులోనఁ జే
రెక్కినదాననంచుఁ బతియెంతయు నాకనురక్తుఁడంచుఁ దా
నిక్కుచు విఱ్ఱవీఁగుచు గణింపదు కాంతల సత్య యింతకున్
స్రుక్కకయున్నె నీమహిమ సూచిన బోటులు
విన్నవించినన్. 33

క. ధరియించిన మొదలొక వ
త్సర మాత్రము తావకీన ధమ్మిల్లములో

నిరవుకొని మగుడ నివ్విరి
తరుణీ! యల పారిజాత తరువున కరుగున్. 34

తే. అనుచు నారదుఁ డాడినయట్టి పలుకు
లచటి వృత్తాంత మంతయు నరసి పోయి
వేఱువేఱన సఖులు దేవేరులకును
విన్నవించిన వారును జిన్నవోయి. 35

ఉ. అందఱిలోనఁ బెద్ద మహిమాన్విత రుక్మిణి గానఁ ♦బూవు గో
విందుఁడు దానికిచ్చెఁ దగవేయని లక్షణయోర్చె, సైఁచెఁ గా
ళింది, శమించె భద్ర, యవు లెమ్మని యూరడిలెన్ సుదంత,లోఁ
గుందుట మానె జాంబవతి, కోప మడంచెను మిత్రవిందయున్. 36

తే. వారిలోపల సౌందర్యవతియు మాన
వతియు మహనీయ సౌభాగ్యవతియు నైన
సత్య యంతట నేమొకో శౌరికడకుఁ
బోయి రాదయ్యెఁ జెలి ప్రొద్దుపోయెననుచు. 37

మ. తన శృంగారవనంబు*లో నగరిపొంతం జక్కఁగా దిద్ది తీ
ర్చిన పూఁదేనియ యేటిగాలువదరిం జెంగల్వపుప్పొళ్లు నిం

♦ యాఁమె కిం, పొంద బ్రసూనమీఁ దగవవొమ్మని లక్షణ. అని. పా. అ.

* లోన గిరిపొంతన్, అని. పా. అ.

చిన చంద్రోపలవేదిపై సరసగోష్ఠిఁ బోటియుం దాను న
వ్వనజాతాయతనేత్ర శౌరిగుణముల్ వాక్రుచ్చి
వర్ణించుచుండె. 38

చ. అలికులరావముల్ గిసలయాకులకోకిలకాకుకాకలీ
కలకలనాదముల్ సెలఁగఁ గమ్మని తమ్మికొలంకు తెమ్మెరల్
వాలయఁగఁ దొంటిచందమున బుద్ధికి నేమియు
నింపుగామికిం
గలుఁగుచు సత్యభామ చెలిఁగన్గొని యించుక
సంశయించుచుండె. 39

చ. అకట! యదేమియో యెఱుఁగనయ్యెదఁ దొయ్యలి!
దక్షిణాంసచూ
చుక నయన ప్రకంపగుణ సూచనలేమియు వల్లగావు సా
రెకు మది జాలివొంది యొకరీతిఁ దలంకెడుఁ బ్రాణ
నాథుఁడొం
డొక చపలాక్షిఁగూడి ననునొల్లని చెయ్దము లేమి
సేసెనో. 30

క. అని సత్యభామ తన విధ
మనుఁగుం దొయ్యలికిఁ జెప్పునవసరమునఁ జ
య్యన వచ్చి యొక్క నెచ్చెలి
కనుఁగవ నెఱసంజ వొడమఁగా నిట్లనియెన్. 41

క. అమ్మా! యేమని చెప్పుదు
నెమ్మి నీ విభుఁడు రుక్మిణీసతి మనికి

ధమ్మున నుండఁగ సురముని
గ్రమ్మఱ నాకస్మికమ్ముగా నచ్చటికిన్. 42

క. చనుదెంచి యమ్మురారికి
ననఘమ్మమరైకయోగ్య మతి సౌఖ్యకర
మ్మనితరసులభ మ్మిది యని
కొనియాడుచు నొక్క దివ్యకుసుమ మ్మొసఁగెన్. 43

క. మిన్నందిి వేగ గయికొని
కన్నుల నొత్తికొని మ్రొక్కి గారవ మెసగన్
వెన్నుఁడు రుక్మిణి కొసఁగెను
అన్నెలఁతయు గొప్పులోన నవ్విరిఁదాల్చెన్. 44

తే. అంతలోనన యద్భుతం బావహిల్లఁ
గొలఁది యిడరాని యొక వింత చెలువు గలిగి
రాజబింబాస్య రుక్మిణి తేజరిల్లె
సానఁబట్టిన పుకరాంకుశస్త్ర మనఁగ. 46

ఉ. ఆకుసుమంబు దాల్చిన మహామహిమంబునఁ దోడి కామినీ
లోకము మచ్చరంబు మదిలోన నొఱంగి భజించుచుండ న
స్తోక నిజప్రభావములు సూపెడు గద్దియమీఁద నెక్కి ము
ల్లోకము దాన యేలఁగతి లోలవిలోచన యేమి సెప్పుదున్

ఉ. ఎంతకు లేఁడు నారదమునీంద్రుఁడు శౌరి వినంగ రుక్మిణీ
కాంత వినంగ నేను వినఁగాఁ బలికెం బతిఁ గూర్చుదాన నా
యంతటివారు లేరని యహంకృతి నెప్పుడు విఱ్ఱవీఁగుచున్
*వంతుకు వచ్చు సత్యగరువం బిఁకఁ జెల్లదటంచు మానినీ!

* వంతున వచ్చు. పా. భే.

క. ఆరణభోజనుమతకము
లా రుక్మిణినటన లాముకాంతకు చెయ్యాల్
చేరి కనుంగొనుచో నె
వ్వారికిఁ గోపంబు రాదు వారిజనేత్రా! 48

—◆ సత్యభామ చింతనొందుట ◆—

చ. అన విని వ్రేటువడ్డ యురగాంగనయుంబలె నేయివోయ భ
గ్గన దరికొన్న భీషణహుతాశనకీల యనంగ లేచి హె
చ్చిన కనుదోయికెంపు దన చెక్కులఁ గుంకుమపత్త్ర
భంగ సం
జనిత నవీన కాంతి వెదచల్లఁగ గద్గదఖిన్నకంఠి యై. 49

శా. ఏమేమీ! కలహాశనుం డచటికై యేతెంచి యిట్లాడెనా
యామాట ల్చెవి యొగ్గి తా వినియెనా యాగోపికావల్లభుం
డేమేమాడెను రుక్మిణీసతియు నీవింకేటికిఁ దాఁచెదే
నీమోమోటలు మాని నీరజముఖీ! నిక్కం బెఱింగింపవే.

చ. అతులమహానుభావమని యవ్విరిఁదా నొకపెద్ద సేసి య
చ్యుతునకు దచ్చకం బొదవ సూడిద యిచ్చిన నిచ్చెఁ
గాక తా
నతఁడు ప్రియంబు గల్గునెడ కర్పణ సేసినఁ జేసెఁగాక యా
మతకరి వేలుపుందపసి మమ్మెుదలంపఁగ నేల యచ్చటన్.

క. పలు దెఱఁగుముళ్ళమాటల
కలహమె కల్యాణ మని జగంబులవెంటన్
మెలఁగెడు మౌనికి సహజము
వలదని వారింపవలదె వల్లభుఁ డతనిన్. 52

క. ముని యేమి సేయు? రుక్మిణిఁ
గొనఁ గారణ మేమి ధూర్తగోపాలుఁడు సే
సిన చెయిద మేమి చెప్పుదు?
మన మెరియదె ప్రాణ మైన మగఁ డిట్లయినన్. 53

క. పరికింపరు తమజాడలు
తరుణులతగులములు నమ్మఁ దగదంద్రు మదిన్
శరదంబుదచలచిత్తులు
పురుషులె పో వారినమ్మఁబోలునె చెలియా! 54

ఉ. ఇన్నిదినంబులున్ సవతు లిందఱిలోఁ గడుగారవంబునం
గన్నియ! నన్ను వల్లభుఁడు గన్నులఁగప్పుకొనంగ నుండియూ
వన్నెయు వాసియుం దఱిఁగి వారు ననుం దలలెత్తి చూడగా
సన్నలఁ జాయలంబలుక సైతునె ప్రాణము*లెంతతీపొకో!

ఉ. నా మొగమోటకై †వలనినాటకముల్ గటియించి రుక్మిణీ
కామినిమీఁదటం గలుగుగౌరవముం గృపయుం
బ్రియంబుఁదా
నేమియుఁ గాననీక యిట నిన్నిదినంబులు నన్నుఁ దేల్చెనో
తామరసాక్షి! మెచ్చవలదా? మురదానవభేదికృత్యముల్.

ఉ. ఓ చెలి! శౌరికిచ్చెనఁట యొక్కలతాంతము దెచ్చి
నారదుం
డా చపలాక్షి కిచ్చెనఁట యాతఁడు నవ్వెరి యిట్టిమాట లా

* లింతతీపొకో

† వలయు నాటకముల్, వలసి నాటకముల్.

హా! చెవుల న్వినంబడియుఁ బ్రాణము దాల్చెద మేన నింతగా
నోఁచితి నింక నెట్టివి కనుంగొన నెమ్మోయి నున్నదాననో!

క. పూనుకొని మేలుగీళ్ళకు
లోనయి విహరించువారి లోకమెఱుఁగదో
యా నరకాసురదమనుఁడు
దా నెఱుఁగఁడో భోజకన్య తా నెఱుఁగదో కో. 58

ఉ. ఆ సరసీరుహాక్షి నిలయంబునఁ బంకజనాభుఁ డుండుటం
జేసి యొసంగెఁ బోతగువు సేకొని యొక్కలతాంతమింతలో
వాసియు వన్నెయుం దగవు వైభవముం జలము న్వివేకముం
బో సవతుల్భజించుటకుఁ బో వెఱఁగయ్యెడు నేమి సెప్పుదున్. 59

క. కలశాల మొక్కగతిఁ బూ
సలలో దారంబుమాడ్కి సతిమదిలోనన్
మెలఁగెడు పురుషుఁడు గలుగుట
తొలిజన్మము నోముఫలము తోయజనేత్రా! 60

సీ. కలలోననైన నవ్వులకైన నామాట
జవదాఁట వెఱచు నో చంద్రవదన!
యేపదార్థంబు నాయెదుటఁ బెట్టకమున్న
యెవ్వారి కొసఁగఁ డో యిగురుబోఁడి!

చెలులు నాతో నేమి చెప్పుదురోయని
లంచంబులిచ్చు నో చంచలాక్షి!
తోడిచేడియలు నాతోడి వంతులకు రా
సయిరింపఁజాల డో సన్నుతాంగి!
తే. యరమరలు లేని కూరిమి నన(గి పెన(గి
కొదలు దీఱనికోర్కు-లఁగూడి మాడి
కపటమెఱుఁగని మమతలఁ గలసి మెలసి
యున్న విభుఁడిట్లు సేయునే యోలతాంగి!
సీ. కృతకాద్రికందరా కేళీనిగూహన
వేళా[1]పరస్పరా న్వేషణములు
పోషిత మాధవీ పున్నాగ పరిణయో
త్సవ కల్పితానేక సంభ్రమములు
చాతురీనిర్జితద్యూతపణాదాన
కలిత చేలాంచలాకర్షణములు
సాయంసమారంభ చక్రవాకద్వంద్వ
విరహావలోకన [2]విభ్రమములు
తే. సాంద్రతర చంద్రికా [3]కేళి చంక్రమములు
విధు శిలామయ వేదికా విశ్రమములు
ఫలకచిత్రిత నిజరూప భావనములు
మఱచెనో కాక రుక్మిణిమాయఁదగిలి. 62
క. పతి ప్రాణసదృశబంధువు
పతిదైవం బెఱుగడయుఁ బతి సతులకు న

1 పరస్పరాన్వేషణములు. 2 విహారణములు. 3 వళీ.

ప్పతియు కడు మేర దప్పిన
గతి కులకాంతలకు వేఱుగలదే చెపుమా? 63

క. ధనమిచ్చి పుచ్చుకొన్నను
మనమున నోర్వంగవచ్చు మగఁ డింతులకున్
జనవిచ్చి పుచ్చుకొన్నను
మనవచ్చునె? యింక నేటిమాటలు చెలియా! 64

క. అని పగల మిగులఁ బొగులుచు
జనితామర్ష మునఁ గోపసదనంబునకున్
జనియెను లతాంగి హరిచం
దనకోటరమునకు నాగతరుణియుఁబోలెన్. 65

ఉ. మాసినచీర గట్టికొని మానముతోడ నిరస్తభూషయై
వాసెనకట్టు గట్టి నిడువాలిక గస్తురిపట్టువెట్టి లో
గాసిలి చీఁకటింటికడ కంకటిపై జలదాంత చంద్రరే
ఖాసదృశాంగియై పొరలె గాఢమనోజ విషాద వేదనన్. 66

చ. బిరుహపత్త్రలోచనకుఁ బెల్లగుమోహము సంఘటిల్లె వె
క్కసమగు నెవ్వగల్వొడమెఁ గంపమువుట్టెఁ జెమర్చె మేను మా
నసమున విన్నఁబా టొదవె నాటెఁ గడుం బరితాప వేదనల్
మసకపుఁబాముకాటుగతి మచ్చరమన్విస మగ్గలింపగన్.

చ. వెడ వెడ గన్నుమూయుఁ గనువిచ్చు నగుం దలయూఁచుఁ
పాన్పుపైఁ
బడు నుసురంచు లేచుఁ దడఁబాటును దత్తరముం
జలంబు లోఁ
నడరఁగఁ గోపవేగమున నగ్గలమైన మనోజబాధలం
బడి పదహస్తిహస్తగతపద్మినియుంబలె సొంపు పెంపఱన్.

క. ఈపగిదిన్ సాత్రాజితి
కోపోద్యోగమున వగలఁ గుందుచు ఘనసం
తాపంబుపేర్మి నితర
వ్యాపారము మానియుండె హరియును నచటన్. 69

సత్యభాను కడప శ్రీకృష్ణుడు వచ్చుట

మ. ముని నాకిచ్చినపూవుచందమును నే మున్నాడి యీ
భోజనం
దన కర్పించినజాడయుం దెలియఁ జెంతం బొంచి వీక్షించి పో
యినసాత్రాజితిబోటి నావలనఁ దానేమి కల్పించెనో
యని ప్రద్యుమ్నుని మానిదండనిడి చింతాయత్త
చిత్తంబునన్. 70

చ. అరదము నెక్కి కేతనపటాంచలచంచలమైన తాల్మితోఁ
దురగజవంబు మున్నడవఁ ద్రోచి కడంగెడు తత్తరంబుతోఁ
దిరిగెడుబండికండ్లపగిదిన్ భ్రమియించుమనంబుతోడ నా
హరి సనుదెంచె సత్యసముదంచిత కాంచనసౌధవీధికిన్. 71

తే. వచ్చి యరదంబు డిగ్గి తద్ద్వారసీమ
దారకుని నుండ నియమించి తానయొకఁడు

కమలనాభుండు కక్ష్యాంతరములు గడచి
యలబలములేని నగ రెల్ల నరసి చూచి. 72

సీ. కనకపంజరశారికలకుఁ జక్కెర వెట్టి
చదివింప రేలొకో సకియ లిపుడు
కరతాళగతుల మందిరమయూరంబుల
నాడింప రేలొకో యతివ లిపుడు
క్రొవ్వాఁడి గోళ్ళఁదంత్రులు మీటి వీణియ
ల్వాలికింప రేలొకో భామలిపుడు
కలికిరాయంచబోదల నెల్ల నెలయించి
నడిపింప రేలొకో పడఁతులిపుడు

తే. ఇన్నిదినములవలె నుండ దేమి నేఁడు
చిన్నబోయిన దీమేడ చెన్ను దఱిఁగి
పద్మముఖితోడ నెవ్వ రేఁ బారిజాత
పుష్పవృత్తాంత మెఱిఁగింపఁ బోలునొక్కొ. 73

క. అని యనుమానించుచు నా
య్యనఁ గోపగృహంబు సేరి యాసత్రాజి
త్తనయ ముసింగిడి యుండఁగ
ననువు మెఱియఁజొచ్చి మాయ యచ్చుపడంగన్. 74

ఉ. కొందఱు మంతనంబులను గొందఱు జంకెనవాఁడిచూపులం
గొందఱఁ జేతిసన్నలఁ దగుల్పడఁ జేయుచుఁ జేరఁబోయి మ
ధ్యందినభానుమండల కరావళి పోవళి వాడి యున్నతీఁ
గం దలపించునమ్మగువఁ గన్గొని యెంతయు విస్మితాత్ముఁడై.

ఉ. ఈలలితాంగిచంద మొకయించుక చూచెదనంచు ధూర్తగో
పాలుఁడు తాలవృంత మొకభామిని సత్యపిఱుంద నుండి మం
దాలసలీలమై విసర నాదటఁ గైకొని వీచెఁ దద్వపుః
కీలితపంచసాయకశిఖిం దరిగొల్పుచు నున్నకైవడిన్. 76

ఉ. అంతటఁ బారిజాతకుసుమాగతనూతనదివ్యవాసనల్
వింతలు సేయఁ [1] దావి యిది విస్మయమంచు మనుంగు ద్రోచి [2] యే
కాంతగృహంబు నల్గడలు నారసి సంభృతతాలవృంతునిం
గాంతునిఁ జూచి [3] బాష్పకళికా తరళీకృతలోచనాంతయై.

క. తలవాంచి మగుడ ముసుఁగిడెఁ
గొలుకుల డిగజారి జాలుకొను బాష్పంబుల్
పలుచని చెక్కుల లపలీ
దళ పతితమరంద బిందుతతిఁ బురుడింపన్. 78

ఉ. ఓర్పొకయింత లేని వికచోత్పలలోచన చిత్తవీథిఁ జ
ల్లార్పఁగ నీలనీరదశుభాంగుఁడు వే చను దెంచెనంచుఁ గం
దర్ప హుతాశను న్వ్రాలికిఁ దార్చు సఖుండునుబోలె వేఁడిని
ట్టూర్పు దళంబుగానిగిడె నున్నమితావరణాంశుకాంతమై.

---

1 దావియది. 2 యేకాంత గృహంబు నల్గడలు గన్గొని.
3 బాష్పకణికా.

చ. వనిత కుచద్వయంబుపయి వ్రాసిన కుంకుమపత్ర
భంగముల్
జనిత నితాంతఘర్మకణజాలముచేతఁ గరంగి మెల్ల మె
ల్లన వెలిపట్టు పయ్యెద కెలంకుల జారుటయొప్పె మానసం
బున నెలకొన్న క్రోధరసము [1]స్వాడి గట్టుచునున్న
కైవడిన్. 80

క. మానవతి యిట్లు మానని
మానక్రోధములచేఁ గుమారిలి చింతా
దీనగతి నుండ మదిలో
నూనిన ప్రేమమున నంబుజోదరుఁ డనియెన్, 81

శ్రీకృష్ణుడు సత్యభామ ననునయించుట

ఉ. ఇందునిభాస్య! మైఁ గొడవు లేల ధరియింపవు [2]సన్న
గావు లీ
వెందును మానలేవు చెలు పేటికిఁ గట్టితి వీటికారుచుల్
కెందలిరాకుమోవిఁ దులకింపగఁ జేయక యున్కియేమి నీ
చందము వింతయయ్యెడు నిజంబుగ నాకెఱుగంగ
జెప్పుమా. 82

చ. మనమరయం దలంచి యొకమార్గము వన్నితొ
నవ్వటాలలో
నను వెలిపించెదో యకట నాయెడ [3]నిక్కము దప్పు
కల్గెనో

---

1 స్వాడబెట్టుచుఁ స్వాడగట్టుచు. 2 సున్నగావు. 3 నిక్కపుఁదప్పు.

వనజదళాయతాక్షి ! పగవాఁడనె నన్నిటులేలచూడ వా
క్క నిముషమైన నీవు దయగన్గొనకుండిన నిల్వనేర్తునే?

ఛ. పలుకుల దేనెలుట్టిపడఁ బల్కవు నేఁడిది [1]యేలవాలుఁగ
న్నుల నునుసిగ్గు నూల్కొనఁ గనుంగొనవేల యురః
స్థలంబుఁ జ
న్నుల నెదురొత్తి మక్కువనునుం బిగికౌఁగిటఁజేర్పవేటికే
చిలుకలకొల్కి ! యెవ్వ రెడసేసిరి నీ కిటులేల చింతిలన్.

చ. మనమున మాటలం గ్రియల మన్నన లీనొకనాఁడు
నెట్టికా
మినులకు గారవంబు మెఱమెచ్చులకై పచరింతుఁ గాని పా
యని యనురక్తి నీయెడన యగ్గలమై కనుపట్టు నాకు నీ
పనిచినపంపు సేయుటయ ప్రాభవ మాటది నీ వెఱుంగవే.

మ. పడఁతీ! నీ మధురాధరామృతము నీ బాహాపరీరంభముం
బడయన్ ధన్యుఁడఁగాక యుండిన ననుంబాటించి
యొక్కింత నీ
నిడువాలుంగడగంటఁ జూచుమనుచు న్నిల్పోపమింబై
చెఱిం
గొడియం జేవిరిదమ్మి వ్రేయుటకునై యుంకించి
జంకించినన్. 86

ఉ. పాటలగంధి చిత్తమునఁ బాటిలు కోపభరంబుదీర్ప నె
వ్వాటను బాటు గామి మృదుపల్లవ కోమలతత్పదద్వయీ

1 యేవిల్చాలుఁగన్నులు

పాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నియవెట్ట నా జగ
న్నాటక సూత్రధారి యదునందనుఁ డర్మిలి మ్రొక్కె
మ్రొక్కినన్. 87

మ. జలజాతాసనవాసవాదిసురపూజాభాజనంబై తన
ర్చు లతాంతాయుధుకన్నతండ్రి శిరమచ్చో
వామపాదంబునం
దొలఁగంద్రోచె లతాంగి యట్లయగు నాథుల్నేరము
ల్సేయఁ బే
రలుకం జెందినయట్టి కాంత లుచితవ్యాపారము ల్నేర్తురే.

క. కోపనపదహతిఁ గుహనా
గోపాలుఁడు గాంచి మెయి గగుర్పొడువఁగ ను
ద్దీపిత మన్మథరాజ్య
ప్రాపితుడై పలికెఁ గూర్మి బయలు పడంగన్. 89

చ. ననుభవదీయదాసుని మనంబున నెయ్యపుఁగిన్కఁబూని
తాఁ
చినయది నాకు మన్ననయ చెల్వగు నీ పదపల్లవంబు మ
త్తనుపులకాగ్ర కంటకవితానము *దాఁకిన నొచ్చునంచు నే
ననియెద నల్క మానవుగదా యిఁక నైన నరాళకుంతలా!

సత్యభామ శ్రీకృష్ణుని దూఱుట

చ. అన విని మానినీతిలక మప్పుడు మేయలు దోఁప నిక్కివీ
డిన కచపంక్తిఁ బల్మఱు ముడి న్వెడదోపుచుఁ బై
చెఱంగు గ్ర

* నాటిన.

కు—నఁజనుదోయిఁ జేర్చుచు మొగంబున లేఁజెమ
రంకురిఁపజం
కెననెఱిచూపు చూచిపలికెం జలితాధర పల్లవాగ్రమై.

ఉ. ఈ నయగారపుంబ్రియుము లీపస లీ మొగ మిచ్చుమాట లే
లా నిను నమ్మియుండిన ఫలంబిదె తోడన కల్గె నాకు నీ
యాన సుమీ ననుం జెనకి యాఁడిపెట్టిన నవ్వువారలం
గాన [1]వెఱుంగునే పసులకాపరి భావజ మర్మకర్మముల్ ?

ఉ. ఇంకిటు నిన్ను నమ్మ నను నేమిటికిం గెరలించె దెంతయుం
బొంకముగాని [2]నీవలనిబొంకులు మాచవి గావు రుక్మిణీ
పంకజపత్రనేత్రకును బ్రాణపదంబులు గాని వల్లవీ
కింకర ! చాలుఁజాలు [3]నుడికింపకు నింపకు లేనికూరుముల్.

ఉ. [4]గట్టినచేఁతలుం బసలుఁ గల్లదనంబులు నీవు పుట్టఁగాఁ
బుట్టిన వెందులేని పలుపోకలమాయలు నీకు వెన్నతోఁ
బెట్టినవా ఱెఱింగియును బేలతనంబున నిన్ను నమ్మి నా
గుట్టును దేజము న్మిగులఁ గోల్పడిపోయితి నేమిసేయుదున్ !

చ. మునిపతివచ్చి పూవొసఁగి మోదముతోడ
భవత్ప్రియాంగన
న్వినుతి యొనర్పఁగా వినిన వీనుల మాచవిగాని మాటల
న్వినవలసెంగదా యిపుడు నీవిట వచ్చుట పారిజాతవా
సనఁ బ్రకటించి నాకు నెకసక్కెము సేయన కాదె
చెప్పుమా. 95

1 నెఱుంగునే, 2 యీవలనిబొంకులు. 3 నడికింపకు, 4 గట్టినచేఁతలుం.

క. మానంబె తొడవు సతులకు
మానమె ప్రాణాధికంబు మాన మఖిల స
మ్మానములకు మూలం బగు
మానరహిత మయిన బ్రదుకు మానిని కేలా ? 96

తే. తనదు కోడండ్రలోనఁ బెద్దయుఁగ నన్ను
దేవకీదేవి మన్నించు నీవు నాకుఁ
జనవు లిచ్చుటఁ జేసి యాసాధ్విసేవ
సేయఁ బోవంగ నాకింక సిగ్గుగాదె ? 97

సీ. ఉవిద యెవ్వతె నోచియున్నదో యీస్యమం
తకరత్నమింక నొందల ధరింప
నీరైవతకశైల చారుకూటవిటంక
కేలి కిం కెవ్వతె పాలుపడునొ
యెవ్వతె కబ్బునో యీ వసంతారామ
కర్పూర కదళికాగారవసతి
లీల నీమణిసౌధజాలకంబుల నిన్నుఁ
గూడి యెవ్వతె వార్ధిఁ జూడ గలదొ

తే. యకట నేఁ బెంపఁ బెరిఁగిన శుకమయూర
శారికాబృంద మెవ్వతెఁ జేరునొక్కొ-
నన్ను నాతోడిసవతులు నగక మున్న
పంత మలరంగ నిన్ను మెప్పింతుఁ *గాక. 98

---

* గాన.

క. నను నెవ్వతెఁగా జూచితి
వని యంతర్బాష్పయగుచు నవనతముఖియై
ఘనతరగద్గదికాని
స్వనమున మఱి మాటలాడ శక్యముగామిన్. 99

ఉ. ఈసునఁ బుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభు కట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోముపయిఁ జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠకలకంఠవధూకలకాకలీధ్వనిన్. 100

ఉ. ఆరమణీలలామ మది నంటిన కోపభరంబు నిల్పఁగా
నేరక నెవ్వగం బొగుల నీరజనాభుఁడు నిండుఁగౌఁగిటం
జేరిచి బుజ్జగించి నునుఁజెక్కులఁ జాలుకొనంగ జాఱు క
న్నీరు కరంబునందుడిచి నెయ్యముఁ దియ్యముఁ దోఁప
నిట్లనున్. 101

ఉ. ఓలలితేంద్ర నీలశకలోపమకైశిక! యింతవంత నీ
కేల లతాంతమాత్రమున కేఁగలుగ న్విను నీకు దేవతా
కేలివనంబు సొచ్చి యనికి న్బలసూదనుఁ డెత్తివచ్చినన్
దీలుపడంగఁదోలి యిటఁ దెచ్చెద నిచ్చెదఁ
బారిజాతమున్. 102

తే. వామలోచన! నీ కేలివనములోనఁ
జలువ వెదచల్లు చెంగల్వకొలనికెలన
సరసకర్పూర కదళికాతరుల నడుమఁ
బెరటిచెట్టుగ నాటింతుఁ బెంపుగనుము. 103

క. అని పలుకు నంబుదశ్యా
మని గర్జిత మధురవాక్యముల సత్యామా
నిని నీపలతిక వోలెం
గనుపట్టె సఖీమయూరికలు సెలరేఁగన్.

మ. దయమానాక్షివిలోక! లోకహితకృత్ప్రారంభ! రంభాకుచ
ద్వయదుర్గాధిపతిద్విషత్ప్రథితగాథావ్యక్తదోస్సార! సా
రయశస్సాంద్ర దిశాంత! శాంతహృదయారజ్యన్న యాచార! చా
రయుతోపాయవిచార! చారణగణప్రస్తూయ మానోదయా! 105

క. ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవి నికరగుంభిత కావ్య
స్మృతిరోమాంచ విశంకిత
చతురాంతఃపురవధూప్రసాదనరసికా! 106

నర్కుటము :

ప్రసృతివిలోచనా కుసుమబాణ! దిశాలలనా
ఘుసృణపటీర లేపకృతికోవిద! బాహుతటీ
[1]విసృమరకీర్తిజాల! రణవీక్షితవైరినృప
త్యసృగతిపంకిలాసిముఖ! [2]శైందవ వంశమణీ! 107

1 విసృమర శౌర్యకీర్తి భరవిక్షితవైరి; 2 యాదవ.

# ధూర్జటి – కాళహస్తి మాహాత్మ్యము

## కిరాతార్జునీయము

### చతుర్థాశ్వాసము

ఈ భాగము ధూర్జటి రచించిన "కాళహస్తి మాహాత్మ్యము," చతుర్థాశ్వాసము నందలిది.

ధూర్జటి క్రీ. శ. పదునాఱవశతాబ్ది పూర్వార్ధమున నుండినవాఁడు. కృష్ణదేవరాయల ఆస్థానమందలి అష్టదిగ్గజములలో నొకఁడుగా నుండి, "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేల కల్గెనో యతులిత మాధురీమహిమ" యని రాయల పొగడ్తను గాంచిన కవితిలకుఁడు. ఇతఁడు "కాళహస్తిమాహాత్మ్యము" నే కాక "కాళహస్తీశ్వరశతకము" అను శతకరాజమును గూడ రచించెను. "కాళహస్తి మాహాత్మ్యము" శ్రీకాళహస్తీశ్వరున కంకిత మీయఁబడినది.

"కిరాతార్జునీయము" న అర్జునుఁడు పాశుపతాస్త్రముఁ బడయఁ గోరి శివునిగూర్చి ఘోరతప మొనరించుట, శివుఁ డాతని భక్తిపరాక్రమములను బరీక్షింపఁ దలఁచి మాయాకిరాతరూపమున నతని కడకు వచ్చుట, అమీఁద వా రిరువురికి మాయాకిటికారణమునఁ బోరు సంభవించుట, అందుఁ బార్థుడు చూపిన పౌరుషము మెచ్చుకొని శివుఁ డాతనికిఁ బాశుపతాస్త్ర మొసఁగుట–ఈ మొదలగు విషయములు వర్ణింపఁబడియున్నవి.

ఉ. *ఈశు జగత్త్రయేశు దివిజేశుతనూభవుఁ డాత్మనిల్పి ము
క్తాశనుఁడై సమగ్రనియమాతిశయంబున నింద్రకీలశై

లేశుపయిం దపంబు రచియించె విపక్షకులక్షయార్థమై
పాశుపతాస్త్రముం బడయఁ బ్రాగ్వరముఖ్యులు చోద్య
మందఁగన్. 1

సీ. *జడకొప్పు కేకిపింఛపుఁ బ్రాటిచుట్టగా
బిసరుహాహితరేఖ పీఁకె గాఁగ
సెగలు చల్లెడుకన్ను జేగుఱు బొట్టుగా
శ్రుతిఫణి యాహవధలతిక గాఁగ
మెడను బుస్కలపేరు మేటి తామరలుగాఁ
దోలుదుప్పటి యొడదోలు గాఁగఁ
జేతి పినాకంబు సెలవింటిబద్దగా
శూల మేర్చిన యంపకోల గాఁగఁ
తే. ప్రమథు లెఱుకులు గా నద్రిరాజతనయ
శబరిగా నాల్గువేదముల్ జాగిలములు
గాఁగ మూకాసురునిఁ బందిగానొనర్చి
శబరుఁడై భర్గుఁ డర్జునాశ్రమముఁ జొరఁగ. 2

క. కాకోలాశనకృతమా
యాకోలము సేయఁదొడఁగె నలజడి మునిరా
జీ కోలాహల మెసఁగ
నాకోలాంగూలకేతు నాశ్రమభూమిన్. 3

చ. వెఱచిన మాసిపుంగవుల విహ్వలతన్ విడుఁడంచు
బాణముల్
తఱగనితూణముల్ ధనువుఁ దాల్చి వరాహముఁగూడ
ముట్టి ముం

దఱఁ జనుదెంచి ధూర్జటియుఁ దా నొకయమ్మున
దాని నేసె న
త్తఱి విజయుండు నేసె నొక దారుణబాణమునన్
సముద్ధతిన్. 4

క. ఇరువురు నేసిన బాణము
లిరుబరులును డాఁకి తిరిగె నిరుదెసలకు న
క్కిరి యిరుమొగముల నట్టువ
తిరుపుఁ గొనెడు క్రమముతో నతి త్వరితగతిన్. 5

క. ఖండేందుధరునిశరముం
బాండవమధ్యమునిశరము బ్రక్కలు గాఁడన్
రెండుతల లనఁగఁ దిరిగెం
జండగతిం బంది గఱచి శరములు దివియన్. 6

క. హరుఁడు నరుండును గిరి బిరు
దరు దని కొనియాడి చేర నరుదేరఁగఁ ద
చ్ఛరముల నదియు న్మృతమై
ధరణిపయిం బడియెఁ బర్వతంబును బోలెన్. 7

క. ఏ ము న్నేసితి ననుచుం
దా ము న్నేసితి నటంచుఁ దమలోఁ గిటుకై
భీముఁడు భీమానుజుఁడును
భీమాహవకేళి సల్పి పేర్చిరి కిటికై. 8

ఉ. సూనశరారియున్ నముచిసూదనపుత్త్రుఁడు దివ్యబాణసం
ధానమునన్ మహాహవము దర్పమెలర్ప నొనర్ప నొప్పిరిం

త్రైనఁ గొఱంత లేక తమయందలి తేజము మిన్నుముట్టఁగా
భానుఁడు భానుఁడుం జటులభానుపరంపరఁ బోరుకై వడిన్.

ఉ. చెం చనుచున్ ధనంజయుఁడు చీరికిఁ గైకొన కేయుచుం బ్రతీ
పించి రణం బొనర్పఁ బురభేదికిఁ గోపము పుట్టి వీఁడు న
న్నించుక యేనియుం దెలియఁ డిత్తఱి నూఱక యున్న నీతి గా
దంచు మహేంద్రజాలకుని యట్లొకమాయ రచింపఁ బూనుచున్. 10

ఉ. *అక్షయతూణమందు నొకయంబక మైనను లేకపోవున
ట్లాక్షణమాత్రఁ జేయ మది సద్భుతమందియు ధీరుఁడై సహ
స్రాక్షసుతుండు మోఁదె విశిఖాసన మత్తఱి సెక్కడించి ఫా
లాక్షునిమౌళిఁ జాటలజటావళి వీడఁగ శేషుఁ డూడఁగన్.

క. వేడిద మగు నా దెబ్బకు
నోడక విల్లెక్కుడించి యుగ్రుఁడు వైచెన్
గ్రీడించు వేడ్క ననిలోఁ
గ్రీడించక వెగడువడఁ బరిస్ఫుటశక్తిన్. 12

శా. కోదండంబుల నిట్టు లొండొరు జటాకోటీరముల్ గుక్షి వ
క్షోదేశంబుల నంసభాగముల సక్రోధంబునన్ వేయుచున్
రోదోంతంబున నట్టహాసములు నార్పుల్ పిక్కటిల్లంగ బా
హాదర్పంబున మల్లసంగరము సేయం జొచ్చి రుద్రార్జునుల్.

ఆ. మల్ల చఱచికొనుచు మహి పాదఘట్టనఁ
దల్లడిలఁగఁ జేసి తనువు లించు
కించు కంత వంచి యిరువురుఁ దొడ లప్ప
ళించి వెదకి తెలిపిలేమిఁ జేసి. 14

సీ. చెయ్యెచ్చి యొకకొంతసేపు నేర్పున బల్మి
యినుమడింపఁగఁ జొరనీక మలసి
యొక తెఱంగునఁ జొచ్చి యొండొండఁ గాసెలు
దొడికి పట్టుక కొంతతడవు బోరి
యది మాని కొంతప్రొద్దవని నూఁదినకాళ్లు
పెకలించి పడవైవఁ బెనఁగిపెనఁగి
మఱికొంతపడి మెడ విఱియ భుజమ్ములఁ
జిక్కించి యక్కున నొక్కినొక్కి

తే. నడుముల నొడిసి కబళించి పుడమిమీఁద
సమముగా వ్రాలి బలపరాక్రమము లెసఁగ
హెచ్చుఁగుం దేమియును లేక యిాశ్వరుండు
హరిహయసుతుండు మల్లసంగర మొనర్చి. 15

మ. మదమాతంగము సింధురార్భకముతో మార్కొంచుఁ
జెర్లాడు పెం
పుదయింపన్ లయకాలతాండవకరుం డుప్పొంగి
గాండీవితోఁ

గదనం బిట్లొనరింప నాతఁడు భుజాగర్వంబు
మాత్సర్యమున్
వదలం జాలమిఁ జూచి మెచ్చి శివుఁ డంతన్
దివ్య తేజంబుతోన్. 16

శా. వైకుంఠద్రుహిణాది దేవతలు గొల్వన్ వామసీమావరో
ధాకారుం డయి నాగచర్మవసనుండై చంద్రరేఖాధరుం
డై కాకోదరభూషణుండయి వళత్పానంగభస్మాంగుఁడై
లోకవ్యాపకపాండుదీధితికరాళుండై వృషారూఢుఁడై. 17

క. ప్రత్యక్షమగుచు సకలా
దిత్యులు జయజయ యనంగ దేవేంద్రసుతున్
గాత్యాయనీమనోహరుఁ
డత్యాదరమున నభీష్ట మడుగుమటన్నన్. 18

శా. ఆనందమ్మునఁ బాండునందనుఁడు సాష్టాంగప్రణామంబులె
న్నైన్నం జేసి యొడల్ వడంకఁగ మదీయాజ్ఞానజాతాపరా
ధానీకంబున గోర్చి శత్రుదహనం బార్పం బ్రభాసారధా
రానిర్యత్ప్రళయాభ్రపాశుపతమంత్రశ్రేష్ఠ మీవే దయన్.

క. ఇదిగాక ముక్తిరమణీ
హృదయేశత్వము వహింప నీవలయును భ
క్తదురాశాపాశలవి
త్ర! దయావీక్షణ! ప్రసన్నతామతి ననుడున్. 20

సీ. పాశుపతాస్త్రోపదేశంబు సేసెదఁ
బరులఁ గెల్వుము ప్రతాపంబుమీఱ
సాయుజ్యసామ్రాజ్యసౌఖ్య మీజన్మంబు
నందు నందవు బంధుహరణమునకుఁ
గాంక్షఁ జేసితి గానఁ గలియుగంబున్న మృగ
హంతవై పుట్టి శైలాటవులకు
నాఖేటకార్థమై యరిగి యస్మద్రూప
మగు దివ్యలింగంబు నచటఁ గాంచి

తే. దేహమోహంబు విడిచి సందేహముడిగి
భక్తి భజియించి కామితపదముఁ గాంతు
వనుచు సర్వేశ్వరుం డనుగ్రహముసేయ
ఫల్గునుఁడు తిన్నఁడై పుట్టి పడసె ముక్తి. 21

---

# కుమ్మరిమొల్ల - మొల్ల రామాయణము

## హనుమంతుఁడు సీతాదేవిని దర్శించుట

కవయిత్రి చరిత్ర :

ఈ పాఠ్యభాగము మొల్లరామాయణములోనిది. ఈ గ్రంథమును 'మొల్ల' యను కవయిత్రి రచించెను. ఆంధ్రభాషలో మొదటి కవయిత్రి యీమెయే. ఈయమ కుమ్మరవంశమునకు జెందినది. తండ్రిపేరు కేసన. ఇంటిపేరు ఆతుకూరివారు. కృష్ణరాయలకాలమున (16-వ శతాబ్దమున) నుండెనని విమర్శకుల యభిప్రాయము.

ఈమె కవిత్వము మృదుమధురమైనది. "కందువ మాటలతో సామెతలతో నిండి వీనులవిందై" యందముగ నుండవలయునని గ్రంథకర్త్రియే చెప్పినది. "గూఢ శబ్దములనుగూర్చిన కావ్యమ్ము మూగ చెవిటివారి ముచ్చటగును" అని యామె తలపు. శ్రీరాముని ప్రేరణముననే తానీ కావ్యమును రచించితినని చెప్పినది. మొల్లరామాయణము ధారాళమగు శైలితో నొప్పారెడి ఒక మధురమైన కావ్యము.

ప్రస్తుత పాఠ్యభాగము సుందరకాండములోనిది. సీతాదేవిని లోబఱచుకొనుటకు రావణుని ప్రయత్నాగములను సీత పాతివ్రత్యమును, హనుమంతుఁడు సీతాదేవిని దర్శించి, శ్రీరాముని కుశలవృత్తాంతమును తెలిపి యంగుళీయక మిచ్చి యామె శిరోరత్నమును గైకొనిపోవుటయు నిందలి యితివృత్తము.

సీతను వెదకుటకై సుగ్రీవునిచే దక్షిణదిక్కునకుఁ బంపఁబడిన హనుమంతుఁడు మొదలగు వానరులు సీతను కనుగొననేరక దుఃఖితులై యుండఁగా 'సంపాతి' యను పక్షిరాజువలన సీతాపహరణ వృత్తాంత

మును విని హనుమంతుఁడు సముద్రమునుదాటి లంకలో ప్రవేశించి సీతాదేవిని వెదకుచు అశోకవనమునకేగి సీతాదేవిని చూచెను. ఇంతలో రావణు డచటి కేతెంచెను. ఇచటినుండి కథ ప్రారంభమగును.

క. పావని కనుఁగొనె నప్పుడు
పావనవిఖ్యాతసుగుణభావోపేతన్
సేవితదనుజవ్రాతన్
భూవనితాజాత నిత్యపూతన్ సీతన్. 1

వ. ఆరామం జూచి శ్రీరామచంద్రుని దేవినిఁగాఁ దలంపుచు నగ్గోపురంబునుండి డిగ్గి సూక్ష్మరూపంబుఁ గైకొనిశింశుపా వృక్షంబారోహించి యందు. 2

సీ. పతిఁ బాసినట్టియాపదకంటెఁ బలుమాఱు
వివిధమాయలచేత వేఁగి వేఁగి
వీరదానవకోటివికృత వేషంబులు
కనుఁగొని చిత్తంబు క్రాఁగి క్రాఁగి
తనదిక్కు లేమికై తల్లడిల్లుచు నాత్మ
లోపల మిక్కిలి లోఁగి లోఁగి
కర్ణకఠోరంబుగా నాడుమాటలఁ
దొరఁగెడికన్నీటఁ దోఁగి తోఁగి

ఆ. రాముఁ దలఁచుకొంచు రామునిఁ బేర్కొంచు
రామ! రామ! యనుచు రమణి పలుకఁ
గపివరుండు సూచి కామినీరత్నంబు
సీత యనుచుఁ బొంగె జిత్తమందు.

వ. అట్టి సమయంబున రావణాసురుండు సీతాపహృతహృద
యుండై పన్నీట మజ్జనం బాడి దివ్యాంబరంబులు గట్టు
కొని కర్పూరసమ్మిళితంబైన శ్రీగంధంబు నెఱపూఁత
పూసి పారిజాతపుష్పంబులు ముడిచి మవ్వంపుఁ దావి
నివ్వటిల్లెడు జవ్వాది మెత్తి దశశిరంబులయందును రత్న
ముకుటంబులు ధరించి మణిమండితంబు లగుకుండలములు
పూని భానుప్రభావిలసితంబు లగుపతకంబులును ముక్తా
హారంబులును భుజకీర్తులును బాహుపురులును నంగుళీ
యంబులును నవరత్న స్థగితం బగునొడ్డాణంబును నమరించి
చంద్రహాసహస్తుండై కందర్పవిలాససుందరుం డగుచుఁ
గిన్నరకింపురుషగంధర్వామరోరగసిద్ధ విద్యాధరాంగన
లుభయపార్శ్వంబుల నాలవట్టంబులు పట్టి మౌక్తికచ్ఛ
త్రంబులుమ దాలవృంతంబులును వింజామరంబులును ధరి
యించి రాఁగొందఱు కరదీపికాసహస్రంబులు గైకొని
ముందఱఁ బిఱుఁదనే తేర నశోకారామంబునకు జనుదెంచె
నప్పుడు గంధవాతూలంబునం దూలుపుష్పలతయునుంబోలె
వడవడ వడంకుచుఁ దన సుందరాంగంబులు హస్తోరువస్త్ర
కేశంబుల మాటియుఁ గప్పియు నడంచియు నివురుగప్పిన
నిప్పు చందంబున ధూళిధూసరం బగు రత్నంబుకైవడి
మేఘచ్ఛన్నంబగుచంద్రబింబంబు డంబున నిత్తడిపొదిగిన
కుందనంపుశలాక లాగున మాఱుపడి యున్న జానకినిఁ
గదిసి.

క. సీతను కనుఁగొని రావణుఁ
డాతతనయవాక్యఫణితి నతికుతుకమునన్
జేతోభవనిశితాంబక
పాతంబులఁ జాల నొచ్చి పలుకఁగఁ జొచ్చెన్.

లయగ్రాహి. తోయజదళాక్షి! వలరాయఁ డిటు లేచి పటు
సాయకము లేర్చి యిపు డేయఁగఁ గడంగెన్
దోయదపథంబున నమేయరుచితోడ నుడు
రాయఁడును మించి వడ గాయఁగఁ గడంగెన్
గోయిలలుఁ గీరములుఁ గూయఁగ నళివ్రజము
లేయెడలఁ జూచినను మ్రోయుచుఁ జెలంగెన్
నాయెడఁ గృపారసము సేయ కవివేకమున
నీయెడల నుండు టిది న్యాయమె లతాంగీ!

వ. అని మఱియును. 7

సీ. అలకేశ్వరుం డుపాయనముగా నిచ్చిన
అంచితచీనిచీనాంబరములు
దివిజాధినాథుండు దినదినంబును నిచ్చు
పారిజాతోల్లసత్ప్రసవములును
దక్షిణాధీశుండు తగఁ గానుక లంపిన
సురభికర్పూరాదిపరిమళములుఁ
బాతాళముననుండి ఫణిసార్వభౌముండు
పుత్తెంచినటువంటిభూషణములుఁ

తే. గలవు నాయింట నెప్రొద్దుఁ గడమ లేక
దేహపరితృప్తిఁ గావించి మోహమలరఁ
గామ కేళిసుఖంబులఁ గలయుటొప్పు
విడువు మడియాస రామభూవిభునిమీఁద.

సీ. ఎవ్వానిపీటికి నేడువారాసులు
పెట్టనికోటలై పెచ్చుపెరుఁగు
నెవ్వాని సేవింతు రింద్రాది దేవత
లనుచరబలులయి యనుదినంబు
నెవ్వానిచెఱసాల నెప్రొద్దునుందురు
గంధర్వ సుర యక్ష గరుడకాంత
లెవ్వానిభండార మిర వొంద విలసిల్లు
నవనిధానంబుల వివిధభంగి

తే. సకలలోకంబులును మహోత్సాహవృత్తి
నెవ్వనికిఁ జెల్లుఁ బుష్పకమ్మెక్కి తిరుగ
నాకె తక్కంగఁ గలదె యేనాఁటనైన
మద్భుజాశక్తి ప్రతిపోల్ప నద్భుతంబు. 9

సీ. శ్వసనుండు లోగిలి సమ్మార్జనముఁ జేయ
నబ్ధినాథుఁడు కలయంపి సల్లఁ
బావకుం డరుదెంచి పాకంబు లొనరింప
శమనుండు వెసఁ బరిచర్యఁ జేయఁ

బాణారి కల్పక ప్రకరంబు లర్పింప
దనుజేశ్వరుండు కైదండ యిడఁగ
నరవాహనుండు దా నగరివెచ్చము వెట్ట
నీశానుఁడు విభూతి నెలమి నీయ
తే. గురుఁడు పంచాంగ మెప్పుడు సరవిఁ జెప్ప
నమరకిన్నరగంధర్వయక్షభుజగ
సిద్ధకింపురుషాంగనల్ చేరి కొలువ
వైభవంబునఁ జెలు వొందువాఁడఁ దరుణి! 10

ఉ. ఎత్తితి శంకరాచల మహీనబలంబున బంతిలాగునన్
మొత్తితి సర్వదిక్పతుల మూఁగినగర్వము విచ్చి పాఱఁగా
నొత్తితి శత్రుభూపతుల నుగ్రరణంబున భూమిఁ ద్రెళ్ళఁగా
మొత్తితి భోగికంతము లమోఘభుజవంబున మేటికీర్తులన్.

తే. జడలు ధరియించి తపసులచందమునను
దమ్ముఁడును దాను ఘోరదుర్గమ్ములందు
కూరగాయలు గూడుఁగా గుడుచునట్టి
రాముఁ డేరీతి లంకకుఁ రాఁగలండు. 12

ఆ. ఇంకఁ జేయ నేర రీదంగ నోపరు
కట్టలేరు చుట్టి పట్ట లేరు
జలధి దాఁట లావు చాలదు నరులకు
వచ్చు టెట్టు చెపుమ వారిజాక్షి. 13

క. దానవు లెప్పుడు చూచిన
మానవులను గెలువఁ గలరు మది నూహింపన్
మానవభక్షకులై మను
దానవులను గెలువ నరులతరమే జగతిన్. 14

క. జగతీశుఁడు మానవుఁ డఁట
నగరే భుజశక్తిచేత నాకెదు రన్నన్
నగధరుఁడో నగధన్వుఁడో
నగభేదియొ కొంత కొంత నాతోఁ బోరన్. 15

వ. ఆసంగతి యట్లుండ సిమ్ము. 16

క. నీకన్నులసౌభాగ్యము
నీకుచములఁ గలుగుమేలు నీముఖకాంతుల్
నీకరములలావణ్యము
నాకస్త్రీలందు లేవు నాకుం జూడన్. 17

మ. సురకాంతల్ సరిరారు యక్షసతులున్ సాటింపఁగా రారు కి
న్నరభామల్ ప్రతిరారు సిద్ధవనితల్ న్యాయంబుఁగాబోలరా
గరుడస్త్రీలసమానలెంతో చవుకల్ గంధర్వాలోలాక్షులున్
మఱియేరీ? నినుఁ జెప్పి చెప్పఁ దరుణుల్ మత్తేభకుంభస్తనీ.

క. వ్రీడ యలంకారముగా
నాడుము భయ ముడిగి మధుర మైనమృదూక్తుల్
బేడిసల నేలుకన్నులఁ
జూడుము కనుఱెప్ప లెత్తి సుదతీ నన్నుఁ. 19

వ. అని యిట్లు నోరికి వచ్చినమచ్చునఁ బ్రేలుచున్న యా
నీచుని దుష్టభాషణంబులకు రోసి తృణంబు చేపట్టి జనక
భూపాల నందనయిట్లనియె, 20

క. పతి దైవముగా నెప్పుడు
మతిఁ దలఁచుచు నుండునట్టిమగువలఁ జెఱుపన్
బ్రతిన గలయట్టినీతోఁ
బ్రతివచనము లాడుకంటెఁ బాపము గలదే. 21

క. పరదారాపేక్షకు లగు
పురుషుల కాయువు నశించుఁ బుణ్యము సెడు స
త్పురుషులు దూషింపఁగఁ దుది
నరకంబునఁ బడుదు రనెడిన్యాయము వినవే. 22

వ. అదియునుంగాక. 23

క. తనసాహసంబు తానే
కొనియాడునతండు హీనగుణుఁ డని వినుచున్
నిను నీవ పొగడుకొంటివి
వినఁ గూడదు నీదునీతివిరహితభాషల్. 24

ఉ. సంగరరంగమందు నతిశౌర్యమునన్ రఘురాముతోడమా
తంగతురంగసద్భటశతాంగబలంబులఁ గూడి నీవు పో
రంగను నోప కిప్పుడు విరాధఖరాదులపాటుఁ జూచియున్
దొంగిలి నన్నుఁ దెచ్చితివి తుచ్ఛపుఁబల్కులుపల్కఁ
బాడియే. 25

సీ. కూకటిముడికినై కురులు గూడనినాఁడె
బెదరక తాటకఁ బీఁచ మణఁచె
గాధేయుఁ డొనరించుక్రతువును రక్షింపఁ
బెక్కండ్రు దైత్యుల నుక్కణంచె

నవనిపై నిలసిల్లునఖిలరాజన్యులు
వ్రేలఁ జూపఁగ లేనివిల్లు విఱిచె
ఘోరాటవులలోనఁ గ్రుమ్మరుచునప్పుడు
ఖరభూషణాదిరాక్షసులఁ జంపెఁ

తే. బాదరజమున నొకఱాయిఁ బడఁతిఁ జేసె
లీలమాయామృగంబును గూలనేసె
రాజమాత్రుండె మేదినీరక్షకుండు
రామభూపాలుఁ డాదినారాయణుండు. 26

తే. అట్టిరామున కీయబ్ధి యనఁగ నెంత
లంక యన నెంత దనుజులపొంక మెంత
నీ వనఁగ నెంత నీలావు చేవ యెంత
చెప్ప నేటికి నీవె చూచెదవు గాక. 27

శా. వీరాలాపము లాడ నేల వినుమీ విశ్వప్రకాశంబుగాఁ
బారావారముఁ గట్టి రాఘవుఁడు కోపస్ఫూర్తి దీపింపఁగా
ఘోరాజిన్ నిను డాసి లావుకలిమిన్ గోటీరయుక్తంబుగాఁ
గ్రూరాస్త్రింబుల మస్తముల్ దునిమి భుక్తుల్ పెట్టు
భూతాళికిన్. 28

శా. ఆరూఢప్రతిమానవిక్రమకళాహంకార తేజోనిధిన్
శ్రీరామున్ సుగుణాభిరాముఁ దెగడన్ జేకొన్న నిన్నాజిలో
దారుణ దొంగిలితంచు నిష్ఠురగతిన్ దండించి ఖండింప ము
న్నీరెల్లైనను దాఁటివచ్చు నలుకన్ నేఁడెల్లి శాంతింపుమా.

వ. అని తన్నుఁ జీరికిం గొనక వీరాలాపంబు లాడ నా
రావణుం డొడుపుదప్పిన కాలాహిచందంబున నుగ్రుడై
మండిపడి యి ట్లనియె. 30

క. ఆఁటది గా యని కూరిమి
పాటించినకొలఁది నన్నుఁ బలుకఁగఁ జొచ్చెన్
మాటాడకుండ నాలుక
తూఁటులుఁగా జేయకున్న దోసము గాదే. 31

క. కుయ్యాడక నాముందఱఁ
గయ్యమునకుఁ గాలు దువ్వఁ గడఁగెను దీనిన్
దయ్యాలకు బలి పెట్టద
వ్రయ్యలుగా నఱికి యెల్లవారును జూడన్. 32

క. కాకున్న దీని బలిమిని
బైకొని నాకాంక్ష దీఱ భావజకేళిన్
జేకొనక విడిచిపెట్టినఁ
గైకొనునే నవ్వుఁగాక గర్వము పేర్మిన్. 33

శా. భీమాటోపభుజప్రతాపమహిమన్ భీమాచలం బెత్తి సు
త్రామాద్యష్టదిగీశసైన్యముల సంగ్రామంబులో నోర్చి యు
ద్దామప్రౌఢిఁ జెలంగుచుండెడుకళాధాముండనాముందటన్
రామున్ గీమునిఁ జెప్ప గిప్ప నగ రా రాకేందుబింబాననా!

సీ. అఖిలలోకముల నాయాజ్ఞ నిల్పితి నేక
హేలను బుష్పకం బెక్కి తిరిగి
వేల్పుమూఁకలచేత వెట్టి సేయించితి
దితిపంక్తవల్లభుల్ ముఖ్యులు సేవ

గణములతోఁ గూడ గైలాసమెత్తితి
బటువైన పూవులబంతి పగిది
వనజగర్భునిచేత వరములు గైకొంటి
దండిగా నత్యుగ్రతపముసల్పి
తే. చెఱను పట్టితి గంధర్వసిద్ధసాధ్య
భుజగసురయక్షకిన్నరముఖ్యసతుల
నిట్టిసామర్థ్య మెవరి కేనాఁడు గలదు
మహిని నాకొక్కనికె కాక మంజువాణి. 35

తే. నాకు నెదిరింప నొకపేదనరుని నొడ్డి
వెఱవ కీరీతి దుర్భాష లఱచు దీని
జిహ్వ మొదలంటఁ బట్టి యీశితకుఠార
ధారఁ దునుమాడి ధారుణి బారవైతు. 36

వ. అని చంద్రహాసంబు జంకించి లేవనుంకించుతఱిఁ గొందఱు
ప్రియసుందరు లడ్డంబు సొచ్చి. 37

చ. సురవరుఁడో ధనంజయుఁడొ సూర్యతనూజుఁడొ
యాతుధానుఁడో
శరధివిభుండొ గాడ్పొ పురశాసనుమిత్త్రుఁడొ భోగిభూషుఁడో
గురుభుజశక్తిఁ గైకొనుచుఁ గోపముసూపఁగ నీకు నెంత యి
త్తరుణిపయిం బ్రతాపమున దారుణకృత్యము సేయఁ
గూడునే. 38

క. ఏటికి మీ రిటు కినియఁగ
గాటపుజంకెనయె చాలుఁ గరవాలున కీ

యాటఁది యర్వామె మము నీ
మాటికి మన్నించి కావుమా యీఁకఁ జాలున్. 39

వ. అని శాంతవచనంబులఁ బ్రియంబు సెప్పిన నప్పంకరుహా
క్షుల విన్నపంబులు మన్నించి యారాక్షసచక్రవర్తి
వైదేహికిఁ గావలియున్న యేకజటా ద్విజటా త్రిజటా
దుర్ముఖీ వాయుముఖీ శూర్పణఖ లాదిగాఁగల దైత్య
కామినులవంకఁ గనుఁగొని. 40

క. గడు విచ్చితి నిరుమాసము
లొడఁబఱుపుఁడు నేర్చునట్లు లొడఁబడ కున్నన్
గడికండలు గాఁ గోసుక
పడఁతులు భక్షింపుఁ డింతిపలలం బంతన్. 41

వ. అని రోషారుణితనేత్రుండై యతిభీషణాకారంబుఁ దాల్చి
పలికిన. 42

క. తనపతి నిందించుటకును
దనప్రియములు చెప్ప వినక తక్కినమీఁదన్
దనుఁ జంపుఁ డన్నమాటకు
నినకులవల్లభుని దేవి యేడ్చెన్ బెలుచన్. 43

సీ. జానకి శోకింప సాధ్యకిన్నరయక్ష
గరుడోరగామరకాంత లెల్ల
వెంటనే శోకింప విని గంధవహపుత్రుఁ
డాత్మలోఁ జింతించి యాగ్రహమున

నీదుష్టదైత్యుపై నిప్పుడే లంఘించి
చెండాడ నాచేతఁ జిక్కెనేని
కార్యంబు లెస్సగుఁ గాక సత్త్వము తూలి
బలువీడి వీనిచేఁ బడితినేని

తే. సీతఁ గానంగ లేక కృశించి రామ
భద్రుఁ డడఁగిన సీతయుఁ బ్రాణ మెడలు
లక్ష్మణుండును జూడ నాలస్య ముడిగి
తెగును నట్లైనఁ గార్యంబు తెఱఁగుఁదప్పు. 44

చ. అని పవనాత్మజుండు దివిజారిపయిం దెగ వేళగాదు భూ
తనయకు నాదుశాక వసుధావరుమేలు నెఱుంగజెప్పి మీఁ
దను మఱి చూత మంచు నుచితస్థితి నూరకనుండె నప్పుడా
దనుజవిభుండు వోయె నిజధామముఁ జేర సతీసమేతుఁడై.

వ. అప్పుడు యామినీచరకామినులు రావణానుమతంబున
ననేక విధంబు లగుమధురాలాపంబుల మిథిలాధీశకుమారిం
గుఱించిబోధించికార్యంబు సాధింప నోపక యలసియుంటం
జేసి యొక్కింతసేపు నిద్రించుచుండ మేల్కొని త్రిజట
యను నిశాచరి యిట్లనియె. 46

మ. కలగంటిన్ వినుఁ డింతులార మనలంకాద్వీప మీయబ్ధిలో
పల వ్రాలన్ మనరావణేశ్వరునిశుంభద్రత్నకోటీరముల్
కలనన్ గూల రఘూద్వహుం డెలమితో గంధద్విపం
బెక్కియు
జ్వలత్కాంతిన్ విలసిల్లుసీతఁ గొనిపోవన్ మిన్నఁ జే నిప్పుడే.

క. శుద్ధాత్ముఁ డైనరాముఁడు
శుద్ధాంతపుదేవిఁ గాన శుభసూచకముల్
శుద్ధ మయి తోఁచుచున్నవి
సిద్ధం బీమాట వేదసిద్ధాంతముగాన్. 48

క. కావున నిక్కోఁ-సులియెడఁ
గావలి యున్నట్టిమీరు కఠినోక్తులు గా
నేవియు నాడకుఁ డిఁక నీ
దేవియ రక్షింప మనకు దిక్కగు మీఁదన్. 49

వ. అని చెప్పి మఱియును. 50

క. అమ్మా వెఱవకు మదిలో
నిమ్మగ మఱి వేక్క నుండు మిఁక నీమగఁడున్
నెమ్మిగ నినుఁ గొనిపోవును
మమ్మందఱ మనుపు మమ్మ మఱువక కరుణన్. 51

ఆ. అనుచు దనుజకాంత లంతంత నెడఁబాసి
నిదుర వోయి రంత నదరి సీత
తనకు దిక్కు లేమిఁ దలపోసి దుఃఖింపఁ
బవనసుతుఁడు మనుజభాషఁ బలికె. 52

క. ఉన్నాఁడు లెస్స రాఘవుఁ
డున్నాఁ డిదె కపులఁ గూడి యురుగతి రానై
యున్నాఁడు నిన్నుఁ గొని పో
నున్నాఁ డిది నిజము నమ్ము మూర్వీతనయా. 53

సీ. ఆమాట లాలించి భూమిజ తనలోన
వెఱఁ గంది శింశుపావృక్ష మరసి
చూడంగ నప్పుడు సూక్ష్మరూపంబున
నొడిక మాశాఖలనడుమ నున్న
కపికుమారునిరూప మపురూపముగఁ జూచి
స్వాంతంబులోన హర్షంబు నొంది
దనుజమాయలచేతఁ దరచు వేఁగుటఁ జేసి
మారాడ నేరక యూర కున్న

తే. భావ మూహించి తన్ను నాదేవి యాత్మ
నమ్మ కుండుటఁ దెలిసి యాకొమ్మమీఁది
నుండి క్రిందికి లంఘించి నిండుభక్తి
మ్రొక్కి నిలుచుండి కరములు మోడ్చి పలికె. 54

ఉ. తమ్మునిఁగూడిపుణ్యగుణధాముఁడు రాముఁడువచ్చి మాల్యవం
తమ్మునసైన్యసంఘము ముదంబునఁ గొల్వఁగనుండి భూమిపై
మిమ్ములఁ జూచిరండనుచు మేటికపీంద్రులఁ బుచ్చియందు మొ
త్తమ్ముగమమ్ముఁగొందఱను దక్షిణభాగముచూడఁ బంపుచున్.

క. అంగన బాడఁగన నీ వి
య్యంగను గడుఁ జాలువాఁడ వంచును నాచే

నుంగర మంపెను శ్రీ రఘు
పుంగవుఁ డిదె కొమ్మటంచు భూమిజ కిచ్చెన్. 56

ఉ. ఇచ్చినఁ జూచి రామధరణీశ్వరముద్రికఁ గా నెఱింగి తా
నిచ్చను మెచ్చి యాకువలయేక్షణ యాత్మగతంబునందు నీ
వచ్చిన దానిభావమును వల్లభుచందము నేర్పడంగ నేఁ
జెచ్చెర నంతయుం దెలియఁ జెప్పుము నమ్మిక
పుట్టునట్లుగన్. 57

వ అని విచారించి యిట్లనియె. 58.

క. నిను విశ్వసింపఁ జాలను
వినుపింపుము నీ తెఱంగు విభునివిధము నా
కనవుడుఁ బావని తెలియఁగ
వినయంబున విన్నవించె విస్ఫుటఫణితిన్. 59

ఉ. రాముని డాఁగురించి నినురావణుఁ డెత్తుక వచ్చువేళ నీ
హేమవిభూషణావళుల నేర్పడ ఋశ్యమహాద్రిపై చినన్
మే మవి తీసి దాఁచితిమి మాపతి యచ్చటి కేఁగు దేరఁగాఁ
దామరసాప్తనందనుఁడు తానవి సూపినఁజూచి
మెచ్చుచున్. 60

సీ. అర్కసంభవునకు నభయంబు దయచేసి
దుందుభికాయమ్ము దూలఁదన్ని
మేడుతాడుల సర్వ మేకమ్ముగాఁ ద్రుంచి
వాలి నద్భుతకళ కిగూలఁజేసి

సుగ్రీవునకుఁ దార సుదతిగా నిప్పించి
యంగదు యువరా జనంగ నిలిపి
వారలతోఁడను వానరసైన్యంబు
లెన్నేనిఁ గొలువంగ నేఁగుదెంచి

తే. మాల్యవంతంబునం దుండి మనుజవిభుఁడు
నిన్ను వెదకంగ నందఱ నన్నిదిశలఁ
బనుచునప్పుడు దక్షిణభాగ మరయ
నంగదుతోడఁ గొందర మరుగుదేర. 61

తే. వారిపంపునఁ నవలీల వార్ధి దాఁటి
వచ్చి సకలంబుఁ జూచి యీవంకఁ గంటి
రావణుఁడు వచ్చి నిన్ను నుగ్రంబు గాఁగ
బలుకునప్పుడు నున్నాఁడఁ బాదపమున. 62

వ. ఇవ్విధంబునఁ బలుకుచుండినను నమ్మక యతనిం గనుగొని
. రాముఁ డేరీతివాఁడో యతనిచందం బెరింగింపు మనవు
డావాయునందనుండు రఘునందనునకు వందనం బాచ
రించి భూమినందనకి ట్లనిచెప్పుచున్నాడు.

సీ. నీలమేఘచ్ఛాయఁ బోలు దేహమువాఁడు
ధవళాబ్జపత్రనేత్రములవాఁడు
కంబుసన్నిభ మైనకంఠంబు గలవాఁడు
బాగైనయట్టిగుల్భములవాఁడు

తిన్ననై కనుపట్టు దీర్ఘబాహులవాఁడు
ఘనమైన దుందుభిస్వనమువాఁడు
పద్మరేఖలు గల్గుపదయుగంబులవాఁడు
చక్కని పీనవక్షంబువాఁడు
తే. కపట మెఱుఁగనిసత్యవాక్యములవాఁడు
రమణి! రాముండు శుభలక్షణములవాఁడు
ఇన్నిగుణముల రూపింప నెసఁగువాఁడు
వరుస సౌమిత్రి బంగారువన్నెవాఁడు. 64
తే. ఉరుతరాటవిలోన మహోగ్రతపము
వాయుదేవుని గుఱియించి వరుసఁ జేసి
యంజనాదేవి గనియె న న్నర్థితోడ
నర్కజుని మంత్రి హనుమంతుఁ డంద్రు నన్ను. 65

వ. అని యిట్లు తాత్పర్యంబునఁ బట్టునట్లుగా విన్నవించి దేవీ! నీ దేవుండయిన శ్రీరాముండు నాచేతి కిచ్చి యంపిన నూత్న రత్నాంగుళీయకంబు నీకు సమర్పించితి నింక నాకు రిక్తహస్తంబులతోఁ జనుట దూతల కుచితమైనకార్యంబు గాదు గావున నిన్ను దర్శించినందులకు శ్రీరామునకును నమ్మిక పుట్టునట్టులుగా నీశిరోరత్నంబు దయచేయవలయు ననుటయు నాకు శేశయనయన యి ట్లనియె. 66

క. నానాథుక్షేమ మంతయు
ధీనిధి! నీచేత వింటిఁ దెలియఁగ నైనన్
నీనిజరూపము చూడక
నే నారత్నంబు నమ్మనీ కీయఁ జుమీ. 67

వ. అనుటయు నా హనుమంతుండు. 68

క. చుక్కలుఁ దలపూవులుఁగా
నక్కజముగ మేను వెంచి యంబరవీథిన్
వెక్కసమై చూపట్టిన
నక్కోమలి ముదము నొందె నాత్మస్థితికిన్. 69

వ. ఇట్లు తనమహోన్నతరూపంబు చూపి యెప్పటియట్ల
మరల సూక్ష్మరూపంబు గైకొని నమస్కరించిన నాహను
మంతునకు నద్దేవి తనశిరోరత్నంబు ననుగ్రహించి యి
ట్లనియె. 70

చ. రవికులవార్ధిచంద్రుఁ డగురాముని సేమము చాల వింటి నా
వివిధము లైనపాట్లు పృథివీపతికిం దగఁ జెప్పఁ గల్గె నేఁ
డవిరళభంగి నీవలన నచ్చుగ నే నుపకార మేమియుం
దవిలి యొనర్ప లేను వసుధాస్థలి వర్ధిలు బహ్మకల్పముల్.

వ. ఇట్లు దీవించి మఱియును. 72

క. ఏయెడఁ జూచినధరణీ
నాయకు శ్రీపాదయుగము నాచిత్తములో
బాయ దని విన్నవింపుము
వాయుతనూజుండ పుణ్యవంతుఁడ తెలియన్. 73

తే. ఇపుడు రావణుఁ డేతెంచి కపటబుద్ధి
గర్వమునఁ జేసి నన్నెన్ని కాఱు లాడె
నన్నియును నీవు చెవులార విన్న తెఱఁగు
పతికి దయ పుట్టఁగా విన్నపంబు సేయు. 74

సీ. నిడుదపెన్నెఱివేణి జడలుగా సవరించి
మలినజీర్ణాంబరం బొలియఁ గట్టి
భూమిరజంబు విభూతిపూతగఁ బూసి
తనదివ్యమూర్తిఁ జిత్తమున నిల్పి
నిరశనస్థితితోడ నిలిచి భూశయ్యను
బవళించి నిదుర యేర్పడఁగ విడిచి
తారక బ్రహ్మమంత్రంబుఁ బఠింపుచుఁ
గఠినరాక్షస దుర్మృగములలోన

తే. నహితలంకామహాద్వీపగహనసీమఁ
దపము సేయుచు నున్నాను తన్నుఁ గూర్చి
నాకుఁ బ్రత్యక్షమగుమని నాథునకును
విన్నవింపుము సత్త్వసంపన్న! నీవు. 75

వ. అని చెప్పి మఱియును. 76

చ. జనకుని భంగి రామనృప చంద్రుని నన్నును దల్లి మాఱుగాఁ
గని కొలువంగ నేర్చుగుణగణ్యుని లక్ష్మణు నీతిపారగున్
వినఁ గని రానిపల్కు లవివేకము చేతను బల్కినట్టి యా
వినుతమహాఫలం బనుభవించితి నంచును జాటి చెప్పుమా.

క. ఆమాటలు మది నుంచక
నామానముఁ గావు మనుచు నయవినయగుణో
ద్దాముడుఁ రాముని తమ్ముఁడు
సౌమిత్రికిఁ జెప్పుమయ్య సాహసివర్యా! 78

వ. అని యిట్లు జనకరాజతనయ పలికినపలుకు లాలకించి
హనుమంతుఁ డాజననితో ని ట్లనియె. 79

క. ఇనుఁ డుదయింపకమున్నే
వననిధి లంఘించి మనుజవల్లభుకడకున్
నినుఁ గొనిపోయెద వీఁపున
జననీ! కూర్చుండు మనిన సంతోషమునన్. 80

క. నీ వంతవాఁడ వగుదువు
నీవెంటనె వత్తునేని నెగడవుకీర్తుల్
రావణునికన్న మిక్కిలి
భూవరుఁడే దొంగ యండ్రు బుధనుతచరితా.

వ. అదియునుం గాక రామచంద్రునిం దప్ప నితరుల నంటు
దానం గాను గావున నీతో రాఁ దగదు మఱియును. 82

క. దొంగిలి తెచ్చిన దైత్యుని
సంగడు లగువానివారిసాహస మొప్పన్
సంగర ముఖమునఁ జంపక
దొంగిలి కొనిపోవఁ దగునె దొరలకు నెందున్. 83

వ. మఱియు రామచంద్రుండు త్రిజగదేకవీరుండును గోదండ
దీక్షాగురుండును రాక్షసకులాంతకుండును నగుటం జేసి
రాణివాసద్రోహి యగు రావణుని సంగరరంగంబునఁ
బ్రఖ్యాతంబుగాజంపి కొనిపోవుట ధర్మంబు; నీవు రామ
చంద్రునకుఁ బరమభృత్యుండవును బుత్రసముండవును
నగుటం జేసి నీవెంట నరుగుదెంచుట తప్పుగాక పోయినను

బగ తీర్పకవచ్చు టుచితంబు గాదు, గావున నీవు రాఘు
వేశ్వరుల కిన్నియుం దెలియ విన్నపంబుసేసి తడయక
తోడ్కొని రమ్మనిన నద్దేవికి నమస్కరించి హనుమంతుం
డిట్లనియె. 84

ఉ. నీవిభుఁ డబ్ధి దాఁటి ధరణీతలనాథులు సన్నుతింప సు
గ్రీవసుషేణముఖ్యబలబృందముతో నరుదెంచి నీచునిన్
రావణు నాజిలోఁ దునిమి రాజస మొప్పఁగనిన్నుఁగొంచుసే
నావళితోడ నీపురికి నారయ నేఁగు నిజంబు నమ్ముమా.

వ. అని విన్నవించి నమ్రుండై యద్దేవిచేత దీవనలు బొంది
మరలి చనియె. 86



## కంకంటి పాపరాజు — ఉత్తరరామాయణము

# లక్ష్మణనిర్యాణము

### దుర్వాసుఁడు క్షుత్పీడితుండై రామునికడకు వచ్చుట

సీ. అనసూయగర్భశుక్తిని రూపు గని యే మ
హర్షి ముక్తాగ్రగణ్యత వహించె
నత్రిసంయమితపోధాత్రీరుహమున
కే యతివరేణ్యుఁడు ఫలాకృతి రహించె
నింద్రరాజ్యవిభూతి నేమౌని శాపాక్ష
రావలి వాయువై యబ్ధిఁ గలిపె
రుద్రుని యత్యుగ్రరోషాగ్ని యే మునీ
శ్వరునిచందమున గోచరతఁ జెందె
తే. నట్టిదుర్వాసుఁ డవ్వేళ నరుగుదెంచి
మోసల వసించురాముతమ్మునిఁ గనుఁగొని
యధిపుతోఁ దెల్పు మారాక యనిన నతఁడు
నెంతయు వినీతుఁడై మ్రొక్కి యిట్టు లనియె. 1

మ. జటిలాగ్రేసర వేళ గాదు రఘువంశస్వామి యేకాంత లం
పటచేతోగతి నున్నవాఁడుక్షమియింపన్ జెల్లునొక్కింతసే
పటకున్ నాకును బోవరా దనిన రోషాగ్నిజ్వాలజ్జ్వాలికా
చటులక్రూరకటాక్షుఁడై యతఁ డనున్ సౌమిత్రితోఁ
గ్రమ్మఱన్. 2

చ. నను నిలుపన్ బితామహ జనార్దన శంభుల కైన శక్తి లే
దనఁగ నొకండు శక్తుఁడె నృపాగ్రణి కీవు మదాగమంబు దె
ల్పనిపని నిక్కమేని హితబాంధవమంత్రులతో ధనంబుతోఁ
దనయులతో మిమున్ గినిసి దగ్ధులు గా శపియింతు
నావుడున్. 3

తే. గడగడ వడంకి పెక్కండ్రు మడియుకంటె
నరయ నొక్కనిచావు మేలని తలంచి
రాఘవునిఁ జేరి మ్రొక్క దుర్వాసుఁడిపుడు
దేవ! యరుదెంచినాఁ డంచుఁ దెల్పుటయును. 4

ఉ. వాసరరాజవంశమణి వాసరరాట్సుతు వీడుకొల్పి దు
ర్వాసునిఁ జేరఁబోయి యభివందనముల్ ఘటియించి
యేల వి
చ్చేసితిరేమి పూజనలు సేయుదు నావుడు వేయియేండ్లు నేఁ
జేసిన బత్తపంబునఁ గృశించితి నాఁకలి దీర్పవే యనన్. 5

చ. వడియము లొల్పుఁబప్పుఁ గలవంటకముల్ వరుగుల్
ఫలాదులున్
బడిదము లప్పముల్ వడలు పాయసముల్ కలమాన్న
మాజ్య మ
ప్పడములుఁ గూరలున్ బెరుఁగుఁబచ్చడు లాదిగ నించి
భోజనం
బిడిన నతండు మెచ్చుచు యథేష్టముగా భుజియించి
పోయినన్. 6

క. కీనాశునిసమ్ముఖమునఁ
దా నూనిన ప్రతినఁదలఁచి దశరథ సూనుం
డాననము వంచి ధైర్యవి
హీనుండై దీనవృత్తి నిట్లనివగచెన్.

చ. కటకట! యేల యిచ్చటికిఁ గాలుఁడువచ్చె మహాప్రతిజ్ఞ యే
మిటికి నొనర్చితిన్ సుజనమిత్రుని నాసహజన్మఁబాసి నే
నెటువలెనిల్తు నెట్లు వచియింపుదు నివ్వెడమాట యెవ్వరున్
గటికిమనంబుతోడ నవకార్యము లిట్టివి యాచరింతురే. 8

సీ. స్వచ్ఛందనాంగనాసౌఖ్యముల్ వర్జించి
నాతోడఁదొల్లి కానలకు వచ్చె
నెడపక పదునాలుగేండ్లు నిద్రాహార
ములు మాని నాకు సేవలు ఘటించె
సీతఁ బాసినవంతఁ జెందనీయక ధైర్య
మొదవ మాటాడి నన్నుపచరించె
రణరంగమున మదర్థమ్ముగా నతికాయ
శక్రజిత్ప్రముఖుల సంహరించె

తే. హృదయ మెఱిఁగి ప్రవర్తించె నిన్నినాళ్లు
నిట్టిహితు నిట్టివిశ్వాసి నిట్టియాప్తు
నిట్టితమ్ముని బ్రతినకై యెట్లునొంతు
నేఁడుసేయుదుఁ దుది దైవమెంతచేసె! 9

వ. అని శోకబాష్పాకులితనేత్రుండై యద్దశరథపుత్రుండు పెక్కుభంగులన్ బనవి బనవి కన్నీరు కరతలంబునన్ దుడుచుకొని యెట్టకేలకు నెప్పటి యెలుంగు నూల్కొల్పి

చెంగటనున్న యనుంగుఁదమ్ముని౯ గనుంగొని
యిట్లనియె. 10

చ. అలుక వహించి యత్రికొడు కాఁకటిపెల్లున రేఁగి యందఱున్
బొలియఁగ దిట్టిపోయినను బోదుము నెమ్మదినాత్మహానికిన్
దలఁకక యేలవచ్చితివి నాయెడకున్ సడికోర్చి నిన్ను ని
ర్మలు నెడఁబాసి నొంటి నిఁకఁ బ్రాణము లెట్లు భరింతు దమ్ముడా! 11

క. ప్రతిన యొనర్చిన నెపమున
మృతిఁబొందన్ జేయుననుచు నేమోయి ననున్
సతతంబు నమ్మి కొలిచితి
వతులగుణాభరణ! లక్ష్మణా! యని వగవన్. 12

ఉ. ఆరఘువీరుఁజూచి వినయంబున లక్ష్మణుఁడిట్లనున్ ననున్
గూరిచి చింతసేయకుము కోవిదు లాపదలన్ గలంగ రె
వ్వారికిఁ గాలమున్ గడపవచ్చునె మీరు ప్రతిజ్ఞఁదప్పినన్
ధారుణిగ్రుంగదే? స్వకులధర్మముమానుదురే? నరాధిపుల్.

చ. ఎలమివహించి నన్నుఁద్యజియింపక యుండితిరేనిఁ బల్కులన్
గలయు నసత్య మందులకుఁ గారణ మేఁగన నన్నుఁజెందుఁద
త్ఫల మటుగాకయుండ నరపాలక! నన్నుఁదొఱంగి సత్యమున్
విలసితకీర్తియున్ నిలుపవే యన రాముడు ఖేదమందుచున్.

క. కుల గురుఁడైన వశిష్ఠుని
నలఘుమతుల మంత్రివరుల నార్యుల హితులన్
బిలిపించి జమునిరాక మె
దలుకొని సకలంబుఁ దెలిపెఁ దత్సభ్యులకున్. 15

చ. తెలిసి వినీతు సోదరుఁ బ్రతిజ్ఞ యటంచు ద్యజింపఁగూడునే
తలఁకెడిఁ జిత్త మెయ్యది హితం బెఱిఁగింపుఁడు మీర లిందఱున్
గలఫల మన్న నొండొరు మొగంబులు సూచుచుఁ దేర్చి యెద్దియున్
బలుకఁగ నేర కూరక సభాసదు లున్న వసిష్ఠుఁడిట్లనున్.

చ. ప్రతిన యటంచు లక్ష్మణునిఁ బాయుట యెట్లన నేల రామ! నీ
ప్రతిన దొలంగినన్ బలు కబద్ధ మనంబడు నయ్యసత్యతన్
హతమగు ధర్మ మాసుకృత మంతముగా జగముల్ నశించు లో
కతతులు పెక్కు నాశ మగుకంటె సహోదరుఁ డొక్కఁ డెక్కుఁడే.

క. సకల మనిత్య మెప్పటికి సత్యము నిత్యము సత్యసంధులై
ప్రకటయశోవిభూతి మనరా మనరాజు లసత్య మాడ నో
పక కద నిన్నుఁ గానలకుఁ బంచె భవజ్జనకుం డెఱుఁగవే
యకుటిలసత్యసంపద జనాధిప! కీర్తి వహింపు నావుడున్.

కం. ఆమాటలు విని సభ్యు,
స్తోమము విధి చెట్ట యనుచు దూఱఁగ రామ

స్వామి కడుఁ దెగువ చేకొని,
సౌమిత్రిన్ జూచి ధైర్యసంపదననియెన్. 19

చ. ఎడపక యెంతతప్పు ఘటియించినచో నినువంటితమ్మునిన్
గడఁగి వధింపఁ జాల నధికప్రతిభాన్వితు లైనవారికిన్
విడుచుట చంపు టొక్కగతి నిన్నుఁ ద్యజించితి నీకు నిచ్చ యా
నెడ కేఁక నేగుమన్న నతఁడెంతయు శోకవిషాదమూర్తియై.

చ. అడలుచు నన్న పాదముల కప్పుడు సాఁగిలి మ్రొక్కి యార్యుల
కడిజనముల్ విభుండు దనుఁ గన్గొని యశ్రులు నించఁ గొల్వు వె
ల్వడి సరయూతరంగిణి కవార్యధృతిన్ జని క్రుంకి యోగ మ
య్యెడ ధరియించి యాత్మఁ దనయెప్పటిరూపుఁదలంచు నంతలోన్. 21

చ. ఎలమిఁ బ్రసూనవృష్టిఁ గురియింపుచు నింద్రుఁడు వచ్చి శంఖ కా
హళములు మ్రోయ రంభ మొదలైనచెలుల్ నటియింప నమ్మహో
జ్జ్వలనిధి మేనితోడఁ ద్రిదివంబునకున్ గొనిపోయె వేడ్క నం
దలిబుధు లార వచ్చె హరినాలవపాలని ప్రస్తుతింపఁగన్.

# ఏనుఁగు లక్ష్మణకవి

# భర్తృహరి సుభాషితములు

సంస్కృతమున సుభాషితములను పేర భర్తృహరియను మహాకవి మూఁడు శతకములుగా రచియించిన గ్రంథమును, తెనుఁగున ముప్వురు కవులు వెలయించిరి: ఎలకూచి బాలసరస్వతి, ఏనుఁగు లక్ష్మణకవి, పుష్పగిరి తిమ్మన. వీరు స్వతంత్రముగా నెవ్వరికి వారే గ్రంథమును పూర్తిగ వ్రాసిరి. ఎలకూచి బాలసరస్వతి 17-వ శతాబ్దమున గుంటూరి మండలమున నుండి మహోపాధ్యాయుఁడను బిరుదము నందినవాఁడు. ఏనుఁగు లక్ష్మణకవి పదునెనిమిదవ శతాబ్దమున పెద్దాపురమున నుండి యనేక గ్రంథములను రచించినవాడు. పుష్పగిరి తిమ్మన నెల్లూరి మండలములో పదునెనిమిదవ శతాబ్ద మధ్యముననే యుండినవాఁడు.

ఈ సుభాషితములకు 'సుభాషిత రత్నావళి' యని పూర్ణమయిన పేరు. ఈ రచనముమిక్కిలి సరసముగాను, హృదయంగమముగా నున్నది. దీని ననువదించిన ముగ్గురు కవుల యాంధ్రీకరణములోనుగూడ లక్ష్మణ కవిదే మిక్కిలి యింపునింపుచుండును. ఈ సుభాషితములను దెనిఁగింపుమని సోమశంకరస్వామి కలలో సాక్షాత్కరించి తనకుఁ జెప్పి నట్లు వ్రాసికొనియున్నాడు. ఇతఁడు రామేశ్వరమాహాత్మ్యము, గంగా మాహాత్మ్యము, రామవిలాసము మొదలయిన గ్రంథములు చేసినట్లు చెప్పి కొని యున్నాఁడు.

తెనుఁగున ననేక శతకములు గలవు. నీతి, భక్తి, వైరాగ్య శృంగారాదికము ప్రధానముగా నెన్నో శతకములు వ్రాయబడినవి. శతక మనఁగా నూరు. ఇందు నూరు పద్యములుండుట సాధారణము గావున వీనికి శతకములను పేరు వచ్చినది.

సాధారణముగా శతకములయందు సంబోధనముతో నున్న మకుట మొకటి యుండును. 'సర్వేశ్వరా' 'దాశరథీ కరుణాపయోనిధీ' మొద లయినవి ఆయాశతకముల తుదినున్న మకుటములు. ఇట్లుండుట శతకములలో చాలవఱకుఁ గలదు. అంతమాత్రమున నన్ని శతకములకు నట్లుండవలెనను నియమములేదు. పఠనీయ శతకముననే యీ నియమములేదు.

శతకములనుజాతి కావ్యములను చాటుప్రబంధములని లాక్షణికులు పేర్కొనిరి.

పఠనీయ పద్యములు నీతిశతకములోనివి.

[క్రిందిపద్యములన్నియు కంఠస్థము చేయవలయును.]

శా. ఆకాశంబుననుండి శంభుని శిరంబందుండి శీతాద్రి, సు
శ్లోకంబైన హిమాద్రినుండి భువి, భూలోకంబునందుండి య
స్తోకాంభోధిఁ, బయోధినుండి పవనాంధోలోకముం జేరె గం
గాకూలంకష, పెక్కుభంగులు వివేకభ్రష్టసంపాతముల్. 1

చ. క్షమ కవచమ్ము, క్రోధ మది శత్రువు, జ్ఞాతి హుతాశ
నుండు, మి
త్రము దగుమందు, దుర్జనులు దారుణపన్నగముల్,
సువిద్య వి
త్త ముచితలజ్జ భూషణ ముదాత్తకవిత్వము రాజ్య
మీక్షమా
ప్రముఖపదార్థముల్ గలుగు పట్టునఁ దక్కవచాదు


లేటికిన్. 2

ఉ. గ్రాసములేక స్రుక్కిన, జరాకృశమైన, విశీర్ణమైన, సా
యాసమునైన, నష్టరుచియైనను, ప్రాణభయార్తమైన సం
త్రాసమదేభకుంభపిశితగ్రహలాలసశీలసాగ్రహా
గ్రేసరభాసమానమగు కేసరి జీర్ణతృణంబు మేయునే? 3

ఉ. జాతి దొలంగుఁగాత, గుణశక్తి రసాతలసీమకుం జనుం
గాత, కులంబు బూది యగుఁగాత, నగంబుననుండిశీలముం
బాతముఁ జెందుగాత, బహుభంగుల విత్తమె మాకు మేలు, వి
ఖ్యాతగుణంబులెల్లఁ దృణకల్పము లొక్కధనంబు లేవడిన్. 4

శా. హ్రీరమ్యుంజడుఁగాఁగ, సువ్రతుని మాయింగా, శుచిం దంభిఁగా
శూరున్ నిర్దయుగా, మునిన్ విమతిగా, శ్రోత్రప్రియు లాపు ని
స్సారుంగా, బలవంతు గర్వితునిగా, సద్వక్త వాచాలుఁగాఁ
గ్రూరుం డెన్ని సుధీగుణంబు దురితారూఢంబుఁ జేయుంగదా. 5

ఉ. నీరము తప్తలోహమున నిల్చి యనామకమై నశించు; నా
నీరమె ముత్యమట్లు నళినీదళసంస్థితమై తనర్చు; నా
నీరమె శుక్తిలోఁ బడి మణిత్వము గాంచు సమంచితప్రభం;
బౌరుషవృత్తు లి ట్లధమ మధ్యము నుత్తముఁ గొల్చువారికిన్. 6

మ. తమకార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్;
దమకార్యంబు ఘటించుచున్ బరహితార్థవ్యాపృతుల్ మధ్యముల్;
దమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్; వృథాన్యార్థభం
గము గావించెడువార లెవ్వరొ యెఱుంగన్ శక్యమే యేరికిన్? 7

శా. నీతిప్రౌఢవిహారులైన నిపుణుల్ నిందింపనీ మెచ్చనీ
ఖ్యాతిం జెందిన సంపదల్ నిలువనీ గాఢంబుగా సాగనీ
ఘాతం బప్పుడ పొందనీ నియతిమై గానీ యుగాంతంబునన్
నీతిశ్లాఘ్యపదంబు దప్పరు గదా నిత్యంబు ధీరోత్తముల్.

క. కందుకము వోలె సుజనుఁడు
గ్రిందం బడి మగుడ మీఁదికి న్నెగయుఁ జుమీ
మందుఁడు మృత్పిండమువలెఁ
గ్రిందంబడి యడగియుండుఁ గృపణత్వమునన్. 9

చ. సలిలముఁ జొచ్చినం, గనకశైలముఁ జేరిన, వైరివీరులం
గెలిచిన, రాజసేవ దిటకించిన, వేదము లభ్యసించినన్,
గళల తెఱం గెఱింగిన; ఖగత్వము దాల్చినఁ గర్మనిఘ్న తా
కలన నభావ్య మైనపని గాదు వినాశము లేదు భావికిన్.10



# పాల్కురికి సోమనాథుఁడు

# బసవపురాణము

## ప్రథమ — ద్వితీయాశ్వాసములు

### అల్లమప్రభుని రాక

అంత నల్లమప్రభువను సంయమీశుఁ
డంతకాంతకమూర్తి యతులితకీర్తి
నిర్మూలితోద్రిక్తదుర్మలుఁ డుభయ
కర్మనికృంతనకర్మకర్మఠుఁడు
వైరాగ్యసంసారవర్జితాత్మకుఁడు
దూరదృష్టాదృష్టచారుచర్యుండు
దానప్రతిగ్రహహీనవర్తనుఁడు
మానావమానసమానకీర్తనుఁడు
సమలోష్టకాంచన సమసుఖదుఃఖ
సమమిత్రశాత్రవ సద్భావనుండు
సప్తధాతుమదాదిసర్వాంగగుణవి
లుప్తచిత్తుండు సంసుప్తిదూరుండు
కాలసంకల్పవికల్ప మహేంద్ర
జాల ప్రపంచనిర్మూలనశాలి
పరమశివానందపరవశీభూతు
డురుముక్తకేశయుతోత్తమాంగుండు
దివ్యానిమిషసుధాదృష్టి గోచరుఁడు

భవ్యుండు గాంధర్వపండితోత్తముఁడు
ఆంతరయోగనిరంతరయోగ
వంతుఁ డనంత వేదాంతవేద్యుండు
నిశ్శరీరి శరీరి నిర్నామి నామి
నిశ్శబ్ది శబ్ది వినిర్భావి భావి
ద్వైతయోగక్రియాద్వైతయోగక్రి
యాతీతయోగక్రియాన్వితుఁ డనఁగ
ముల్లోకములఁ దేటతెల్లమై భక్తి
కెల్లమై స్వేచ్ఛావిహీనకృత్యమున
లీలఁ గరస్థలలింగవిన్యస్త
లోలేక్షణానందకేళిఁ ద న్మరచి
యిది యేలు వల్లంబు నిది సెట్టు గట్టు
నిది దెర్వ డవియని మదిఁ దలంపుడిగి
యఱదేర నన్నియు నంతంతఁ దొలఁగి
తెఱవిచ్చుఁటకు నఱ లఱదని పొగడ
బసవనియసమ విభ్రాజితభక్తి
రసవార్ధి వెల్లివిరిసి నిట్టవొడువ
వచ్చెఁ దద్వీచిప్రవర్తితం బగుచు
వచ్చువహిత్రంబువడువును బోలె
నిచ్చ రత్నపరీక్ష యెఱిఁగి చేపట్టు
బచ్చునుబోలె నబ్బసవయ్యప్రభువు
భావంబు సంగయదేవునియంద
భావనఁ బొరయుడు భక్తిమై ప్రమోద

రుచిరరత్నప్రభానిచితమై యున్న
యచలితస్వర్ణసింహాసనం బెక్కి
ప్రభువున్న ; నంగప్రభాపటలంబు
లభినుతిఁబొంచె దిశాంతరాళముల
నొడల జీవము గల్గియును లేనివాని
నడగల్గియును వర్తనము లేనివానిఁ
గన్నులు వ్రేఁగులుగాఁ గలవాని
మున్న లింగమ ప్రాణముగ నున్నవానిఁ
జేతనుం డయ్యు నిశ్చేష్టలవాని
ఖ్యాతి లేకయు నుతిఁ గడచన్నవానిఁ
బలుకుల మీఱిన బాసలవానిఁ
దలఁపులదాఁటిన తత్త్వంబువాని
గుణహీనుఁ డయ్యును గుణమిచ్చువానిఁ
బ్రణవాత్ముఁ డయ్యు నేర్పడియుండువానిఁ
గని శరణనుచు గద్గదకంఠుఁ డగుచుఁ
గనుఁగవ హర్షాశ్రుకణములు దొరఁగ
బసవఁ డల్లంతటఁ బ్రణమితుం డగుచు
నసలార సముచితాభ్యర్చితుఁ జేసి
లింగతూర్యములు సెలంగ నుప్పొంగి
మంగళారతు లెత్తె మహిఁ దక్షిణంబ.

అల్లమప్రభునికి విందువెట్టుట

పళ్ళెరం బిడి పంచభక్ష్యాన్నములును
నెల్లపదార్థముల్ మొల్లంబుగాఁగ

వడ్డించి యబ్బసవం డర్థి దొడ్డ
దొడ్డకళ్ళుగఁ జేసి తోడ్తోడఁ బట్టి
హారునకుఁ దొల్లి యా సురియచౌడరసు
కరమర్థి నందిచ్చు కరణియుఁ బోలె
నందిచ్చుచుండంగ నర్థిఁ జేసేత
నందికొంచును బ్రభు వారగింపంగ
బంబి లక్షయు నెనుబదివేలు జంగ
మంబుల కనుచు సమగ్రత దనర
నటమున్న చేసినయప్పదార్థంబు
లిటుగూడ సమయుడు నెట్లొకో యనక
యేనకా కోగిరం బింక నీ కనుచుఁ
బూని యూఁకింపఁ బ్రభువు మెచ్చి యంతఁ
"గో"యని భక్తనికాయంబు వొగడ
"హో"యని సత్కృపాయుక్తి వొల్పార
"బాపురే! బసవ! సద్భక్తసంత్రాణ!
బాపురే! బసవ! సద్భక్తిధురీణ!
నల్లవో! బసవ!యనశ్వరకీర్తి!
నల్లవో! బసవన్న! నందీశమూర్తి;
అమృతంబునందు దివ్యంబగుచేగ
విమలమాణిక్యగర్భమున దీపంబు
చెఱకునఁ బండు పసిఁడిఁ గమ్మఁదనము
గొఱవైన మలయజకుజమునఁబూవు
చిత్తరువునకును జీవంబుఁ బసిఁడి

పుత్త్రికిని బ్రాణమును నిక్కువముగఁ
బుట్టినయట్టుగాఁ బుట్టితికొడుక!
నెట్టణ భక్తికి నిలుకడయగుచు
నాదుబసవ! దండనాయకబసవ!
యాదిబసవ! యసంఖ్యాతులబసవ!
భక్తులబసవ! యాప్రమథులబసవ!
ముక్తీశుబసవ! నాముద్దులబసవ!
సంగన బసవ! ప్రసాదంబుబసవ!
జంగమంబుబసవ! సత్యంబుబసవ!
పండితబసవ! సత్పాత్రంబుబసవ!
బండారిబసవ! సౌభాగ్యంబుబసవ!
తత్త్వంబుబసవ! మహత్వంబుబసవ!
సత్త్వంబుబసవ! నిత్యత్వంబుబసవ!
వృషభంబుబసవ! సంవిజ్జ్యోతిబసవ!
విషకంఠుబసవ! వివేకంబుబసవ!
తజ్జ్ఞులబసవ! తత్వజ్ఞులబసవ!
ప్రాజ్ఞులబసవ! సర్వజ్ఞులబసవ!
సిద్ధులబసవ! ప్రసిద్ధులబసవ!
శుద్ధులబసవ! ప్రబుద్ధులబసవ!
బసవయ్య! బసవన్న! బసవకుమార
బసవ! బసవరాజ! బసవలింగంబ
వడిఁ బాలుజలమున కొడలెల్లఁ గాళ్లు
వడిఁ గాలుచిచ్చున కొడలెల్ల నోళ్లు

వడి వీచుగాడ్పున కొండలెల్లఁ దలలు
వడఁ జేయుబసవ! నీకొండలెల్ల భక్తి
'బసవా' యనఁగ విన్నఁ బాన లొండేల ?
పసులకునైనను బ్రబలదే భక్తి ?
'బసవా' యనఁగ విన్నఁ బాన లొండేల ?
పసిబాలురకునైన నెసఁగదేభక్తి
'బసవా' యనఁగ విన్నఁ బాన లొండేల ?
యసమాత్మునకునైన నలరదే భక్తి
"బసవా" యనెడిభక్తిపరులఁ జూచినను
నెసగుపత్నులకైన నింపదే భక్తి
"బసవా" యనెడు భక్తిపరులచేరువను
మసలు జంతువులకు నెసఁగదేభక్తి
"బసవా" యనినఁ జాలుఁ బానలొండేల ?
యసలార విషమైన నమృతంబుగాదె ?
"బసవా" యనినఁజాలుఁ బాన లొండేల ?
పసిగ మైఁగులిశంబు గుసుమంబుగాదె ?
"బసవా!" యనినఁ జాలుఁ బాన లొండేల ?
వసుధ శత్రులు మిత్రవర్గంబుగారె ?
"బసవా" యనినఁ జాలుఁ బాన లొండేల ?
వెసఁ గాలుకార్చిచ్చు వెన్నెలగాదె ?
లింగైక్యసౌఖ్యకేళీలోలభక్తి
జంగమప్రాణానుసంధానశక్తి
యుభయప్రసాదసంభోగోపభుక్తి

త్రిభువనంబుల నున్న దే యితరులకు''
నని పెక్కుభంగుల నగ్గింపుచుండ
ననుపక్తి నా బసవనకుమారుండు
మిక్కిలిసద్భక్తి మిక్కుటంబుగను
మ్రొక్కుచు నందంద మోడ్పుఁగే లమర
''భక్తవత్సల! పరాపర! పరమాత్మ!
ముక్తివల్లభ! దివ్యమూర్తి! సర్వజ్ఞ!
ప్రభువ! జంగమలింగ! ప్రమథాగ్రగణ్య
ప్రభువ! సంగయదేవ! పరమానురాగ!
కారుణ్యనిధి! సమగ్రత సూపి నీకు
నారగింపఁగ బెట్టునంత భక్తుఁడనె?

పార్వతి ప్రమథులకు విందువెట్టు కథ

కైలాసమునఁ దొల్లి గఱకంఠుఁ గొలువ
శైలేంద్రకన్యక సనుదెంచునెడను
మూరారి యట్ల ప్రమథవర్గమెల్ల
నారంగ సారూప్యధారులై యున్నఁ
బరమేశుఁ డెవ్వఁడో ప్రమథు లందెవ్వరో?
యరుదెంచి యెఱుఁగలే కంబిక నిలువఁ
బార్వతిసందేహభావన యెఱిఁగి
పార్వతీశుఁడు దక్కఁ బ్రమథు లాత్మనము
తమతమ తొంటిరూపములు వోవిడిచి
రమణ నొండొండురూపములు పొల్పార
గోమేష వానరకుక్కుటముఖులు

సామజశరభోష్ట్ర శార్దూలముఖులు
మహిషాశ్వసారంగమార్జాలముఖులు
నహికేసరి వరాహవిహగాదిముఖులు
ద్విముఖచతుర్ముఖ త్రిముఖైకముఖులు
నముఖపంచముఖసహస్రాదిముఖులు
లంబోష్ఠలంబాక్షలంబనాసికులు
లంబోదరులు నతిలంబకర్ణులును
గజకర్ణ లజకర్ణ లజితకర్ణులును
విజయఘంటాకర్ణ వీరకర్ణులును
బాహూరుముఖులును బాహూరుతనులు
బాహూరుపాదులు బాహువక్త్రులును
బహుబాహుబహుపాదబహుతాలుజిహ్వా
బహువర్ణబహుకర్ణబహురూపధరులు
నై యున్న ప్రమథగణానేకకోట్ల
నాయంబ గని యద్భుతాక్రాంత యగుచు
నతులితనిజసహజాకృతి నున్న
పతికి మ్రొక్కుచును సంస్తుతిపూర్వకముగ
"విను ప్రమథాధీశ ! వీరలందఱును
దనమనోధర్మంబు దారి క్లైటింగి
కామరూపంబు సక్కఁగఁ దాల్చి రొప్ప
నీమహా గణముల కెల్ల నీతఁణామ
పెట్టుదు విందు సంప్రీతిమై భక్తి
పుట్టెడునట్లు విభూతు లిప్పించి

యరిగి మహాకాశ మనియెడి బయలఁ
బరగఁ దత్త్వములను పందిరుల్ వెట్టి
యవికలాజాండంబు లను భాండములను
వివిధపక్వాన్నాదివితతులు గూర్చి
భవ్యకల్పద్రుమఫలపల్లవములు
దివ్యామృతంబునఁ దివుటఁ దాలించి
క్షీరేక్షురసదధిఘృతవార్ధికోట్ల
క్షీరేక్షురసదధిఘృతములు నిలిచి
యకలంకరసరసాయనములు గూర్చి
సకలదీర్ఘికల వాసనచేసి కలపి
మఱియుఁ జింతామణిమందిరభిత్తిఁ
దఱిఁదఱి బదపదార్థములు సిద్ధించి
సురభిసహస్రసుస్థిరజన్మదేశ
వరదివ్యలోచన వలయువస్తువులు
వెండియు సమకూర్చుచుండంగఁ బ్రమథ
మండలి ప్రమథకుమారు నొక్కరుని
"యరయుమా యవసరం బయ్యెనో కాదో ?
గిరిజాలయంబున కరిగి నీ'' వనుడు
"నవుఁగాక'' యనివచ్చి యంబికఁ గాంచి
"యవసరం బే''యనియడుగఁగ దడవఁ
"బ్రమథుల నిట్టున్నభంగిఁ దో డ్తెమ్ము
ప్రమథకుమార ! వేపరువున'' ననుడు
"నొక్కింత వెట్టిన నొగి నారగించి

గ్రక్కునఁ దోఁ డ్తెత్తు గణముల నెల్ల
నరుగంగఁ జాల నిట్లాఁకొని" యనుడు
సరసర లింగావసరముఁ జెల్లించి
సొంపార గిరిజ వడ్డింప వడ్డింపఁ
బొంపిరి నోగిరంబులు పదార్థములు
కులపర్వతంబులంతలు గళ్ళు సేసి
నలి నారగింపంగఁ గలపదార్థములు
నోగిరంబులు సమయుడు వెఱఁగంది
యాగౌరి యత్యద్భుతాక్రాంత యగుచు
"నెన్నంగఁ బ్రమథులకెల్లఁ గావించి
యున్నపదార్థంబు లోగిరంబులును
మానుగాఁ బ్రమథకుమారుఁ డొక్కఁడ
తా నారగించెఁ జిత్రముసిత్ర! యింక
నేమిసేయుదు" నంచు నీశ్వరుకడకు
హైమవతీదేవి యరుదెంచి మ్రొక్కి
తలవాంచియున్నెడ దరహాసదీప్తి
వెలయంగఁ బ్రమథుల వినుతి సేయుచును
"గౌరి! యిం దొకసిట్టిగణ మిట్టివాఁడు
తోరంబు గణములగౌరవం బెట్టి
లవు 'నసంఖ్యాతా స్సహస్రాణి" యనుచు
భువి "నేవ మేత న్నిబోధత" యనుచుఁ
దొడఁగి వేదములు సంస్తుతి సేయఁ బోయి
నసుఁకుచు వడవడ వడఁకెడి నేఁడుఁ

గావున బ్రమథు లక్షయు లనపాయు
లావిర్భవన్మహిమాఢ్యు లద్విజులు
నవ్యయు లనుపము లమరు లక్షరులు
దివ్యులు భవ్యులు ద్రిభువనస్తుతులు
సుభగులు సుగుణులు సుమతులు శూరు
లభవు లప్రతిము లత్యానందయుతులు
వేదాంతవేద్యులు విశ్వైకనుతులు
నాదికారణు లణిమాదిసద్గుణులు
లింగాంశు లయ్యాదిలింగసంభవులు
లింగమూర్తులు మహాలింగైకతనులు
లింగాశ్రయులు ప్రాణలింగసంగతులు
లింగసదర్థులు లింగానుభవులు
లింగగంభీరులు లింగకారణులు
లింగవ్రతస్థులు లింగచేతనులు
లింగవినోదులు లింగసంచయులు
లింగావధానులు లింగాత్మసుఖులు
లింగాభిమానులు లింగశాసనులు
లింగసత్ప్రాణులు లింగతత్పరులు
సర్వశుభోదయుల్ సర్వాధిపతులు
సర్వసంపూర్ణులు సర్వకారణులు
వేయేమి ? ప్రమథుల కాయంబు మాకు
గాయంబుగా కొండుగాయంబు గలదె ?
యని చెప్పి ప్రమథునియచ్చు నజాండ

సందోహములు సెకు జనియించు నిలుచు
నదిగాక హరివిరించాది దేవతలఁ
గుదియింతు రనుటెల్ల నిది యెంత పెద్ద
తప్ప కిందొక్కఁడు తెప్పపెట్టుడును
నప్పుడ సర్వసంహారమా ననినఁ
గావున వర్ణింపగా నగోచరము
భావించి చూడ మాప్రమథులమహిమ''
యనుచుఁ బ్రశంసింప నంబికాదేవి
సంచితమానసాశ్చర్యయై యుండె;
నట్టి పార్వతియు మున్నారగింపంగఁ
బెట్టఁ జాలదు విందు విన్నపానికి
దేవ! దేవస్తుత్య! దివ్యలింగాంగ
భావనాతీత! సద్భావసన్నిహిత!
శంకర! దురితభయంకర! శౌరి
పంకజప్రభవాదికింకరోల్లసిత!
శుభకర! చిన్మయ! జ్యోతిస్స్వరూప!
ప్రభువ! పరాపర! భక్తవత్సలుఁడ
సర్వకల్యాణ! సంసారవిదూర!
సర్వజ్ఞ! జియ్య! సాక్షాత్సంగమేశ!
నెట్టన నిష్ఠించి నీ శారగింపఁ
బెట్ట నాశక్యమే? పృథుదయా భావ!

అల్లమప్రభువు బసవనికి వరము లిచ్చుట

యనుచుఁ బ్రశంసింప నల్లమ మెచ్చి
వినుతదయామృతవనధి నోలార్చి
"సురభి చింతామణి సురభూరుహములు
వరవులై యుండంగ వరమీఁగి యెంత
వెద్ద నా" కనుచు సంప్రీతి సిత్తమునఁ
దద్ద సంధిలఁ బ్రసాదము గృప సేసి
తలచిన పదపదార్థములు సేకూడ
వలె నన్న వస్తువు లిలఁ దాన పొందఁ
బలికిన బాసయుఁ బాటియై తనర
నిలిచినమార్గంబు నిలుకడ గాఁగఁ
బట్టినపదడైనఁ బసిఁడియై వెలిగె,

శివుడు తనహృదయమున బసవనిఁ జూపుట

ఆలోక మీలోక మన నేల బసవఁ
డేలోకమునను లే? డెల్లచో నుండుఁ
బ్రమథులయందు సద్భక్తులయందు
నమరంగ నాహృదయాబ్జకర్ణికను
సతతంబు గురులింగచర ములయందు
నతిముదమున నుండు నాదిబసవఁడు
అట్టాట కిటుసూడుమా"యని శంభుఁ
డిట్టలంబుగఁ దనహృదయంబుఁ దెఱవ
సంగతంబగు కరస్థలము లింగంబు
జంగమావలికిని వర నాను వరము

ననిమిషుఁడై చూచు హరుమీఁదిదృష్టి
గనుఁగవహర్షాశ్రుకణవితానంబు
దరహసితాస్యవిస్ఫురణయుఁ దనరఁ
బరమశివధ్యానపారవశ్యమునఁ
బద్మాసనస్థుఁడై పరమేశుహృదయ
పద్మంబునం దున్న బసవనిఁ జూచి
ప్రమథులు హర్షింప నమరులు మ్రొక్క
నుపబోటి యత్యద్భుతోపేతగాఁగ
నామూర్తిఁ గని సిద్ధరామయ్య యుద్గ
తామితానందపూర్ణాత్ముఁడై తనర.
హరుఁడు పర్వతపుత్త్రి నరవిరికంటఁ
బొరిఁ బొరిఁ జూచుచుఁ "బూర్ణేందువదన!

శివుడు పార్వతికి బసవనిమహిమ తెలుపుట

చూచితే! బసవనిసురుచిరమహిమ
యీచెల్వునిక్కడ యేరికిఁ గలదె?
వెలయఁగ నయ్యాదివృషభేంద్రుఁ డనఁగ
నలి నేన రెండుమూర్తులు ధరించితిని
విని "తవపుత్త్రో భవిష్యామి" యనుచు
నెనయ శిలాదున కేన పుట్టితిని
అసలార భక్తహితార్థమై యేన
వసుధ జనించితి బసవం డనంగ
నెసఁగ నిట్టిదకాన యీశుండ నేన
బసవఁ డఁగేరి భక్తుండ నేన

మున్నును మన బసవన్న సద్గుణ మ
హోన్నతి యెఱుఁగవే యొగి నట్లుఁగాక
లోకాధిపతి నేను లోలాయతాక్షి!
ప్రాకటంబుగ లోకపావనుఁ డితఁడు
కారణలోకసంహారుండ నేను
కారణలోకోపకారి యితండు
భక్తవత్సలుఁడ నేఁ బర్వతపుత్త్రి!
భక్తరత్నములకు బండారి యితఁడు
భక్తైకదేహుండ భావింప నేను
భక్తజనప్రాణి బసవఁ డీక్షింప
ముక్తికి రాజఁజూ ముద్దియ నేను
భక్తికి రాజసూ బసవఁ డీక్షింపఁ
బసరింప నే లింగపట్టబద్ధుండ
బసవండు సద్భక్తిపట్టబద్ధుండు
అచరలింగంబ నే నచలేంద్రతనయ!
సచరాచరక్షోణిఁ జరలింగ మితఁడు
సనునాది నాపేరు శంభుం డనంగఁ
బొనర ద్వితీయశంభుఁడు వీనిపేరు.
స్థిరభక్తి మమ్ముఁ గొల్చినఁగాని లేదు
ధర వీనిఁ దలఁచినంతనె ముక్తి గలదు.
అలరుచుఁ బ్రాణదేహార్థముల్ నాకు
నిల నిత్తు రఖిలభక్తులు నొక్కయెడను
నచ్చుగాఁ బ్రాణదేహార్థముల్ బసవఁ

డిచ్చుచునుండుఁ దా నెల్లభక్తులకు
నాయతమతి బసవా యనఁబరగు
నీయక్షరత్రయం బిట్లొక్కమాటు
సదువు నాతని ముఖసదనంబు నందె
కదలకుండుదుము మాగణములు నేము
పొదలు నెవ్వని యాత్మ నుదితసద్భక్తి
యదియ బసవని మహత్త్వంబ కాదె
పరికింప నెవ్వఁడు వడయుఁ బ్రసాద
పరముక్తి యది బసవనికృప గాదె
మదిలోన నెవ్వఁడు మముఁ దలపోయు
నదియెల్ల బసవనియంశంబ కాదె
పసరించు జంగమభక్తి యెవ్వండు
వసుధలో నది బసవనివృత్తి గాదె
భక్తిపట్టము దాల్ప బసవఁడు దక్క
శక్తిసమేతులు జగతిపైఁ గలరె
యది గాక యొక్కనాయందేల భక్త
హృదయస్థుఁడై చూడ నిట్లున్న వాఁడు
అంచు వెండియుఁ బ్రస్తుతించుచు శంభుఁ
డంచితమతి బసవయ్య కిట్లనియె
"బసవ! మర్త్యమునందు భక్తులు గలరె!
యెసకమై సంసార మిష్టమే నీకు?"
నని యానతిచ్చుడు నద్దేవు హృదయ
వనజస్థుఁడగు బసవం డిట్లనియె

"మందునకై నను మర్త్యలోకమున
నిందుశేఖరుభక్తుఁ డెందును లేఁడు
భక్తుండ నేన చూ భక్తు లిందఱును
భక్తాత్మ ! మీస్వరూపంబ కావునను
వెండియుఁ గల దొక్కవిన్నపం బింకఁ
జండేశవరద ! ప్రసన్నత వినుము
జంగమలింగప్రసాదోపభోగ
సంగతసుఖసుధాశరధి నోలాడు
నిటువంటిభవము లెన్నేనియు లెస్స
యిట యపవర్గమహిమ్మశతకంబెఁ
గావున శునకసూకరక్రిమికీట
కావహాజన్మంబు లైనఁ గానిమ్ము
సుప్రసిద్ధము జంగమప్రసాదంబ
యేప్రొద్దు భోగింప నెట్లు గల్గినను
జాలుఁబో భవకోటిశతసంఖ్యలందు
నోలి నన్ బుట్టింపు మొకటియు నొల్ల"
ననవుడు గౌరీశుఁ డతిదయాదృష్టిఁ
గనుఁగొని సిద్ధరామునకుఁ జూపుడును
శివునకు మ్రొక్కుచు సిద్ధరామయ్య
భువికి నేతెంచి యద్భుతము నొక్కఁగ
భక్తసమూహికి బసవయ్యమహిమ
వ్యక్తిగాఁ జెప్పంగ నట్ల నేవింటి"
ననవుడు బిజ్జలుఁ "డట్లు లౌటకును

జనులకునెల్ల దృష్టం బిప్పుడిదియ''
యనుచు నమూల్యవస్త్రాభరణములఁ
బొనరంగఁ గాళవ్వబోయిని గొసఁగి
''యవికలాజాండతత్త్వాత్మకుఁడైన
శివుఁడు గరస్థలాసీనుఁడై యుండ
సర్వగతుండైన శంభుభక్తునకు
సర్వగతత్వంబు సహజంబ కాదె
సర్వమయుండైన శర్వుభక్తునకు
సర్వమయత్వంబు సహజంబ కాదె
దూరేక్షణంబును దూరశ్రవణము
దూరవిజ్ఞానసిద్ధులు మొదల్గాఁగ
నణిమాదిసిద్ధులు నభవుభక్తునకు
గణుతింప నెంత శ్లాఘ్యంబు దా'' ననుచు
సకలమానవులు మస్తకతటన్యస్త
ముకుళితహస్తులై మ్రొక్కుచునుండ
''నల్లవో'' యనుచు భూవల్లభుఁ డతులి
తోల్లాసచిత్తుఁడై యెల్లవస్తువులు
దట్టుఁడు బసవనదండనాయకున
కిట్టలంబుగఁ గట్టనిచ్చె సంప్రీతి
గురుభక్తిశృంగార ! గుణగణాధార !
వరదయాలంకార ! సురుచిరాకార !
ఖ్యాతగంభీర ! దుష్కర్మవిదూర !
గీతముఖోద్ధార ! ధూతసంసార !

అకుటిలచిత్త! శివాచారవేత్త!
ప్రకటతత్త్వాయత్త! ప్రవిమలవృత్త!
అజ్ఞానజైత్ర! యుదాత్తచరిత్ర!
విజ్ఞానపాత్ర! సంవిత్సుఖామాత్ర!
రూఢవ్రతోత్తుంగ! రుచిరాంతరంగ!
గూఢప్రసాదాంగ! గొబ్బూరిసంగ!
ఇది యసంఖ్యాతమాహేశ్వరదివ్య
పదపద్మసౌరభభ్రమరాయమాణ
జంగమ లింగప్రసాదోపభోగ
సంగతసుఖసుధాశరధినిమగ్న
సుకృతాత్మ పాలుకురికి సోమనాథ
సుకవిప్రణీతమై శోభిల్లి తనరి
చరలింగఘనకరస్థలి విశ్వనాథ
వరకృపాంచితకవిత్వస్ఫూర్తిఁ బేర్చి
చను బసవపురాణ మనుకథయందు
ననుపమంబుగ ద్వితీయాశ్వాసమయ్యె.



## రంగనాథరామాయణము – సుందరకాండము

### హనుమంతుఁడు సీతను జూచుట

... ... ... "భూమిజఁగానక బుద్ధిలోవగచి
యినవంశవల్లభు డేకతంబునను
మునునన్నురమ్మని ముదమొప్పఁబిలిచి
జనకజఁబొడగానఁ జాలుదువీవ
యనిచెప్పి నాచేతి కానవాలిచ్చెఁ
బనిబూనివచ్చితి బంటనై యేను
గనుగొనలేనైతిఁ గమలాక్షి నెందు
నీదుకాత్మ్ముఁడు సీత నిటఁదెచ్చుచోట
వేదనఁ బ్రాణము ల్విడిచెనో యింతి
యంబరగతి భీతి సరుసెంచుచోట
నంబుధిఁబడియెనో యసుర చేఁదప్పి
యిచ్చటిదనుజుల వీక్షించిబెదరి
చచ్చెనో విరహాగ్ని సమసెనో లేక
కమలాక్షి నొరులకుఁ గానరాకుండ
భ్రమపెట్టి మాయలుపన్నెనో వీఁడు
ఒండు దేశంబుల నునిచెనో గాక
దండించిచంపెనో తరలాక్షి నసుర
యేమని మగుడుదు నేమందుబోయి
యేమిసేయుదు నింక నెటమీఁద నేను

వామాక్షిఁగానక వచ్చితిననిన
రాముఁ డప్పుడె పాయుఁ బ్రాణవాయువుల
నన్నకై సౌమిత్రి యడఁగు నీవార్త
విన్నంత భరతుండు విడుచుఁ బ్రాణముల
నతనికై శత్రుఘ్నుఁ డఖిలబాంధవులు
హతులౌదు రినవంశ మంతట సమయ
నదిచూచి సుగ్రీవుఁ డా యంగదుండు
మొదలైన కపివంశమును నాశ మొందుఁ
గాన వానప్రస్థగతి మహాటవుల
నేను గాపుండుదు నిదియుఁగాదేని
పొదఁబేర్చుకొని యగ్నిఁజొత్తు నొండేని
యుదధులఁబడి చత్తు నుసుఱాసదక్కి
యక్కట సంపాతి యాడినమాట
నిక్కంబుగా నమ్మి నీరధిదాఁటి
యిచ్చటి కొంటిమై యేవచ్చుటెల్ల
నచ్చుగా వృథయయ్యె నాఁగాక యేమి
త్రిదశులతోఁగూడఁ దెగువమైఁ బేర్చి
త్రిదశేంద్రుఁబట్టి బాధింతునొండేని
చెలఁగి కీలలతోడ శిఖి నీటముంచి
యిలఁద్రొబ్బి ప్రభలుపూ యింతు నొండేని
క్రందుగా జముని గింకరులతోఁబట్టి
డెందంబు పగుల దండింతు నొండేని
చల మొప్ప నిరృతి రాక్షసులతోఁగూడఁ

బెలుకుఁబట్టి నొప్పింతు నొండేని
వారి రాసులతోడ వరుణుగాలించి
ధీరత గలఁచి సాధించు నొండేని
కరువలి నయ్యేడు గాడ్పులఁబెనఁచి
కెరలి యందంద శిక్షింతునొండేని
నలిరేఁగి ధనదుఁ గిన్నరులతోఁబట్టి
చెలువేది కూల భర్జింతునొండేని
యెనయఁ బ్రమథులతో నీశానుఁబట్టి
చెనసియొండొండ నిర్జింతునొండేని
కులలంబు గిరులతోఁ గుమ్మరసారె
గతిఁద్రిప్పిత్రిప్పి యుక్కడఁతునొండేని
యీలంక దైత్యుల నీయబ్ధిముంచి
లీలమైఁగలఁచి కాలింతునొండేని
యే నింతచేసిన నెల్ల దేవతలు
నానతులై వచ్చి యతివఁ జూపెదరు
కాకున్న రాఘవు లక్కరుణమైఁదామె
యీకీడు వల దని యింకమాన్పెదరు"
అని నిశ్చయముచేసి యామేడశిఖర
మనిలనందనుఁ డెక్కె నాసమీపమున
వాయువు నెండయు వడిఁజొరరాని
యాయశోకవనాంతరాపళిలోన
నెలమి జొంపిరివోయి హేమవర్ణమున
విలసిల్లుశింశుపా వృక్షంబుక్రింద

వ్రతములఁగడు డస్సి వనటలఁగ్రుస్సి
యతిదుఃఖములఁగుంది యాత్మలోఁగంది
విపులాశ్రువులఁ దోఁగి విరహాగ్నిఁగ్రాఁగి
కపటవృత్తులఁజిక్కి కడుముట్టసుక్కి
జీవంబుపై రోసి చెలువంబుఁ బాసి
యావిధి మది దూల నలసత మీఱి
చెక్కుటఁజెయిఁజేర్చి చింతల కోర్చి
దిక్కు లేమిదలంచి ధృతి దీఱడించి
యినరశ్మి వాడిన యెలదీఁగెఁబోలె
ఘనధూమయుత దీప కళికయుఁబోలె
జలదమాలికలోని శశికళవోలెఁ
బలుమంచుపొదివిన పద్మినివోలె
చెలఁగి పిల్లులలోని చిలుకయుఁబోలె
బులులలో నావును బోలె దుర్వార
ఘోరరాక్షసవధూ కోటిలోనున్న
నారీశిరోమణి నలినాయతాక్షి
మలినాంగి యలివేణి మాతంగగమన
కలితభూషణజాల గద్గదకంఠి
జనితోష్ణనిశ్వాస సతతోపవాస
జనకతనూజాత జగదేకమాత
నిఖిలసన్నుతపూత నిర్మలఖ్యాత
యఖిలగుణోపేత యయినయాసీతఁ
బొడగని సీత గాఁ బోల్చుఁ బొమ్మనుచు

గడుభక్తి రామలక్ష్మణులకు మ్రొక్కి
కడువేడ్క సురలను గడఁగివేఁడుచును
నడరెడు ముదమున నామేడ డిగ్గి
మదినుబ్బి యంగుష్ఠ మాత్రుఁడై కదిసి
పదిలుఁడై యాశింశుపావృక్ష మెక్కి
బాలుఁడై యల వటపత్రంబునందు
వేలీలఁ గ్రీడించు విష్ణుండుపోలె
శాఖామృగేంద్రుండు జడిగొన్న దాని
శాఖలలోడాఁగి చతురుఁడై యుండి
పావనచరితుఁ డా పద్మాయతాక్షి
భావించి భావించి పలుమాఱుఁజూచి
కడఁకతోఁ బుష్యమూకమునందుఁగన్న
తొడవులు నీయున్న తొడవులుఁజూడ
నేకప్రకారంబు లీపద్మనయన
శాకుత్స్థుసతి సీతగాఁబోలు ననుచు
మఱియునుబరికించి మారుతాత్మజుఁడు
నెఱసినబుద్ధిమై నెలఁత నీక్షించి
శ్రీరాముఁ డానతిచ్చినప్రకారమున
నారమణీమణి యవయవశ్రీలు
కర్ణవేష్టనములు కరకంకణములు
స్వర్ణాంబరంబును సరిఁబరికించి
వలవంతఁబడిక్రేఁగు వారిచిహ్నములు
వలనొప్పఁగల పతివ్రతల చిహ్నములు

చదురాంధ్రులగు మర్త్యసతుల చిహ్నములు
చెదరకన్నియుఁజూచి చింతించిమఱియు
గొనకొనిరాముఁ బేర్కొని ప్రలాపింపఁ
గనుఁగొని మఱిసీతగానిశ్చయించి
యావిన్నఁగుమోము నాకృశాంగంబు
నావిరిసినవేణి యాయున్నయునికి
యాదురవస్థయు నావిలాపంబు
నాదైన్యమునుజూచి యాత్మ శోకించి
చంద్రునిఁబాసిన చంద్రికరీతిఁ
జంద్రాస్య యారామచంద్రునిఁబాసి
యుండునేయీయింతి నోగిఁబాసిరాముఁ
డుండునేయిది చోద్యమూహించినాఁడఁ
గులశీలదాక్షిణ్య గుణవయోధర్మ
లలితరూపము లొక్క లాగొటఁజేసి
యారామవిభున కీయంగనామణియు
నీరామ కారామనృపతియుఁదగును
ఈకాంతకై కాదె యినకులేశ్వరుఁడు
శ్రీకంఠువిలుఁద్రుంచెఁ జెఱకుచందమునఁ
దొలుతఁ బట్టినయంత ద్రుంచె విరాధు
నలిఁగోసె నాశూర్పణఖముక్కుచెవులు
ఖరదూషణాదిరాక్షసుల ఖండించె
మరణంబు నొందించె మారీచు నీచు
వాలినొక్కమ్మున నదియించి కపుల

నాలుగుదిశల కున్న తళక్తినని చె
వారిలోపల బలవంతుఁడననుచు
నారూఢగతి నంగదాదులఁగూడి
ఘనపుణ్యనిధియైన కాకుత్స్థునెదురఁ
బనిఁబూనివచ్చితిఁ బంతంబుమెఱసి
నాపుణ్యవశమున నాకోరినట్టు
లీపుణ్యవతిఁగంటి నిచ్చోట వచ్చి
దారుణాసురవధూతతి నట్టనడుమఁ
గారణాకృతిఁజిక్కి కలఁగుసీసతికి
నెబ్భంగిఁజూపుదు నింకనారూపు
నెబ్భంగిభాషింతు నీయింతితోడ
నెబ్బంగినూరార్తు నీపుణ్యసాధ్వి
నెబ్భంగినిబ్భంగు లెఱిఁగింతు బతికి
నని యిట్లు చింతించె
... ... ... దనుజుల చేతిబాధల జాలనలసి
తనదిక్కు లేమికిఁ దరలాక్షివగవ
సుదతిచిత్తములోని శోకంబుమాన్ప
నిది నాకుఁదఱియని యిచ్చఁజింతించి
రవికులక్రమమును రామపౌరుషము
వివిధభంగుల వేడ్క వినుతిసేయుచును
ద్రుమానిమీదనెయుండి మారుతాత్మజుఁడు
వానరభాష గీర్వాణభాషయును
ఈన్నాతిమెఱుఁగునో యెఱుఁగదోయనుచు

మానవభాషల మగువ కిట్లనియె.
"ఓమహీనందన యోపుణ్యసాధ్వి
యీమెయిశోకింపనేటికి నీకు
మగువ నీవిభుఁడు సేమముగనున్నాఁడు
జగదేకనిధి రామజనపాలవిభుఁడు
వనధిబంధించి రావణు సంహరించి
నినుఁ దోడుకొనిపోవు నిక్కమీపలుకు
సహజన్ముఁడైన లక్ష్మణుఁడు తన్గొలువ
మహనీయమహిమతో మాల్యవంతమున
నున్నాఁడు కపిసేన లొగి ననేకములు
తన్నర్థిఁగొల్వఁగా దశరథాత్మజుఁడు."
అనవుడు నిదియొక్క యాకాశవాణి
యని శింశుపావృక్ష మవనిజ చూడఁ
బన్నిననీలాభ్రపటలంబులోనఁ
గ్రొన్నెలగతి మెఱుంగునుబోలెఁజూడ
సన్నమైయామ్రాని శాఖలనడుమ
నున్న మర్కటరూప మొయ్యనఁగాంచి
కలలోనఁబ్లవగంబుఁ గంటి నేననుచుఁ
గలఁగి యాకలకీడు కాకుత్స్థజులకుఁ
గాకుండుఁగాకంచు ఘనుల దేవతల
నాకాంత గొనియాడి యటఁ దెలివొంది
కంటకాసురకోటి గారించుకతనఁ
గంటికి నిదురవే [illegible]

గాన నిద్దుర లేని కలయొందుఁగలదు
పూని యింకొకసారి పోలంగఁజూతు
నని తనవదనాబ్జ మల్లననెత్తి
హనుమంతు మఱియును నందందచూచి
యెందుండి వచ్చెనో యీమ్రానిమీఁది
కెందును గడుఁజిత్ర మిదియొక్కకోఁతి
దెలుపొప్ప నరుఁడుభా షించుచందమున
నలినాప్తకులము నానాథుసేమంబు
నలవడఁదెలుపుచు నమృతంబు లొలుకఁ
బలుమాఱు ప్రియములు పలుకుచున్నదియు
వానరజాతి కీ వార్తలుగలవె
నానావిధంబుల నాకుఁజింతింప
కడఁగి రాక్షసమాయ గాఁబోలుననుచుఁ
బడఁతి యూరకయుండెఁ బ్రతిభావలుడిగి.
అనిలనందనుఁ డంత నవనీతనూజ
మనసులోఁదన్ను నమ్మమిఁజూచి యెఱిఁగి
యాతరు వటుడిగ్గి యతిభక్తియుక్తి
నాతికి దండప్రణామము ల్సేసి
కరములు మోడ్చియో కల్యాణినన్నుఁ
బరికింపు మేను నీ పతిగూర్చుబంట
జనపతి నీకు విశ్వాసంబుపుట్టు
నని యిచ్చిపుత్తెంచె నంగులీయకము
అని చూపి మ్రొక్కి నవనీతనూజ

హనుమంతుఁగనుఁగొని యతని కిట్లనియె.
అడ రెడుదనుజమాయలనునుమ్మలపు
టుడుకులఁబడి[వేఁగుచుండుదుఁగాన
ననఘాత్మ! రఘురాముసంగుళీయకము
గనియు విశ్వాసంబుగలుగదు నాకు
నీవెవఁడవు మఱినీకుఁ బేరేమి
భూవరునకు నీకుఁబొం దెటులయ్యె
ఇనకులాధిపువేష మెట్టిది యతని
యనుజుండుసౌమిత్రి యతఁ డెట్టివాఁడు
గాకుత్స్థుఁడిప్పు డెక్కడనున్నవాఁడు
నీకునేమని చెప్పి నిన్నుఁబుత్తెంచె
నేచందమునవచ్చితీవార్ధిఁదాటి
నాచిత్తమూఱడ నాతోడఁజెప్పు
మని యొప్ప నడిగిన నవనినందనకు
హనుమంతుఁ డంతయునటఁజెప్పఁదొణఁగె.



## గౌరన – హరిశ్చంద్రోపాఖ్యానము

## పతివ్రత

(గౌరనమంత్రి 15-వ శతాబ్దమున జీవించియుండెను. రసము చిప్పిలు మనోహరమగు ద్విపదకవిత్వ మీతఁడు రచించెను. ఈతఁడు "నవనాథచరిత్రము" "హరిశ్చంద్రోపాఖ్యానము" అను ద్విపదకావ్యములనేకాక "లక్షణదీపిక" యను ఛందశ్శాస్త్రమునుగూడ రచియించెను. ఈతనికి "చతురసాహిత్యలక్షణ చక్రవర్తి" యను బిరుదు గలదు.

పాఠ్యాంశము హరిశ్చంద్రోపాఖ్యానమునుండి గైకొనబడినది. నక్షత్రకుఁడు చంద్రమతితో "నీవు హరిశ్చంద్రుని వీడివచ్చినచో లోహితాస్యునకుఁ బట్టము గట్టుదు" నని యాశపెట్టుటయుఁ జంద్రమతి యాతనికిఁ బతివ్రతా ధర్మములు బోధించుటయుఁ గలవు.)

అంత నక్షత్రకుం డా మహారాజు
కాంతాశిరోమణిఁ గాంచి దీవించి
"దేవి! నీదైన పాతివ్రత్యమహిమ
వేవేల తెఱఁగుల వినుతింప నరిది
యనల కీలావళి కాహుతినైన
ననుఁ బ్రాణములుగాచి నయమునఁ బ్రోచి
తీ క్షితిలో నీకు నీడుగా మొదలి
పతు మేర్పడగ లోపాముద్ర నెన్ని
యా యరుంధతిఁ జెప్పి యనసూయఁ బొగడి
శ్రీ యలరార శచీదేవిఁ దలఁచి
యలవడఁగొనియాడ నగుగాక యున్న
పొలతులు నీతోడఁ బురుడింపఁగలరె?
కరుణామై నీ యుపకారంబు నాకుఁ

బరగఁ జేసిన నీకుఁ బ్రత్యుపకార
మొనరఁ గావించెద, నొకమాట వినుము
చనువుమైఁ గౌశికసంయము వేడి
క్రమ్మఱ నాకుఁ గాఁ గైకొని రాజ్య
మిమ్ముల నీకిచ్చి యీ లోహితాస్యుఁ
బట్టంబు గట్టించుఁ బరఁగ నీముద్దు
పట్టిఁ దోడ్కొనుచు నీ పట్టణంబునకు
రమ్ము ; నీకిది పొందు ; రానవలదు
నమ్ముము కృపగాను నామాట యతివ !
ఎలమిమై నటుగాక యీరాజు వెంట
నలయక వర్తింప నాసించె దేని
వని హుతాశన మహాజ్వాలకరాళ
ఘనతర విస్ఫులింగముల నంగములు
గమరక పోవచ్చుఁగాక కల్పాంత
డమరు నిష్ఠుర ఢమఢమ రవస్ఫుటిత
పటుతర బ్రహ్మాండ భాండ చండీశ
చటుల రౌద్రాకృతి సమకొనఁ జేర్చు.
కటిల కౌశికు తీవ్రకోపాగ్ని శిఖలఁ
బెటపెటఁ బ్రేలక ప్రిదిలిపోవశమె ?
అదియును గాక నేఁడాదిగా నింకఁ
బదిదినంబులు సిక్కెఁ బలికిన మితికిఁ
మునినాథు ధనమెట్లు ముందటఁ జెల్లు
వెనుకఁ జెల్లిన దరవీసంబు లేదు

లే దుపాయం బింక లేశ మాత్రంబు
మేదినీపతి కిటమీఁద నూహింప
నొదవు పేరాఁకట నుదరి హుమ్మనుచుఁ
గదియు బెబ్బులివలె గాశికుఁ డలిగి
తడయక వచ్చి మాధనముఁ దెమ్మనుచు
నడిగి యట్టాని బిట్టదలించెనేని
కడువడి గర్భంబు గదలి కంపించి
సుడివడి నిన్ను నీ సుతుని నక్కఱకుఁ
బోయినంతట నమ్మిపుచ్చు భూవిభుఁడు
తోయజానన ! నాకుఁ దోచినబుద్ధి''
నావుడుఁ జిఱునవ్వు నవ్వి యా రాజు
దేవి నక్షత్రకు దెసఁజూచి పలికె
''సతి కేడుగడయును జర్చింపఁ బతియె ;
పతియచూ దైవ మెబ్బఁగుల సతికి
పతిభక్తి సతులకుఁ బరమ శీలంబు
పతిభక్తి సతులకు భాగ్యమూలంబు
పతిభక్తి సతులకుఁ బరమభూషణము
పతిభక్తి సతులకు భాగ్యపోషణము
పతిభక్తి సతులకు భయ నివారణము
పతిభక్తి నిఖిలశోభన కారణంబు
పతిభక్తి నింతికిఁ బడయంగరాని
యతులిత పుణ్యంబు లవి యెందుఁ గలవు
బలవంతమగు విధి ప్రాణేశుఁ బాప

వలవంత( జెందిన వర వధూమణికి.
భారంబు హారంబు, భాసురగంధ
సారం బసారంబు, సార కాసార
తీరంబు ఘోరంబు, తీవ్రసల్లాప
కీరంబు క్రూరంబు, కిన్నెరమంజు
నాదంబు ఖేదంబు, నవచంద్రకాంత
వేదులు సూదులు, వికసితోద్యాన
చూతంబు భూతంబు, సురభికస్తూరి
పూతలు రోఁతలు, పూర్ణచంద్రికల
మేలపులు వెలుపులు, మెత్తనిదూది
పఱుపులు మఱుపులు, పరభృతసమితి
కూతలు ఘాతలు, గోదమ తుమ్మెదల
మ్రోఁతలు వేఁతలు, ముద్దురాయంచ
మురువులు పరువులు, మోహంపుఁ జెలుల
సరసముల్ విరసముల్, చందనానిలపు
మెలఁకువ యలఁకువ, మేల్మి చెంగావి
జిలుగులు సిలుగులు, చివురుఁజప్పరపుఁ
బొంతలు చింతలు, పూఁబొదరిండ్ల
క్రొంతలు వంతలు, కమనీయ సరసి
బిసములు సుసములు, పృథుమకరంద
రసములు విసములు, రమ్యహిమాంబు
పూరంబుగాదు, కర్పూరంబు సేఁదు
వీరుండు మారుఁ డీ విధమునుగాక

ముదమునఁ గులశీలములు మదిఁగోరి,
బ్రదుకు పతివ్రతా రత్నంబులకును
బతిలేని రాజ్యసంపద లవి యేల ?
పతిలేని సుతులేల ? బంధువులేల ?
పతిలేని హితులేల ? ప్రాణంబులేల ?
మతిఁ దలపోయ, నీ మానవేశ్వరుఁడు,
నాకూర్మినిలుకడ, నాతోడునీడ,
నాకన్న పెన్నిధి, నానోముఫలము
నామేలి చెలికాడు, నాపట్టుగొమ్మ,
నామెచ్చు వలరాజు, నన్నేలు రాజు,
చిక్కనే కౌశికు చిక్కులఁ దగిలి,
వెక్కఱ వడుగ ! యీ వెడమాట లుడుగు,
నీవు గురుండును నిఖల నిర్జరులు,
వేవేల తెఱఁగుల వినుతులు సేయ
జగ మెఱుంగఁగ హరిశ్చంద్ర భూవిభుఁడు
నెగడు సత్యవ్రత నియతిఁ బెంపొంది,
వెలయ నష్టాదశ ద్వీప సంధులను,
నెలమిమైఁ గ్రమ్మఱ నేలు నిక్కముగ,
ననుటయుఁ 'నిది తథ్య' మని వినువీథి,
ననువొంద భాషించె నశరీరవాణి
యది విని మదిలోన నాశ్చర్యమంది,
కొదుపుచు నక్షత్రకుం డూరకుండె.

*

# ಟಿಪ್ಪಣಿ

ಅ

ಅಂಕಿಲಿ-ಅಡ್ಡಿ
ಅಂಗಡ-ಹಸಿವು
ಅಂಗನ-ಹೆಂಗಸು
ಅಂಗಾರವಮು-ಕೆಂಡ
ಅಂಚಯಾನ-ಹಂಸಗಮನೆ
ಅಚ್ಚೆರುವು-ಆಶ್ಚರ್ಯ
ಅಗಲು-ಭೇದಿಸು
ಅಂದಲವಮು-ಪಲ್ಲಕ್ಕಿ
ಅಜಗರವಮು-ದೊಡ್ಡಹಾವು
ಅಡಲು-ಶೋಕ
ಅಡಚನ-ಅಡ್ಡಿ
ಅದುರು-ಚಲಿಸು
ಅನರು-ದುಃಖ
ಅನಿ-ಯುದ್ಧ
ಅನುಪು-ಕಳುಹಿಸು
ಅನುವು-ಉಪಾಯ-ಅನುಕೂಲ
ಅನ್ನುವ-ಅಲ್ಪ

ಅನ್ಯಾಯಮು-ಅನ್ಯಾಯ
ಅರವಮರ-ಸಂದೇಹ
ಅರಿ-ಶತ್ರು
ಅರಿಗಾಪು-ಕಾವಲು
ಅರಿದಿ-ಅಶಕ್ಯವು
ಅರುಗು-ಜಗುಳಿ
ಅರುದು-ಆಶ್ಚರ್ಯ
ಅರುಪು-ಕೂಗು
ಅಲಸಟ-ಶ್ರಮ
ಅಲಜಡಿ-ಕ್ಲೇಶ
ಅಲರು-ವಿಕಸಿಸು
ಅಲವೋಕ-ಸ್ವೇಚ್ಛೆ
ಅಲುಕ-ಕೋಪ
ಅಲುಗು-ಕೋಪಿಸು
ಅವ್ವಾರಿ-ಅಧಿಕ
ಅಳುಕು-ಭಯ

ಆ

ಆಕಲಿ-ಹಸಿವು
ಆಕು-ಎಲೆ

ಆರಗಿಂಚು-ತಿನ್ನು
ಆರಟಪಡು-ಪರಿತಾಪಹೊಂದು

ಆಗಮು-ತಪ್ಪು
ಆಟಕಾಡು-ನರ್ತಕ
ಆಟಕತ್ತೆ-ನರ್ತಕಿ
ಆಡಿಕೋಲು-ದೂರು
ಆದಟ-ಪ್ರೀತಿ
ಆನವಾಲು-ಗುರ್ತು
ಆಮನಿ-ವಸಂತಋತು
ಆಮೆ-ಆಕೆ
ಆಮೆತ-ಹಬ್ಬ
ಆರಿವೇರವು-ಕಲಹ
ಆಱಡಿ-ವ್ಯರ್ಥ
ಆಱು-ಉಪಶಮನೆ
ಆಲವು-ಯುದ್ಧ, ಉಪೇಕ್ಷೆ
ಆಲಿ-ಭಾರ್ಯ
ಆಲಿಂಚು-ಕೇಳು
ಆವು-ಹಸು
ಆವುಲಿಂತ-ಆಕಳಿಕೆ

ಇ

ಇಂಗಲವು-ಕೆಂಡ
ಇಂಚುಕ-ಕೊಂಚ
ಇಂತಿ-ಹೆಂಗಸು
ಇಂತಿಯು-ಇಷ್ಟೇ
ಇಂಪು-ಆನಂದ
ಇಕ್ಕಡ-ಇಲ್ಲಿ
ಇಕ್ಕುವ-ಸ್ಥಳ
ಇಗುರು-ಚಿಗುರು
ಇಗುರುಬೋಡಿ-ಸ್ತ್ರೀ
ಇಚ್ಚಕವು-ಪ್ರೀತಿಯ ಮಾತು
ಇಚ್ಚಗಿಂಚು-ಇಚ್ಛಿಸು
ಇತವರಿ-ಹಿತವನ್ನು ಹೇಳುವನು
ಇದ್ದರು-ಇಬ್ಬರು
ಇಮ್ಮು-ಸ್ಥಾನ
ಇರವು-ಸ್ಥಾನ
ಇರುಕು-ಇಕ್ಕಟ್ಟು
ಇರುಗು-ಅಕ್ಕಪಕ್ಕದವರು
ಇಲ್ಲು-ಮನೆ
ಇಲುವರುಸ-ವಂಶಾನುಕ್ರಮ
ಇಸುಕ } -ಮರಳು
ಇಸುವು }

ಈ

ಈಂಕ } -ಪುಕ್ಕ
ಈಕೆ }
ಈಗನ್ನೊಣ
ಈಸು-ಈರ್ಷ್ಯೆ
ಈಸುಕಾಡು-ಈರ್ಷ್ಯೆಯುಳ್ಳವನು

ಈಲುಪು–ಪಾತಿವ್ರತ್ಯ
ಈಸಡಿಂಚು–ಕೋಪಿಸು
ಈಹಾಮೃಗವು–೧. ತೋಳ
೨. ನಾಟಕವಿಶೇಷ

ಉ

ಉಂಕಿಂಚು–ಪ್ರಯತ್ನಿಸು
ಉಂಕುವ–ಕನ್ಯಾಶುಲ್ಕ
ಉಂಡು–ಇರು, ನಿವಾಸಮಾಡು
ಉಕ್ಕಿರಿಬಿಕ್ಕಿರಿ–ಉಸುರಾಡದಿರುವ ಪರಿಸ್ಥಿತಿ
ಉಗ್ಗು–ಮಕ್ಕಳಿಗೆ ಹಾಕುವ ತಾಯಿಯ ಹಾಲು ಮತ್ತು ಹರಳೆಣ್ಣೆಯ ಬೆರೆಕೆ
ಉಗ್ಮಲಿ–ಸ್ತ್ರೀ
ಉಚ್ಚು–ನೇಣು
ಉಟ್ಟಿ–ನೆಲುವು
ಉಡುತ–ಅಳಿಲು
ಉತ್ತ–ಶೂನ್ಯವು
ಉತ್ತರಿಂಚು–ಕತ್ತರಿಸು
ಉತ್ತರುವು–ಆಜ್ಞೆ
ಉದ್ದಿ–ಸಮಾನ ;ಜತೆ
ಉದ್ದಿಕಾಡು–ಗೆಳೆಯ
ಉನಿಕಿ–ಇರುವುದು ; ಸ್ಥಳ
ಉಬುಸು–ಕೆಲಸವಿಲ್ಲವಿಕೆ
ಉಮುಕ–ಹೊಟ್ಟು
ಉಮ್ಮಡಿ–ಸ್ನೇಹ
ಉಮ್ಮಲಿಂಚು–ದುಃಖಿಸು
ಉಮ್ಮಲಿಕ–ದುಃಖ
ಉಮ್ಮಿ–ಎಂಜಿಲು
ಉಱುಕು–ಓಡು
ಉರುಮು–೧. ಗರ್ಜಿಸು
೨. ಗುಡುಗು
ಉಲಿಪಿ–ದುರ್ಮಾರ್ಗನು
ಉಲಿವು–ಶಬ್ದ, ಭಯ
ಉಲುಕು–ಭಯ
ಉಲ್ಲಮು–ಹೃದಯ, ಮನಸ್ಸು
ಉಸ್ಸೆತ್ತು–ನಿಶ್ಶೇಷವಾಗಿ

ಊ

ಊಕ–ಹೊಟ್ಟು
ಊತ–ಆಧಾರ
ಊಟ–ಊಲ
ಊರಕ–ಸುಮ್ಮನಿರುವುದು
ಊರುಕೊನಕ–ಸುಮ್ಮನೆ ಇರದೆ
ಊಸರಿಲ್ಲು–ಕೃಶಿಸು

ಊಪಿರಿ—ಶ್ವಾಸ
ಊಳ—ನರಿಕೂಗು

ಎ

ಎಂಗಿಲಿ—ಎಂಜಲು
ಎಂಚು—ಎಣಿಸು
ಎಂಡ—ಬಿಸಿಲು
ಎಂತ—ಎಷ್ಟು
ಎಂದರು—ಎಷ್ಟುಜನ
ಎಕಸೆಕ್ಕೆಮು—ಗೇಲಿಮಾಡು
ಎಕಿವಿಾಡು—ಅಧಿಪತಿ
ಎಕ್ಕಡ—ಎಲ್ಲಿ
ಎಕ್ಕುವ—ಹೆಚ್ಚು
ಎಗಯು—ನೆಗೆ
ಎಗುರುಲಾಡು—ಕುಣಿಯುವುದು
ಎಗ್ಗು—ಅಪಕಾರ
ಎಚಟ—ಎಲ್ಲಿ
ಎಟ್ಟಕೆಲಕು—ಹೇಗಾದರು
ಎಡಬಾಟು—ವಿರಹ
ಎಡನೀರು } —ಎಳೆನೀರು
ಎಳನೀರು
ಎಡರು—೧. ಆಪತ್ತು
೨. ಭಂಗ
ಎಡ್ಲು—ಎತ್ತುಗಳು
ಏತ್ತಿಕೋಲು—ಪ್ರಯತ್ನ
ಎತ್ತುಗಡ—ಉಪಾಯ
ಎದ—ಹೃದಯ
ಎದುರುಪಡು—ಭೇಟಿಯಾಗು
ಎನುವು—ಎಮ್ಮೆ
ಎರ—ಆಹಾರ, ತಿಂಡಿ
ಎಱಗು—ನಮಸ್ಕರಿಸು
ಎಱಚಿ—ಮಾಂಸ
ಎಱುಕ—ತಿಳುವಳಿಕೆ
ಎಱುಪು—ಕೆಂಪು
ಎಲುಗು ಕಂಠಧ್ವನಿ
ಎವರು—ಯಾರು
ಎಲರು—ಅತಿಶಯ
ಎಲ್ಲಿ—ನಾಳೆ
ಎವಡು } —ಯಾರು
ಎವ್ವಡು
ಎವ್ವತೆ—ಯಾರವಳು
ಎಸರು—ಮಿಾರಿಸು

ಏ

ಏಕತವು—ಆಲೋಚನೆ
ಏಡ್ಚು—ಅಳು

ಏಚು–ಬಾಧಿಸು
ಏಡುಗಡ-ಸಪ್ತವಿಧವಾದ ರಕ್ಷಣೆ (ತಾಯಿ, ತಂದೆ, ಗುರು, ಪುರುಷನು, ವಿದ್ಯೆ, ದೇವರು, ದಾತ)
ಏನುಗು-ಆನೆ
ಏಲಿಕ-ಅರಸ
ಏವಗಿಂಚು-ಅಸಹ್ಯ

ಐ

ಐದುವ-ಸುಮಂಗಲಿ (ಮುತ್ತೈದೆಗೆ ಐದು ವಿಧವಾದ ಅಲಂಕರಣವು–ಮಂಗಳಸೂತ್ರ, ಹರಸಿನ, ಕುಂಕುಮ, ಬಳೆ, ಬಿಚ್ಚೋಲೆ)
ಐಣೆಯಮು-ಜಿಂಕೆ ಚರ್ಮ
ಐಪು-ತಪ್ಪು
ಐಪೋವು-ಮುಗಿದುಹೋಗುವುದು

ಒ

ಒಂಟರಿ-ಏಕಾಕಿ
ಒಂಟೆಂಪು-ಅನುಕೂಲ
ಒಂಡು-ಒಂದು, ಅನ್ಯವು
ಒಕತೆ-ಒಬ್ಬಳು
ಒಜ್ಜ-ಉಪಾಧ್ಯಾಯ
ಒಡ್ಡಾಣಮು-ಡಾಬು
ಒನರಿಂಚು-ಮಾಡು
ಒಪ್ಪಮಿ-ಇಷ್ಟವಿಲ್ಲ
ಒಪ್ಪಾರು-ಒಪ್ಪು
ಒರುಡು-ಇನ್ನೊಬ್ಬ
ಒಜಟು-ಕಠಿನ
ಒಱಲು-ಒರಳು
ಒಲುಚು-ಅಪಹರಿಸು
ಒಲ್ಲಿಯ-ವಸ್ತ್ರ

ಓ

ಓಗಿರಮು-ಅನ್ನ
ಓಟ, ಓಟಮಿ }–ಭಯ
ಓಡು-ಅಪಜಯ
ಓರ್ತು-ಒಬ್ಬರು
ಓಲಗಮು-ಸಭೆ
ಓಲಲಾಡು, ಓಲಾಡು }–ಮುಳುಗು

ಔ

ಔಗಾಕ-ಹಾಗೇ ಆಗಲಿ
ಔಡು-ಕೆಳತುಟಿ
ಔದಲ-ತಲೆ

ಕ

ಕಂಕಟಿ-ಹೆಚ್ಚು
ಕಂಕಿ-ತೆನೆ
ಕಂಗಾರು-ಭಯ
ಕಂಚಿಯ } -ಬೇಲಿ
ಕಂಚೆ }
ಕಂಡಚಕ್ಕಾರ-ಕಲ್ಲುಸಕ್ಕರೆ
ಕಂದಕವು-ಕಂದಕ
ಕಂದುವ-ಮಾರ್ಗ
ಕಕಪಾಲ-ಸನ್ಯಾಸಿಗಳು ಧರಿಸುವ ಜಿಂಕೆ ಚರ್ಮದ ಚೀಲ. ಸಂ-ಕಕ್ಷಪಾಲೆ
ಕಟಿಕ-ಮಾಂಸ ಮಾರುವವನು
ಕನ್ಗೊನು } -ನೋಡು
ಕನುಗೊನು }
ಕನ್ನಾಕು-ವೀಳದೆಲೆ ಕಟ್ಟನಲ್ಲಿ ಮೇಲೆ ಇರುವ ಒಳ್ಳೆ ಎಲೆ
ಕಬುರು-ಸಮಾಚಾರ
ಕಮ್ಮನಿ-ಒಳ್ಳೆಯ
ಕಯಿವಾರವು-ಸ್ತೋತ್ರ ಮಾಡುವುದು
ಕಟುವು-ಕಾಠಿನ್ಯ
ಕಟ್ನವು-ಕಾಣಿಕೆ
ಕಡಗು-ಯತ್ನಿಸು
ಕಡಗಂಡ್ಲು-ಕಷ್ಟಗಳು
ಕಡತೇರು-ಸಮಾಪ್ತಿ
ಕಡಲಿ-ಸಮುದ್ರ
ಕಡವ-ಮಡಿಕೆ
ಕಡಿದಿ-ಆಪತ್ತು
ಕಡಿವಿ-ಹೆಚ್ಚು
ಕಡುಪು-ಹೊಟ್ಟೆ
ಕದಿಯು-ಹತ್ತಿರ ಬರುವುದು
ಕನುಕಲಿ-ನೋಟ
ಕುತ್ತುಕ-ಕತ್ತು
ಕುಪ್ಪಸವು-ಕುಬುಸ
ಕುರುಲು-ಕೂದಲು
ಕುರುವ-ಬೆಟ್ಟದ ಮೇಲಿರುವ ಕಾಲುದಾರಿ
ಕುಱುಚ-ಕುಳ್ಳ
ಕುಶಾಲು-ಸಂತೋಷ
ಕುಹನ-ಈರ್ಷ್ಯೆ

ಕಯ್ಯ್ಯಮು-ಜಗಳ
ಕರಗು-ದ್ರವಿಸು
ಕರಣಮು-ಶ್ಯಾನುಭೋಗ
ಕರಮು–ಕಯ್ಯಿ, ಬಹಳ, ಆನೆ ಸೊಂಡಿಲು
ರುಪು-ಕ್ಷಾನು
ಕರೇಣುವು-ಹೆಣ್ಣಾನೆ
ಕರಕಂಠುಡು-ಶಿವನು
ಕಱಕರಿ } -ಕಠಿನ
ಕಱಕು }
ಕಱಪು-ಬೋಧಿಸು
ಕಱಿ-ಕಪ್ಪು
ಕಱ್ಟಿ-ಅರ್ಜುನ
ಕಲತ-ಕ್ಷೋಭೆ
ಕಲಱುಕ-ಬೆರಕೆ
ಕಲ್ಲ-ಸುಳ್ಳು
ಕಲ್ಲರಿ-ಸುಳ್ಳು ಮಾತಾಡುವವನು
ಕವಱಲು-ದಾಳ
ಕಶೇರುಕ-ಬೆನ್ನೆಲುಬು
ಕಸರು-ಚಲಿಸು
ಕಸಿ-ಕೋಪ
ಕಸಿಡಿ-ಸ್ವಲ್ಪ
ಕಳ್ಳೆಮು-ಕಡಿವಾಣ

ಕೂತ–ಕೂಗು
ಕೂತುರು–ಮಗಳು
ಕೂಡಬೆಟ್ಟು–ಕೂಡಿಟ್ಟು
ಕೂಯಮು–ಕೂಗುವುದು
ಕೂರ್ಚುಂಡು–ಕೂತುಕೋ
ಕೂಳ–ಅವಿವೇಕಿ
ಕೂಳುಡು–ಕುತ್ಸಿತ
ಕೆಂದಮ್ಮಿ–ಕೆಂಪುತಾವರೆ
ಕೆರಲು–ಅತಿಶಯ
ಕೆಲವು–ಅನುರಾಗ
ಕೆಲಸಮು–ಕೆಲಸ
ಕೇಕ–ದೊಡ್ಡ ಕೂಗು
ಕೇರಡಮು–ಉಪೇಕ್ಷೆ
ಕೇರು–ಉತ್ಸಾಹ
ಕೇಲು–ಕೈ
ಕೇಳಿ–ಆಟ
ಕೇಳಿಕ–ನೃತ್ಯ
ಕೈಕೊನು–ಗ್ರಹಿಸು
ಕೈತ–ಕಪಿತ್ಥ
ಕೈದಂಡ–ಹಸ್ತಾವಲಂಬನ
ಕೈಮೋಡ್ಪು–ನಮಸ್ಕಾರ
ಕೈರವಮು–ಬಿಳಿತಾವರೆ
ಕೈವಡಿ–ಪ್ರಕಾರ
ಕೈಸೇಯು–ಅಲಂಕರಿಸು

ಕಾಂದಿಶೀಕುಡು- ಭಯದಿಂದ ಓಡುವವನು
ಕಾಟಕಮು-ಕ್ಷಾಮ
ಕಾಟುಕ-ಕಜ್ಜಲ
ಕಾತಾಳಮು-ಕೋಪ
ಕಾದಂಬಿನೀ-ಮೇಘಪಂಕ್ತಿ
ಕಾನನಿವಾಡು-ಕುರುಡ
ಕಾನುಪು-ಹೆರಿಗೆ
ಕಾರಾಕು-ಹಣ್ಣಾದ ಎಲೆ
ಕಾರು-ಕಾಡು
ಕಾಲುದ್ರುವ್ವ-ಕಲಹಕ್ಕೆ ಬರುವುದು
ಕಾವರಮು-ಗರ್ವ
ಕಾವಲಮು-ಪಾಪವು
ಕಾವಿತಾಲ್ಪು-ಸನ್ಯಾಸಿ
ಕಾವಲಿ-ಕಾವಲು
ಕಾವಿರಿ-ಕಪ್ಪು
ಕಾವುನ-ಆದ್ದರಿಂದ
ಕಿಟುಕು-ಕಪಟ
ಕಿನಿಯು-ಕೋಪಿಸು
ಕಿನ್ನರ } -ವೀಣಾವಿಶೇಷ
ಕಿನ್ನೆರ }
ಕಿಮುಡು-ಅಲ್ಪ
ಕಿಲಾತಮು-ಕುದುರೆ

ಕೊಂಕು-ಭಯ
ಕೊಂಗ-ಕೊಕ್ಕರೆ
ಕೊಂಚೆಮು-೧. ಕೊಂಚ
೨. ನ್ಯೂನತೆ
ಕೊಂಡ-ಬೆಟ್ಟ
ಕೊಂಡಾಡು-ಕೊಂಡಾಡು
ಕೊಂಡೆಕಾಡು-ಸುಳ್ಳು ಹೇಳುವವನು
ಕೊಂತ-ಕೊಂಚ
ಕೊಂದಲಮು-ಕ್ಷೋಭೆ
ಕೊಂಪ-ಮನೆ
ಕೊದಮು-ಮರಿ
ಕೊನಿಯಾಡು-ಹೊಗಳು
ಕೊಪ್ಪು-ಕೂದಲು ಮುಡಿ
ಕೊಮ್ಮ-ಸ್ತ್ರೀ, ಕೊಂಬೆ
ಕೊಮರಾಲು-ಯುವತಿ
ಕೊಮಾರಿ-ಮಗಳು
ಕೊಮಾರುಡು-ಮಗ
ಕೊರಡಾ-ಚಾವಟ
ಕೊಱಗಾಮಿ-೧. ಕೆಲಸಕ್ಕೆ ಬಾರದೆ ಇರುವುದು
೨. ದೋಷ
ಕೊಱುಕು-ಕಚ್ಚು
ಕೊಲನು-ಕೊಳ

ಕಿಲಾರವಮು—ದನದ ಗುಂಪು
ಕೀಡು-ಅಶುಭ, ಅಪಕಾರ
ಕೀತ—ನಿಕೃಷ್ಟ
ಕೀಲಕವಮು—ಮರ್ಮವು
ಕೀಶವಮು—ಕೋತಿ
ಕೀಸ—ಕೊಂಚ
ಕು—೧. ಕೆಟ್ಟ (ಕುಜನ, ಕುತರ್ಕ)
೨. ಭೂಮಿ (ಕುವಲಯ)
ಕುಂಚಿಯ, ಕುಂಚೆ —ಕುಚ್ಚು, ಚಾಮರವು
ಕುಂದು—ದುಃಖಿಸು
ಕುಂಡ—ಮಡಿಕೆ
ಕುಕ್ಕ—ನಾಯಿ
ಕುಕ್ಕಗೊಡುಗು—ನಾಯಿಛತ್ರಿ
ಕುಟ್ರ—ಕುತ್ಸಿತ
ಕುಡುಪು—ತಿನ್ನಿಸು
ಕುತಪಕಾಲವಮು—ದಿನದಲ್ಲಿ ಎಂಟನೇ ಒಂದು ಭಾಗ
ಕೊಲುವು—ಆಸ್ಥಾನ, ಸೇವೆ
ಕೊಸರು—ಇನ್ನೂ ಕೇಳು, ಪ್ರಾರ್ಥಿಸು
ಕೋಕಿಲ—ಕೋಗಿಲೆ
ಕೊಡಲು—ಸೊಸೆ
ಕೋನ—೧. ಮೂಲೆ ೨. ಕಾಡು
ಕೊಲ—ಕೋಲು
ಕೊಲೆವಮ್ಮು—ಬೆನ್ನೆಲುಬು
ಕೋವೆಲ—ಗುಡಿ
ಕೌಗಿಲಿ, ಕವುಗಿಲಿ —ಆಲಿಂಗನ
ಕೌನು—ಸೊಂಟ
ಕೌಶಿಕವಮು—ಗೂಬೆ, ಮುಂಗಸಿ
ಕೃಚ್ಛ್ರ—ಬೇಗ
ಕ್ರಮ್ಮರು—ಹಿಂತಿರುಗು
ಕ್ರಾಲುಗಂಟಿ—ಸ್ತ್ರೀ
ಕ್ರೇಪು—ಕರು
ಕ್ರೇಳ್ಳು—ಉನ್ನತಿ
ಕ್ರೊತ್ತ—ಹೊಸ
ಕ್ರೊನ್ನೆಲ—ಹೊಸ ಬೆಳದಿಂಗಳು
ಕ್ರೊವ್ವು—ಗರ್ವ

## ಗ

ಗಂಡಡು—ಶೂರನು
ಗಂಡವಮು—೧. ಆನೆ ಕೆನ್ನೆ
೨. ಆಪತ್ತು
ಗಾಸಿಪಡು-ಬಾಧೆಯನ್ನು ಹೊಂದು
ಗಿಲಿ—ಭಯ

ಗಂಡಾರು—ಜೈಲು
ಗಗುರುಪಾಟು—ರೋಮಾಂಚ
ಗಟ್ಟಿವ—ಧೂರ್ತ, ಮೋಸ
ಗಟ್ಟಿವಾಡು—ಸಮರ್ಥನು
ಗಡನ—ಲೆಕ್ಕ ಮಾಡುವುದು
ಗಡಪ—ಹೊಸಲು
ಗಡ್ಡಿ—ಕಸ
ಗಮಕಿಂಚು—ಯತ್ನಿಸು
ಗಮ್ಮತ್ತು—ವೇದಿಕೆ
ಗರಿ—ಗರಿ
ಗಲ್ಲಮು—ಕೆನ್ನೆ
ಗವಿ—ಗುಹೆ
ಗಾಟಮು—ಅಧಿಕವಾಗಿ
ಗಾಣ—ಹಾಡುಗಾರನು
ಗಾತಿ—ತಿಂಡಿ
ಗಾಡುಪು—ಗಾಲಿ
ಗಾಥ—ಚರಿತ್ರೆ
ಗಾರಾಬಮು—ಪ್ರೀತಿ

ಗುಂಡೆ } —ಹೃದಯ
ಗುಂಡೆಕಾಯ }
ಗುಪ್ಪಿಲಿ—ಹಿಡಿ
ಗುಬ್ಬ—ಸ್ತನ
ಗುಮಿ—ಗುಂಪು
ಗುವ್ವ—ಗುಬ್ಬಚ್ಚಿ
ಗೂಬ—ಗೂಬೆ
ಗೇಡೆ—ಎಮ್ಮೆ
ಗೇಸ್ತು—ಗೃಹಸ್ಥ
ಗೊಡವ—ಆಪತ್ತು
ಗೊನಕೊನು—ಯತ್ನಿಸು
ಗೊನಯಮು—ಬಿಲ್ಲಿನ ಧಾರ
ಗೋಮಾಯುವು—ನರಿ
ಗೋರು—ಉಗುರು
ಗೋಸ್ತನಿ—ದ್ರಾಕ್ಷಿ
ಗೌರ—ವ್ಯಾಪಾರಿ
ಗೌಳಿ—ಹಲ್ಲಿ

## ಚ

ಚಿಂದಮು—ಶಂಖ
ಚಿಗುರು—ಚಿಗುರು
ಚಿಚ್ಚು-ಬೆಂಕಿ
ಚಿಟ್ಟಿಜಟಿ—ಸಂಚಲಿಸು

ಚೆಱಗು—ಸೆರಗು
ಚೆಱುವು-ಕೆರೆ
ಚೆಲಿಕತ್ತೆ—ಸಖಿ
ಚೆಲಿಕಾಡು—ಸಖ

ಚಿತ್ತರುವು–ಚಿತ್ರ
ಚಿನ್ನಾರಿ-ಸೊಗಸಾದ
ಚಿನ್ನಿಯು–ಗುರುತು
ಚಿರಾಕು–ಕೋಪ
ಚಿರುತ–೧. ಚಿಕ್ಕಹುಲಿ
೨. ಚಿಕ್ಕದು,
ಚಿಲಿಪಿ–ಅಲ್ಪಸ್ವಲ್ಪ
ಚೀಕು–ಕುರುಡ
ಚೀರ–ಸೀರೆ, ವಸ್ತ್ರ
ಚೀರು–ಪರಚು
ಚೆಕ್ಕಿಲಿ–ಕೆನ್ನೆ
ಚೆಡ್ಡ–ಕೆಟ್ಟ
ಚೆನಟಿ–ಕುತ್ಸಿತನು
ಚೆನ್ನು–ಅಂದ
ಚೆಮಟ–ಬೆವರು
ಚೆಯಿದಮು-ಕೆಲಸ

ಚೆಲಿಯಲಿಕಟ್ಟ–ಸಮುದ್ರದ ದಡ
ಚೆಲ್ಲಿ–ತಂಗಿ
ಚೆವುಡು–ಕಿವುಡು
ಚೇಕೂಱು–ಲಭಿಸು
ಚೇದೋಡು–ಸಹಾಯ
ಚೇರುವ–ಸಮೀಪ
ಚೇವ–ಧೈರ್ಯ, ಸಾರವತ್ತಾದದ್ದು
ಚೋದ್ಯಮು–ಆಶ್ಚರ್ಯ
ಚದುವು–ಓದು
ಚಪ್ಪರಮು–ಚಪ್ಪರ
ಚುಟ್ಟಮುಲು–ನೆಂಟರು
ಚೊಕ್ಕು–ಪರವಶವಾಗುವುದು
ಚೊಚ್ಚು-ಪ್ರವೇಶಿಸು
ಚೋಟು–ಸ್ಥಳ
ಚೌಸಿತಿ-ಲಳ ಎಂಭತ್ತುನಾಲ್ಕು

ಜ

ಜನಾಭಾ–ಜನಸಂಖ್ಯೆ
ಜಿಗಟಿ–ಬಂಧನ
ಜಿತ್ತು–ಮೋಸ

ಟ

ಟೆಂಕಿ–ಸ್ಥಾನ
ಟೆಕ್ಕೆಮು–ಧ್ವಜ

ಡ

ಡಗ್ಗುತ್ತಿಕ–ಗದ್ಗದಸ್ವರ
ಡಿಂದು–ಅಡಗು
ಡಾಪಲ–ಎಡಗಡೆ

ತ

ತಕರಾರು—ವಿವಾದ
ತಗುಲಮು—ಆಸಕ್ತಿ
ತಟಮು—ದಡ
ತಡಕ-ತಡಿಕೆ
ತಡುಪು—ಒದ್ದೆ ಮಾಡು
ತನರು—ಹೆಚ್ಚಿಸು
ತಮಕಮು—ಮೋಹ
ತರಿತೀಪು—೧. ಕೋರಿಕೆ
೨. ಉಪೇಕ್ಷೆ
ತಲು—ಚಲಿಸು, ಹೋಗು
ತಟಿ—ಸಮಯ
ತಲಪು—ಆಲೋಚನೆ
ತಲಕೊನು—ಯತ್ನಿಸು
ತಲಗಡ—ದಿಂಬು
ತಲಪೆಟ್ಟು-ಪ್ರಾರಂಭಿಸು
ತಲಪೋತ—ಆಲೋಚನೆ
ತಲರು—ಚಲಿಸು, ಚಿಂತಿಸು
ತಲಿರು-ಚಿಗುರು
ತಲ್ಲಿ-ತಾಯಿ
ತಾಮರತಂಪರ-ಅಭಿವೃದ್ಧಿ
ತಾಮರಪಾಕು-ತಾವರೆ ಎಲೆ
ತಾಮಸಮು-ಆಲಸ್ಯ
ತಾರಸಿಲು-ಸಮೀಪಿಸು

ತಿಲಕಿಂಚು—ನೋಡು
ತೀಗ, ತೀವ —ಬಳ್ಳಿ
ತೀಪಿ-ಸಿಹಿ
ತುಂದುಡುಕು—ಸಂತಾಪ, ಕ್ಷೋಭೆ
ತುಂಪೆಸಲಾಡು-ಚಲಿಸು
ತೆಗಡು-ಉಪೇಕ್ಷಿಸು
ತೆಲಿಪಿಟ್ಟ—ಹಂಸೆ
ತೇನೆ—ಜೇನುತುಪ್ಪ
ತೊಂಡಮು—ಸೊಂಡಿಲು
ತೊಯ್ಯಲಿ-ಸ್ತ್ರೀ
ತೊಲಕರಿ-ವರ್ಷಾಕಾಲ
ತೊಲಕರಿಸೂಡು-ಹಂಸ
ತೋಕ-ಬಾಲ
ತೋಡೆಲು-ತೋಳ
ದೋಬುಟ್ಟು-ಸಹೋದರ ಸಹೋದರಿ
ತೋಡ್ತೋ-ಬೇಗ
ತೋಯಲಿ-ಸ್ತ್ರೀ
ತೋರಮು-೧. ಅಧಿಕ
೨. ವ್ರತದಲ್ಲಿ ಧರಿಸುವ ಧಾರ
೩. ಭಾರ

ತಿರವಮು-ಸ್ಥಿರ

ತ್ರೋವ-ಮಾರ್ಗ

ದ

ದಂಡುಗ-ನಷ್ಟ

ದಯ್ಯಮು-ದೆವ್ವ

ದವ್ವು-ದೂರ

ದಾದಾಪು-ಸಮೀಪ, ಅಂದಾಜು

ದಿನಕರುಡು-ಸೂರ್ಯನು

ದಿವಾಣಮು-ಸಭಾಸ್ಥಲಿ

ದೀಟುಕೊನು-ಸಮಾನ

ದುರಪಿಲ್ಲು-ಶೋಕಿಸು

ದೂಡ-ಕರು

ದೇವೆರಿ-ಅರಸನ ಪತ್ನಿ

ದೊಡ್ಡ-ದೊಡ್ಡ

ದೊಷಾಕರುಡು-ಚಂದ್ರನು

ದೊಷಾಚರುಡು-ರಾಕ್ಷಸನು, ಚಂದ್ರನು

ದೋಸಿಲಿ-ಬೊಗಸೆ

ನ

ನಂಜು } -ವಿಷ
ನಂಜುಡು }

ನಗರು-ರಾಜಗೃಹ

ನಟ್ಟಡವಿ-ಅರಣ್ಯಮಧ್ಯೆ

ನಡುರೇಯಿ-ಅರ್ಧರಾತ್ರಿ

ನನ-ಚಿಗುರು, ಹೂವು

ನನಯು-೧. ಚಿಗುರು,
೨. ಪುಷ್ಟಿಸು

ನನಬೋಡಿ-ಪುಷ್ಪದಂತೆ ಮನೋಜ್ಞವಾದಂತಹ ಸ್ತ್ರೀ

ನುನುಪು-೧. ಅನುರಾಗ,
೨. ಸ್ನಗ್ಧತ್ವ

ನೂಕು-ನೂಕು

ನೂಲು-ನೂಲು

ನೂಲುಕೊನು-ಒಪ್ಪಿಕೊಳ್ಳುವುದು

ನೆಂಜಿಲಿ-ಮನೋವ್ಯಥೆ

ನೆಗಯು-ನೆಗೆ

ನೆಗುಲು-ನೋವು

ನೆಟ್ಟನ-ಅನಿವಾರ್ಯವಾದದ್ದು

ನೆಡಿಮೆ-ದ್ವೀಪ

ನೆತ್ತಿ-ತಲೆ, (ನೆತ್ತಿ)

ನೆತ್ತುರು-ರಕ್ತ

ನೆನರು-ಪ್ರೀತಿ, ಕೃತಜ್ಞತೆ

ನೆಪಮು-ನೆಪ

ನೆಮರು-ಮೆಲಕು ಹಾಕುವುದು

ನಲಿ-ರೋಗ

ನಲುಪು-ಕಪ್ಪು

ನಾಗಲಿ
ನಾಗೇಲು } -ನೇಗಿಲು

ನಾರ್ಧಿ-ಧನಸ್ಸಿನ ಧಾರ

ನಾವ-ಹಡಗು

ನಿಂಗಿ-ಆಕಾಶ

ನಿಕ್ಕ್ವಮು-ನಿಜ

ನಿಕ್ಕಾಕ-ತುಂಬ ಬಿಸಿ

ನಿಕ್ಕುವಮು-ನಿಜ

ನಿಗ್ಗು-ಹೆಚ್ಚಿನ ಕಾಂತಿ

ನಿಚ್ಚೆನ-ಏಣಿ

ನಿಚ್ಚಲು-ಯಾವಾಗಲು

ನಿದುರ
ನಿದ್ದರ } -ನಿದ್ದೆ

ನಿಬ್ಬರಮು-ಸಹನೆ

ನಿವಾಳಿ
ನಿವ್ವಾಳಿ } -ಆರತಿ

ನಿವ್ವೆಱಪಡು-ಆಶ್ಚರ್ಯ

ನೀಡ-ನೆರಳು

ನೀರಾಟವಮು-ನೀರಿನಲ್ಲಿ ಸಂಚರಿಸುವುದು

ನುಡಿ-ಮಾತು

ನೂಕ-ನುಚ್ಚು

ನೆಮ್ಮಿ-ಪ್ರೀತಿ

ನೆಮ್ಮು-ಒದ್ದೆ

ನೆಯ್ಯಮು-ಸ್ನೇಹ

ನೆಯ್ಯಿ
ನೇಯಿ } -ತುಪ್ಪ

ನೆರಸು-ತಪ್ಪು

ನೆಱಪು-೧. ವ್ಯಾಪಿಸು
೨. ಪೂರ್ತಿ

ನೆಲ-೧. ತಿಂಗಳು
೨. ಚಂದ್ರನು
೩. ಹುಣ್ಣಿಮೆ

ನೆಲಂತ-ಸ್ತ್ರೀ

ನೆಲವಂಕ-ಬಾಲಚಂದ್ರ

ನೇತ-೧. ಅರಸ ೨. ಅಧಿಪತಿ

ನೇರಮಿ-ಅಜ್ಞಾನ

ನೇಸ್ತಮು-ಸ್ನೇಹ

ನೊಂಚು-ಬಾಧಿಸು

ನೊಪ್ಪಿ
ನೊವ್ವು
ನೋವು } -ಬಾಧೆ

ನೊಸಲು-ಫಾಲಭಾಗ, ಹಣೆ

ನೋಮು-ವ್ರತ

ನೋರು-ಬಾಯಿ

ನೋವು-ನೋವು

## ಪ

ಪಂಜರ-ಪಂಜರ (ಹಕ್ಕಿಯನ್ನು ಇಡುವ ಗೂಡು)
ಪಂಜು-ಪಂಜು (Torch)
ಪಂಡುಗ-ಹಬ್ಬ
ಪಂದ-ಅಂಜಿಕುರಕ
ಪಂದಿ-ಹಂದಿ
ಪಗ-ಹಗೆ
ಪಗಲು-ಹಗಲು
ಪಗವಾಡು-ವಿರೋಧಿ, ಶತ್ರು
ಪಚ್ಚ-ಹಸುರು
ಪಚ್ಚಿ-ಹಸಿ
ಪಜ್ಜ-ಹತ್ತಿರ
ಪಡಕ-ಹಾಸಿಗೆ
ಪಡಗ-ಹೆಡೆ
ಪಡಮರ-ಪಶ್ಚಿಮ ದಿಕ್ಕು
ಪಡವ-ದೋಣಿ
ಪಡಿತರಮು-ಏರ್ಪಾಟು
ಪಡಿಸೆಮು-ನೆಗಡಿ
ಪಣಮು-ಹಣ
ಪದಂಪಡಿ } -ಕೂಡಲೇ
ಪದಪಡಿ }
ಪದಿಲಮು-ಸ್ಥಿರ

ಪಲುಕು-೧. ಮಾತು (ನಾಮ)
೨. ಮಾತಾಡು (ಕ್ರಿ)
ಪಲುಗಾಕಿ-ದುಷ್ಟ
ಪಲ್ಲವು-ಹಳ್ಳ
ಪಸದನಮು-ಬಹುಮಾನ ಧನ
ಪಸಿಡಿ-ಬಂಗಾರು
ಪಾಟುಪಡು-ಕಷ್ಟಪಡು
ಪಾಡಿ-ಧರ್ಮ
ಪಾಡಿ-ಹಾಲು ಮೊಸರಿನ ಸಮೃದ್ಧಿ
ಪಾಡು-೧. ಹಾಳು
೨. ಹಾಡು (ಕ್ರಿ)
ಪಾಮು-ಹಾವು
ಪಾಱು-ಓಡು
ಪಾಱುಡು-೧. ಬ್ರಾಹ್ಮಣ
೨. ಓಟ
ಪಾಲು-ಹಾಲು
ಪಿಂಡಿ-ಹಿಟ್ಟು
ಪಿಚ್ಚಿ-ಹುಚ್ಚು
ಪಿಚ್ಚಿವಾಡು-ಹುಚ್ಚ
ಪಿಱುಂದ-ಹಿಂದೆ
ಪಿಲ್ಲ-೧. ಮರಿ ೨. ಹುಡುಗಿ

ಪನಿಗೊನು }
ಪನುಪು } -ನಿಯೋಗಿಸು
ಪನುಚು }

ಪನ್ನುಗಡ–ರಚನೆ

ಪಬ್ಬವಮು–ಉತ್ಸವ

ಪಯ್ಯೆದ–ಸೆರಗು

ಪರಾಕು–೧. ತತ್ಪರತೆ
೨. ಪ್ರಮಾದ

ಪರಾರಿ–ಓಡು

ಪರಿಕಿಂಚು–ನೋಡು

ಪರುವವಮು–ಯೌವನ

ಪಱತೆಂಚು–ಬರುವುದು

ಪುವ್ವಿಲುಕಾಡು–ಮನ್ಮಥ

ಪುವ್ವು–ಹೂವು

ಪೂಬೋಡಿ–ಸ್ತ್ರೀ

ಪೆಂಪು–ಹೆಚ್ಚಿನ

ಪೆದವಿ–ತುಟಿ

ಪೆನಗು–ಯುದ್ಧಮಾಡು

ಪೆರುಗು–೧. ಮೊಸರು (ನಾ)
೨. ಬೆಳೆಯು (ಕ್ರಿ)

ಪೈಡಿ–ಚಿನ್ನ

ಪಿಲ್ಲಿ–ಬೆಕ್ಕು

ಪುಟ್ಟವಮು–ಬಟ್ಟೆ

ಪುಟ್ಟಿಲ್ಲು–ತೌರುಮನೆ

ಪುಡವಿ–ನೆಲ

ಪುಡಮಿಱೇಡು–ಅರಸ

ಪುಱಲೋಡು–೧. ಸಂಕೋಚ
೨. ಹಿಂಜರಿಯು

ಪುರುಡಿಂಚು–೧. ಸಮಾನ
೨. ಹೋಲಿಕೆ

ಪುರುಡು–ಜಾತಾಶೌಚ

ಪುಲಕಂಡವಮು–ಕಲ್ಲುಸಕ್ಕರೆ

ಪುಲಕಿಂಚು-ರೊಮಾಂಚ

ಪುಲಿ–ಹುಲಿ

ಪೈಕೊನು–ಮೇಲೆ ಬೀಳು

ಪೈದಲಿ–ಸ್ತ್ರೀ

ಪೊಗಡು–ಹೊಗಳು

ಪೊಡಿ–ಪುಡಿ

ಪೊದುಗು–ಕೆಚ್ಚಲು

ಪೊಲತಿ–ಸ್ತ್ರೀ

ಪೊಲುಟು–ಕಾಣಿಸಿಕೊಳ್ಳುವುದು

ಪೋಲಿಕ–ಹೋಲಿಕೆ

ಪ್ರೋಲು–ಪಟ್ಟಣ

ಬ

ಬಚ್ಚು–ವೈಶ್ಯ

ಬಡುಗು–ಕೃಶವಾದುದ್ದು

ಬತಿಮಾಲು–ಬೇಡಿಕೊಳ್ಳುವುದು
ಬಯಲುದೇರು–ಹೊರಡು
ಬರಣಿ–ಡಬ್ಬಿ
ಬರುವು–ಭಾರ
ಬಲ್ಲಿದುಡು–ಬಲಿಷ್ಠನು
ಬಾಡುವ–ಹಲ್ಲದ ನೆಲ
ಬಾಸಾಡು–ಮಾತಾಡು
ಬಿಂಕಮು–ಬಿಗಿ
ಬಿಡುವು–ಅವಕಾಶ
ಬಿಡ್ಡ–ಮಗು
ಬಿಯ್ಯಮು–ಅಕ್ಕಿ
ಬೀರಮು–ಪರಾಕ್ರಮ
ಬೆಗಡು–ಭಯ
ಬೆಗ್ಗಡಿಲು–ಭಯಪಡು
ಬೆಟ್ಟಿದಮು–ಕಠಿನ, ಕ್ರೌರ್ಯ
ಬೆಟ್ಟು–ಗೌರವ, ಅಧಿಕ
ಬೆಡಗು–ಅಂದ
ಬೆಡದ–ಬಾಧೆ
ಬೆಡಿದಮು–ಭಯಂಕರಸ್ವರೂಪ
ಬೆಬ್ಬುಲಿ–ಹುಲಿ
ಬೆರುಕು–೧. ಭೇದ
೨. ಪ್ರಯೋಜನ
ಬೇಪಾರಿ–ವ್ಯಾಪಾರಿ
ಬೊಂಕು–ಸುಳ್ಳು
ಬೊಕ್ಕಸಮು–ಕೋಶ
ಬೊಮಮುಡಿ–ಕಣ್ಣುಬ್ಬುಮುಡಿ
ಬೋನಮು–ಭೋಜನ
ಬೋರನ–ಬೇಗ
ಬೋರುಕಾಡಿಂಚಿ–ಸ್ನಾನಮಾಡಿಸಿ

## ಮ

ಮಂಟ–ಉರಿ
ಮಂತನಮು–ಆಲೋಚನೆ
ಮಂದಡಿ–ಅಶ್ವಶಾಲೆ
ಮಂದು–ಔಷಧಿ
ಮಗಡು–ಭರ್ತೃ (ಗಂಡ)
ಮಗವಾಡು–ಗಂಡಸು
ಮಚ್ಚೆಕಂಟಿ–ಸ್ತ್ರೀ
ಮಟ್ಟಾಡು–ಸಂಚರಿಸು
ಮುದಿಮಿ–ವಾರ್ಧಕ್ಯ
ಮುದುಸಲಿ–ಮುದುಕ
ಮುಸುರು–ನಿರಂತರ ಮಳೆ
ಮೆಕಮು–ಮೃಗ
ಮೆತುಕು–ಅಗುಳು
ಮೆಯಿಕೊನು / ಮೆಚ್ಕೊನು –ಇಷ್ಟಪಡು
ಮೆಲತ–ಸ್ತ್ರೀ

ಮಟ್ಟೆ—ಹೆಂಗಸರು ಕಾಲಿಬೆರಳಿಗೆ ಹಾಕಿಕೊಳ್ಳುವ ಬೆಳ್ಳಿಉಂಗುರ
ಮತ್ತು—ಮೊತ್ತು
ಮನಿಕಿ—ಜೀವನ
ಮನು—ಜೀವಿಸು
ಮನುವು—ಜೀವನ
ಮರುಲು—ಮೋಹ
ಮಲಗು—ತಿರುಗಾಡು
ಮಸಕ—ಕಪ್ಪು
ಮಸಟು—ಕೊಳೆ
ಮಸಲು—ತಡೆಯಾಗು
ಮಾನವು—ಅಭಿಮಾನವು
ಮಾನಿಸಿ—ಮನುಷ್ಯ
ಮಿನುಕು—ತಾಳಿ
ಮಿನ್ನು—ಆಕಾಶ
ಮಿನ್ನೇರು—ಆಕಾಶಗಂಗೆ
ಮಿಸಿಮಿ—ನೂತನ ಕಾಂತಿ
ಮೀಸಮು—ಮೀಸೆ
ಮುಂಗುರುಲು—ಮುಂಗುರುಳು
ಮುದಿತ—ಸ್ತ್ರೀ
ಮೇನು—ಶರೀರ
ಮೇರ—ಮರ್ಯಾದೆ
ಮೇಲಿಮಿ—ಆಧಿಕ್ಯ
ಮೇಲುಕೊಲುಪು ಎಬ್ಬಿಸು
ಮೇಳವಿಂಚು—ಜೋಡಿಸು
ಮೈಕೊನು—ಇಷ್ಟಪಟ್ಟು
ಮೊಕ್ಕುಬಡಿ—ದೇವತಾ ಪ್ರಾರ್ಥನೆ
ಮೊಗಮು—ಮುಖ
ಮೊಗುಲು—ಮೇಘ
ಮೊಗ್ಗ—ಮೊಗ್ಗು
ಮೊದಟಿವೇಲ್ಪು—ಬ್ರಹ್ಮ
ಮೊನಕಾಡು—ಶೂರ
ಮೊಱಕು—ಮೂರ್ಖ
ಮೊಲಕ—ಮೊಳಕೆ
ಮ್ರಕ್ಕಡಿ—ಸ್ವಲ್ಪ
ಮ್ರಚ್ಚಿಲು—ಕದಿಯುವುದು
ಮ್ರೊಕ್ಕು—ನಮಸ್ಕಾರ
ಮ್ರೋತ—ಧ್ವನಿ

## ರ

ರಂತು—ರತಿ
ರಕ್ಕಸುಡು—ರಾಕ್ಷಸ
ರಕ್ಕಸಿ—ರಾಕ್ಷಸಿ
ರಾರಾಜು—೧. ಚಕ್ರವರ್ತಿ
೨. ಕುಬೇರನು
೩. ದುರ್ಯೋಧನ

ರಕ್ಕೈಸ–ಆಯುಕ್ತವಾದ
ರಚ್ಚು–ರಾಜಮಾರ್ಗ
ರಟ್ಟು–ದೂರು, ನಿಂದೆ
ರವಳಿ–ಧ್ವನಿ
ರಸದಾಡಿ } –ಒಂದು ವಿಧವಾದ
ರಸದಾಳಿ } ಕಬ್ಬು
ರಹಿ–ಆನಂದ
ರಾಚವೀಡು–ರಾಜಧಾನಿ
ರಾಟ್ಟು–ಅರಸ
ರಾಣುವ–ಸೈನ್ಯ
ರಾತ್ರಿಂಚರುಡು–ರಾಕ್ಷಸ

ರಾಸಭಮು–ಕತ್ತೆ
ರಿತ್ತ–ಶೂನ್ಯ (ಸಂ) ರಿಕ್ತ
ರಿಮ್ಮ–ಹುಚ್ಚು
ರೆಕೆತ್ತು–ವೃದ್ಧಿಹೊಂದು
ರೇಪಾಡಿ } –ಪ್ರಾತಃಕಾಲ
ರೇಪಕಡ }
ರೇವಡು–ಆಗಸ
ರೊದ–ಧ್ವನಿ
ರೋಕಲಿ–ಒನಕೆ
ರೌತು–ಅಶ್ವಸಾರಥಿ
ಱಂಕೆ–ಗುಟರು
ಱೋಲು–ಒರಳು

ಲ

ಲಕ್ಕ–ಅಗರು
ಲಗ್ಗು–ಮೇಲು
ಲಾಂಗೂಲಮು–ಬಾಲ
ಲಾಗ–ಬಿಲ
ಲೆಂಕ–ಸೇವಕ

ಲೆಸ್ಸ–ಲೇಸು
ಲೇಗ–ಕರು
ಲೇತ–ಎಳೆ
ಲೇಡಿ–ಜಿಂಕೆ
ಲೇಮಿಡಿ–ದಾರಿದ್ರ್ಯ

ವ

ವಂಟ–ಅಡಿಗೆ
ವಂತ–ಸಂಕಟ
ವಂದು } –ದುಃಖಿಸು
ವಂದುರು }
ವಗ } –೧. ದುಃಖ
ವಗಪು } ೨. ಸಂತಾಪ

ವಿಸುಗು–ಬೇಜಾರು
ವೀಕ-ಉತ್ಸಾಹ
ವೀಟಿಕ–ತಾಂಬೂಲ
ವೀಡುಕೊಲ್ಪು }
ವೀಡುಕೊನು } –ಕಳುಹಿಸು
ವೀಡ್ಕೊಲ್ಪು }

ವಗದೆಗು–ಪರಿಷ್ಕಾರ ಮಾಡು
ವಜೀರುಡು–ಶೂರನು
ವಡಕು–ಕಂಪಿಸು
ವಡಮುಡಿ–ಭೀಮನು
ವಡಿ–ಬೇಗ
ವಡುವು–ವಿಧ
ವಡ್ಲು–ಭತ್ತ
ವನ್ನೆ–ಬಣ್ಣ
ವಮ್ಮು–ವ್ಯರ್ಥ
ವರುಸ–ಪಂಕ್ತಿ, ಸಾಲು
ವಱದ, ವರ್ರು –ಪ್ರವಾಹ
ವಲ–ಬಲೆ
ವಲನು–ದಿಕ್ಕು
ವಲಿ–ಶೈತ್ಯ
ವಲ್ಲಾರಮು–ಹಂದಿಮಾಂಸ
ವಾಕಿಲಿ–ಬಾಗಿಲು
ವಾಡ–ಬೀದಿ
ವಾಡಿ–ಚೂಪು
ವಾಂಡು–ಅವನು
ವಾಡು–ಬಾಡು
ವಾತೆರ–ತುಟಿ
ವಾದೋಡು–ಸಹಾಯ
ವಾನ–ಮಳೆ
ವಾಲಕಮು–ಮೋಸ

ವೀತೆಂಚು–ಬರುವುದು
ವೆಂಗಲಿ–ಮೂರ್ಖ
ವೆಂಡಿ–ಬೆಳ್ಳಿ
ವೆಂಡಿಯು–ಆಮೇಲೆ
ವೆಕ್ಕಸಮು–ಅಸಹನೆ
ವೆಗಟು–ವಿರಸ
ವೆಡಗು–ಅವಿವೇಕ
ವೆಡಲುಪು–ಹಗಲ
ವೆದಕು–ಹುಡುಕು
ವೆದುರು–ಬಿದುರು
ವೆನುಕ–ಹಿಂಭಾಗ
ವೆನ್ನ–ಬೆಣ್ಣೆ
ವೆನ್ನು–ಬೆನ್ನು
ವೆನ್ನೆಲ–ಬೆಳದಿಂಗಳು
ವೆರವು–ಉಪಾಯ
ವೆರಗುಪಾಟು–ಆಶ್ಚರ್ಯ
ವೆರಪು–ಭಯ
ವೆಱ್ಱಿ–ಹುಚ್ಚು
ವೆಲಧಿ–ಸ್ತ್ರೀ
ವೆಲಾರುಚು, ವೆಲಾರ್ಚು, ವೆಲಿಬುಚ್ಚು –ಬಹಿರಂಗಪಡಿಸು
ವೆಲುಗು, ವೆಲುತುರು –ಬೆಳಕು
ವೆಲ್ಲ–ಬೆಳ್ಳಗೆ

ವಾವಿ—ಬಂಧುತ್ವ
ವಾವಿರಿ—ಕ್ರಮ
ವಾಸೆನ } —ಮಾಸಿದ ಬಟ್ಟೆ
ವಾಸೆನಕಟ್ಟು } ಯನ್ನು ಧರಿಸಿದ
ವಿಚ್ಚೆಯು—ಬರುವುದು
ವಿಚ್ಚಲವಿಡಿ—ಸ್ವೇಚ್ಛೆ
ವಿಟಪಿ—ಗಿಡ
ವಿಡುಪು—ವಿಮೋಚನೆ
ವಿಡೆಮು } —ತಾಂಬೂಲ
ವೀಡ್ಯಮು }
ವಿತಾಕು—ಆಶ್ಚರ್ಯ
ವಿನ್ನಾಣಮು—ಜಾಣತನ
ವಿರಿ—ಪುಷ್ಪ
ವಿರಿಬೋಡಿ—ಸ್ತ್ರೀ
ವಿರಿಯು—ವಿಕಸಿಸು
ವಿಱುಗು—ಮುರಿಯು
ವಿಱ್ಱವೀಗು—ಜಂಭ ತೋರಿಸುವುದು
ವಿಲುಕಾಡು—ಬಿಲ್ಲುಗಾರ
ವೆಲ್ಲುವ—ಪ್ರವಾಹ
ವೆಳ್ಳು—ಹೋಗು
ವೇಗ—ಬೇಗ
ವೇಟ—ಬೇಟೆ
ವೇಡುಕ—ವೇಡಿಕೆ
ವೇನಲಿ—ಜಡೆ
ವೇನವೇಲು—ಸಾವಿರಾರು
ವೇಲುಪು—ದೇವತೆ
ವೇಲುಪುಗಿಡ್ಡಿ } —ಕಾಮ-
ವೇಲ್ಪುಗಿಡ್ಡಿ } ಧೇನುವು
ವೇವಿಳ್ಳು—ಬೈಕಲು
ವೇವುರು—ಅನೇಕರು
ವೇಸವಿ—ಬೇಸಗಿ
ವೇಳಾಕೋಳಮು—ಹಾಸ್ಯ
ವ್ಯಾಜ್ಯಮು—ಜಗಳ
ವ್ರಾತ—ಬರವಣಿಗೆ
ವ್ರೇಲು—೧. ನೇತಾಡು
೨. ಬೆರಳು

ಶ

ಶಷ್ಕುಲಿಕ—ಚಕ್ಕುಲಿ
ಶಾಟಿ—ಸ್ತ್ರೀ
ಶೀಕರ—ನೀರಿನ ತುಂತರು
ಶುಂಡಾಲಮು—ಆನೆ
ಶೂಲ—೧. ರೋಗ ೨. ಸಾವು
೩. ವೇಶ್ಯೆ
ಶೈಲೂಷಿ—ನರ್ತಕಿ
ಶೋಣಿತಮು—ರಕ್ತ

ಶುಷ್ಮವಮು–ಬಲ ; ತೇಜಸ್ಸು
ಶ್ವಾನಾರವಮು-೧. ನಾಯಿಯ ಹಾಲು
೨. ಹಾವಿನ ಮೊಟ್ಟೆ
ಶ್ರುತಿ–೧. ವೇದ ೨. ಕಿವಿ
೩. ಶಾಸ್ತ್ರ
ಶ್ವಾಪದವಮು–ಹುಲಿ

ಷ

ಷಟ್ಪದವಮು-ತುಂಬಿ
ಷಡ್ಜವಮು–ಒಂದು ಸ್ವರ

ಸ

ಸಂಕು–ಶಂಖ
ಸಂಗಡಿ–ಸ್ನೇಹ
ಸಂತಸವಮು–ಸಂತೋಷ
ಸಂತರಿಂಚು–ಸರಿಪಡಿಸು
ಸಂಪಾಸಾರಿ-ಕೋಮಟಿ
ಸಂಬರವಮು–ಸಂತೋಷ
ಸಂಯುಮನಿ–ಯಮನ ಪಟ್ಟಣ
ಸಂವೇಶವಮು–೧. ಪೀಠ ೨, ನಿದ್ದೆ
ಸಂವ್ಯಾನವಮು–ವಲ್ಲಿ
ಸಂಸರಣವಮು–೧. ಸಂಸಾಗ
೨. ಯುದ್ಧಾರಂಭ
ಸಗ್ಗಡ–ಚೆಂಬು
ಸಡಲು–ಜಾರು
ಸಡಿ–ಅಪಕೀರ್ತಿ
ಸಣುಗು–ಬಾಧೆ
ಸತಾಯುಂಚು–ಸತಾಯಿಸು
ಸದ್ಮವಮು–ಮನೆ
ಸವತಿ–ಸಪತ್ನಿ
ಸವಿತ–೧. ಸೂರ್ಯನು
೨. ತಂದೆ
ಸಾಂಪರಾಯುವಮು–೧. ಯುದ್ಧ
೨. ಆಪತ್ತು
ಸಾತು–ವರ್ತಕಜನ ಸಮೂಹ
ಸಾವಿಾರಿ–೧. ಹನುಮಂತ
೨. ಭೀಮ
ಸಾರಮೇಯುವಮು-ನಾಯಿ
ಸಾವಿಕ–ಸೂಲಗಿತ್ತಿ
ಸಾಹಿಣಿ-ಕುದುರೆಸಾಕುವವನು
ಸಿಂಗಾರವಮು–ಅಲಂಕಾರ
ಸಿಗ್ಗು } ..ನಾಚಿಕೆ
ಸಿಬ್ಬಿತಿ }
ಸೀಮಂತಿನಿ–ಸ್ತ್ರೀ
ಸೀರಿ–ಬಲರಾಮನು
ಸುಚಕವಮು-ಬೊಗಳುವ ನಾಯಿ

ಸನ್ನ—ಸಂಜ್ಞ
ಸಮಕೊಲ್ಪು—ಲಭಿಸು
ಸಮಜ್ಯ—ಕೀರ್ತಿ
ಸಮೀಚೀನಮು—ಸತ್ಯವಾದದ್ದು
ಸಮುನ್ನಮು—ಒದ್ದೆಯಾಗಿರುವುದು
ಸಯ್ಯಾಟ—ಸ್ತ್ರೀಪುರುಷರ ಪರಿಹಾಸ
ಸರಗು—ಬೇಗ
ಸಲಿಗ—ಆಶ್ರಯ
ಸುಡಿವಾಲು—ಚಕ್ರಾಯುಧ
ಸುರಟಿ—ಬೀಸಣಿಗೆ
ಸೂಡು—ಶತ್ರು
ಸೂರೆಲು—ಅಕ್ಕಪಕ್ಕಗಳು
ಸೈಂಧವಮು—೧. ಕುದುರೆ
೨. ಉಪ್ಪು
ಸೌನ್ನಮು—ಬಂಗಾರು
ಸೊಬಗು—ಚೆಲುವೆ
ಸ್ಯಂದನಮು—ರಥ

ಹ

ಹಾಲಮು / ಹಾಲಿ —ನೇಗಿಲು
ಹಾಸಿತಮು—ನಗು
ಹಾಯನಮು—ಸಂವತ್ಸರ
ಹೇತಿ—೧. ಸೂರ್ಯನ ಕಿರಣ
೨. ಉರಿ
ಹೇರಾವಿ—ಹಿಂಸಿಸು
ಹೇಳಿ—೧. ಸೂರ್ಯನು
೨. ಆಲಿಂಗನ
ಹೊನ್ನು—ಬಂಗಾರು
ಹೊಯಲು—ವಿಲಾಸ
ಹ್ರದಮು—ಕೊಳ

